మానవతకు “సత్యాహింసలు శౌచదయాది గుణాలు ముఖ్యం” అనే విషయాన్ని వీరి ఆధ్యాత్మిక గ్రంథాలు వెలువరిస్తాయి.

సంస్కృతాంధ్రవాఙ్మయం ఆపోశనం పట్టిన విద్వాంసులు. సనాతనపద్ధతిలో గురువులను సేవించి, ఉపనిషత్ సారాన్ని గ్రహించిన ఆర్షావిద్యానిధి. వారు వారి గ్రంథాలన్నింటిలోను గురుత్రయాన్ని స్మరించారు.

సంస్కృత ఉద్యోగపర్వంలో 41వ అధ్యాయం నుండి 45వ అధ్యాయం వరకు విస్తరించి ఉన్న “సనత్సుజాతీయం” - 163 శ్లోకాలను 1950 లో తెలుగులో టీకా తాత్పర్యంతో వెలువరించారు. అందు గురుస్మరణను *1) నాకు చిన్నతనంలోనే అమరం చెప్పునప్పుడు ‘సర్వతంత్రస్వతంత్రాయ” అను శ్లోకమును చెప్పి శంకరుల జీవితమును ప్రవచించిన విద్యా గురువులు, నాకు మేనమామ వరుసవారు కీర్తిశేషులు అల్లాడి పిచ్చయ్య శాస్త్రిగారు. వేదాంతమునందు అభిరుచి కలిగించిన కర్మరులు, జ్ఞాని. వీరిని ఈ సమయ మందు స్మరించుట నాకు చాల శ్రేయోదాయకము. 2) రఘువంశాది పంచకావ్యాలను, నాటకాలంకారాది గ్రంథములను పాఠము చెప్పి నా సాహిత్యమునకు పునాది వేసిన వారు రెండవ విద్యా గురువులు, నాకు పెదతండ్రివరుసవారు శ్రీ మునుస్వామిశాస్త్రిగారు. 3) మఱి 1939వ సం॥లో నాకు బ్రహ్మవిద్యాగురువులై ప్రస్థాన త్రయముపదేశించిన వారు కాంచీ కామకోటి పీఠాధిపతులు* ***‘శ్రీచంద్రశేఖరేన్ద్రసరస్వతీస్వాములు’*** *వారు. గురు త్రయము యొక్క అనిర్వ్యాజకృపా విశేషముననే నేను ఇట్టి గ్రంథాలను అనువదింప గోరుకొనుచున్నాడననియు, వారిడిన సారస్వతభిక్షయే నాకు భుక్తి, భక్తి, ముక్తిదాయక మగుచున్నదనియు తలంచి వారి పాదసరసీరుహములకు సదా మ్రొక్కుచు వారిని స్మరించుచున్నాను.*

ఈ విధముగా గురుస్మరణ చేసిన శ్రీ చదలువాడ జయరామశాస్త్రిగారిని, వారు 1960-64 సంవత్సరముల మధ్య శ్రీమద్భాగవతమునకు వెలువరించిన టీకాతాత్పర్యము లతో నున్న సప్తమ స్కంధము నేడు పుస్తకరూపంగా రూపొందు సమయమున నేను ‘మనసా వాచా కర్మణా’ స్మరించు భాగ్యము కలుగజేసిన శ్రీనృసింహభగవానునకు నమస్సులర్పించు చున్నాను.

**వీరు వ్యాఖ్యానించిన ఇతర ముద్రితగ్రంథములు :**

1) భీష్మస్తవరాజము-121 సంస్కృత శ్లోకాలు-తెలుగు టీకా తాత్పర్యములు - 1957.

2) సౌందర్యలహరి - శ్రీలోల్ల లక్ష్మీధర దేశిక విరచిత వ్యాఖ్య-తెలుగు టీకాతాత్పర్యము విశేషార్థములు-1968.





శ్రీః

# శ్రీమద్భాగవతమహాపురాణమ్

## సప్తమస్కన్ధః

ప్రకాశకులు

**సాధన గ్రంథ మండలి, తెనాలి - 522 201**

వెల రూ. 100-00

శ్రీః

# శ్రీమద్భాగవతమహాపురాణమ్ - సప్తమస్కన్ధః

ఆంధ్ర ప్రతిపదార్థ, తాత్పర్యములు

**శ్రీ చదలువాడ జయరామశాస్త్రి**


ప్రథమముద్రణ :– 27–08–2005

**శ్రీపార్థివ నామ సం॥ వైష్ణవ శ్రీకృష్ణ జయంతి**

ప్రతులు : 1000

పేజీలు : 260

వెల రూ. : 100–00

1. **[illegible] [illegible] [illegible], [illegible]**, M.A. (Sanskrit)
[illegible], [illegible]& [illegible] [illegible], [illegible] - 523 157
**[illegible] :**
4-103, [illegible] [illegible], [illegible].,
[illegible], [illegible].
[illegible] : 08594 - **234054**
[illegible] : **94401 15411**

2. **సాధన గ్రంథ మండలి,**
**తెనాలి – 522 201**

***Computer Layout by :-***
**J. RAJA**
Jaisankar Nagar
CHIRALA.
Phone : 08594 - **238049**

***Printed at :-***
**SURYA OFFSET,**
Station Road,
CHIRALA.
Phone : 08594 - **233943**






## సహ వీర్యం కరవామహై



**కీ॥శే॥ చదలువాడ జయరామశాస్త్రిగారు**

నెల్లూరు నగరంలో వ్రేళ్ళమీద లెక్కపెట్టదగిన మహాపండితులలో శ్రీ చదలువాడ జయరామశాస్త్రిగారు ఒకరు. వీరు విద్వత్కవివరేణ్యులు. సర్వతోముఖప్రజ్ఞాశాలి. సారస్వతోపాసకులు. నిరంతర గాయత్రీ మంత్రోపాసకులు. తన ఇల్లే శారదా పీఠంగా, నిరంతర సాహితీతపస్సే జీవితపరమార్థంగా భావించిన మహామనీషి. ధారణాశక్తి శాస్త్రిగారికి ఉగ్గుపాలతో వచ్చిన వరం. వారి రచనా స్రవంతిలో పురాణాలు, ఇతిహాసాలు, లక్షణ గ్రంథాలు, శాస్త్రార్థాలు, కథానికలు మొదలైన వివిధ ప్రక్రియలు గోచరిస్తాయి. ఈయన సహస్రాధిక మాసజీవి. 1905 లో జన్మించిన శ్రీ శాస్త్రిగారు 86 వత్సరాల వారి జీవితకాలంలో అనేక రచనలు కొనసాగించి ది.31–05–1991 న నెల్లూరులో దివంగతులైన వీరు స్పృశింపని సాహిత్య ప్రక్రియ అంటూ లేదంటే అతిశయోక్తిలేదు.

కవులలో ఉండవలసిన చిత్తశుద్ధి అనే గొప్పగుణం వీరి గ్రంథాలలో దర్శనమిస్తుంది. మయూరకవి సూర్యశతకాన్ని అనువాదం చేసి మయూరుని వలెనే వీరు కూడ సంపూర్ణ ఆరోగ్యాన్ని పొందారు. బాలబాలికల హృదయాలలో నైతిక, ఆధ్యాత్మికబీజాలను నాటడానికి "గోమహిమానుదర్శనం"అనే గ్రంథాన్ని వెలయించారు. 'శ్రీమద్భాగవతభూమిక' అనే గ్రంథం అష్టాదశపురాణ, ఉపపురాణ స్వరూప వివరణ చేసింది. "శంకరదర్శనం" అనే గ్రంథములో శంకరులవారి అద్వైతతత్త్వాన్ని వ్యవహారభాషలో విశదం చేశారు.

## సంపాదక వర్గము

*ప్రధాన సంపాదకుడు :*

**రావి మోహన రావు,** □.□□., M.A. (Sanskrit)
Lecturer, V.R.S.& Y.R.N. College, Chirala.
4-104, ఐ.యల్.టి.డి. కాలనీ ఎక్స్‌టెన్షన్, కొత్తపేట, చీరాల - 523 157

*సహ సంపాదకులు :*

1. విద్వాన్ **బులుసు సూర్యప్రకాశశాస్త్రి,**
   వ్యవస్థాపకులు : సాధన గ్రంథ మండలి, తెనాలి - 522 201.
2. **వి.వి.యస్. శర్మ,** ప్రిన్సిపాల్ (రిటైర్డ్)
   సీనియర్ సిటిజన్స్ హోమ్, శివరామ్‌పల్లి, హైదరాబాద్ - 500 072.
3. **డా॥ సి. విజయలక్ష్మి,** లెక్చరర్
   1-5-22, న్యూ మారుతీ నగర్, హైదరాబాద్ - 500 060.
4. **డా॥ యం. విశ్వనాథశాస్త్రి,** □.□., □□.□.,
   హెడ్ - సంస్కృత విభాగము,
   యస్.జి.వి.ఓ. కాలేజి, తిమ్మసముద్రము, ప్రకాశం జిల్లా.



3) శ్రీమద్భాగవతం-దశమస్కంధం-పూర్వభాగం-తెలుగుటీకా తాత్పర్యములు - 1971.

4) శ్రీమద్భాగవతం-ఏకాదశ ద్వాదశ స్కంధాలు-తెలుగుటీకా తాత్పర్యములు-1985.

5) ఉత్తరహరివంశం-నాచన సోమనాథుని పద్యకావ్యానికి వ్యాఖ్య- శిథిలభాగపూరణం శ్రీ వి.వి.యస్.యస్.గావించుటతో ఇటీవల వెలువడినది.

**అముద్రితగ్రంథములు :** 1) వేదార్థ ప్రకాశిక, 2) ప్రస్థానత్రయము, 3) నారాయణీయము, 4) అనర్ఘరాఘవము (అనువాదము), 5) ఆంధ్రసిద్ధాన్తకౌముది, 6) శ్రీమద్భాగవతమందలి మిగిలిన స్కంధముల వ్యాఖ్య. వీని హస్తలిఖితప్రతులు సంరక్షణ లేక చదలువాడవారి యింటనున్నవి.

త్వరలో శ్రీమద్భాగవతం అష్టమస్కంధం వీరి తెలుగు టీకాతాత్పర్యములతో వెలువరించాలన్న సంకల్పమును గజేంద్రరక్షకుడు పూరించునని తలంచుచూ, ఆ గజేన్ద్ర రక్షకుడినే శ్రీచదలువాడవారి మిగిలిన అముద్రితగ్రంథములకు రక్షకుడుగా గూడ నేతెంచ ప్రార్థింతును.

### శ్రీ వఝ్ఝల వేంకట సుబ్రహ్మణ్యశర్మ గారు



1922 లో నెల్లూరు జిల్లా నేలటూరు గ్రామములో జన్మించిన వీరు మద్రాసు క్రైస్తవ కళాశాల, తాంబరం నుండి 1939-43 సంవత్సరములో బి.ఏ. పట్టాను పుచ్చుకొని, 1949లో ఏం.ఏ. ప్రయివేటుగా మద్రాసు విశ్వవిద్యాలయం నుండి పూర్తిచేసి, ప్రభుత్వ విద్యాశాఖలో తెలుగు ట్యూటర్, అసిస్టెంట్ లెక్చరర్, లెక్చరర్ మరియు ప్రభుత్వ డిగ్రీ కళాశాల, కర్నూలులో రెండేళ్లు ప్రిన్సిపాల్ పదవి నిర్వహించి ది.30-11-1977 న పదవీ విరమణ చేసినారు.

1960 - 64 ల మధ్య శ్రీ చదలువాడ జయరామశాస్త్రిగారు శ్రీమద్భాగవతమునకు వ్రాసిన తెలుగు టీకా తాత్పర్యముల హస్తలిఖితప్రతుల సంరక్షణను శ్రీ వఝ్ఝల వేంకట సుబ్రహ్మణ్యశర్మ చేయుటచేతను, నేడు వారి ద్వారా నాకు అందుటచేతను శ్రీ మద్భాగవత సప్తమస్కంధము ప్రస్తుత పుస్తక రూపాన్ని సంతరించుకున్నది. ఈ సమయమున వారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. శ్రీ వి.వి.యస్. శర్మగారు వారి వద్ద నున్న అముద్రిత గ్రంథములను సంరక్షించుటయే కాక, శిథిలమైన హరివంశ గ్రంథము వ్యాఖ్యను పూరించి వెలువరించుట సాహిత్య లోకము మఱువదని తలంతును.

**ప్రతిపదార్థము:-** సుమహాభాగ=ఓ మహాపూజ్యుడా!, ఇతి=ఇట్లు, నః=మాకు, నారాయణ గుణాన్ ప్రతి=శ్రీమన్నారాయణుని అనుగ్రహాది గుణములను గురించి, సంశయః=సందేహము, సుమహాన్=మహాదొడ్డది, జాతః=కలిగినది,తమ్=దానిని,భవాన్=నీవు, ఛేతుమ్=పోగొట్టుటకు, అర్హతి=తగుదువు.

**తాత్పర్యము:-** ఓ పూజ్యతముడా! ఇట్లు మాకు శ్రీనారాయణుని అనుగ్రహాదిగుణములను గూర్చి పెద్దసంశయము ఏర్పడినది. వానిని దొలగింప నీవే సమర్థుడవు.

**శ్రీ శుక ఉవాచ**

**శ్లో॥ సాధు పృష్టం మహాభాగ! హరేశ్చరితమద్భుతమ్।**
**యద్భాగవతమాహాత్మ్యం భగవద్భక్తివర్ధనమ్॥ 4**

**ప్రతిపదార్థము:-** హే మహాభాగ!=ఓ పరమపూజ్య! హరేః=విష్ణువు యొక్క, అద్భుతం చరిత్రమ్ ఆశ్చర్యకరమైన చరిత్రమును, భాగవతమాహాత్మ్యమ్=భాగవతమహిమ, భగవద్భక్తివర్ధనమ్= భగవంతుని యందు భక్తిని వర్ధిల్లజేయునది, యదస్తి=ఏది గలదో, (తత్త్వయా=అట్టిది నీచే) సాధు పృష్టమ్=లెస్సగా నడుగబడినది.

**తాత్పర్యము:-** ఓ పరమపూజ్య! నీవు విష్ణువుయొక్క ఆశ్చర్యకరమైన చరిత్రమును గురించి చాల చక్కగా ప్రశ్నించితివి. ఏ భాగవతుడగు (భగవద్భక్తుడు అగు) ప్రహ్లాదుని ప్రభావము భగవంతునియందు అవిభక్తమై వర్ధిల్లజేయనగును.

**శ్లో॥ గీయతే పరమం పుణ్యమృషిభిర్నారదాదిభిః।**
**నత్వా కృష్ణాయ మునయే కథయిష్యే హరేః కథామ్॥ 5**

**ప్రతిపదార్థము:-**పరమమ్=ఉత్తమమై, పుణ్యమ్=పావనమైన, హరేః కథామ్=హరిచరిత్రమును నారద+ఆదిభిః=నారదుడులోనగు ఋషులచే, గీయతే=గానము చేయబడుచున్నది, కృష్ణాయ మునయే=కృష్ణద్వైపాయనునికి, నత్వా=నమస్కరించి, హరేః=విష్ణువు యొక్క, కథామ్= చరిత్రమును, కథయిష్యే=వచించెదను.

**తాత్పర్యము:-** ఇంద్రియాతిరిక్తజ్ఞానులగు నారదుడులోనగు మునులు ఉత్తమమైన, పావనమైన ఏ చరిత్రమును కొనియాడుచుందురో కృష్ణద్వైపాయనమునికి నమస్కరించి హరి చరిత్రమును చెప్పెదను.

**శ్లో॥ నిర్గుణోఽపి హ్యజోఽవ్యక్తో భగవాన్ప్రకృతేః పరః।**
**స్వమాయాగుణమావిశ్య బాధ్యబాధకతాం గతః॥ 6**

**ప్రతిపదార్థము:-** ప్రకృతేః పరః=ఎందువలన త్రిగుణాత్మకమగు మూలప్రకృతికి పరుడో, భిన్నుడో అందువలన,నిర్గుణః=గుణరహితుడు,అజః=కాబట్టే పుట్టుకలేని, అవ్యక్తః=అందువల్ల ఇంద్రియము లకు గోచరించనివాడు, భగవాన్=(ఐశ్వర్యము, యశము, శ్రీ, వీర్యము, జ్ఞానము మొదలైన షడ్గుణపరిపూర్ణుడైన) భగవంతుడు, రాగద్వేషాదులకు దేహేంద్రియాదిరహితుడైన, స్వమాయాగుణమ్=తన మాయా గుణమును, ఆవిశ్య=అధిష్ఠించి, బాధ్యబాధకతామ్=బాధింప దగినవారలను, బాధకుడు బాధించువాని భావములను, గతః=పొందెను.





# శ్రీః
# శ్రీమద్భాగవతమ్-సప్తమ స్కన్ధః

శ్రీః





శ్రీః

ఓం నమో భగవతే వాసుదేవాయ

# శ్రీమద్భాగవతమహాపురాణమ్

## సప్తమస్కన్ధః

### అథ ప్రథమోఽధ్యాయః

రాజోవాచ

**శ్లో॥ సమః ప్రియస్సుహృద్బ్రహ్మన్భూతానాం భగవాన్స్వయమ్।**
**ఇన్ద్రస్యార్థే కథం దైత్యానవధీద్విషమో యథా॥ 1**

**ప్రతిపదార్థము:–** బ్రహ్మన్=ఓ బ్రాహ్మణోత్తమా!, భగవాన్=షడ్గుణైశ్వర్య సంపన్నుడు అగు మహావిష్ణువు, స్వయమ్=తాను, సమః=సముడై, భూతానామ్=ప్రాణులకెల్ల, ప్రియసుహృత్= ఇష్టులకు మేలుకలిగించువాడైయుండి, ఇంద్రస్య+అర్థే=ఇంద్రుని విషయమై, విషమో యథా= పక్షపాతము చేత రాగద్వేషాదులుగలవాడువలె, దైత్యాన్=దైత్యులను, కథమ్=ఎట్లు, అవధీత్= ఎట్లు వధించెను.

**తాత్పర్యము:–** ఓ బ్రాహ్మణోత్తమా! షడ్గుణైశ్వర్యసంపన్నుడు అగు భగవంతుడు తాను ప్రాణుల యందు సమబుద్ధిగలవాడై భూతములకెల్ల ప్రీతి గలిగించువాడైయుండి, (దేవదానవులకు సముడై యుండి కూడా) ఒకనియందు అభిమానము ఒకనియందు ద్వేషముగల పక్షపాతియై ఇంద్రుని కొఱకు మాత్రము దైత్యుల నెట్లు వధించెను?

**శ్లో॥ న హ్యస్యార్థస్సురగణైస్సాక్షాన్నిశ్శ్రేయసాత్మనః।**
**నైవాసురేభ్యో విద్వేషో నోద్వేగశ్చాగుణస్య హ॥ 2**

**ప్రతిపదార్థము:–** సాక్షాత్=ప్రత్యక్షమున, నిశ్శ్రేయసాత్మనః=పరమానందస్వరూపుడైన, అస్య=ఈ మహావిష్ణువునకు, సురగణైః=ఇంద్రాదిసురగణములచే, అర్థః=ప్రయోజనము, న హ=లేదు కదా!, అగుణస్య=నిర్గుణుడైనవానికి, అసురేభ్యః చ=అసురులవలనను, ఉద్వేగః=భయము, న=లేదు, విద్వేషః=అందువలన వారి యందు ద్వేషమును లేదు గదా!

**తాత్పర్యము:–** సాక్షాత్తుగ పరమానందస్వరూపుడై నిర్గుణుడైన భగవంతునకు ఇంద్రాది దేవతలవలన నగు ప్రయోజనమేమియులేదు. అసురుల వలన నేర్పడు భయమును లేదు. కాబట్టి యసురులపై ద్వేషమును లేదు గదా!

**శ్లో॥ ఇతి నస్సుమహాభాగ నారాయణగుణాన్ప్రతి।**
**సంశయస్సుమహాఞ్జాతస్తద్భవాంశ్ఛేత్తుమర్హతి॥ 3**

**ప్రతిపదార్థము:-** రాజా=రాజైన యుధిష్ఠిరుడు,మహాక్రతౌ=దొడ్డక్రతువైన, రాజసూయే=రాజసూయయాగమందు, భగవతి=భగవంతుడైన, వాసుదేవే=శ్రీకృష్ణునందు, చేదిభూభుజః=చేదిదేశపు రాజగు శిశుపాలునియొక్క, మహా+అద్భుతమ్=మిక్కిలి అద్భుతమై, సాయుజ్యమ్=లీనమగుటను, దృష్ట్వా=చూచి.

**శ్లో॥ తత్రాసీనం సురఋషిం రాజా పాణ్డుసుతః క్రతౌ।**
**పప్రచ్ఛ విస్మితమనా మునీనాముపశృణ్వతామ్॥ 16**

**ప్రతిపదార్థము:-** రాజా! పాండుసుతః=రాజు పాండుకుమారుడు, ధర్మరాజు, తత్ర క్రతౌ=ఆ యాగమునందు,ఆసీనమ్=కూర్చుండిన, సురఋషిమ్=నారదుని, మునీనామ్=మునులు, ఉపశృణ్వతామ్=వినుచుండగా, విస్మితమనా=అచ్చెరువొందిన మనసుగలవాడై, ప్రపచ్ఛ=ఇట్లు ప్రశ్నించెను.

**తాత్పర్యము:-** పాండురాజపుత్రుడు, రాజు, యుధిష్ఠిరుడు రాజసూయయాగమందు కృష్ణునిచే వధింపబడిన శిశుపాలుని యాత్మ తేజోరూపమున శ్రీకృష్ణభగవానునందు ప్రవేశించి లీనమగు నద్భుత పద్ధతిని జూచి అచ్చెరువొందుచు మునులందరు వినుచుండ నిట్లు ప్రశ్నించెను.

**యుధిష్ఠిర ఉవాచ**

**శ్లో॥ అహో అత్యద్భుతం హ్యేతుద్దుర్లభైకాన్తినామపి।**
**వాసుదేవే పరే తత్త్వే ప్రాప్తిశ్చైద్యస్య విద్విషః॥ 17**

**ప్రతిపదార్థము:-** విద్విషః=పగవాడైన, చైద్యస్య=శిశుపాలునికి, వాసుదేవే=మహావిష్ణువునందు ఆత్మ సాయుజ్య ప్రాప్తి, ఏకాంతినామపి=అనన్య భక్తులకు సైతము, దుర్లభా=దుర్లభమైన, తత్త్వప్రాప్తిః=సాయుజ్యము గలుగుట, అహో!=ఆహా!, ఏతత్=ఇది, అత్యద్భుతమ్=మిగుల ఆశ్చర్యము.

**తాత్పర్యము:-** పరమేశ్వరుడైన వాసుదేవునందు అనన్య భక్తులకు సైతము దుర్లభమైన సాయుజ్య ప్రాప్తి పగవాడైన శిశుపాలునకు గలుగుట అహో! ఇది చాలా ఆశ్చర్యకర విషయము.

**శ్లో॥ ఏతద్వేదితుమిచ్ఛామస్సర్వ ఏవ వయం మునే।**
**భగవన్నిన్దయా వేనో ద్విజైస్తమసి పాతితః॥ 18**

**ప్రతిపదార్థము:-** మునే=ఓ నారదమునీ! సర్వ ఏవ వయమ్=మేమెల్లరమును, ఏతత్=ఈ, (శిశుపాలునకు గలిగిన సంభవము ఎట్లు కలిగినది), వేదితుమ్=తెలుసుకొనుటకు, ఇచ్ఛామః=కోరుచున్నాము. వేనః=అంగరాజపుత్రుడు వేనుడు, భగవత్+నిందయా=భగవంతుని నిందచే, ద్విజైః=విప్రులచే, తమః=నరకమందు, పాదితః=పడవేయబడెను.

**తాత్పర్యము:-** ఓ నారదమునీ! పూర్వమంగరాజు కొడుకు వేనుడను వాడు భగవంతుని నిందించుట వలన వానిని ఋషులు హతమార్చగా నరకమున బడెను. మఱి ఇది ఇట్లుండ అట్టి భగవన్నిందావరుడగు శిశుపాలునకు విష్ణునందు సాయుజ్యమెట్లు కలిగినదో ఆ విషయమును గూర్చి మేమెల్లరమును వినగోరుచున్నాము.





**తాత్పర్యము:-** విష్ణువు త్రిగుణాత్మకమగు ప్రకృతి కంటె భిన్నుడైయుండువాడు కావుననే గుణరహితుడై నిర్గుణుడైయున్నాడు. కాబట్టి ఆ పుట్టుకలేనివాడై యజుడను, అందువలన ఇంద్రియగోచరుడు కానివాడై అవ్యక్తుడగుచున్నాడు. మఱి రాగద్వేషాదులకు కారణమైయుండు దేహేంద్రియాదులు లేనివాడైనను భగవంతుడు తన మాయయొక్క సత్త్వాదికమగు గుణము నధిష్ఠించి జగమందు బాధబాధకభావమును పొందుచున్నాడు. అనగా బాధించదగిన వారలను (దుష్టులను) బాధించువాడైయుండు భావమును పొందుచున్నాడు. మఱి దేవతలు అసురులు లోనగు వారలకు (తాను అంతరాత్ముడై) బాధ్యబాధక భావమును పొందెను. దాని వివరణము పైన దెలియగోరెను.

**శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి ప్రకృతేర్నాత్మనో గుణాః।**
**న తేషాం యుగపద్రాజన్హ్రాస ఉల్లాస ఏవ వా॥ 7**

**ప్రతిపదార్థము:-** రాజన్=ఓరాజా!, సత్త్వం రజః తమస్ ఇతి=సత్త్వము, రజస్సు, తమస్సు అను, గుణాః=మూడు గుణములు, ప్రకృతేః=మూల ప్రకృతివి, న ఆత్మనః=పరమాత్మకు సంబంధించినవి కావు, ఓయీ! తన ఇచ్ఛ వచ్చినట్లు గుణాధిష్ఠుడగుచో పక్షపాతము సంభవించును. కావున అప్పుడు వైషమ్యము తప్పక యేర్పడును. అన్నచో అట్లు గాదు భగవంతుడు గుణాధిష్ఠుడగుట ననునది కాలముచే నగుచున్నదనుచున్నాడు. తేషామ్=అసత్త్వ రజస్తమోగుణాలకు, హ్రాసః=క్షయము, ఉల్లాసః=వృద్ధి, న యుగపత్=ఒకమారు సంభవించదు. ఒకప్పుడొక గుణమునకు వృద్ధి ఇంకొకప్పుడు డింకొక గుణమునకు వృద్ధి కలుగును.అట్టి హెచ్చుట తగ్గుట సంభవించును.

**తాత్పర్యము:-** ఓ రాజా! సత్త్వము-రజస్సు-తమస్సు అను మూడు గుణములు ప్రకృతివిగాని, పరమాత్మవి గావు. మఱి ఆ మూడు గుణములకు పూర్తి వృద్ధికాని, పూర్తి క్షయముగాని ఒక్కమారుగా సంభవించవు. సత్త్వగుణమునకొకప్పుడు వృద్ధి తక్కిన రజస్తమోగుణములకు క్షయము, అట్లే రజస్సునకు వృద్ధి తమస్సుకు వృద్ధి సంభవించును.

**శ్లో॥ జయకాలే తు సత్త్వస్య దేవర్షీన్ రజసోఽసురాన్।**
**తమసో యక్షరక్షాంసి తత్కాలానుగుణోఽభజత్॥ 8**

**ప్రతిపదార్థము:-**సత్త్వస్య=సత్త్వగుణముయొక్క, జయకాలే తు=జయకాలమునందు, దేవర్షీన్=దేవర్షులను,రజసః=రజోగుణముయొక్క, జయకాలమునందు, అసురాన్=అసురులను, తమసః=తమోగుణముయొక్క జయకాలమునందు, యక్షరక్షాంసి=యక్షరాక్షసులను, తత్+కాల+అనుగుణః=ఆ కాలమునకు అనుగుణుడై, అభజత్=పొందెను.

**తాత్పర్యము:-** భగవంతుడు సత్త్వగుణముయొక్క జయకాలమందు అనగా అభివృద్ధి కాలమునందు దేవర్షులను పొందును. రజోగుణము యొక్క అభివృద్ధికాలమునందు అసురులను పొందును. తమోగుణముయొక్క అభివృద్ధి కాలము నందు యక్షులను రాక్షసులను పొందును.

**వివరణము:-**సత్త్వగుణోల్లాసకాలమునందు దేవతలను బొంది జయమిచ్చును. అసురాదులకు పరాజయము కల్గించును. అట్లే రజోగుణోల్లాసకాలమునందు అసురులంజేరి వారికి జయమిచ్చును. దేవతలకు పరాజయమునిచ్చును. అట్లే తమోగుణమునంజేరి యక్ష రాక్షసులకు

జయము దక్కినవారికి బరాజయము సామాన్యము. దేవతల సత్త్వగుణోల్లాసులు వారికే జయము కల్గించునని భావము.

**శ్లో॥ జ్యోతిరాదిరివాభాతి సజ్ఘాతాన్న వివిచ్యతే।**
**విదన్త్యాత్మానమాత్మస్థం మథిత్వా కవయోఽన్తతః॥ 9**

**ప్రతిపదార్థము:-** స భగవాన్=భగవానుడు, జ్యోతిః ఆదిః ఇవ ఆభాతి (అగ్నిః దారుష్వివ)= కాష్ఠము లందగ్నిరీతి గూఢుడై వెలుగొందును. (అజ్ఞైః స భగవాన్) సంఘాతాత్ న వివిదిచ్యతే= భూతములందు నత్యంత సూక్ష్మవర్తనచే మందబుద్ధులకు నగోచరుడుగను. సర్వగతమైన సంఘాతమే దీనికి హేతువు కింతు,

**తాత్పర్యము:-** భగవానుడు కాష్ఠములందగ్నిరీతి గూఢుడై వెలుగొందును. భూతములందు నత్యంత సూక్ష్మవర్తనచే మందులకు నగోచరుడగును. సర్వగతమైన సంఘాతమే దీనికి హేతువు. కాని జ్ఞానులు ఆత్మను స్వాత్మయందే స్వానుభవముచే నెరుంగుచున్నారు.

**శ్లో॥ యదా సిసృక్షుః పుర ఆత్మనః పరో - రజః సృజత్యేష పృథక్ స్వమాయయా।**
**సత్త్వం విచిత్రాసు రిరంసురీశ్వర - శ్శయిష్యమాణస్తమ ఈరయత్యసౌ॥ 10**

**ప్రతిపదార్థము:-** యదా=ఎప్పుడు, ఆత్మనః=జీవునికి, పురః=భోగము కొఱకు శరీరము, పరః =పరమేశ్వరుడు, సిసృక్షుః(భవతి)=సృష్టిచేయగోరువాడగును, అప్పుడు (స్వరూప భేదముచే) రజః=ఉన్నట్టి రజస్సును, పృథక్ సృజతి=వేఱుగా సృజించును, విచిత్రాసు=వివిధములైన శరీరములందు, రిరంసుః=ఎప్పుడు క్రీడింపగోరునో అప్పుడు, ఈశ్వరః=ఈశ్వరుడు, సత్త్వమ్= సత్త్వమును,సృజతి=సృజించును,అసౌ=ఈ రూపమును,శయిష్యమాణః=లయమును, సంహరింప జేయు చున్నవాడగునో అప్పుడు, తమః=తమస్సును,ఈరయతి=ప్రత్యేకముగ ప్రేరేపించుచున్నాడు.

**తాత్పర్యము:-** పరమేశ్వరు డెప్పుడు జీవుల భోగమునకై శరీరమును సృజింపగోరునో అప్పుడు రజోగుణమును ప్రత్యేకముగా సృజించును. ఎప్పుడు వివిధములైన ఆ శరీరములందు క్రీడింప గోరునో, అప్పుడు సత్త్వగుణమును ప్రత్యేకముగా సృజించును. ఎప్పుడు వాని సంహరింపజేయువాడగునో, అప్పుడా ఈశ్వరుడు తమోగుణమును ప్రత్యేకించి సృజించును.

**శ్లో॥ కాలం చరన్తం సృజతీశ ఆశ్రయం - ప్రధానపుంభ్యాం నరదేవ! సత్యకృత్।**
**స తత్ర తత్రోభయసిద్ధిమాప్నుయాత్ - లిఙ్గాత్మనో లిఙ్గగుణాశ్చ సన్తి॥ 11**

**ప్రతిపదార్థము:-** నరదేవా!=ఓ నరపాలా!, ప్రధాన పుంభ్యామ్=నిమిత్తభూతులైన ప్రకృతి పురుషులచే, సత్యకృత్=విఫలముగాక సత్యముగా చేయువాడు, అమోఘకర్త, ఈశః= ఈశ్వరుడు, చరంతం=ఆ ప్రకృతి పురుషుల కాశ్రయభూతమై వర్తించుచున్నాడు, కాలమ్= కాలమును, నిమేష ముహూర్తాది దినవిభాగమైన కాలమును, సృజతి=సృజించుచున్నాడు, సః=ఆ, ఈ, తత్ర తత్ర=ఆ ప్రకృతి పురుషులందు, ఉభయ సిద్ధిమ్=ఆయి క్షితి ధర్మములను, లింగాత్మనః =సూక్ష్మలింగమై, అంతర్యామియై, లింగగుణాః=సత్త్వాది గుణములు, ఆప్నుయాత్ =పొందును.

**తాత్పర్యము:-** సృష్టికి నిమిత్త భూతులైయున్న ప్రకృతి పురుషులచే జగత్తును అమోఘముగా సృజించుచు నీశ్వరుడు వారి కాశ్రయమై వర్తించు కాలమును సృజించుచున్నాడు. అప్పుడు





అంతర్యామియై సత్త్వాదిగుణములు సత్యసంకల్పాది గుణములను పొందుచు ప్రకృతి పురుషుల ధర్మములను పొందుచున్నాడు.

**శ్లో॥ య ఏష రాజన్నపి కాల ఈశితా - సత్త్వం సురానీకమివైధయత్యజః।**
**తత్ప్రత్యనీకానసురాన్సురప్రియో - రజస్తమస్కాన్ప్రమిణోత్యురుశ్రవాః॥ 12**

**ప్రతిపదార్థము:-** రాజన్=ఓ రాజా!, యః ఏషః=ఏది, కాలః=కాలమైయున్నదో, సః=ఆ కాలము, సత్త్వమ్=సత్త్వమును, ఏధయతి=వర్ధిల్లజేయును, ఈశితా, అజః=ఈశ్వరుడు, సురానీకమ్ =సత్త్వగుణప్రధానమైన దేవతల సముదాయమును, ఏధయతి=వర్ధిల్లజేయును, ఉరుశ్రవాః=దొడ్డ కీర్తి గల ఈశ్వరుడు, రజస్తమస్కాన్=రజస్తమో గుణములు గలవారైన, తత్+ప్రత్యనీకాన్= సురులకు, ప్రతిపక్షులైన అసురులను, ప్రమిణోతి=వధించుచున్నాడు.

**తాత్పర్యము:-** ఓ రాజా! ఏ కాలము ఈశ్వరునిచే సృజించబడినదో ఆ కాలము ఒకప్పుడు సత్త్వమును వర్ధిల్లజేయుచున్నది. ఈశ్వరుడు అప్పుడు సత్త్వగుణ ప్రధానులైన దేవతలను వర్ధిల్లజేయును. రజస్తమోగుణములను గూడి దేవతలకు విరోధులైన అసురులను వధించు చున్నాడు.

**శ్లో॥ స వా పునస్స్వసృష్టస్య స్థితిరక్షానువృత్తయే।**
**సత్త్వం సురగణాన్ విష్ణురుపబృంహయతే ముహుః॥ 13**

**ప్రతిపదార్థము:-** పునః=మరల, స్వసృష్టస్య=తనచే సృజింపబడిన దేహధారులయొక్క, స్థితిరక్షా +అనువృత్తయే=ఉనికి, రక్షించుట అనువానిని వర్తింపజేయుట కొఱకు, సః=ఆ, విష్ణుః= విష్ణువు, సత్త్వమ్=సత్త్వగుణమును, సురగణాన్=దేవతాగణములును, ముహుః=మఱల,ఉప బృంహీయతే= వృద్ధిపొందజేయుచున్నాడు.

**తాత్పర్యము:-** తాను సృజించిన దేహధారులందు జగము నిల్పుటకు రక్షించుటకును ఆ విష్ణువు సత్త్వగుణమును, దేవతా గణములను వృద్ధిచేయుచున్నాడు.

**శ్లో॥ అత్రైవోదాహృదః పుణ్య ఇతిహాసస్సురర్షిణా।**
**ప్రీత్యా మహాక్రతౌ రాజన్! పృచ్ఛతే హతశత్రవే॥ 14**

**ప్రతిపదార్థము:-** రాజన్=ఓ రాజా!, అత్ర+ఏవ=ద్వేషాదులులేని భగవంతుడు దైత్యవధ గావించు విషయమై, మహాక్రతౌ=రాజసూయయాగమందు, హతశత్రవే=శత్రులనెల్లనుఱు మాడుట,పృచ్ఛతే =ప్రశ్నించినవాడగు ధర్మరాజునకు,సురర్షిణా=దేవర్షియగు నారదునిచే, ప్రీత్యా =సంతోషముచే, పుణ్యః=పవిత్రమైన, ఇతిహాసః=పూర్వకథ, ఉదాహృతః=ఉదహరించబడినది.

**తాత్పర్యము:-** ఓరాజా! ఈ విషయమై ధర్మరాజు సకల శత్రువుల హతమార్చి రాజసూయ యాగము చేయు సందర్భమున ద్వేషాదులు లేని భగవంతుడు సర్వసముడు దైత్యుల నెల్ల వధించుట న్యాయమెట్లగునని ప్రశ్నించెను. అప్పుడు దేవర్షి నారదుడు ధర్మజునికై నిష్టముగొని ఆ సందేహనివారణము కొఱకు పూర్వము జరిగిన కథ నొక్కట నుదాహరించి చెప్పెను.

**శ్లో॥ దృష్ట్వా మహాద్భుతం రాజా రాజసూయే మహాక్రతౌ।**
**వాసుదేవే భగవతి సాయుజ్యం చేదిభూభుజః॥ 15**

శ్లో॥ కీటః పేశస్కృతా రుద్ధః కుడ్యాయాం తమనుస్మరన్।
సంరమ్భభయయోగేన విన్దతే తత్స్వరూపతామ్॥ 29

**ప్రతిపదార్థము:-** కీటః=ఒకానొక పురుగు, పేశకృతా=గూడు కట్టుకొను తుమ్మెదచే, కుడ్యాయామ్=గోడయందు (మర్మముగా) రుద్ధః=నిర్బంధింపబడినది, సంరంభభయయోగేన=క్రోధము, భయము అనువాని కూడికచే, తమ్=ఆ భ్రమరమును, అనుస్మరన్=స్మరించుచు, తత్స్వరూపమ్=ఆ భ్రమర రూపమును, విందతే=పొందుచున్నది.

**తాత్పర్యము:-** భ్రమరము (తుమ్మెద) ఏదోనొక పురుగును పట్టుకొని వచ్చి, గోడయందు మట్టిలో దానుగట్టిన గూడు రంధ్రమునందు పెట్టి,ఝుంకారము చేయుచుండును. ఆ పురుగు తుమ్మెద పై కోపము, దానివలన భయముగలదై అది తన్నేమిచేయునో నని బెదరుచు ఆ భ్రమరమునే సదా స్మరించుచు కొన్ని దినములలో ఆ తుమ్మెద రూపమును బొందుచున్నదే. ఇది భ్రమర కీట న్యాయము.

శ్లో॥ ఏవం కృష్ణే భగవతి మాయామనుజ ఈశ్వరే।
వైరేణ పూతపాప్మానస్తమాపురనుచిన్తయా॥ 30

**ప్రతిపదార్థము:-** ఏవమ్=ఈ ప్రకారము, భగవతి=భగవంతుడై, మాయామనుజఈశ్వరే= మాయా మనుజుడై, పరమేశ్వరుడైన, కృష్ణే=కృష్ణునియందు, వైరేణ=విరోధముచే, పూత పాప్మానః=పాపములు నశించినవారై, అనుచింతయా=ఆ భగవంతుని చింతచేత-స్మరణచేత, తమ్=ఆ కృష్ణుని, ఆపుః=శత్రువులు అతనిని పొందిరి.

**తాత్పర్యము:-** ఇట్లు లీలామానుష విగ్రహుడైన, పరమేశ్వరుడైన కృష్ణుని యందు వైరము పూనినవారు సదా ఆయనను జింతించుచుందురు. అందువల్ల పాపములెల్ల శమించి పవిత్రులై ఆ భగవంతుని జేరుచున్నారు.

శ్లో॥ కామాద్ద్వేషాద్భయాత్ స్నేహాద్యథా భక్త్యేశ్వరే మనః।
ఆవేశ్య తదఘం హిత్వా బహవస్తద్గతిం గతాః॥ 31

**ప్రతిపదార్థము:-** కామాత్ ద్వేషాత్=కామమునను, ద్వేషమునను, భయాత్=భయమువలనను, స్నేహాత్=స్నేహముచేత, భక్త్యా=భక్తిచేతను, ఈశ్వరే=ఈశ్వరుని యందు, మనః=మనస్సు, ఆవేశ్య=ఆవేశించి, బహవః=పెక్కురు, అఘమ్=పాపమును, హిత్వా=కోరి, తద్గతిమ్=ఆ భగవంతుని సాయుజ్యమును, గతాః=పొందిరి.

**తాత్పర్యము:-**కామించుటచేత, ద్వేషించుటచేత, భయముచేత, స్నేహముచేత, భక్తిచేత పరమేశ్వరు నందు మనస్సుంచి పెక్కు మంది పాపము చేసినా పాపవిముక్తికై కోరి ఆ భగవంతుని సాయుజ్యమును పొందిరి.

శ్లో॥ గోప్యః కామాద్భయాత్కంసో ద్వేషాచ్చైద్యాదయో నృపాః।
సమ్బన్ధాద్వృష్ణయః స్నేహాద్యూయం భక్త్యా వయం విభో॥ 32

**ప్రతిపదార్థము:-** విభో!=ఓ రాజా!, గోప్యః=గోపికలు, కామాత్=కామమువలన, కంసః=



శ్లో॥ దమఘోషసుతః పాప ఆరభ్య కలభాషణాత్।
సమ్ప్రత్యమర్షీ గోవిన్దే దన్తవక్త్రశ్చ దుర్మతిః 19

**ప్రతిపదార్థము:-** దమఘోషసుతః=దమఘోషుని పుత్రుడు శిశుపాలుడు, కలభాషణాత్ ఆరభ్యః=బాల్యమునకు కోమలములైన మాటలు మాటలాడునది మొదలు, సంప్రతి=ఇప్పటి వరకు, గోవిందే=కృష్ణునందు, అమర్షీ=క్రోధమును గలవాడు, దంతవక్త్రశ్చ=వాని పినతల్లి కొడుకు దంతవక్త్రుడును, దుర్మతిః=చెడ్డబుద్ధి కలవాడు.

**తాత్పర్యము:-** దమఘోషుని పుత్రుడు శిశుపాలుడు పుట్టి బాలుడై మాటలు నేర్చినది మొదలు కృష్ణునందు ద్వేషియై దూషించుచున్నవాడు. ఆతని పినతల్లి కొడుకు దంతవక్త్రుడును చెడ్డబుద్ధి గలవాడు.

శ్లో॥ శపతోరసకృద్విష్ణుం యద్బ్రహ్మ పరమవ్యయమ్।
శ్విత్రో న జాతో జిహ్వాయాం నాన్ధం వాప్యావిశత్తమః॥ 20

**ప్రతిపదార్థము:-** యత్=ఏ, బ్రహ్మపరమ్=పరమాత్మ స్థానమై, అవ్యయమ్=అనాదినిధనుడైన, విష్ణుమ్=విష్ణువు అగు కృష్ణుని, అసకృత్=పలుమారు, శపతః=తిట్టువానిని, జిహ్వాయామ్=నాలుక, శ్విత్రః=కుష్టువు, న జాతః=పుట్టలేదు, అంధమ్=కటిక చీకటి, అంధకారబంధురమైన, తమః అపి వా=నరకమునైనను, న ఆవిశత్=పొందలేదు. పైగా విష్ణునందు లయమైనాడు.

**తాత్పర్యము:-** పరమాత్మయై నాశరహితుడైన మహావిష్ణువును పలుమారు నిందించు వానికి నాలుక యందు కుష్టువు జనించలేదు. కటిక చీకటికి స్థానమైన నరకమునకు బోవనూ లేదు. పైగా విష్ణువు నందు లయమయ్యెను.

శ్లో॥ కథం తస్మిన్భగవతి దురవగ్రాహ్యధామని।
పశ్యతాం సర్వలోకానాం లయమీయతురఞ్జసా॥ 21

**ప్రతిపదార్థము:-** దురవగ్రాహ్యధామని=పొందుటకు శక్యముగాని స్వరూపముగల, తస్మిన్=ఆ, భగవతి=శ్రీకృష్ణభగవానునియందు, సర్వలోకానామ్=ఎల్లప్రజలు, పశ్యతామ్=చూచుచుండ, అంజసా=తక్షణమే, లయమ్=నాశమును, కథమ్=ఎట్లు, ఈయతుః=శిశుపాలుడు దంతవక్త్రుడు పొందగలిగిరి.

**తాత్పర్యము:-** పొందుటకు శక్యముగాని స్వరూపము కలిగిన భగవంతుడు శ్రీకృష్ణునందు ఎల్లవారు చూచుచుండ, ఆ శిశుపాలదంతవక్త్రులు ఎట్లు సాయుజ్యమును పొందగలిగిరి.

శ్లో॥ ఇతి భ్రామ్యతి మే బుద్ధిర్దీపార్చిరివ వాయునా।
బ్రూహ్యేతదద్భుతతమం భగవాంస్తత్ర కారణమ్॥ 22

**ప్రతిపదార్థము:-** ఇతి=ఇట్లని, మే బుద్ధిః=నాయొక్క మనసు, వాయునా=వాయువుచే, దీపార్చిరివ=దీపజ్వాలవలె, భ్రామ్యతి=చలించుచున్నది, ఏతత్=ఇది, అద్భుతతమమ్=అన్నిటి కంటె నాశ్చర్యకరమై, అత్ర=ఇట్లు సంభవించుటకు, భగవాన్=భగవానుడవగు నారద!, కారణమ్=కారణమును, బ్రూహి=చెప్పుము.

**తాత్పర్యము:–** ఇట్టి పాపాత్ములకట్టి భగవత్ప్రాప్తిమెట్లు గలిగినదో అని నా బుద్ధి వాయు సంచారితమైన దీపశిఖవోలె నల్లలనాడుచున్నది. కాబట్టి ఓ నారద భగవానుడ! ఇట్టి సంభవమునకు గారణమేమో చెప్పుము.

**శ్రీ శుక ఉవాచ**

**శ్లో॥ రాజ్ఞస్తద్వచ ఆకర్ణ్య నారదో భగవానృషిః।**
**తుష్టః ప్రాహ తమాభాష్య శృణ్వన్త్యాస్తత్సదః కథాః॥ 23**

**ప్రతిపదార్థము:–** రాజ్ఞః=రాజగు ధర్మరాజు యొక్క, తద్ వచః=ఆ మాటను, ఆకర్ణ్య=ఆలకించి, భగవాన్=సర్వజ్ఞుడైన, నారదః=నారదమహర్షి, తుష్టః=సంతుష్టుడై, తమ్=ఆ ధర్మజుని, ఆభాష్య =సంబోధింది, తత్ సదః=ఆ సదస్సు, శృణ్వంత్యాః=వినుచుండ, కథాః=ఆ శిశుపాలాదుల కథలను, ప్రాహ=వచించెను.

**తాత్పర్యము:–** ధర్మరాజు వచించిన వాక్యముల నాలకించి నారద భగవానుడు సంతుష్టుడై ఓ ధర్మజా! అని సంబోధించి ఆ యాగ సదస్సులోనివారెల్లరు వినుచుండ ఆ శిశుపాలాదుల గూర్చిన కథలను జెప్పెను.

**నారద ఉవాచ**

**శ్లో॥ నిన్దనస్తవసత్కారన్యక్కారార్థం కళేబరమ్।**
**ప్రధానపరయో రాజన్నవివేకేన కల్పితమ్॥ 24**

**ప్రతిపదార్థము:–** రాజన్=ఓ రాజా!, నిందన=దోషమును గీర్తించుచు, స్తవ=గుణమును బేర్కొనుచు, సత్కార=పూజనము, న్యక్కారార్థమ్=తిరస్కారము లోనగువానికి విషయమైన, ప్రధాన పరయోః=ప్రకృతి పురుషుల యొక్క, అవివేకేన=వివేకించి తెలుసుకొనలేకపోవుటచే, కళేబరమ్ =శరీరము, కల్పితమ్=సృజించబడినది.

**తాత్పర్యము:–** ఓ రాజా! ప్రకృతి పురుషుల వివేకము లేకపోవుటచే దోషములను పేర్కొనుట, గుణములను శ్లాఘించుట, సత్కారములు చేయుట, తిరస్కారము గావించుట లోనగు వానికి శరీరము లక్ష్యమని ప్రకృతి కల్పించబడియున్నది.

**శ్లో॥ హింసా తదభిమానేన దణ్డపారుష్యయోర్యథా।**
**వైషమ్యమిహ భూతానాం మమాహమితి పార్థివ॥ 25**

**ప్రతిపదార్థము:–** పార్థివ!=ఓ రాజా!, తత్+అభిమానేన=దేహాభిమానము శరీరమే నేనను బుద్ధిచే, యథా=ఈ ప్రకారము, దండపారుష్యయోః=కొట్టుట తిట్టుట అనునవి కారణములు గలదైన, హింసా=పీడ కలుగుచున్నది, అట్లే భూతానామ్=భూతములకు, అహం మమ=నేను నాది అనువాని, వైషమ్యమ్=భేదబుద్ధి కలుగుచున్నది.

**తాత్పర్యము:–** ఈ శరీరమే నేను అను బుద్ధిచే దండనము నింద అనునవి హింసగా నేర్పడినట్లు భూతములకు నేను నాది యను భేదబుద్ధి శరీరమును గూర్చియే సంభవించుచున్నది.





**శ్లో॥ యన్నిబన్ధోఽభిమానోఽయం తద్వధాత్ప్రాణినాం వధః।**
**తథా న యస్య కైవల్యాదభిమానోఽఖిలాత్మనః।**
**పరస్య దమకర్తుర్హి హింసా కేనాస్య కల్ప్యతే॥ 26**

**ప్రతిపదార్థము:–** యత్ నిబంధః=ఏదేనియందు లగ్నమైన, అయమ్=ఈ, అభిమానః= దేహాభిమానము గలదో, తత్+వధాత్=ఆ దేహము వధ వలన, ప్రాణినాం వధః=ప్రాణుల వధ ఎట్లగుచున్నదో, తథా=అట్లు, యస్య=ఎవనికి, అఖిలాత్మనః=సర్వాత్ముడగు పరమేశ్వరుడు, కైవల్యా=కేవలుడగుటవలన, న=లేదు అభిమానః=దేహాభిమానము,పరస్య=ఇతరుని,దమకర్తుః =హితము కొఱకు, దండనముచేయుచున్న, అస్య=ఈశ్వరునికి, ఈశ్వరుని హింసా కేన= హింసాకార్యం ఎవని చేత, కల్ప్యతే=కల్పింపబడుచున్నది.

**తాత్పర్యము:–** ఎవని కీ దేహమందు అభిమానము గలదో, ఎవడీ దేహమే తాననే అట్టివాడు చేసిన ప్రాణులవధ హింసయగుచున్నది. ఎవని కథ దేహాత్మాభిమానము లేదో కేవలుడై సర్వాత్మకు డైన పరమేశ్వరునికి ఇతరుని మేలు కొఱకు దండించువానికి హింసయగుచో ఎవనిచే గల్పింప బడుచున్నది. దేహవధ ఆత్మవధ కాదు.

**శ్లో॥ తస్మాద్వైరానుబన్ధేన నిర్వైరేణ భయేన వా।**
**స్నేహాత్కామేన వా యుఞ్జ్యాత్ కథఞ్చిన్నేక్షతే పృథక్॥ 27**

**ప్రతిపదార్థము:–** తస్మాత్=పరమేశ్వరుడు దేహాభిమానములేని వాడగుటవలన, వైరానుబంధేన =పగసాధించు పూనిక చేతను, నిర్వైరేణ=ఏ విధమునను బగలేని మార్గము భక్తి యోగముచే గాని, భయేన=భయముచే గాని, స్నేహాత్=స్నేహమువలన కామేన వా=కామముచేత, కథంచిత్ =ఎట్లైనను, యుంజ్యాత్=మనస్సును ఆ భగవంతునియందు జేర్చినచో, పృథక్ న ఈక్షతే=ఆ మార్గమును వేఱుగ చూడడు.

**తాత్పర్యము:–** పరమేశ్వరుడు దేహాభిమానము గలవాడు కాదు. కాబట్టి ఆ భగవంతుని మీద పగసాధించబూనిక చేతను, భక్తియోగము చేతను, భయము చేతగాని, స్నేహమునను కామమున గాని మఱియే మార్గముచేగాని, ఆయన యందు మనస్సుంచవలెను. అట్లుంచిన వారలందరి యందు అతడు సముడై ముక్తినిచ్చును. వాడు చేపట్టిన మార్గములందు మంచి చెడ్డలకు భగవంతుడు పక్షపాతమును జూడడు.

**శ్లో॥ యథా వైరానుబన్ధేన మర్త్యస్తన్మయతామియాత్।**
**న తథా భక్తియోగేన ఇతి మే నిశ్చితా మతిః॥ 28**

**ప్రతిపదార్థము:–** మర్త్యః=మనుషులకు, యథా=ఏ ప్రకారము, వైర+అనుబంధేన=వాని యందు వైరమే శ్రేష్ఠము అని పగసాధింపు బుద్ధిచే, తత్+మయాతామ్=ఆ భగవంతుని స్వరూపమువలన, ఇయాత్=పొందును, తథా=ఆ ప్రకారము, భక్తియోగేన=భక్తయోగముచే, ఇతి న=పొందదని, మే=నాయొక్క, మతిః=మనస్సు, నిశ్చితా=నిర్ణయము పొందినది.

**తాత్పర్యము:–** భగవంతునిపై పగబూనినవాడు భగవత్స్వరూపుడై పోవుచు అట్లు ఎల్లప్పుడు ఆ భగవంతుని గూర్చి తలంచుచుండును గావున అట్లు తక్క భక్తియోగముచే సమకూరదని నా అభిప్రాయము.

**తాత్పర్యము:-** విష్ణువు నరసింహమూర్తియై హిరణ్యకశిపుని వధించెను. అట్లే భూమిని పైకెత్తు సమయమునందు విష్ణువు వరాహమూర్తియై అడ్డువచ్చిన ఆ హిరణ్యాక్షుని చంపెను.

**శ్లో॥ హిరణ్యకశిపుః పుత్రం ప్రహ్లాదం కేశవప్రియమ్।**
**జిఘాంసురకరోన్నానా యాతనా మృత్యుహేతవే॥ 43**

**ప్రతిపదార్థము:-** హిరణ్యకశిపుః=హిరణ్యకశిపుడు, కేశవప్రియః=విష్ణువునకు ఇష్టుడై భక్తుడైన, ప్రహ్లాదం పుత్రమ్=ప్రహ్లాదుడను పుత్రుని, జిఘాంసుః=చంపగోరి, మృత్యుహేతవే=చచ్చుట నిమిత్తము, నానా యాతనాః=పెక్కు బాధలను, అకరోత్=చేసెను.

**తాత్పర్యము:-** హిరణ్యకశిపుడు తన పుత్రుని ప్రహ్లాదుని విష్ణుభక్తుని జంపగోరినవాడై వాడు చచ్చుటకు పెక్కు హింసలు గావించెను.

**శ్లో॥ తం సర్వభూతాత్మభూతం ప్రశాన్తం సమదర్శనమ్।**
**భగవత్తేజసా స్పృష్టం నాశక్నోద్ధన్తుముద్యమైః॥ 44**

**ప్రతిపదార్థము:-**సర్వభూత+ఆత్మభూతమ్=సర్వభూతముల కాత్మయై, సమదర్శనమ్=అంతట బ్రహ్మమునే చూచువాడును, ప్రశాంతమ్=ద్వేషాదులులేనివాడు, భగవత్తేజసా=భగవంతుని తేజస్సు చేత, స్పృష్టమ్=వ్యాపించబడినవాడగు, తమ్=ఆ పుత్రుని, ఉద్యమైః=స్వ ప్రయత్నము లచే ఖడ్గప్రహారాదులతో, హంతుమ్=చంపుటకు, న అశక్నోత్=సమర్థుడు కాలేదు.

**తాత్పర్యము:-** ఎల్లప్రాణులకు ఆత్మయైన బ్రహ్మమును అంతట జూచుచు ఆ యాత్మయే వాడై ద్వేషాదులులేక భగవంతుని తేజమున వెలుగుచుండు ఆ ప్రహ్లాదుని తన సర్వ ప్రయత్నములచే ఖడ్గప్రహారాదులచే కూడా చంపలేకపోయెను.

**శ్లో॥ తతస్తౌ రాక్షసౌ జాతౌ కేశిన్యాం విశ్రవస్సుతౌ।**
**రావణః కుమ్భకర్ణశ్చ సర్వలోకోపతాపనౌ॥ 45**

**ప్రతిపదార్థము:-** తతః=ఆతర్వాత, తౌ=ఆ ద్వారపాలురే, ఆ హిరణ్యకశిపులే, కైకస్యాం/కేశిన్యామ్=కైకసియందు, విశ్రవః=విశ్రవుని, సుతౌ=పుత్రులై, రాక్షసౌ=రాక్షసులై, జాతౌ=పుట్టి, రావణః=రావణుడు, కుంభకర్ణః చ=కుంభకర్ణుడు అని, సర్వలోక+ఉపగతౌ=ఎల్లలోకములకు బాధ కలిగించువారైరి.

**తాత్పర్యము:-** తర్వాత వారు కైకసియందు విశ్రవుని పుత్రులై రావణుడు కుంభకర్ణుడు అనుపేర్లతో రాక్షసులై జన్మించి యెల్లలోకములకు నుపద్రవము దెచ్చువారైరి.

**శ్లో॥ తత్రాపి రాఘవో భూత్వా న్యహనచ్ఛాపముక్తయే।**
**రామవీర్యం శ్రోష్యసి త్వం మార్కణ్డేయముఖాత్ప్రభో॥ 46**

**ప్రతిపదార్థము:-** తత్ర+అపి=ఆ జన్మమందు విష్ణువు, రాఘవః భూత్వా=రఘువంశమునందు జన్మించినవాడై, శాపముక్తయే=వారి శాపనివృత్తికి, న్యహనత్=వారలను వధించెను, ప్రభో!=ఓ రాజా!,త్వమ్=నీవు,రామవీర్యమ్=రాముని శౌర్యమును, మార్కండేయముఖాత్=మార్కండేయుని వలన, శ్రోష్యసి=వినగలవు.



కంసుడు, భయాత్=భయముతో, చైద్య+ఆదయః=చైద్యుడు (శిశుపాలుడు) మొదలగు, నృపాః =రాజులు, ద్వేషాత్=ద్వేషముతో వైరముతో, వృష్ణయః=యాదవులు,సంబంధాత్=బంధుత్వము వలన, యూయమ్=మీరు, స్నేహాత్=స్నేహము వలనను, వయమ్=మేము, భక్త్యా=భక్తిచేతను భగవంతుని స్మరించుచున్నాము.

**తాత్పర్యము:-** ఓ రాజా! గోపికలు కామించియు, కంసుడు భయపడియు, శిశుపాలాదులు ద్వేషించియు, యాదవులు బంధుభావము పూనియు, మీరు చెలిమి గలిగి, మేము భక్తితోడను భగవంతుని సేవింపగలిగితిమి.

**శ్లో॥ కతమోఽపి న వేనః స్యాత్పఞ్చానాం పురుషమ్ప్రతి।**
**తస్మాత్కేనాప్యుపాయేన మనః కృష్ణే నివేశయేత్॥ 33**

**ప్రతిపదార్థము:-** పంచానామ్=ఇప్పుడు పేర్కొన్న భగవంతుని జేరు నుపాయాలలో నొక్క కామము తప్ప తక్కిన అయిందిటి లోపల, పురుషం ప్రతి=శ్రీహరిని గూర్చి, కతమః అపి=ఎవడును,వేనః న స్యాత్=వేనునివలె కాకూడదు, తస్మాత్=అందువలన, కేన ఉపాయేన అపి=ఏ యుపాయముచే నైనను,మనః=మనస్సును,కృష్ణే=కృష్ణునందు, నివేశయత్=ఉంచవలెను.

**తాత్పర్యము:-** కామము, భయము, ద్వేషము, సంబంధము, స్నేహము, భక్తి, అను ఆరు మార్గములందు పురుషులకు కామము పొసగనందున తక్కిన ఐదు ఉపాయములలో నేదేని జేపట్టినవాడై వేనుని వలె కాదు వేనునికి ఇవేవియులేవనుట, కృష్ణునందు మనస్సుంచవలెను.

**శ్లో॥ మాతృష్వసేయో వశ్చైద్యో దన్తవక్త్రశ్చ పాణ్డవ।**
**పార్షదప్రవరౌ విష్ణోర్విప్రశాపాత్పదాచ్చ్యుతౌ॥ 34**

**ప్రతిపదార్థము:-**పాండవ!=ఓ ధర్మజా!, చైద్యః=ఈ శిశుపాలుడు, దంతవక్త్రః చ=దంతవక్త్రుడు, వః=మీకు, మాతృష్వసేయః=పినతల్లికొడుకులు, విష్ణోః=విష్ణువు యొక్క, పార్షదప్రవరౌ= పరిషత్తు నందు శ్రేష్ఠమైన సభ్యులుగా నున్నవారు, ద్వారపాలురనుట, విప్రశాపాత్=బ్రాహ్మణుల శాపమువలన, పదాత్=వైకుంఠస్థానము నుండి, చ్యుతౌ=భ్రష్టులయిరి.

**తాత్పర్యము:-** ఓ ధర్మరాజా! మీ పినతల్లుల కొడుకులైన శిశుపాల దంతవక్త్రులు అనువారు విష్ణుదేవుని యొక్క పార్షదము యొక్క ద్వారపాలకులు. వారు విప్రుల శాపమున వైకుంఠ స్థానము నుండి భ్రష్టులైనవారు.

**యుధిష్ఠిర ఉవాచ**

**శ్లో॥ కీదృశః కస్య వా శాపో హరిదాసాభిమర్శనః।**
**అశ్రద్ధేయ ఇవాభాతి హరేరేకాన్తినాం భవః॥ 35**

**ప్రతిపదార్థము:-** శాపః=విప్రశాపము, కీదృశః=ఎట్టిది?, కస్య వా=ఎవనికి సంబంధించినది, హరిదాస+అభిమర్శనః=హరిదాసులను బాధించునది, హరేః=విష్ణువుయొక్క, ఏకాంతినామ్= ఏకాంత భక్తులకు, భవః=జన్మము, అశ్రద్ధేయః ఇవ=అనాదరమువలె, ఆభాతి=ప్రకటితమగు చున్నది.

**తాత్పర్యము:-**ఆ శాపమెట్టిది? ఎవరిచ్చినది? హరిదాసులను సైతము బాధించునది, విష్ణువు

నకు కొంత భిన్నమైన వారికి జన్మము కలుగుచున్న దన్నచో అది నమ్మగూడనిదిగానున్నది. అసంభవముగానున్నది.

**శ్లో॥ దేహేన్ద్రియాసుహీనానాం వైకుణ్ఠపురవాసినామ్।**
**దేహసమ్బన్ధసమ్బద్ధమేతదాఖ్యాతుమర్హసి॥ 36**

**ప్రతిపదార్థము:–** దేహేంద్రియ+అసుహీనానామ్=జన్మహేతుభూతములు, ప్రాకృతమగు దేహేంద్రియ ప్రాణములులేని శుద్ధసత్త్వమయ దేహములుగల, వైకుంఠపురవాసినామ్=వైకుంఠ పట్టణవాసులకు, దేహసంబంధసంబద్ధమ్=ప్రాకృతమగు దేహసంబంధముతోడి సంబంధమును, ఏతత్=ఈ విధముగా, ఆఖ్యాతుమ్=చెప్పుటకు, అర్హసి=తగుదువు.

**తాత్పర్యము:–** జన్మ కారణములగు కర్మాదులు గల్గి ప్రాకృతములైన దేహేంద్రియప్రాణములు లేనివారగు వైకుంఠపురవాసులకు ప్రాకృతదేహసంబంధము సంభవించినట్లు చెప్పితివి. ఈ కథ సాకల్యముగా జెప్పుము.

**నారద ఉవాచ**

**శ్లో॥ ఏకదా బ్రహ్మణః పుత్రా విష్ణోర్లోకం యదృచ్ఛయా।**
**సనన్దనాదయో జగ్ముశ్చరన్తో భువనత్రయమ్॥ 37**

**ప్రతిపదార్థము:–** ఏకదా=ఒకప్పుడు, బ్రహ్మణః పుత్రా=బ్రహ్మదేవునికి పుత్రులయిన, సనంద నాదయః=సనందుడులోనగువారు, యదృచ్ఛయా=యాదృచ్ఛికముగా, తమకు తామే, భువన త్రయమ్=ముల్లోకములను, చరంతః=సంచరించుచు, విష్ణోః+లోకమ్=విష్ణులోకముకు, జగ్ముః =పోయిరి.

**తాత్పర్యము:–** ఒకప్పుడు బ్రహ్మ మానస పుత్రులయిన సనందుడులోనగువారు నలుగురు మూడు లోకములను సంచరించుచు విష్ణువుండు వైకుంఠలోకమునకు బోయిరి.

**శ్లో॥ పఞ్చాషడ్ఢాయనార్భాభాః పూర్వేషామపి పూర్వజాః।**
**దిగ్వాససశ్శిశూన్మత్వా ద్వాఃస్థౌ తాన్ ప్రత్యషేధతామ్॥ 38**

**ప్రతిపదార్థము:–** పంచాషద్+ఆయనాః=అయిదారు సంవత్సరముల వయసు వారగు, అర్భ+ ఆభాః=బాలురవలె ప్రకాశించువారును, పూర్వేషామ్ అపి=పూర్వులగు మరీచిలోనగు నవబ్రహ్మ కంటె, పూర్వజాః=ముందు జన్మించినవారు, దిగ్వాసనః=దిగంబరులైనవారు, శిశూన్=వారలను బాలురని, మత్వా=తలంచి, ద్వాఃస్థౌ=ద్వారము నందున్న యిరువురు పాలకులు, తాన్= వారలను, ప్రత్యషేధతామ్=లోపల బోగూడదని నివారించిరి.

**తాత్పర్యము:–** అయిదారు వత్సరముల వయస్సుగల బాలురవలె నున్నవారును పూర్వులగు మరీచిలోనగు నవబ్రహ్మల కంటె పూర్వము జనించినవారును, దిగంబరులు అగువారలను జూచి విష్ణు ద్వారపాలకులు శిశువులని తలంచి లోపలికి పోకూడదని నివారించిరి.

**శ్లో॥ అశపన్ కుపితా ఏవం యువాం వాసం న చార్హథః।**
**రజస్తమోభ్యాం రహితే పాదమూలే మధుద్విషః।**
**పాపిష్ఠామాసురీం యోనిం బాలిశౌ యాతమాశ్వతః॥ 39**





**ప్రతిపదార్థము:–** కుపితాః=అట్లు నిషేధించుటవలన కినుకచెందినవారై,ఏవమ్=ఇట్లు, అశపన్ =ద్వారపాలకులను శపించిరి,యువామ్=మీరు, వాసం చ=ఈ వైకుంఠలోకవాసమును, న అర్హథః=పొందుటకు అర్హులుకారు, రజస్తమోభ్యామ్=రజోగుణ తమోగుణములచే, రహిత= సంబంధమందులేని, మధుద్విషః=విష్ణువుయొక్క, పాదమూలే= పాద సమీపమునందును సేవకు సైతము, న అర్హథః=తగినవారుకారు, బాలిశౌ=ఓ పాపాత్ములారా!, అతః=ఇందువల్ల, ఆశు=తక్షణమే, పాపిష్ఠామ్=మిగుల పాపమునకు స్థానమై,అసురీం యోనిమ్=అసుర జన్మము, యాత=పొందుము.

**తాత్పర్యము:–** అంతవారు కినుకజెంది ద్వారపాలుర జూచి మీరు మమ్ములను నిషేధించిరి. కావున ఓ పాపాత్ములార! మీరు ఈ వైకుంఠమున నుండ దగరు. రజస్తమోగుణములు సంగతిలేని విష్ణుపాదసేవ సైతము మీరు చేయదగరు. కావున మీరు వెంటనే అధికపాపమునకు నెలవైన అసుర జన్మమును పొందుము అని శపించిరి.

**శ్లో॥ ఏవం శప్తౌ స్వభవనాత్ పతన్తౌ తైః కృపాలుభిః।**
**ప్రోక్తౌ పునర్జన్మభిర్వాం త్రిభిర్లోకాయ కల్పతామ్॥ 40**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఇట్లు, శప్తౌ=శపింపబడినవారై, స్వభవనాత్=తామున్న వైకుంఠ నగరము నుండి, పతంతౌ=భువికి పడుతున్నవారై, కృపాలుభిః=దయగలవారగు, తైః= సనందనాదులచే, వామ్=మీయొక్క, త్రిభిః=మూడు జన్మములచే, లోకాయ=మరల ఈ లోకమునకు, స్వస్థానప్రాప్తికి, కల్పతామ్=తగుదురు గాక, పునః=మరల, ప్రోక్తౌ=చెప్పిరి.

**తాత్పర్యము:–** ఇట్లు శపింపబడి స్వస్థానము నుండి భ్రష్టులగు చుండువారలను సనకాదులు దయగలవారై మూడు జన్మములు అసురులైయుండి తర్వాత మరల మీ స్వస్థానమగు ఈ లోకమును పొందుదురు గాక! అని అనుగ్రహించిరి.

**శ్లో॥ జజ్ఞాతే తౌ దితేః పుత్రౌ దైత్యదానవవన్దితౌ।**
**హిరణ్యకశిపుర్జ్యేష్ఠో హిరణ్యాక్షోఽనుజస్తతః॥ 41**

**ప్రతిపదార్థము:–** తౌ=ఆ ద్వారపాలురిరువురు, దితేః=దితికి, పుత్రౌ=పుత్రులై, దైత్యదానవ వందితౌ=దైత్యదానవులచే నమస్కరించబడుచు, జజ్ఞాతే=జనించిరి, హిరణ్యకశిపుః జ్యేష్ఠః= హిరణ్య కశిపుడు పెద్దవాడు, హిరణ్యాక్షః అనుజః=హిరణ్యాక్షుడు చిన్నవాడు, తతః=తరువాత.

**తాత్పర్యము:–** వారు కశ్యపుని భార్య దితికి పుత్రులై దైత్యదానవులచే నమస్కరించబడుచు జన్మించిరి. వారలందు జ్యేష్ఠుడు హిరణ్యకశిపుడు, కనిష్ఠుడు హిరణ్యాక్షుడు అయిరి. తర్వాత.

**శ్లో॥ హతో హిరణ్యకశిపుర్హరిణా సింహరూపిణా।**
**హిరణ్యాక్షో ధరోద్ధారే బిభ్రతా సౌకరం వపుః॥ 42**

**ప్రతిపదార్థము:–** హిరణ్యకశిపుః=హిరణ్యకశిపుడు, సింహరూపిణా=సింహరూపియైన, హరిణా=విష్ణువుచేత, హతః=చంపబడెను, ధరోద్ధారే=భూమిని పైకెత్తు సమయమున, సౌకరం వపుః=వరాహ శరీరమును, బిభ్రతా=ధరించు విష్ణువుచే, హిరణ్యాక్షః=ఆ పనికి అడ్డువచ్చినవాడై హిరణ్యాక్షుడు, హతః=చంపబడెను.

**శ్లో॥ తస్మిన్ కూటేఽహితే నష్టే కృతమూలే వనస్పతౌ।**
**విటపా ఇవ శుష్యన్తి విష్ణుప్రాణా దివౌకసః॥ 9**

**ప్రతిపదార్థము:–** కూటే=కపటస్థుడు, అహితే=శత్రువునగు, తస్మిన్=ఆ హరి, నష్టేసతి=నశించిన వాడుకాగా, వనస్పతౌ=మద్దిలోనగు వృక్షం, కృత్తమూలే=తెగినవేర్లుగలదిగా, విటపా ఇవ=దాని కొమ్మలవలె, విష్ణుప్రాణాః=విష్ణువే ప్రాణంగా గల, దివౌకసః=స్వర్గవాసులైన దేవతలు, శుష్యంతి= నశిస్తారు.

**తాత్పర్యము:–**మద్దిలోనగు వృక్షాల కుంగుడు వేరు ఖండించినచో దాని కొమ్మలన్నీ ఎండిపోయి నట్లు కపటియైన, శత్రువైన ఆ హరిని చంపితే విష్ణువే ప్రాణమైన దేవతలందరూ నశిస్తారు.

**శ్లో॥ తావద్యాత భువం యూయం బ్రహ్మక్షత్రసమేధితామ్।**
**సూదయధ్వం తపోయజ్ఞస్వాధ్యాయవ్రతదానినః॥ 10**

**ప్రతిపదార్థము:–** తావత్=ఇప్పుడు, యూయమ్=మీరు, విప్రక్షత్రసమేధితామ్=బ్రాహ్మణులతో క్షత్రియులతో వృద్ధిపొందిన, భువమ్=భూమినిగురించి, యాత=పొందుడు(చేరుడు), తపోయజ్ఞ స్వాధ్యాయవ్రతదానినః=తపం, యజ్ఞం, లేదా స్వాధ్యాయం వ్రతం, దానం గలవారలను, సూదయధ్వమ్=వధింపుడు.

**తాత్పర్యము:–** ఇప్పుడు మీరు బ్రాహ్మణ క్షత్రియులతో వృద్ధి పొందిన భూమి అంతా సంచరిస్తూ తపస్సు చేసేవారిని, యజ్ఞం చేసేవారిని, వేదాధ్యయనం చేసేవారిని, వ్రతాలు చేసేవారిని, దానం చేసేవారిని పట్టి వధించండి.

**శ్లో॥ విష్ణుర్ద్విజక్రియామూలో యజ్ఞధర్మమయః పుమాన్।**
**దేవర్షిపితృభూతానాం ధర్మస్య చ పరాయణమ్॥ 11**

**ప్రతిపదార్థము:–** విష్ణుః=హరి, ద్విజక్రియామూలః=విప్రుల కర్మానుష్టానానికి ఆధారంగా గలవాడు,యజ్ఞధర్మమయః=యజ్ఞస్వరూపుడు, దేవర్షిపితృభూతానామ్=దేవతలకు, ఋషులకు, పితరులకు, ధర్మస్య=వారి నిత్య ప్రవృత్తికి, పరాయణమ్=ఆశ్రయమై, పుమాన్=పురుషుడై ఉన్నాడు.

**తాత్పర్యము:–** మహావిష్ణువు విప్రుల నిత్యకర్మానుష్ఠానం మూలంగా గల యజ్ఞస్వరూపుడు ధర్మస్వరూపుడు. దేవతలకు, పితృదేవతలకు, పెద్దలకు ఇతర ప్రాణులకు వారి జీవనయాత్రకు ఆశ్రయమైనవాడు. (వారెల్లరు నన్ను సేవింపక ఆతనిని సేవించుచున్నారు కావున వధింపదగిన వాడాయెను.)

**శ్లో॥ యత్ర యత్ర ద్విజా గావో వేదా వర్ణాశ్రమాః క్రియాః।**
**తం తం జనపదం యాత సన్దీపయత వృశ్చత॥ 12**

**ప్రతిపదార్థము:–** యత్ర యత్ర=ఎక్కడెక్కడ, ద్విజాః=ద్విజులు (బ్రాహ్మణులూ), గావః=గోవులు, వేదాః=వేదాలు, వర్ణాశ్రమాః క్రియాః=వర్ణాశ్రమ కర్మలు కలవో, తం తం జనపదమ్=ఆయా దేశాలను, యాతః=పొంది, సందీపయత=వానిని దగ్ధం చెయ్యండి, వృశ్చత=చీల్చిచెండాడండి.



**తాత్పర్యము:–** ఆ రావణ కుంభకర్ణులను విష్ణువు రాఘవుడై యవతరించి శాపనివృత్తికై వారిని వధించెను. రాముని పరాక్రమము నీవు మార్కండేయుని వలన వినగలవు.

**శ్లో॥ తావద్య క్షత్రియౌ జాతౌ మాతృష్వస్రాత్మజౌ తవ।**
**అధునా శాపనిర్ముక్తౌ కృష్ణచక్రహతాంహసౌ॥ 47**

**ప్రతిపదార్థము:–** తౌ=ఆ యిరువురు, అద్య=ఇప్పుడు, తవ= నీయొక్క, మాతృష్వస్ర+ఆత్మజౌ= పినతల్లి కొడుకులైన, క్షత్రియౌ=క్షత్రియులై, జాతౌ=జనించిరి, కృష్ణచక్రహతా+అంహసౌ= కృష్ణుని చక్రముచే కొట్టబడిన పాపముగలవారై, అధునా=ఇప్పుడు, శాపనిర్ముక్తౌ=శాప విముక్తులైరి.

**తాత్పర్యము:–** ధర్మరాజా! ఇప్పుడు నీ యొక్క పినతల్లి కుమారులై క్షత్రియులై జన్మించి కృష్ణుని చక్రముచే పాపములన్నియు పోగొట్టుకొని ఇప్పుడు శాపము నుండి విడుదలగాబడిరి. కృష్ణుడు వారి పాపసంహారము గావించెను. కాని వారిని వధించలేదనుట.

**శ్లో॥ వైరానుబన్ధతీవ్రేణ ధ్యానేనాచ్యుతసాత్మ్యతామ్।**
**నీతౌ పునః హరేః పార్శ్వం జగ్మతుర్విష్ణుపార్షదౌ॥ 48**

**ప్రతిపదార్థము:–** వైర+అనుబంధ తీవ్రేణ=పగబట్టి తీవ్రమైన, ధ్యానేన=ధ్యానముచేత, అచ్యుత సామ్యతామ్=విష్ణుసామ్యమును, నీతౌ=పొందినవారై, పునః=మరల, విష్ణుపార్షదౌ=విష్ణువు సేవకులై, హరేః పార్శ్వమ్=విష్ణువు పార్శ్వభాగమును, జగ్మతుః=పొందిరి.

**తాత్పర్యము:–** తీవ్రముగ బగబట్టి నిరంతరము చింతించుటచే విష్ణుసామ్యమును పొందినవారై మరల విష్ణుపార్షదులై విష్ణువునకు బార్శ్వ చరులైపోయిరి.

**యుధిష్ఠిర ఉవాచ**

**శ్లో॥ విద్వేషో దయితే పుత్రే కథమాసీన్మహాత్మని ।**
**బ్రూహి మే భగవన్! యేన ప్రహ్లాదస్యాచ్యుతాత్మతా॥ 49**

**ప్రతిపదార్థము:–** భగవన్=ఓ నారద భగవానుడా!, దయితే పుత్రే=ప్రియమైన పుత్రుడైన, మహాత్మని=మహాత్ముడైన అతనియందు, కథమ్=ఎట్లు, విద్వేషమ్=ద్వేషము, ఆసీత్=ఆయెను, యేన ఏకారణముచేత,ప్రహ్లాదస్య=ప్రహ్లాదునకు, అచ్యుత+ఆత్మతా=విష్ణువునందు ఏకచిత్తత్వము గలిగే !, మే=నాకు, బ్రూహి=చెప్పుము.

**తాత్పర్యము:–** ఓ నారద భగవానుడా! హిరణ్యకశిపునకు మహానుభావుడైన ప్రియపుత్రునందు విద్వేషమేల కలిగెను? ప్రహ్లాదునికి విష్ణునందేకాంత భక్తి యెట్లు గలిగెనో ఆ వృత్తాంతము నాకు జెప్పుము.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**ప్రహ్లాదచరితోపక్రమే జయవిజయజన్మత్రయవర్ణనం నామ**
**ప్రథమోఽధ్యాయః(1)**

## శ్రీః
## అథ ద్వితీయో௨ధ్యాయః

నారద ఉవాచ

**శ్లో॥ భ్రాతర్యేవం వినిహతే హరిణా క్రోడమూర్తినా।**
**హిరణ్యకశిపూ రాజన్ పర్యతప్యద్రుషా శుచా॥ 1**

**ప్రతిపదార్థము:–** క్రోడమూర్తినా=క్రోధుడై వరాహ రూపముతోనున్న, హరిణా=విష్ణువుచేత, ఏవమ్=ఈవిధముగా, భ్రాతః వినిహతే=సోదరుడైన హిరణ్యాక్షుడు చంపబడినవాడు కాగా, హిరణ్యకశిపుః=హిరణ్యకశిపుడు, రుషా శుచా=రోషం చేత, దుఃఖం చేత, పర్యతప్యత్=చాల మనోవ్యథచెందాడు.

**తాత్పర్యము:–** విష్ణువు కినుక (కోపం) తో వరాహరూపంలో తన తమ్ముని హిరణ్యాక్షుని చంపాడు. అది చూసిన హిరణ్యకశిపుడు ఎంతో బాధ, కోపం కలవాడై మనోవ్యథ చెందాడు.

**శ్లో॥ ఆహ చేదం రుషా ఘూర్ణన్ సన్దష్టదశనచ్ఛదః।**
**కోపోజ్జ్వలద్భ్యాం చక్షుర్భ్యాం నిరీక్షన్ ధూమ్రమమ్బరమ్॥ 2**

**ప్రతిపదార్థము:–** రుషా=రోషం చేత, ఘూర్ణన్=సింహగర్జనచేస్తూ, సందష్టదశనచ్ఛదః=పెదవి కొఱుకుతూ, కోపోజ్జ్వలద్భ్యామ్=కోపాగ్నిచేత మండుతున్న, చక్షుర్భ్యామ్=కన్నులలో, ధూమ్రమ్ =పొగకమ్మిన దాన్నిగా, అంబరమ్=ఆకాశాన్ని, నిరీక్షన్=చూస్తూ, ఇదం చ ఆహ=ఈ మాట అన్నాడు.

**తాత్పర్యము:–**రోషంతో మిక్కిలి కోపంకలవాడై సింహగర్జనచేస్తూ పెదవులుకొరుకుతూ కోపాగ్ని వల్ల మండుతున్న కళ్ళతో ఆకాశాన్ని పొగకమ్మిన దానిలా చూస్తూ ఇలా పలికాడు.

**శ్లో॥ కరాళదంష్ట్రోగ్రదృష్ట్యా దుష్ప్రేక్ష్యభ్రుకుటీముఖః।**
**శూలముద్యమ్య సదసి దానవానిదమబ్రవీత్॥ 3**

**ప్రతిపదార్థము:–** కరాళదంష్ట్రా+ఉగ్రదృష్ట్యా=భయంకరమైన కోరలచేత భీతి కలిగించే చూపు చేత, దుష్ప్రేక్ష్యభ్రుకుటీముఖః=చూడటానికి వీలుకాని కనుబొమలూ, ముఖం కలవాడై, శూల ముద్యమ్య=శూలాన్ని పైకెత్తి, సదసి=సదస్సులో, ఆ సభలో, దానవాన్=రాక్షసులగురించి, ఇదమ్= ఈవిధంగా, అబ్రవీత్=పలికేడు.

**తాత్పర్యము:–** భయంకరమైన కోరలతో భయం కలిగించే చూపుతో చూడటానికి వీలుకాని కనుబొమలూ, ముఖం కలిగినవాడై, శూలాన్ని పైకెత్తి దానవసభలో ఇలా అన్నాడు.

**శ్లో॥ భో భో దానవదైతేయాద్విమూర్ధంస్త్ర్యక్ష శమ్బర।**
**శతబాహో హయగ్రీవ నముచే పాక ఇల్వల॥ 4**

**శ్లో॥ విప్రచిత్తే మమ వచః పులోమఞ్శకునాదయః।**
**శృణుతానన్తరం సర్వే క్రియతామాశు మా చిరమ్॥ 5**



**ప్రతిపదార్థము:–** భో భో దానవదైతేయాః=ఓ దానవులారా, దైత్యులారా, ద్విమూర్ధమ్= ద్విమూర్ధుడా!, త్ర్యక్ష=ఓ త్రినేత్రుడా!,శంబర=శంబరుడా,శతబాహో=శతబాహుడా, హయగ్రీవ =హయగ్రీవా, నముచే–పాక–ఇల్వల=నముచీ,పాకుడా,ఇల్వలుడా!,విప్రచిత్తే=విప్రచిత్తీ, పులోమ =ఓ పులోముడా!, శకున+ఆదయః=శకునుడు మొదలైనవారు, సర్వే=మీరందరూ, మమ వచః =నా మాటను, శ్రుణుత=వినండి, అనంతరమ్=ఆ తర్వాత, ఆశుమ్=వెంటనే, క్రియతామ్ =చేయండి, మా చిరమ్=ఆలస్యం చెయ్యకండి.

**తాత్పర్యము:–** ఓ దానవులారా! దైత్యులారా, ఓ త్రిశిరుడా, ఓ త్రినేత్రుడా!, శంబరుడా, శతబాహుడా!, హయగ్రీవా, నముచీ!, పాకుడా, ఇల్వలుడా, విప్రచిత్తీ, పులోముడా, శకునుడ! మీరంతా నా మాట వినండి. ఆ తర్వాత నేను చెప్పినట్లు చెయ్యండి. ఆలస్యం చెయ్యకండి.

**శ్లో॥ సపత్నైర్ఘాతితః క్షుద్రైర్భ్రాతా మే దయితస్సుహృత్।**
**పార్ష్ణిగ్రాహేణ హరిణా సమేనాప్యుపధావనైః॥ 6**

**ప్రతిపదార్థము:–** సపత్నైః=మన శత్రువులు, క్షుద్రైః=బలహీనులగు, ఉపధావనైః=తనను భజించే వారైన దేవతలచేత, సమేన అపి=సముడైనను, పార్ష్ణిగ్రాహేణ=వెనుక సహాయుడైవచ్చు, హరిణా =విష్ణువుచేత, మే=నాకు, దయితః=ఇష్టుడు, సుహృత్=మేలుకోరువాడు అగు, భ్రాతా= సోదరుడు, ఘాతితః=చంపబడెను.

**తాత్పర్యము:–** బలహీనులైన మన శత్రువులు దేవతలు, విష్ణువును భజించారు. అతడు అందరికీ సమానుడయ్యు వారికి సహాయులై వచ్చిన నా కూర్మి తమ్ముడు, నా మేలు కోరువాడు చంపబడెను.

**శ్లో॥ తస్య త్యక్తస్వభావస్య ఘృణేర్మాయావనౌకసః।**
**భజన్తం భజమానస్య బాలస్యేవాస్థిరాత్మనః॥ 7**

**ప్రతిపదార్థము:–** త్యక్తస్వభావస్య=విడిచిపెట్టబడ్డ సమత్వమునుగల, మాయావనౌకసః=శుద్ధ మైన తేజోస్వరూపుడై మాయచేత, కాననము ఉనికిగాగల, ఘృణేః=వరాహరూపుడైన, భజంతమ్ =తన్ను భజించువానిని, భజమానస్య=భజించువాడై, బాలస్య+ఇవ=బాలుడుగ, అస్థిర+ఆత్మనః =నిలకడలేని ఆత్మ గలవారు.

**తాత్పర్యము:–** తమ సమత్వగుణం చేత అడవి ద్రిమ్మరి అయి సూకరరూపం పొంది తనను సేవించేవారిని వెంబడిస్తూ బాలునిలా అస్థిరచిత్తుడు కాని వాడు ఆ హరి.

**శ్లో॥ మచ్ఛూలభిన్నగ్రీవస్య భూరిణా రుధిరేణ వై।**
**రుధిరప్రియం తర్పయిష్యే భ్రాతరం మే గతవ్యథః॥ 8**

**ప్రతిపదార్థము:–** మత్+శూలభిన్నగ్రీవస్య=నాశూలంచేత ఖండితమైన కంఠం గలవాని యొక్క భూరిణా=అధికమైన, రుధిరేణ=రక్తంచేత, రుధిరప్రియమ్=రక్త మందు ఇష్టుడై, మే=నాయొక్క భ్రాతరమ్=సోదరుని, గతవ్యథః=మనోవ్యథ తొలగినవాడై, తర్పయిష్యే=తృప్తిగావించెదను.

**తాత్పర్యము:–** అటువంటి ఆ విష్ణువు కంఠాన్ని శూలంచేత ఖండించి, వాని రక్తంచేత రక్త ప్రియుడైన నా తమ్మునికి తర్పణం ఇచ్చి మనోవ్యథ తొలగినవాడై తృప్తిగావించెదను.

**శ్లో॥ ఏవం గుణైర్భ్రామ్యమాణే మనస్యవికలః పుమాన్।**
**యాతి తత్సామ్యతాం భద్రే! హ్యలిఙ్గో లిఙ్గవానివ॥ 24**

**ప్రతిపదార్థము:-** భద్రే=ఓ మంగళశీలా!, ఏవమ్=ఈ ప్రకారం, గుణైః=సత్త్వాదిగుణాలచేత, భ్రామ్యమాణే=భ్రమించుచున్న, మనసి=మనసులో, అవికలః=పరిపూర్ణుడైన, పుమాన్= పురుషుడు, అలింగః=సూక్ష్మాది శరీరాలు లేనివాడు, లింగవాన్ ఇవ=దేహేంద్రియాలు కలవానివలె, తత్+సామ్యతామ్=ఆ మనసుతోడి సామ్యాన్ని,యాతి=పొందుచున్నాడు, హి=కదా!

**తాత్పర్యము:-** ఈ ప్రకారం సత్త్వాది గుణాలతో భ్రమిస్తున్న మనస్సులో పరిపూర్ణుడైన పురుషుడు (ఆత్మ) దేహేంద్రియాదులు లేనివాడు లాగ అయ్యి, ఆ మనసుతో సామ్యాన్ని పొందుతున్నాడు. మనసే కదా! సంకల్పాలు కలది.

**శ్లో॥ ఏష ఆత్మవిపర్యాసో హ్యలిఙ్గే లిఙ్గభావనా।**
**ఏష ప్రియాప్రియైర్యోగో వియోగః కర్మసంసృతిః॥ 25**

**ప్రతిపదార్థము:-** ఏషః=ఇది, ఆత్మవిపర్యాసః=ఆ కర్మకు అన్యథా భావమగుచున్నది, ఏవమ్= ఈ ప్రకారము, ప్రియ+అప్రియైః=ఇష్టమైనవానిలో, అనిష్టమైన వానిలోని, యోగః=కూడుట, వియోగః=ఎడబాయుట, కర్మసంసృతిః=కర్మలు చేయుట, వివిధములగు ప్రాణి గర్భములందు ప్రవేశించి జనాదులు పొందుట ఒక పాతమును కలుగుచున్నది.

**తాత్పర్యము:-** ఆత్మ తాను అలింగుడైయుండి కూడా దేహేంద్రియాది ప్రాణమనోబలాదుల సమ్మేళనరూపములగు స్థూలసూక్ష్మ శరీరాదులు లేనివాడయ్యు అవి గలవాడు వలె భావించుట అనునది, నేను మానవుడను, బ్రాహ్మణుడను, కౌశికగోత్రుడను, రామశర్మను, గృహస్థుడను, విద్యావంతుడను, ధనికుడను, పుత్రమిత్రకళత్ర గృహపశ్వాదులు కలవాడని భావించుట అంతట ఆత్మకు అన్యథా భావవిలసితమగుచున్నది. ఇట్టి ఈ ఆత్మ ఇష్టానిష్టములను పొందుట వీడుట అను వానిని పొందుచున్నాడు.

**శ్లో॥ సమ్భవశ్చ వినాశశ్చ శోకశ్చ వివిధః స్మృతః।**
**అవివేకశ్చ చిన్తా చ వివేకస్మృతిరేవ చ॥ 26**

**ప్రతిపదార్థము:-** సంభవః=పుట్టుక, వినాశః చ=మరణం, వివిధః=నానా విధాలైన, శోకః= బాధ, అవివేకః=అజ్ఞానం, చింతా చ=విషయాల గురించి ఆలోచించుట, వివేకస్మృతిః= ఆత్మానాత్మ జ్ఞానాన్ని స్మరింపలేకపోవుట, స్మృతః=చెప్పబడింది.

**తాత్పర్యము:-** ఈ అన్యథా భారాల వల్లనే జననమరణాలు, నానా రకాల శోకాలు, అజ్ఞానం, విషయభ్రాంతి, ఆత్మానాత్మజ్ఞానం, స్మరణలేకపోవడం మొదలైనవన్నీ ఏర్పడుతున్నాయి.

**శ్లో॥ అత్రాప్యుదాహరన్తీమమితిహాసం పురాతనమ్।**
**యమస్య ప్రేతబన్ధూనాం సంవాదం తం నిబోధత॥ 27**

**ప్రతిపదార్థము:-** అత్ర+అపి=శోకహేతువు లేక ఈ బాధ వృథా అనే ఈ సందర్భమందు,





**తాత్పర్యము:-** ఎక్కడెక్కడ ద్విజులు, గోవులు, వేదాలు, వర్ణాశ్రమ క్రియలు వర్తిస్తున్నాయో ఆయా దేశాలకు పోయి అక్కడ వారిని తగులబెట్టి, ఖండించండి.

**శ్లో॥ ఇతి తే భర్తృనిర్దేశమాదాయ శిరసాదృతాః।**
**తథా ప్రజానాం కదనం విదధుః కదనప్రియాః॥ 13**

**ప్రతిపదార్థము:-** ఇతి=ఇట్లు, తే=ఆ అసురులు, భర్తృనిర్దేశమ్=ప్రభువైన హిరణ్యకశిపుని ఆజ్ఞను,ఆదాయ=గైకొని, శిరసా=శిరస్సుతో, ఆదృతాః=ఆదరించినవారై, తథా=అలాగు, కదన ప్రియాః=యుద్ధంలో ఇష్టులై,ఆసక్తులై, ప్రజానామ్=ప్రజలకు, కదనమ్=వధను, విదధుః=చేసిరి.

**తాత్పర్యము:-** ఇట్లు ప్రభువైన హిరణ్యకశిపుడు ఆజ్ఞాపించగా ఆ యాజ్ఞను ఆదరించి శిరసావహించి, యుద్ధాసక్తులైన అసురులు జనపదాలకు వెళ్ళి ప్రజలను వధించిరి.

**శ్లో॥ పురగ్రామవ్రజోద్యానక్షేత్రారామాశ్రమాకరాన్।**
**ఖేటకర్వటఘోషాంశ్చ దదహుః పత్తనాని చ॥ 14**

**ప్రతిపదార్థము:-**(తే=వారు), పురగ్రామ....ఘోషాన్=పురములను,గ్రామములను, మందలను, తోటలను,ముళ్ళను,దోపులను,ఆశ్రమములను,ఖనులను,కృషీయపల్లియలను,కొండపల్లియలను, గొల్లపల్లియలను, పత్తనాని చ=మరియు రాజధానులను, దదహుః=దహించిరి.

**తాత్పర్యము:-** వారు హిరణ్యకశిపుని ఆజ్ఞ మేరకు పురములను, గ్రామములను, మందలను, తోటలను,ముళ్ళను,దోపులను,ఆశ్రమములను,ఖనులను,కృషీయపల్లియలను,కొండపల్లియలను, గొల్లపల్లియలను మరియు రాజధానులను దహించిరి.

**శ్లో॥ కేచిత్ ఖనిత్రైర్బిభిదుస్సేతుప్రాకారగోపురాన్।**
**ఆజీవ్యాంశ్చిచ్ఛిదుర్వృక్షాన్ కేచిత్పరశుపాణయః।**
**ప్రాదహఞ్శరణాన్యన్యే ప్రజానాం జ్వలితోల్ముకైః॥ 15**

**ప్రతిపదార్థము:-** కేచిత్=కొందరు, ఖనిత్రైః=గుద్దళ్ళతో, సేతుప్రాకారగోపురాన్=సేతు ప్రాకారము లను, బిభిదుః=త్రవ్విరి, పరశుపాణయః=గొడ్డళ్ళు చేతబూని, కేచిత్=కొందరు, ఆజీవ్యాం వృక్షాన్ =జీవ్యవృక్షములను, చిచ్ఛిదుః=తెగనటికిరి, అన్యే=ఇతరులు, జ్వలితోల్ముకైః= మండు కొఱవులతో, ప్రజానాం శరణాని=ప్రజల యిండ్లను, ప్రాదహన్=పూర్తిగా తగులబెట్టిరి.

**తాత్పర్యము:-** కొందరు గుద్దళ్ళతో సేతుప్రాకారములను త్రవ్విరి. గొడ్డళ్ళు చేతబూని కొందరు జీవ్యవృక్షములను తెగనటికిరి. ఇతరులు మండు కొఱవులతో ప్రజల యిండ్లను పూర్తిగా తగులబెట్టిరి.

**శ్లో॥ ఏవం విప్రకృతే లోకే దైత్యేన్ద్రానుచరైర్ముహుః।**
**దివం దేవాః పరిత్యజ్య భువి చేరురలక్షితాః॥ 16**

**ప్రతిపదార్థము:-** ఏవమ్=ఈ విధముగ, దైత్యేంద్రానుచరైః=రాక్షసరాజపరివారముచే, లోకే విప్రకృతే(సతి)=లోకముపీడింపబడగా, దేవాః=దేవతలు,దివమ్=దివమును, పరిత్యజ్య=విడిచి, భువి=భూమియందు, అలక్షితాః=దాగినవారలై, చేరుః=చరించుచుండిరి.

**తాత్పర్యము:–** ఈ విధముగ రాక్షసరాజపరివారముచే లోకము పీడింపబడగా దేవతలు దివమును విడిచి భూమియందు దాగినవారలై చరించుచుండిరి.

**శ్లో॥ హిరణ్యకశిపుర్భ్రాతుస్సమ్పరేతస్య దుఃఖితః।**
**కృత్వా తిలోదకాదీని భ్రాతృపుత్రానసాన్త్వయత్॥ 17**

**ప్రతిపదార్థము:–** దుఃఖితః=దుఃఖితుడైన, హిరణ్యకశిపుః=హిరణ్యకశిపుడు, సంపరేతస్య భ్రాతుః =చచ్చిన తమ్మునికి, తిలోదకాదీని=తిలోదకాదులు, కృత్వా=నిర్వర్తించి, భ్రాతృపుత్రాన్=తమ్ముని కుమారులను, అసాన్త్వయత్=ఓదార్చెను.

**తాత్పర్యము:–** తన తమ్ముని మరణము వలన దుఃఖితుడైన హిరణ్యకశిపుడు చచ్చిన తమ్మునికి తిలోదకాదులు నిర్వర్తించి, తమ్ముని కుమారులను ఓదార్చెను.

**శ్లో॥ శకునిం శమ్బరం దార్ష్ణిం భూతసన్తాపనం వృకమ్।**
**కాలనాభం మహనాభం హరిశ్మశ్రుమథోత్కచమ్॥ 18**

**శ్లో॥ తన్మాతరం వృషద్భానుం దితిం చ జననీం గిరా।**
**శ్లక్ష్ణయా దేశకాలజ్ఞ ఇదమాహాసురేశ్వరః॥ 19**

**ప్రతిపదార్థము:–** దేశకాలజ్ఞః=దేశకాలజ్ఞుడైన, అసురేశ్వరః=అసురేశ్వరుడు (హిరణ్యకశిపుడు), శకునిమ్=శకునిని, శంబరమ్=శంబరుని, ధార్ష్ణిమ్=ధార్ష్ణిని, భూతసంతాపనమ్=భూత సంతాపుని, వృకమ్=వృకుని, కాలనాభమ్=కాలనాభుని, మహానాభమ్=మహానాభుని, హరిశ్మశ్రుమ్= హరిశ్మశ్రుని, మథోత్కచమ్=మథోత్కచుని, తన్మాతరమ్=వారి తల్లియైన వృషద్భానువుని, జననీమ్ దితిం చ=తల్లియైన దితిని, శ్లక్ష్ణయా=మృదువగు, గిరా=మాటలతో, (సాన్త్వయన్=ఓదార్చి) ఇదమాహ=ఇట్లు చెప్పెను.

**తాత్పర్యము:–** ఆ పిమ్మట దేశకాలజ్ఞుడును, అసురేశ్వరుడును అయిన హిరణ్యకశిపుడు శకునిని, శంబరుని,ధార్ష్ణిని,భూతసంతాపుని, వృకుని, కాలనాభుని, మహానాభుని, హరిశ్మశ్రుని,మథోత్కచుని మరియు వారి తల్లియైన వృషద్భానువుని, తన తల్లియైన దితిని మృదువగు మాటలతో ఓదార్చి ఇట్లు చెప్పెను.

**హిరణ్యకశిపురువాచ**

**శ్లో॥ అమ్బామ్బ హే వధూః పుత్రా వీరం మార్హథ శోచితుమ్।**
**రిపోరభిముఖే శ్లాఘ్యశ్శూరాణాం వధ ఈప్సితః॥ 20**

**ప్రతిపదార్థము:–** అంబ+అంబ=ఓ అమ్మా అమ్మా, హేవధూః=ఓ మరదలా!, పుత్రాః= కొడుకులారా! వీరమ్=వీరుడైన హిరణ్యాక్షుని గురించి, శోచితమ్=ఆలోచించుటకు, మా అర్హథ=శోకింపవలదు, రిపోః=శత్రువులను, అభిముఖేః=ఎదుర్కోవడంలో, శూరాణామ్= శూరులనకు, పరాక్రమవంతులకు, వధః=మరణం, శ్లాఘ్యః=కొనియాడతగినది, ఈప్సితమ్= ఇష్టమైనది.



**తాత్పర్యము:–** ఓ తల్లీ! ఓ మరదలా! ఓ కొడుకుల్లారా! వీరుడైన, చనిపోయిన హిరణ్యాక్షుని గురించి మీరు ఆలోచింపవలదు. శోకించవలదు. శత్రువుల నెదుర్కోవడం, వానిని ఓడించడం లేదా వాని చేతిలో మరణించడం వీరులకు తగినది. అదే శ్లాఘనీయమైనది.

**శ్లో॥ భూతనామిహ సంవాసః ప్రపాయామివ సువ్రతే।**
**దైవేనైకత్ర నీతానామున్నీతానాం స్వకర్మభిః॥ 21**

**ప్రతిపదార్థము:–** సువ్రతే=ఓ వ్రతంగల తల్లీ!,ఇహ=లోకంలో, భూతానామ్=సమస్త ప్రాణులకు, సంవాసః=ఒకచోట కలిసియుండటం, ప్రపాయామివ=చలిపందిరిలో ఉండటం, ఏకత్ర= ఒక్కచో, నీతానామ్=కూడినవారు, స్వకర్మభిః=వారి వారి కర్మలచేత, ఉన్నీతానామ్=వియోగాన్ని పొందిన వారు.

**తాత్పర్యము:–** మంచి వ్రతముగల మాతా! వినుము. పూర్వ జన్మ కర్మచేత ఒక్కచోట కూడి, మరల వారి వారి కర్మల చేత ఎడబాయుచున్న ప్రాణులొక్కచోట కూడియుండుట అనునది చలిపందిరియందు కోరికతో నలుగడల నుండి వచ్చి చలిపందిరియందు కూడినట్లు వారి వారి కర్మలచే కూడుచు, విడిపోవుచున్నారు.

**శ్లో॥ నిత్య ఆత్మావ్యయశ్శుద్ధస్సర్వగస్సర్వవిత్పరః।**
**ధత్తేఽసావాత్మనో లిఙ్గం మాయయా విసృజన్ గుణాన్॥ 22**

**ప్రతిపదార్థము:–** ఆత్మా=ఈ జీవాత్మ, నిత్యః=మృత్యుశూన్యుడు, అవ్యయః=అపక్షయం లేనివాడు, శుద్ధః=నిర్మలుడు, సర్వగః=సర్వులకు హితుడు, సర్వవిత్=సమస్తం తెలిసినవాడు, పరః=దేహాది వ్యతిరిక్తుడు, అసౌ+ఆత్మనః=ఈ పరమాత్మయొక్క, మాయయా=తన అవిద్యచే, గుణాన్= గుణములను, విసృజన్=విశేషముగా సృజించుచు, లింగమ్=సూక్ష్మశరీరమును, ధత్తే=ధరించు చున్నాడు.

**తాత్పర్యము:–** ఆత్మ మృత్యువు లేనివాడు కావున నిత్యుడు, క్షీణించువాడు కాదు. కాబట్టి అవ్యయుడు. అవిద్యాదిదోషములంటనివాడు. కావున నిర్మలుడు. సర్వప్రాణులందు వ్యాపించి ఉన్నవాడు సర్వజ్ఞుడు పరమాత్మ మాయాది భయం- అవిద్యచే సూక్ష్మశరీరాన్ని ధరిస్తున్నాడు.

**శ్లో॥ యథామ్భసా ప్రచలతా తరవోఽపి చలా ఇవ।**
**చక్షుషా భ్రామ్యమాణేన దృశ్యతే చలతీవ భూః॥ 23**

**ప్రతిపదార్థము:–** యథా=ఏ ప్రకారం, ప్రచలతా=చలిస్తున్న, అంభసా=నీటిచేత, తరవః+ అపి=గట్టున ఉన్న చెట్లు సైతం, చలతీవ=కదలునట్లు కనపడుతోంది, భ్రామ్యమాణేన=తిరుగు తున్న, చక్షుషా= నేత్రాలచే, భూః=భూమి, చలా ఇవ=చలిస్తున్నదిగా, దృశ్యతే=గోచరిస్తున్నది.

**తాత్పర్యము:–** సరస్సులోని జలం కదులుతుండగా, ప్రవహిస్తుండగా గట్టున ఉన్న చెట్లసైతం నీటిలో ప్రతిబింబించి చలిస్తున్నట్లు, కదులుతున్నట్లు కనబడుతుంది. (అలాగే ఉపాధి ధర్మాలు ఉపహితమైన దానిలో చూపెడుతున్నాడని దృష్టాంతం చెప్పాడు). మరి బాలురు మొదలైనవారు గిరగిరతిరిగినప్పుడు వాళ్ళ కళ్ళు చూపులు భ్రమిస్తాయి.అప్పుడు భూమి అంతా తిరుగుతున్నట్లు కనబడుతుంది.

గురించి, స్వయమ్=స్వయముగా, స ధర్మా=అది వానిలో సమానమైన మరణ ధర్మం గలవారై, అపార్థమ్=అనవసరంగా (వ్యర్థంగా), శోచంతి=శోకిస్తున్నారు.

**తాత్పర్యము:-** మనకంటే వయసులో పెద్దవారైన వాళ్ళకి కలిగే జననమరణాది క్రమాన్ని ప్రకృతి ధర్మంగా చూస్తూన్నవారు అయినా కూడా ఎందుకు ఈ మోహం? ఔరా! ఎంత విచిత్రం!, మనుషులు ఏ పరమేశ్వరుని మాయ నుండి జన్మిస్తారో ఆ ప్రకృతిలోనే లయ మవుతారు. అది తెలిసి కూడా మరణించిన వారి గురించి ఇలా అనవసరంగా శోకిస్తున్నారు.

**శ్లో॥ అహో వయం ధన్యతమా యదత్ర త్యక్తాః పితృభ్యాం న విచిన్తయామః।**
**అభక్ష్యమాణా అబలా వృకాదిభిస్స రక్షితా రక్షతి యో హి గర్భే॥ 38**

**ప్రతిపదార్థము:-** అహో!=ఔరా! వయమ్=మనం, ధన్యతమాః=మిక్కిలి ధన్యులం, యత్= ఏలన, అత్ర=ఈ భూమిమీద, పితృభ్యామ్=తల్లిదండ్రులచేత, త్యక్తాః=విడువబడ్డవారమై, న విచింత యామః=ఆలోచించడంలేదు, అబలాః=బలహీనులమైనా, వృకాదిభిః=తోడేళ్ళు మొదలైనవి, అభక్ష్యమాణాః=మనం భక్షింపబడనివారమయ్యాం, యః=ఎవడు, గర్భే=తల్లి గర్భంలోనే, రక్షతి =రక్షిస్తున్నాడో, సః+హి=ఆ పరమేశ్వరుడే, రక్షితాః=ఈ విశ్వాన్నంతటినీ రక్షిస్తున్నాడు.

**తాత్పర్యము:-** ఔరా! మనమెంతో ధన్యులం. ఎందుకంటే మన తల్లిదండ్రులు మనల్ని విడిచిపెట్టి వెళ్ళిపోయినా వాళ్ళ గురించి మనం ఆలోచించడం లేదు. బాల్యంలో బలహీనులమై ఉన్నా తోడేళ్ళు మొదలైన జంతువులు భక్షించలేదు. మనల్ని తల్లిగర్భంలో ఎవడు రక్షించాడో ఆ ఈశ్వరుడే విశ్వాన్నంతటినీ పరిరక్షిస్తున్నాడు.

**శ్లో॥ య ఇచ్ఛయేశస్సృజతీదమవ్యయో - య ఏవ రక్షత్యవలుమ్పతే చ యః।**
**తస్యాబలాః క్రీడనమాహురీశితుః - చరాచరం నిగ్రహసఙ్గ్రహే ప్రభుః॥ 39**

**ప్రతిపదార్థము:-** అబలాః=ఓ పట్టపురాణులారా!, యః=ఎవడు, ఈశః=ఈశ్వరుడు, ఇచ్ఛయా=తన సంకల్పమాత్రంతో, ఇదమ్=ఈ విశ్వాన్ని, సృజతి=సృష్టిస్తున్నాడు, మరి యః=ఏ, అవ్యయః =నాశనం లేనివాడు, రక్షతి=రక్షిస్తున్నాడు, యః=ఎవడు, అవలుంపతే=లయం చేస్తున్నాడు, తస్య ఈశితుః=ఆ ఈశ్వరుడు, చరాచరమ్=ఈ జంగమస్థావరాత్మకమైన, క్రీడనమ్=ఆటగా, ఆహుః =పెద్దలు చెప్తున్నారు, నిగ్రహ సంగ్రహే=సంహారంలో, పాలనలో, ప్రభుః=అతడే సమర్థుడు.

**తాత్పర్యము:-** ఓ రాణులారా! ఏ పరమేశ్వరుడు ఈ విశ్వాన్ని సృష్టిస్తున్నాడో, ఏ అవ్యయుడు ఈ జగాన్ని రక్షిస్తున్నాడో, ఏ ఈశ్వరుడు ఈ విశ్వాన్ని లయంచేస్తున్నాడో, ఆ ఈశ్వరునకు ఈ స్థావరజంగమాత్మకమైన చరాచరప్రపంచమంతా ఒక క్రీడాస్థానమని పెద్దలు చెప్తారు. ఈ జగాన్ని పాలింపను, సంహరింపను అతడే సమర్థుడు.

**శ్లో॥ పథి చ్యుతం తిష్ఠతి దిష్టరక్షితం-గృహే స్థితం తద్విహతం వినశ్యతి।**
**జీవత్యనాథోఽపి తదీక్షితో వనే-గృహేఽపి గుప్తో విహతో న జీవతి॥ 40**

**ప్రతిపదార్థము:-**పథి=దారిలో, చ్యుతమ్=జారిపడిపోయిందైనా ధనాదికం, దిష్టరక్షితమ్= దైవమైన





యమస్య=యమునికి, ప్రేతబంధూనామ్=చనిపోయినవారి బంధువులకు, సంవాదమ్=జరిగిన సంవాదరూపమైన,పురాతనమ్=ప్రాచీనమైన,ఇతిహాసమ్=కథను, ఉదాహరన్తి=ఉదహరింతురు, నిబోధత=తెలుసుకో.

**తాత్పర్యము:-** శోక కారణం లేకుండానే శోకించడం వ్యర్థమని పూర్వ యమునికీ, చనిపోయిన వారి బంధువులకు ఒక సంవాదం జరిగింది. ఆ కథ చెబుతున్నాను. దీని అర్థాన్ని తెలుసుకొందురుగాక!

## - సుయజ్ఞోపాఖ్యానమ్ -

**శ్లో॥ ఉశీనరేష్వభూద్రాజా సుయజ్ఞ ఇతి విశ్రుతః।**
**సపత్నైర్నిహతో యుద్ధే జ్ఞాతయస్తముపాసత॥ 28**

**ప్రతిపదార్థము:-** ఉశీనరేషు=ఉశీనర జనపదాల్లో, సుయజ్ఞః ఇతి=సుయజ్ఞుడనే, రాజా=రాజు, విశ్రుతః=ప్రసిద్ధుడు, అభూత్=ఉండేవాడు, యుద్ధే=యుద్ధంలో, సపత్నైః=శత్రువులచేత, నిహితః =వధించబడ్డాడు. తమ్=అతనిని గూర్చి, జ్ఞాతయః=బంధువులు, సముపాసతః=ఆ రాజు దగ్గరకు వచ్చారు.

**తాత్పర్యము:-** ఉశీనర దేశపురాజు సుయజ్ఞుడనేవాడు ఉండేవాడు. ఆతడొకప్పుడు యుద్ధంలో శత్రువులచేతిలో వధించబడ్డాడు. వానికి దహన సంస్కారాలు చెయ్యడానికి అతని బంధువులు అతని దగ్గరకు వచ్చారు.

**శ్లో॥ విశీర్ణరత్నకవచం విభ్రష్టాభరణస్రజమ్।**
**శరనిర్భిన్నహృదయం శయానమసృగావిలమ్॥ 29**

**శ్లో॥ ప్రకీర్ణకేశం స్తబ్ధాక్షం రభసాదష్టదచ్ఛదమ్।**
**రజఃకుణ్ఠముఖామ్భోజం ఛిన్నాయుధభుజం మృధే॥ 30**

**ప్రతిపదార్థము:-** విశీర్ణరత్నకవచమ్=చిరిగిపోయిన రత్నాలకవచం కలవాడు, విభ్రష్టాభరణ స్రజమ్=ఊడిపోయినభూషణాలు, పూలమాలలుకలవాడు, శరనిర్భిన్నహృదయమ్=బాణాలచేత ఛేదించబడ్డ హృదయం కలవాడు, శయానమ్=నేల మీద పరుండినవాడు, అసృగావిలమ్=రక్తం చేత మలినమైన శరీరం కలవాడు, ప్రకీర్ణకేశమ్=ఎగ్రబారిన వెండ్రుకలు కలవాడు, స్తబ్ధాక్షమ్= రెప్పపాటులేక స్తంభించిపోయిన కళ్ళు కలవాడు, రభసా=తొందరపాటుతో, దష్టదచ్ఛదమ్= కొఱకబడే పెదాలు కలవాడు, రజన్+కుంఠ ముఖాంభోజమ్=దుమ్ముధూళిచేత కమ్ముకున్న ముఖతామరకలవాడు,ఛిన్నాయుధభుజమ్=చెల్లాచెదురైన ఆయుధాలు, విరిగిపోయిన భుజాలు కలవాడుగా, తమ్=అతనిని, (తర్వాతి శ్లోకంతో అన్వయం...)

**తాత్పర్యము:-** ఆ సుయజ్ఞ ప్రభువు రత్నకవచం చిరిగిపోయింది. ధరించిన భూషణాలు, పూలదండలు అన్నీ వూడి రాలిపోయి నేలబడ్డాయి. బాణాలచేత ఆతని హృదయం పగిలిపోయింది. శరీరమంతా రక్తంతో తడిసి, మలినమైంది. తలవెండ్రుకలు చిందర అయ్యాయి. రెప్పపాటులేక స్తంభించిన కళ్ళు కలవాడై, దంతాలతో పెదాలను కఱుచుకుని ఉన్నాడు. దుమ్ము

ధూళితో ముఖతామర నిండిపోయింది. ఆయుధాలను పోగొట్టుకొని, విరిగిపోయిన బాహువులతో ఆ యుద్ధభూమిలో ఉన్న ఆ రాజును (తర్వాతి శ్లోకంతో అన్వయం.....)

**శ్లో॥ ఉశీనరేన్ద్రం విధినా తథా కృతం పతిం మహిష్యః ప్రసమీక్ష్య దుఃఖితాః।**
**హతాః స్మ నాథేతి కరైరురో భృశం ఘ్నన్త్యో ముహుస్తత్పదయోరుపాపతన్॥ 31**

**ప్రతిపదార్థము:–** విధినా=విధివశం చేత, తథాకృతమ్=ఆ ప్రకారం చేయబడ్డ, ఉశీనరేంద్రమ్= ఉశీనర దేశపు రాజును, పతిమ్=తమ భర్తను, మహిష్యః=అతని పట్టపురాణులు, ప్రసమీక్ష్య= చూసి, దుఃఖితాః=దుఃఖంతో, నాథ!=ఓ ప్రాణనాథా!, హతాః స్మ ఇతి=మేము అనాథలైపోతిమే అని, కరైః=చేతులతో, ఉరః=తమ వక్షస్థలాలను, భృశమ్=మిక్కిలిగా, ముహుః=మాటిమాటికి, ఘ్నంత్యః=కొట్టుకుంటూ, తత్ పదయోః=ప్రాణనాథుని పాదాలపై, ఉపాపతన్=పడిరి.

**తాత్పర్యము:–** విధివశం చేత ఆ విధంగా మరణించిన తమ భర్తను, ఉశీనర ప్రభువును చూసి అతని పట్టపురాణులు దుఃఖంతో ఓ ప్రాణనాథా! మేము దిక్కులేని అనాథలై చెడితిమే అని మొరపెట్టుకుంటూ చేతులతో తమ రొమ్మును పదేపదే బాదుకుంటూ భర్త పాదాలపై బడ్డారు.

**శ్లో॥ రుదన్త్య ఉచ్చైర్దయితాఙ్ఘ్రిపఙ్కజం సిఞ్చన్త్య అస్రైః కుచకుఙ్కుమారుణైః।**
**విస్రస్తకేశాభరణాశ్శుచం నృణాం సృజన్త్య ఆక్రన్దనయా విలేపిరే॥ 32**

**ప్రతిపదార్థము:–** ఉచ్చైః=బిగ్గరగా, రుదంత్యః=రోదిస్తున్నవారు, దయిత+అంఘ్రిపంకజమ్= తమ ప్రియుని పాద పంకజాలను, కుచకుంకుమ+అరుణైః=చనుదోయి కుంకుమ పూవు లేపనం చేత ఎఱ్ఱనైన, అస్రైః=కన్నీళ్ళచేత, సించంత్యః=తడుపుతున్నవారు, విస్రస్తకేశాభరణాః=జారిపోయిన తల వెండ్రుకలు, ఆభరణాలు కలవారై, నృణామ్=వారిని చూసే జనావళికి, శుచమ్=శోకాన్ని, సృజంత్యః=కలిగిస్తూ, ఆక్రందనయా=గట్టిగా అరుస్తూ రోదిస్తూ, విలేపిరే= విలపించారు.

**తాత్పర్యము:–** సుయజ్ఞప్రభువు భార్యలు భర్తపోయిన కారణంగా బిగ్గరగా అరుస్తూ తమ భర్త పాదకమలాలను తమకుచాలకు అద్దుకుంటూండటం వల్ల కుచకుంకుమ లేపనంతో పాదాలు తడిసి ఎర్రనైనవయ్యాయి. అలా చేస్తూ కొప్పు ఇతర ఆభరణాలు జారిపడిపోయే విధంగా ఆ చుట్టూ జనాలందరికీ హృదయం ద్రవించేటట్లు పెద్దపెట్టున విలపించారు.

**శ్లో॥ అహో విధాత్రాకరుణేన నః ప్రభో భవాన్ ప్రణీతో దృగగోచరాం దశామ్।**
**ఉశీనరాణామసి వృత్తిదః పురా కృతోఽధునా యేన శుచాం వివర్ధనః॥ 33**

**ప్రతిపదార్థము:–** ప్రభో=ఓ ప్రభూ, భవాన్=నీవు, అకరుణేన=దయలేని, విధాత్రా=విధిచేత, నః=మా యొక్క, దృక్+అగోచరామ్=కంటికి కనబడని, దశామ్=స్థితికి, ప్రణీతః=చేర్చావు, యేన=ఎవనిచే, ఉశీనరాణామ్=ఉశీనరదేశపు ప్రజలకు, పురా=పూర్వం, వృత్తిదః=జీవనాన్ని ఇచ్చేవాడవై, అధునా=ఇప్పుడు, (త్వమేవ=నీవే) శుచామ్=దుఃఖాన్ని, వివర్ధనః=పెంచువాడవై, కృతః=చేసావు, అసి=కదా!

**తాత్పర్యము:–** ఓ ప్రభూ! ఔరా! ఆ బ్రహ్మ నిర్దయుడైన నిన్ను మా కన్నులకు కనబడని చోటుకి తీసుకెళ్ళిపోయాడు కదా! పూర్వమే విధాత నిన్ను ఉశీనర ప్రజలకు జీవనాన్ని ఇచ్చే నిమిత్తం ఇచ్చి ఇప్పుడు వెంటనే ఆ విధాతే అందరికీ దుఃఖాన్ని కలిగించేవిధంగా నిన్ను తీసుకెళ్లాడు కదా!



**శ్లో॥ త్వయా కృతజ్ఞేన వయం మహీపతే–కథం వినా స్యామ సుహృత్తమేన తే।**
**తత్రానుయానం తవ వీర పాదయోః–శుశ్రూషతీనాం దిశ యత్ర యాస్యసి॥ 34**

**ప్రతిపదార్థము:–** మహీపతే!=ఓ భూపతీ!, కృతజ్ఞేన=చేసిన మేలు మరువలేని కృతజ్ఞతతో, సుహృత్తమేన=మాకు అత్యంతం (ఎంతో) ప్రియతముడవైన, త్వయా వినా=నువ్వు లేకుండా, వయమ్=మేము, కథం స్యామ=ఎలా జీవించగలం?, వీర=ఓ వీరుడా, తవ పాదయోః=నీ పాదాలను, శుశ్రూషతీనామ్=సేవించుకునే మాకు, యత్ర=ఎచ్చోటకు, యాస్యసి=పోయెదవో, తత్ర=అచ్చోటికి, అనుగమనమ్=నిన్నును గురించి వచ్చునట్లు, దిశ=అనుమతించు.

**తాత్పర్యము:–** ఓ భూపాలా! కృతజ్ఞతతో ఎంతో ప్రియాతిప్రియమైన నువ్వు లేకుండా, నిన్ను వీడి మేం ఎలా జీవించగలం? కాబట్టి ఓ వీరా! నీ పాదసేవచేసుకునే మాకు నువ్వెక్కడికి వెడతావో అక్కడికి మేం వచ్చునట్లుగా అనుమతివ్వు.

**శ్లో॥ ఏవం విలపతీనాం వై పరిగృహ్య మృతం పతిమ్।**
**అనిచ్ఛతీనాం నిర్హారమర్కోఽస్తం సంన్యవర్తత॥ 35**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ ప్రకారం, విలపంతీనామ్=విలపిస్తూన్న వారికి, మృతంపతిమ్= చనిపోయిన భర్తను, పరిగృహ్య=కౌగిలించుకొని, నిర్హారమ్=దహనం కోసం, అనిచ్ఛంతీనామ్= ఇష్టపడని ఆ దేవేరులకు, అర్కమ్=సూర్యుడు, అస్తమ్=అస్తాద్రిని, సంన్యవర్తత=అధిష్ఠించాడు.

**తాత్పర్యము:–** ఈ విధంగా ఆ పట్టపురాణులు చనిపోయిన భర్త మృతదేహాన్ని కౌగిలించుకొని ఏడుస్తూ, దహనం చెయ్యడానికి ఇష్టపడనివారై ఉండగా సూర్యుడు అస్తాద్రిని అధిష్ఠించాడు.

**శ్లో॥ తత్ర హ ప్రేతబన్ధూనామాశ్రుత్య పరిదేవితమ్।**
**ఆహ తాన్ బాలకో భూత్వా యమః స్వయముపాగతః॥ 36**

**ప్రతిపదార్థము:–** ప్రేతబంధూనాం=చనిపోయిన రాజు యొక్క బంధువులైన రాణులయొక్క పరిదేవితమ్=రోదనను, ఆశ్రుత్య=తనపురంలోనే విని, యమః=యముడు, బాలకః=బాలుడై, తత్ర=వారున్నచోటికి, స్వయమేవ=తానే, ఉపాగతః=వచ్చి, ఆహ=ఇలా చెప్పాడు.

**తాత్పర్యము:–** చనిపోయిన రాజు భార్యలు, బంధువులు ఏడ్పు విని, యముడు బాలుని వేషంలో వాళ్ళ దగ్గరకు వచ్చి ఇలా చెప్పాడు.

**యమ ఉవాచ**

**శ్లో॥ అహో అమీషాం వయసాధికానాం–విపశ్యతాం లోకవిధిం విమోహః।**
**యత్రాగతస్తత్ర గతం మనుష్యం–స్వయం సధర్మా అపి శోచన్త్యపార్థమ్॥ 37**

**ప్రతిపదార్థము:–** వయసా=వయస్సుచేత, అధికానామ్=మనలాంటి అధికులైన వారి యొక్క, లోకవిధిమ్=లోకరీతి, జననమరణాలరీతిని, విపశ్యతామ్=చూస్తున్నవారైనా కూడా, అమీషామ్ =వాళ్ళయొక్క, విమోహః=అవివేకం, అహో!=ఔరా!, వింతే ఇది, యత్ర=ఏ అవ్యక్తం నుండి పుట్టారో, తత్ర=ఆ అవ్యక్తంలోకి (గురించి), గతమ్=వెళ్ళేటువంటి, మనుష్యమ్=మనుష్యుల

కలుగుతాయి. తర్వాత దుఃఖం కలుగుతుంది. ఇదంతా మాయవల్ల కలుగుతోంది. ఇది పరమార్థం లేదా వాస్తవం కాదు.

**శ్లో॥ వితథాభినివేశోఽయం యద్గుణేష్వర్థదృగ్వచః।**
**యథా మనోరథస్స్వప్నస్సర్వమైన్ద్రియకం మృషా॥ 48**

**ప్రతిపదార్థము:–** గుణేషు=సత్త్వాది గుణాల కారణాలైన సుఖదుఃఖాదుల్లో, అర్థదృక్=పరమార్థ మనే దృష్టిగల, వచః యత్=ఏమాట ఉందో, అయమ్=ఇది, వితథాభినివేశః=వ్యర్థమై, మిథ్యా భూతమై, మనోరథః=మనస్సంకల్పవికల్ప రూపమైన, స్వప్నః=స్వప్నం, సర్వమ్=ఇదంతా, ఐంద్రియకమ్=బాహ్యేంద్రియ విషయమైన శబ్దాధికం, మృషా=మిథ్య, అసత్యం. సత్త్వరజస్తమో గుణాల కార్యాలైన సుఖదుఃఖాదులు సత్యమని, పరమార్థమదే అని యేది కలదో, అనునది.

**తాత్పర్యము:–** నిష్ప్రయోజనమై వాస్తవంగా మనస్సులో సంకల్ప వికల్పాలు చేసే కోరికలు గాని స్వప్నంలో కనిపించే పదార్థజాలంగాని, ఇంద్రియాలకు అగుపించే శబ్దాదులుగానీ, ఇవన్నీ సత్యాలు కావు మిథ్యయే. పరమార్థాలు కావు.

**శ్లో॥ అథ నిత్యమనిత్యం వా నానుశోచన్తి తద్విదః।**
**నాన్యథా శక్యతే కర్తుం స్వభావః శోచతామితి॥ 49**

**ప్రతిపదార్థము:–** అథ=అందువల్ల, నిత్యమ్=నిత్యుడైన ఆత్మను, అనిత్యం వా=అనిత్యమైన దేహాన్ని గాని, తద్విదః=వానిని, వానితత్వాల్ని చక్కగా తెలుసుకొన్నవారు, న అనుశోచంతి=దుఃఖాదికా లను గురించి శోకించరు,శోచతామ్=ఆవిధంగా దుఃఖించేవారి, స్వభావః=స్వభావం, అన్యథా=వేరే విధంగా, కర్తుమ్=చేయుటకు, న శక్యతే=సమర్థము కాదు.

**తాత్పర్యము:–** ఆత్మ నిత్యుడు, దేహం, సుఖదుఃఖాదులు అనిత్యాలని తెలుసుకున్న జ్ఞానులు వాటిని గురించి శోకించరు. అదేవిధంగా వివేకవంతులు సైతం కొందరు శోకిస్తున్నారంటే వారి కింకా అనిత్యానిత్యవస్తు వివేకం పొందలేదు. వారి స్వభావం మరొకరీతిగా మార్చుట శక్యము గాదు. వారట్లే బాధపడతారు.

## – కుళిఙ్గోపాఖ్యానమ్ –

**శ్లో॥ లుబ్ధకో విపినే కశ్చిత్పక్షిణాం నిర్మితోఽన్తకః।**
**వితత్య జాలం విదధే తత్ర తత్ర ప్రలోభయన్॥ 50**

**ప్రతిపదార్థము:–** విపినే=అరణ్యంలో, కశ్చిత్=ఒకానొక, లుబ్ధకః=బోయవాడు, పక్షిణాః=పక్షులకు, అంతకః=యముడై నాశకుడై, నిర్మితః=సృజింపబడ్డాడు, తత్ర తత్ర=అక్కడక్కడా పక్షులున్న ప్రదేశంలో, లుబ్ధకః=బోయవాడు, జాలమ్=వలను, వితత్య=పరచి, ప్రలోభయన్= గింజలు మొదలైనవి జల్లి వాటిని ప్రలోభపరచి, ఆశపెట్టి, విదధే=విశేషించి చేసాడు.

**తాత్పర్యము:–** ఒకానొక వనంలో ఒక బోయవాడు పక్షులను నాశనం చేసే వాడై, అహో యముడై, ఆ పక్షులుండే ప్రదేశాలలో వలపన్ని వాటిని లోబరచుకోడం కోసం గింజలు మొదలైనవి జల్లి ఆశ చూపించేవాడు.



ఈశ్వరునిచేత రక్షితం, రక్షితమ్=రక్షింపబడినదైతే, తిష్ఠతి=అక్కడే ఉండి మళ్ళీ పోగొట్టుకొన్నవానికి లభిస్తుంది, గృహస్థితమ్=ఇంట్లో ఉన్నదైనా, తత్+విహితమ్=ఆ ఈశ్వరుని చేత కొట్టబడినది, వినశ్యతి=నశించిపోతుంది, వనే=అడవిలో, అనాథః అపి=దిక్కులేనివాడైనా, తత్+ఈక్షితః =భగవంతుని కటాక్షాన్ని పొందుతూ, జీవతి=జీవిస్తున్నాడు, గృహే=ఇంట్లో, గుప్తః అపి=రక్షించబడే వాడయ్యు, విహతః=దైవనిహతుడు, న జీవతి=జీవించలేడు.

**తాత్పర్యము:–** మనం మార్గాన పోతున్నప్పుడు మన సొమ్మేదైనా పోగొట్టుకున్నప్పుడు అది దైవరక్షితమైతే తిరిగి అది మనకు లభ్యమౌతుంది. ఇంట్లో దాచిపెట్టినా పరమేశ్వరుని అనుగ్రహం లేకపోతే అతి తప్పక నశిస్తుంది. అదేవిధంగా అడవిలో దిక్కులేనివాడైనా భగవత్కటాక్షానికి పాత్రుడైతే వాడు జీవించగలుగుతాడు. ఇంట్లో ఉన్నవాడైనా రక్షణకలవాడైనా దైవబలం లేకపోతే అతడు జీవింపనేరడు.

**శ్లో॥ భూతాని తైస్తైర్నిజయోనికర్మభిః భవన్తి కాలే న భవన్తి సర్వశః।**
**న తత్ర హాత్మా ప్రకృతావపి స్థిత స్తస్యా గుణైరన్యతమో నిబధ్యతే॥ 41**

**ప్రతిపదార్థము:–** భూతాని=ప్రాణులదేహాదులు, తైః తైః=ఆయా, నిజయోని కర్మభిః=తమకు కారణభూతమైన లింగ శరీరాలకు నిమిత్తమైన కర్మలచే, కాలే=కర్మలపరిపక్వమైన సృష్టి కాలంలో, భవంతి=జనించుచున్నాయి, న సర్వశః భవన్తి=సర్వకాలములందొకేరీతి, సర్వులకు జరుగనేరదు, ప్రకృతౌ=ప్రకృతిన, స్థితః అపి=ఉన్నవాడైనను, ఆత్మా=ఆత్ముడు, తస్యాః=ఆ ప్రకృతియొక్క, గుణైః =దేహధర్మాలను, జన్మాదులచేత, న నిబధ్యతే=కూడుకోడు, అన్య తమః=ఆదేహం కంటె అత్యంత విలక్షణుడు.

**తాత్పర్యము:–** ఈ ప్రాణుల దేహాలు తమకు కారణమైన సూక్ష్మశరీరానికి మూలమైన ఆయా కర్మలచేత సృష్టికాలంలో జన్మిస్తున్నాయి. లయకాలంలో నశిస్తున్నాయి. ప్రకృతికార్యమైన నీ దేహంలో ఉండేవాడైనను ఆత్మ ప్రకృతి గుణమైన దేహధర్మాలగు జనన మరణాదులకు అధీనుడు కాడు. ఏలననగా అతడు దేహం కంటె విలక్షణుడు.

**శ్లో॥ ఇదం శరీరం పురుషస్య మోహజం యథా పృథగ్భౌతికమీయతే గృహమ్।**
**యథోదకైః పార్థివతైజసైర్జనః కాలేన జాతో వికృతో వినశ్యతి॥ 42**

**ప్రతిపదార్థము:–** పురుషస్య=పురుషుని యొక్క, భౌతికమ్=పాంచభౌతికమైన, ఇదం శరీరమ్= ఈ శరీరం, గృహం యథా=గృహం ఎట్లో అలా, పృథక్=పురుషుని కంటె వేరుగా కనిపిస్తోంది, యథా=ఏప్రకారం, ఉదకైః=ఉదక పరమాణువులచేత, జాతః=పుట్టిన బుడగలు మొదలైన దానితో ఉన్నదీ, పార్థివ=పృథివీ పరమాణువులచే ఘటాదికాలు, తైజసైః=తేజాది పరమాణువు లతో జనించిన కుండలాదికాలు, వినశ్యతి=నశిస్తున్నవో, తథా=ఆ ప్రకారంగా ఈ మూడు భూతములచే పరమాణువులతో జనించిన, శరీరమ్ః=దేహం, వికృతః=పరిణామాన్ని పొందినా, కాలేన=ఏదో ఒక సమయంలో (కాలంలో), వినశ్యతి=నశించును, ఆత్మ నశించదు.

**తాత్పర్యము:–** ఇంటి యజమాని (గృహస్వామి) ఇంటిని తనదే అని ఎంతనుకున్నా ఆ యిల్లు

అతని కంటె ఏవిధంగా వేరో అదేవిధంగా పంచభూతాలవల్ల జనించిన శరీరం పురుషుని కంటె మిక్కిలి భిన్నమైనది. పురుషుడు దేహమే నేననుకోవడం కేవలం అవివేకమే అవుతుంది. ఉదక పరమాణువులతో జనించిన బుడగలు, పృథివీ పరమాణువులతో ఏర్పడిన ఘటం, తేజో పరమాణువులతో ఏర్పడిన కుండలాదికాలు ఎట్లు నశిస్తాయో అట్లే త్రివిధ పరమాణువు లతో జనించిన ఈ దేహం దినదినాభివృద్ధిచెంది పరిణతిచెంది (బాల్యాది దశలను) చివర నశిస్తుంది.

**శ్లో॥ యథానలో దారుషు భిన్న ఈయతే యథానిలో దేహగతః పృథక్ స్థితః।**
**యథా నభస్సర్వగతం న సజ్జతే తథా పుమాన్ సర్వగుణాశ్రయః పరః॥ 43**

**ప్రతిపదార్థము:–** యథా=ఏ ప్రకారంగా, అనలః=అగ్ని, దారుషు=దారువులు (కొయ్య లేక కఱ్ఱలందు) ఉన్నదైనను, భిన్నః=దహించేతత్త్వంలో భిన్నుడైనను, యథా=ఏ ప్రకారం, దేహగతః =దేహగతుడైనవాడైనా, అనిలః=వాయువు, పృథక్=నాసికాదులందు వేరుగా నుండి కనపడు తుంది. యథా=ఏ ప్రకారం, నభః=ఆకాశం, సర్వగతమ్=అన్నిటినీ పొందినదైనా, న సజ్జతే= దేని ధర్మాన్ని పొందదో, తథా=ఆ ప్రకారంగా, పుమాన్=పురుషుడు, సర్వగుణాశ్రయః= దేహేంద్రియాలయొక్క సమస్త గుణాలకు ఆశ్రయుడైనా లేదా వాని నాశ్రయించినవాడైనా, పరః=వాని కంటె వేరైన వాడవుతున్నాడు.

**తాత్పర్యము:–** దారువుల్లో ఉన్నాగాని అగ్ని, దాహకగుణం వల్ల, ప్రకాశగుణం చేత, ఆ దారువుల కంటె భిన్నంగా ఏవిధంగా కనపడుతున్నాడో, దేహం అంతా నిండి ఉన్నా వాయువు నాసికాదుల యందు వేరుగా ఉన్నట్లు ఏవిధంగా చూపబడుతుందో, సమస్త జగత్తూ వ్యాపించి ఉన్నా ఆకాశం తాను ఏ వస్తుధర్మాన్ని బొందకుండా ఎట్లు వేరేగా ఉందో అట్లే పురుషుడు దేహేంద్రియాది గుణాలకు ఆశ్రితుడైనా లేదా వాని నాశ్రయించి ఉన్నా గానీ వాని కంటె భిన్నుడే అవుతున్నాడు. (వాటితో సంబంధము ఉన్నా లేనట్లే.)

**శ్లో॥ సుయజ్ఞో నన్వయం శేతే మూఢా యమనుశోచథ।**
**యశ్శ్రోతా యోఽనువక్తేహ స న దృశ్యేత కర్హిచిత్॥ 44**

**ప్రతిపదార్థము:–** హే మూఢాః=ఓ మూఢురాండ్రా!, యమ్=ఎవనిని గురించి, అనుశోచథ= శోకిస్తున్నారో, అయం సుయజ్ఞ=ఈ సుయజ్ఞుడు, భూ భర్త, శేతే=నిద్రిస్తున్నాడు. యః శ్రోతా= ఎవడు వింటాడో, యః=ఎవడు, అనువక్తే=బదులిస్తాడో, సః=అట్టివాడు, ఇహ=ఇక్కడ, కర్హిచిత్=ఎటుచూసినా, న దృశ్యేత=కనపడదు.

**తాత్పర్యము:–** ఓమూఢురాండ్రా! మీ రెవని గురించి శోకిస్తారు? మీ భర్త సుయజ్ఞుడేమైనా ఇక్కడపరుండి నిద్రిస్తున్నాడా! ఎవడు మీ మాట వింటాడో! ఎవడు బదులు చెప్పునో అట్టివాడు ఎవ్వడూ ఎటుచూసినా ఇక్కడ కనబడదు.

**శ్లో॥ న శ్రోతా నానువక్తా వా ముఖ్యోప్యత్ర మహానసుః।**
**యస్త్విహేన్ద్రియవానాత్మా స చాన్యః ప్రాణదేహయోః॥ 45**



**ప్రతిపదార్థము:–** మహాన్=ఎల్ల ఇంద్రియాల వ్యాపారానికి హేతువై దొడ్డవాడైన, అసుః=ప్రాణం, అత్ర=ఈ దేహంలో, ముఖ్యః హి=పై కారణాల వల్ల (సుబట్టి) ముఖ్యమైనది అయినా, 'ప్రాణోవైముఖ్యః' అను శ్రుతి. అట్లయినా వక్తా, శ్రోతా అగును కదా! అన్నప్పుడు, యః=ఎవడు, ఇహ=ఈ దేహంలో, ఇంద్రియవాన్=ఇంద్రియాలను కలవాడు, దేహేంద్రియాల ద్వారా ఆయా అర్థాలను, శబ్దాది ప్రపంచాన్ని చూసే, ఆత్మా సః=ఆ ద్రష్ట ఆత్మ, ప్రాణదేహయోః=అచేతనమైన ప్రాణ దేహాల కంటె, అన్యః=ఇతరుడు.

**తాత్పర్యము:–** ఈ దేహంలో ఇంద్రియాల నన్నింటినీ వానివాని వ్యాపారాలను ప్రవర్తింపజేసే వాడవడం వల్ల దొడ్డవాడు, ప్రధానుడు అవుతున్నాడు. కానీ ఆ ప్రాణం శ్రోత కాదు, వక్తా కాదు. ఎవడు? ఇంద్రియ వ్యాపారాలను దర్శిస్తూ దేహంలో ఉన్నదా! ఆద్రష్ట ఆత్మ. అతను అచేతనాలైన ఈ ఇంద్రియాల కంటె దేహం కంటె ఇతరుడు. (చేతనుడన్యుడు అయినప్పుడు నేను కృశుడను, నేను స్థూలుడను, నేను కాణుడను (ఒంటి కన్నువాడు), నేను బధిరుడను అనే ఈ దేహేంద్రియ ధర్మప్రాప్తి యెట్లు కలుగుతుంది అన్న ప్రశ్నకు ఇలా చెబుతున్నాడు.)

**శ్లో॥ భూతేన్ద్రియమనోలిఙ్గాన్ దేహానుచ్చావచాన్ విభుః।**
**భజత్యుత్సృజతి హ్యన్యస్తచ్చాపి స్వేన తేజసా॥ 46**

**ప్రతిపదార్థము:–** విభుః=సర్వవ్యాపకుడైన ఆయన్ను, స్వేన=తనదైన, తేజసా=జ్ఞానబలంతో, అన్యః=ఇతరుడు, భూత+ఇంద్రియ+మనస్+లింగాన్=పంచభూతాలచేత, ఇంద్రియాలచేత, మనసుచేత, గుర్తింపబడుతున్న, ఉచ్చావచాన్=వివిధాలైన హెచ్చు తగ్గులైన, దేహాన్=శరీరాలను, భజతి=భజించుచున్నాడు, ఆ దేహాదులనే తలుస్తున్నాడు. అట్లయిన వాని నుండి విడుదలయిన, ఉత్సృజతి=ఆ దేహాదులను వదలుతున్నచో, తత్=అది, అపి హి=ఇది అనుభవమే కదా! అని ప్రమాణీకరణ.

**తాత్పర్యము:–** సర్వవ్యాపకుడైన ఆయాత్మ, తాను పంచభూతాలు, ప్రాణం, మనసు మొదలైన వానిచే సృజించబడిన అనేక దేహాలను వాని కంటె ఇతరుడై పొందుతున్నాడని తన వివేకబలంతో వానిని విడుస్తున్నాడు. ఇది ప్రత్యక్షానుభవమైన ప్రమాణం.

**శ్లో॥ యావల్లిఙ్గాన్వితో హ్యాత్మా తావత్కర్మనిబన్ధనమ్।**
**తతో విపర్యయః క్లేశో మాయాయోగోఽనువర్తతే॥ 47**

**ప్రతిపదార్థము:–** యావత్=ఎంతవరకూ, ఆత్మా=ఆత్మ, లింగాన్వితమ్=ఈ లింగశరీరంతో, ఈ శరీరమే నేను, నాది అనే అభిమానం గలవాడవునో, తావత్=అంతవరకూ, కర్మనిబంధనమ్ =ఆ దేహేంద్రియాదులు కర్మబంధన కారణమౌనో, తతః=ఆ బంధనంతో, విపర్యయః=దేహం మీద అభిమానం, దేహమేనేననే భ్రాంతి, క్లేశః=దుఃఖం, మాయాయోగః=మాయవల్ల సమ కూడును. కానీ ఇది పరమార్థం కాదు.

**తాత్పర్యము:–** ఆత్మ ఎంతవరకూ ఈ లింగ శరీరాభిమాని అవుతాడో అంతవరకూ కర్మబంధం ఉంటుంది. ఆ కర్మబంధం వల్ల దేహాదికాన్ని పొందును. ఆ దేహమే నేననే అభిమానం భ్రాంతి

**ప్రతిపదార్థము:-** ఇతి=ఇట్లు, దైత్యపతేః=దైత్యప్రభువైన హిరణ్యకశిపుని యొక్క వాక్యమ్=మాటను, దితి=దితీదేవి, సస్నుషా=కోడలిని తీసుకొని, పుత్రశోకమ్=పుత్రమరణం వల్ల కలిగిన శోకాన్ని, క్షణమాత్రేణ=క్షణకాలం చేత, త్యక్త్వా=విడిచిపెట్టి, తత్త్వే=పరమాత్మ తత్త్వం గురించి, చిత్తమ్=తన మనస్సును, అధారయత్=ఉంచింది.

**తాత్పర్యము:-** ఈ విధంగా దైత్యప్రభువైన హిరణ్యకశిపుని మాట విని దితీదేవి కోడలిని తీసుకొని పుత్రుని మరణం వల్ల కలిగిన శోకాన్ని క్షణకాలంలో విడిచి పరమాత్మయందు తన మనస్సును ఉంచింది.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**కలింగకథనేన దితిశోకాపనయనం నామ ద్వితీయోऽధ్యాయః(2)**



**శ్లో॥ కులిఙ్గమిథునం తత్ర విచరత్సమదృశ్యత।**
**తయోః కులిఙ్గీ సహసా లుబ్ధకేన ప్రలోభితా॥ 51**

**ప్రతిపదార్థము:-** తత్ర=ఆ వల పరచిన స్థలంలో, విచరత్=తిరుగుతున్న, కులింగ మిథునమ్=కులింగ పక్షుల జంట, సమదృశత=కనబడింది, తయోః=ఆ జంటలో, కులింగీ=పెండు కులింగ పక్షి, సహసా=శీఘ్రంగా (తొందరగా), లుబ్ధకేన=బోయవానిచేత, ప్రలోభితా=ఆశకొల్పబడింది.

**తాత్పర్యము:-** బోయవాడు ఆవల పన్నిన చోటికి రెండు కులింగ పక్షులు వచ్చాయి. ఆ పక్షులలో ఒక పెండు పక్షి బోయవాడు వేసిన గింజలకు ఆశపడింది. వానికి లొంగి పోయింది.

**శ్లో॥ సాసజ్జత సిచస్తన్త్ర్యాం మహిషీ కాలయన్త్రితా।**
**కులిఙ్గస్తాం తథాపన్నాం నిరీక్ష్య భృశదుఃఖితః॥ 52**

**ప్రతిపదార్థము:-** సా మహిషీ=ఆ కులింగ పక్షి, కాలయంత్రితా=కాలానికి కట్టుపడినదై, సిచస్తంత్ర్యామ్=వలత్రాడునందు, సజ్జత=తగుల్కొన్నది, కులింగః=మగపక్షి, తథా=ఆ ప్రకారం, ఆపన్నామ్=ఆపదను పొందిన, తామ్=ఆ ఆడుపక్షిని, నిరీక్ష్య=చూసి, భృశదుఃఖితః=మిక్కిలి శోకించింది.

**తాత్పర్యము:-** ఆ ఆడు కులింగ పక్షి కాలవశం చేత బోయవాని వలలో చిక్కుకున్నది. వలలో చిక్కుకున్న ఆడుపక్షిని చూసి మగపక్షి ఎంతో దుఃఖించింది.

**శ్లో॥ స్నేహాదకల్పః కృపణః కృపణాం పర్యదేవయత్।**
**అహో అకరుణో దేవః స్త్రియాకరుణయా విభుః॥ 53**

**ప్రతిపదార్థము:-** స్నేహాత్=స్నేహంవల్ల, అకల్యః=దానిని విడిపించడానికి, శక్యం కాక, కృపణః=దీనుడైన మగపక్షి, కృపణాం=దిక్కులేని భార్యను గురించి, పర్యదేవయత్=బాధపడుతూ, విభుః=ఆ పక్షి, అహో= అయ్యో, దేవః=దేవుడు, అకరుణయా=కరుణలేనివాడై, అన్నివిధాలా దయచూప వలసిన, స్త్రియా= స్త్రీచేత (నా భార్య చేత) (తర్వాతి శ్లోకంతో అన్వయం.)

**తాత్పర్యము:-** స్నేహంచేత విడిపించడానికి శక్యం కాని మగపక్షి దీనురాలైన తన భార్యను గురించి ఏడవడం మొదలుపెట్టింది. అయ్యో! కరుణలేని ఆ దేవుడు కనికరం చూపదగిన నా భార్యచేత (తర్వాతి శ్లోకంతో అన్వయం.)

**శ్లో॥ కృపణం మానుశోచన్త్యా దీనయా కిం కరిష్యతి।**
**కామం నయతు మాం దేవః కిమర్ధేనాత్మనో హి మే॥ 54**

**ప్రతిపదార్థము:-** కృపణమ్=దీనుడనైన, మామ్=నన్ను, అనుశోచంత్యా=దుఃఖించు, దీనయా=ఈ నా భార్యతో, కిం కరిష్యతి=ఏం చెయ్యగలను. దేవః=దేవుడు, మే=నాలో, ఆత్మనః=దేహం యొక్క, అర్ధేన=సగభాగమైన నా భార్యతో, మామ్=నన్ను, కామమ్=యథేచ్ఛగా, కిం నయతు హి=ఏల తీసుకొని పోలేదు.

**తాత్పర్యము:-** దీనుడనైన నన్ను గురించి శోకిస్తున్న నా భార్య నొక్కతెనే ఏం చెయ్యగలడు. నా శరీరంలో అర్ధభాగమైన నా భార్యతో నన్ను యథేచ్ఛగా ఎందుకు తీసుకొనిపోకున్నాడు.

**శ్లో॥ దీనేన జీవతా దుఃఖమనేన విధురాయుషా।**
**కథం త్వజాతపక్షాంస్తాన్మాతృహీనాన్ బిభర్మ్యహమ్॥ 55**

**ప్రతిపదార్థము:–** విధురాయుషా=భార్యాశూన్యుడనవ్వడం చేత, వ్యర్థమైన ఆయుషు కలవాడనై, దుఃఖమ్=దుఃఖాన్ని అనుభవిస్తూ, మందేన=బుద్ధిహీనుడనై, దీనేన=దీనుడనై, జీవతా=జీవించు నా వల్ల ప్రయోజనం ఏమిటి?, అహమ్=నేను, త్వజాతపక్షామ్=రెక్కలు మొలవనివై, మాతృ హీనాన్, తల్లిలేనివై, తాన్=ఆ పిల్లలను, కథం తు బిభర్మి=ఎట్లు భరింతును.

**తాత్పర్యము:–** భార్యలేని కారణంచేత నేను, నా ఆయువు వ్యర్థం అయ్యాయి. వివేకం, బుద్ధిలేనివాడనై, జీవించే నావల్ల ప్రయోజనం ఏమిటి? రెక్కలురాని, తల్లిలేని ఈ పిల్లలనెట్లు భరించగలను?

**శ్లో॥ మన్దభాగ్యాః ప్రతీక్షన్తే నీడే మే మాతరం ప్రజాః।**
**ఏవం కులిఙ్గం విలపన్తమారాత్ ప్రియావియోగాతురమశ్రుకణ్ఠమ్।**
**స ఏవ తం శాకునికశ్శరేణ వివ్యాధ కాలప్రహితో విలీనః॥ 56**

**ప్రతిపదార్థము:–** మందభాగ్యాః=దురదృష్టవంతులైన, ఇమే=ఈ, ప్రజాః=శిశువులు, నీడే= తమగూడులో, మాతరమ్=తల్లి గురించి, ప్రతీక్షంతే=నిరీక్షిస్తుంటారు, ఏవమ్=ఈ ప్రకారంగా, ఆరాత్=సమీపంలో, విలపంతమ్=విలపిస్తూ, ప్రియావియోగాతురమ్=ప్రియురాలియెడబాటుతో వెతపడుతూ, బాధపడుతూ, అశ్రుకంఠమ్=కన్నీళ్ళతో నిండిన గద్గద కంఠంతో, తమ్=ఆ, కులింగమ్= మగపక్షిని, సః=ఆ, శాకునికః=పక్షులవేటగాడు, కాలప్రహితః=కాలప్రేరితుడై, విలీనః = పొదమాటున దాగి ఉండి, శరేణ=బాణంతో, వివ్యాధ=వధించాడు.

**తాత్పర్యము:–** దురదృష్టవంతులైన ఈ పిల్లలు తమ గూటిలో ఉండి తల్లి కోసం ఎదురుచూస్తూ ఉంటారు. అని ఈ విధంగా ప్రియురాలి యెడబాటు వల్ల కలిగిన బాధను కన్నీళ్ళను దిగమింగుతూ గద్గద కంఠంతో విలపించే ఆ మగపక్షిని పక్షుల వేటగాడు కాలప్రేరేపణతో పొదల మాటున పొంచి ఉండి ఒక్క బాణంతో కూల్చాడు.

**శ్లో॥ ఏవం యూయమపశ్యన్త్య ఆత్మాపాయమబుద్ధయః।**
**నైనం ప్రాప్స్యథ శోచన్త్యః పతిం వర్షశతైరపి॥ 57**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ ప్రకారం, యూయం అపి=మీరు సైతం, ఆత్మ+అపాయమ్= మీ మృత్యువును, అపశ్యంత్యః=చూడనివారై (తెలియనివారై), అబుద్ధయః=బుద్ధిహీనులై, శోచంత్యః =శోకిస్తున్న మీ, వర్షశతైః=నూరు వత్సరాలచేతనైనా, ఏనం పతిమ్=ఈ మీ భర్తను, న ప్రాప్స్యథ= పొందలేరు సుమా!

**తాత్పర్యము:–** ఇదే విధంగా మీరు తెలివిలేనివారై మీ మృత్యువును మీరు తెలుసుకోలేక బాధపడుతున్నా మరో నూరు సంవత్సరాలైనా మీరు మీ ఈ పతిని పొందలేరు సుమా!



**హిరణ్యకశిపురువాచ**

**శ్లో॥ బాల ఏవం ప్రవదతి సర్వే విస్మితచేతసః।**
**జ్ఞాతయో మేనిరే సర్వమనిత్యమయథోత్థితమ్॥ 58**

**ప్రతిపదార్థము:–** బాలః=బాలుడు, ఏవమ్=ఇట్లు, ప్రవదతి=చెప్పగా, సర్వే=అందరూ, జ్ఞాతయః =బంధువులు, భార్యలూ, విస్మితచేతసః=ఆశ్చర్యపడిన మనస్సుకలవారై, అయథోత్థితమ్=సత్యం కానిదై ముందులేక మధ్య ఏర్పడిన, సర్వమ్=ఈ జగమంతా, అనిత్యమయమ్=అశాశ్వతమైనదని, మేనిరే=తలచారు.

**తాత్పర్యము:–** బాలుడైన యముడు ఇట్లు చెప్పేసరికి బంధువులు, రాజపత్నులంతా ఆశ్చర్య పడిన మనస్సుతో సత్యం కానిదై ముందు లేనిదై మధ్యలో జన్మించి కనపడే ఈ జగమంతా అశాశ్వత మైనదని తలంచారు.

**శ్లో॥ యమ ఏతదుపాఖ్యాయ తత్రైవాన్తరధీయత।**
**జ్ఞాతయోఽపి సుయజ్ఞస్య చక్రుర్యత్సామ్పరాయికమ్॥ 59**

**ప్రతిపదార్థము:–** యమః=యముడు, ఏతత్+ఉపాఖ్యాయ=ఈకథను చెప్పి, తత్ర+ఏవ= ఆచోటనే, అంతరధీయత=మాయమయ్యేడు, జ్ఞాతయః=బంధువులు, రాణులు, సుయజ్ఞస్య=రాజు సుయజ్ఞునకు, యత్ సాంపరాయికమ్=పరలోక కృత్యం అయిన దహన సంస్కారాలు, చక్రుః =చేసారు.

**తాత్పర్యము:–** యముడు ఈ కథంతా చెప్పి, ఆ చోటనే మాయమయ్యాడు, బంధువులు, రాణులు సుయజ్ఞ మహారాజుకు పరలోక కృత్యాలైన దహన సంస్కారాలు చేసారు.

**శ్లో॥ తతః శోచత మా యూయం పరం నాత్మానమేవ వా।**
**క ఆత్మా కః పరో వాత్ర స్వీయః పారక్య ఏవ వా।**
**స్వపరాభినివేశేన వినా జ్ఞానేన దేహినామ్॥ 60**

**ప్రతిపదార్థము:–** తతః=అందువల్ల, యూయమ్=మీరు, పరం వా=ఇతరుని గురించి, ఆత్మానమ్ ఏవ=తమను గురించి గానీ, మా శోచత=బాధపకడండి, అత్ర=ఇక్కడ, ఈ ప్రపంచంలో, కః ఆత్మా=తానెవరు?, కః పరః=పరుడెవడు, స్వీయః=తనది, పారక్య ఏవ వా=పరునిది అనేది ఏదీ, దేహినామ్=ప్రాణులకు, స్వపర+అభినివేశేన=తాను, పరుడు ఒక్కడే అన్న అభిమానం, జ్ఞానేన వినా=జ్ఞానం లేకపోవడం చేత, స్వపరభావం కలుగుతోంది.

**తాత్పర్యము:–** అందువల్ల మీరు పరులను గురించి కాని మిమ్ములను గురించి కానీ శోకించకండి. తాను అని, పరుడని ఎవడు, తనది, పరునిది అనేవి ఇది అంతా ఒక్కటే అనే ఆత్మజ్ఞానం లేకపోవుటచేత ప్రాణులకు తాను పరుడు అనే భేదభావం కలుగుతోంది.

**నారద ఉవాచ**

**శ్లో॥ ఇతి దైత్యపతేర్వాక్యం దితిరాకర్ణ్య సస్నుషా।**
**పుత్రశోకం క్షణాత్త్యక్త్వా తత్త్వే చిత్తమధారయత్॥ 61**

పదవిని సాధించాను. వాడు అల్పాయుష్కుడు అందువలన ఒక్క జన్మం ధారపోసి పెక్కు జన్మాలైనను నీ పదవిని సాధింతునని వాడు తలచియున్నాడు.

**శ్లో॥ అన్యథేదం విధాస్యేऽహం యథాపూర్వమోజసా।**
**కిమన్యైః కాలనిర్ధూతైః కల్పాన్తే వైష్ణవాదిభిః॥ 11**

**ప్రతిపదార్థము:–** అహమ్=నేను, ఇదమ్=సురాసురాదికమగు ఈ జగాన్ని, అయథాపూర్వమ్=పూర్వమున నున్నవానిగా కాక, అన్యథా=మరొకరీతిని, విధాస్యే=ఈ జగాన్ని నిర్మింతును, కల్పాన్తే=ప్రళయకాలంలో, కాలనిర్ధూతైః=కాలంచేత సంహరింపబడు, వైష్ణవాధిభిః=విష్ణు సంబంధ స్థానముతో, కిమ్=ఏమి ప్రయోజనం.

**తాత్పర్యము:–** నేను నా తపోబలంబున సురలు పుణ్యాత్ములు అసురులు పాపాత్ములని ఉన్న రీతిని మార్పుచేసి సురలు పాపులుగాను, అసురులు పుణ్యాత్ములుగా నున్నట్లు ఈ జగాన్ని ఉంచే విధంగా నిర్మింతును. కల్పాన్తమందు కాలవశమున నశించు విష్ణు సంబంధ స్థానములతో నాకు ఏమి పని?

**శ్లో॥ ఇతి శుశ్రుమ నిర్బన్ధం తపః పరమమాస్థితః।**
**విధత్స్వానన్తరం యుక్తం స్వయం త్రిభువనేశ్వర॥ 12**

**ప్రతిపదార్థము:–** ఇతి=ఇట్లు నా పదాన్ని (పదవి స్థలాన్ని) అపహరింపగోరినవాడై, నిర్బంధమ్=దృఢమైన, పరమమ్=తీవ్రమైన, తపః, ఆస్థితః=తపస్సు చేస్తున్నాడు, త్రిభువనేశ్వరః=ముల్లోకాలను పాలించే ఈశ్వరా,అనంతరమ్=తర్వాత, స్వయం ఏవ యుక్తమ్=నీకు తగినదేదో, విధత్స్వ=చెయ్యి.

**తాత్పర్యము:–**ఇట్లు నా పదవిని అపహరింపగోరినవాడై పట్టుదలతో తీవ్రమైన తపస్సు చేస్తున్నాడు. ఓ త్రిలోకాధిపా! తర్వాత నీకు తోచినదేదో చెయ్యి.

**శ్లో॥ తవాసనం ద్విజగవాం పారమేష్ఠ్యం జగత్పతే।**
**భవాయ శ్రేయసే భూత్యై క్షేమాయ విజయాయ చ॥ 13**

**ప్రతిపదార్థము:–** జగత్+పతే=ఓ లోకేశ్వరా!, తవ+ఆసనమ్=నీయొక్క పదవి, పారమేష్ఠ్యమ్=అత్యున్నతమైన నీ స్థానం, ద్విజగవామ్=ద్విజులకు, గోవులకు గాను, భవాయ=పుట్టుకకు, శ్రేయసే=సుఖానికి, భూత్యై=ఐశ్వర్యానికి, క్షేమాయ=(క్షేమం కొరకు) లభించిన దాని పాలనం కోసం, విజయాయ=విజయం కొరకు.

**తాత్పర్యము:–**ఓ లోకాధిపతీ! వాడు పారమేష్ఠ్యమైన నా స్థానాన్ని ఆక్రమించుకో చూస్తున్నాడు. అది ద్విజులకు, గోవులకు జన్మ, సుఖ, ఐశ్వర్య, క్షేమాదులను ఇచ్చేది. అవి లేకుండా పోతాయి.

**శ్లో॥ ఇతి విజ్ఞాపితో దేవైర్భగవానాత్మభూర్నృప।**
**పరితో భృగుదక్షాద్యైర్యయౌ దైత్యేశ్వరాశ్రమమ్॥ 14**

**ప్రతిపదార్థము:–** దేవైః=దేవతలచేత, ఇతి=ఇట్లు, విజ్ఞాపితః=విన్నవించబడినవాడై, భగవాన్=భగవంతుడు, ఆత్మభూః=స్వయంభువు బ్రహ్మ, భృగుదక్షాద్యైః=భృగు, దక్షుడు మొదలైన మహర్షులతో, పరీతః=కూడుకొని, దైత్యేశ్వర+ఆశ్రమమ్=దైత్య ప్రభుని ఆశ్రమానికి, యయౌ=వెళ్లాడు.



## శ్రీః
## అథ తృతీయోऽధ్యాయః

వరాలు పొందిన హిరణ్యకశిపుడు సాధువులను హింసించమని దానవులకు ఆజ్ఞ ఇచ్చి, బంధువుల శోకాన్ని తత్త్వనిరూపణంతో తొలగించి ఏంచేసాడో దాన్ని చెప్పడం మొదలుపెట్టాడు.

ఈ తృతీయాధ్యాయంలో ఆ హిరణ్యకశిపుడు తపస్సుచేసి జగమంతా సంతాపం కలిగించడం చూసిన బ్రహ్మదేవుడు ఆశ్చర్యపడ్డాడు. హిరణ్యకశిపుని దగ్గరకు వచ్చి అతని చేత పొగడబడ్డవాడై అతనికి వరాలిచ్చాడు.

**నారద ఉవాచ**

**శ్లో॥ హిరణ్యకశిపూ రాజనజేయమజరామరమ్।**
**ఆత్మానమప్రతిద్వన్ద్వమేకరాజం వ్యధిత్సత॥ 1**

**ప్రతిపదార్థము:–**రాజన్=ఓ రాజా!, హిరణ్యకశిపుః=హిరణ్యకశిపుడు, ఆత్మానమ్=తనను, అజేయమ్=జయించ శక్యం కానివానిగా, అజర+అమరమ్=ముసలితనం, చావులేనివానిగా, అప్రతిద్వంద్వమ్ = ప్రతిపక్షం లేనివాడుగా, ఏకరాజమ్ = ఏకచ్ఛత్రాధిపతిగా, వ్యధిత్సత = చేయగోరెను.

**తాత్పర్యము:–** ఓ రాజా! హిరణ్యకశిపుడు తాను అజేయుడు, అమరుడు, అజరుడు, శత్రువులు లేనివాడు, ఏకచ్ఛత్రాధిపతిగా కోరెను.

**శ్లో॥ స తేపే మన్దరద్రోణ్యాం తపః పరమదారుణమ్।**
**ఊర్ధ్వబాహుర్నభోదృష్టిః పాదాఙ్గుష్ఠాశ్రితావనిః॥ 2**

**ప్రతిపదార్థము:–** సః=ఆ హిరణ్యకశిపుడు, మందరద్రోణ్యామ్=మందరగిరి చరియ ప్రాంతంలో, ఊర్ధ్వబాహుః=పై కెత్తిన బాహువులు కలిగి, నభోదృష్టిః=ఆకసం వైపు దృష్టిపెట్టి, పాద+అంగుష్ఠ+ఆశ్రిత+అవనిః=కాలిబొటనవ్రేలితో భూమిపై నిలబడ్డవాడై, పరమదారుణమ్=మిక్కిలి దారుణమైన, తపః=తపస్సు, తేపే=చేసెను.

**తాత్పర్యము:–** ఆ హిరణ్యకశిపుడు మందరగిరి సానువులకు చేరి, చేతులు పైకెత్తి ఆకాశంలోకి చూస్తూ బొటనవ్రేలి మీద నేల మీద నించొని ఉగ్రమైన తపస్సు చేసాడు.

**శ్లో॥ జటాదీధితిభీ రేజే సంవర్తార్క ఇవాంశుభిః।**
**తస్మింస్తపస్తప్యమానే దేవాస్స్థానాని భేజిరే॥ 3**

**ప్రతిపదార్థము:–** జటాదీధితిభిః=జడల కాంతి చేత ఆ దైత్య ప్రభువు, సంవర్తార్కః ఇవ=ప్రళయ కాలసూర్యునిలా, అంశుభిః=తీక్ష్ణ కిరణాలచేత, రేజే=ప్రకాశించాడు, తస్మిన్=అతడు, తపః=తపస్సును, తప్యమానే=తపస్సుచేస్తూండగా, దేవాః=దేవతలు లోనైనవారు, స్థానాని=వారి వారి స్థానాలను, భేజిరే=పొందారు.

**తాత్పర్యము:–** తీవ్రమైన అంశువులతో ప్రళయకాల సూర్యుడువలె జడల కాంతిచే ఆ హిరణ్యకశిపుడు ప్రకాశించెను. అతడు తపస్సు చేస్తుండగా దిక్పాలకులు మొదలైన దేవతలు, (అతనికి లోబడి) సేవచేస్తూ లేక అతని ధాటికి నిలువలేక పలాయనమైనవారు, స్వస్థానాలను పొందారు.

**శ్లో॥ తస్య మూర్ధ్నస్సముద్భూతస్సధూమోఽగ్నిస్తపోమయః।**
**తిర్యగూర్ధ్వమధోలోకానసకృద్విష్వగీరితః॥ 4**

**ప్రతిపదార్థము:–** తస్య=ఆ హిరణ్యకశిపుని యొక్క, మూర్ధ్నః=శిరస్సు నుండి, సముద్భూతః =జన్మించిన, తపోమయః=తపమువల్ల ఏర్పడిన, సధూమః=పొగతో కూడిన, అగ్నిః=అగ్ని, లోకాన్= లోకాలను అంతటా, తిర్యక్=అడ్డంగా, ఊర్ధ్వమ్=పైకి, విష్వక్=మధ్యను, అధః=కిందికి, అసకృత్=పలుమార్లు, లోకాన్+ఈరితః=లోకాలంతటా వ్యాపించింది.

**తాత్పర్యము:–** ఆ హిరణ్యకశిపుని శిరస్సు నుండి జన్మించిన తపోఽగ్ని పొగతో కూడి పైకి, క్రిందకు, మధ్యను పలుమార్లు లోకాలంతటా వ్యాపించింది.

**శ్లో॥ చుక్షుభుర్నద్యుదన్వన్తస్సాద్రి ద్వీపాచచాల భూః।**
**నిపేతుస్సగ్రహాస్తారాః జజ్వలుశ్చ దిశో దశ॥ 5**

**ప్రతిపదార్థము:–** నదీ+ఉదన్వంతః=నదులు, సముద్రాలు, చుక్షుభుః=కలత చెందె, స+అద్రి= పర్వతములతో, ద్వీపాః చ=ద్వీపాలతో కూడిన, భూః=భూమి, చచాల=చలించింది, సగ్రహాః =గ్రహాలతో కూడిన, తారాః=నక్షత్రాలు, నిపేతుః=కిందపడ్డాయి, దశదిశః=పది దిక్కులూ, జజ్వలుః =మండాయి.

**తాత్పర్యము:–** అటువంటి ఆ రాక్షసుని తపోగ్నిధూమం వల్ల నదులూ, సముద్రాలూ, క్షోభిల్లాయి. పర్వతాలతో, ద్వీపాలతో ఉన్న భూమి దద్దరిల్లి వణికింది. గ్రహాలతో నక్షత్రాలు రాలాయి. పది దిక్కులు ప్రజ్వరిల్లాయి.

**శ్లో॥ తేన తప్తా దివం త్యక్త్వా బ్రహ్మలోకం యయుస్సురాః।**
**ధాత్రే విజ్ఞాపయామాసుర్దేవదేవ జగత్పతే॥ 6**

**శ్లో॥ దైత్యేన్ద్రతపసా తప్తా దివి స్థాతుం న శక్నుమః।**
**తస్య చోపశమం భూమన్ విధేహి యది మన్యసే।**
**లోకా న యావన్నఙ్క్ష్యన్తి బలిహారాస్తవాభిభూః॥ 7**

**ప్రతిపదార్థము:–** తేన=ఆ రాక్షసుని తపోఽగ్నిచేత, తప్తాః=సంతప్తులై, సురాః=దేవతలు, దివమ్=స్వర్గలోకాన్ని, త్యక్త్వా=వదిలిపెట్టి, బ్రహ్మలోకమ్=బ్రహ్మలోకానికి, యయుః=వెళ్ళిరి, ధాత్రే=బ్రహ్మ కోసం, విజ్ఞాపయామాసుః=ఇట్లు విన్నవించుకున్నారు, దేవదేవ=ఓ దేవతలకే దైవమా!, జగత్పతే!=ఓ లోకేశ్వరా!, భూమన్=శాశ్వతుడైన ఓ దేవా!, దైత్యేంద్ర తపసా=దైత్యపతి యొక్క తపస్సువల్ల, తప్తాః=తాపం పొందిన, దివి=స్వర్గలోకంలో, స్థాతుమ్=నిలబడటానికి, న శక్నుమః=సమర్థులం కాలేకపోయాం, యది మన్యతే=మా క్షేమాన్ని కోరెదవేని, తస్య=ఆ తపోఽగ్నికి, ఉపశమమ్=ప్రశాంతిని, విధేహి=కావించు,అభిభూః=ఓ సర్వాధిపతీ!, తవ=నీకు, బలిహారాః =పూజ కావించే, లోకాః=సమస్తలోకాలు, యావత్=అంతా, నఙ్క్ష్యంతి=నశించేంత లోపల వానికి వరమివ్వు.

**తాత్పర్యము:–** ఆ సురారి తపోఽగ్నిచేత స్వర్లోకమంతా తాపం చెంది, దేవతలంతా స్వర్గవాసం వదలి బ్రహ్మలోకం చేరి బ్రహ్మదేవునికి విన్నవించుకున్నారు. ఓ దేవదేవా! ఓ జగదీశా! ఓ శాశ్వతా! దైత్య ప్రభుని తపస్సుచేత స్వర్గలోకం అంతా తప్తం అవుతోంది. మేం అక్కడ నిలువలేక పోతున్నాం. నీవు మా క్షేమం, లోక క్షేమం కోరి వాని తపోఽగ్నిని శాంతింపజేయి. ఆ హిరణ్యకశిపునికి వరమివ్వు. ఓ సర్వాధిపతీ! నీకు పూజచేసే లోకాలు లేక లోకులు వాని తపస్సున మండిపోకముందే వానికి వరమివ్వు.

**శ్లో॥ తస్యాయం కిల సఙ్కల్పశ్చరతో దుశ్చరం తపః।**
**శ్రూయాతాం కిన్న్వవిదితం తవాథాపి నివేద్యతే॥ 8**

**ప్రతిపదార్థము:–** దుశ్చరమ్=ఆచరించడానికి సాధ్యం కాని, తపః చరతః=తీవ్రమైన తపస్సు చేసే, తస్య=ఆ హిరణ్యకశిపునియొక్క,అయమ్=ఈ, సంకల్పమ్=ఉద్దేశం, తవ=నీకు, కిం ను+అవిదితమ్ =తెలియనిది కాదు కదా!, అథ+అపి=అయినా, శ్రూయతామ్=వినండి, నివేద్యతే=మాచేత నివేదించబడుతున్నది.

**తాత్పర్యము:–** కష్ట సాధ్యమైన తీవ్ర తపస్సు చేసే ఆ హిరణ్యకశిపుని ఉద్దేశం ఆతనికాంక్ష, మీకు తెలియనిది కాదు. అయినా నివేదించబడుచున్నది. వినండి....!

**శ్లో॥ సృష్ట్వా చరాచరమిదం తపోయోగసమాధినా।**
**అధ్యాస్తే సర్వధిష్ణ్యేభ్యః పరమేష్ఠీ నిజాసనమ్॥ 9**

**ప్రతిపదార్థము:–** తపోయోగసమాధినా=శారీరక తపం నైర్మల్యం, ఏకాగ్రతగల చిత్తధారణా రూపమైన యోగం అనే రెండింటి చేత, ఆ బ్రహ్మను అనవరతం ధ్యానించుట అనే నిష్ఠచేత, ఇదమ్=ఈ, చరాచరమ్=జంగమ స్థావరాత్మకమైన ప్రపంచాన్ని, సృష్ట్వా=సృజించి, సర్వధిష్ణ్యేభ్యః =ఎల్లలోకాల కంటె శ్రేష్ఠమైన, నిజాసనమ్=తన చోటును సత్యలోకంలో, పరమేష్ఠీ=పరమేష్ఠి, అధ్యాస్తే=అధిష్ఠించియున్నాడు.

**తాత్పర్యము:–** తపస్సు యోగం అనేవాని నిష్ఠచే ఈ జంగమ స్థావరాత్మకమైన ఈ ప్రపంచాన్ని సృజించి ఎల్లలోకాల కంటే శ్రేష్ఠమైన సత్యలోకాన్ని అధిష్టించియున్నాడు.

**శ్లో॥ తదహం వర్ధమానేన తపోయోగసమాధినా।**
**కాలాత్మనోశ్చ నిత్యత్వాత్సాధయిష్యే తథాత్మనః॥ 10**

**ప్రతిపదార్థము:–**తత్=ఆ ప్రకారం, అహమ్=నేను, వర్ధమానేన=దినదినాభివృద్ధిగా, తపోయోగ సమాధినా=తపోయోగ నిష్ఠచేత, కాలాత్మనోః=కాలం, ఆత్మలకు, నిత్యత్వాత్ చ=నిత్యత్వం వలన, (తథా ఆబ్రహ్మవత్) ఆత్మనః=నాకును, సాధయిష్యే=బ్రహ్మపదం సాధించుకొందును.

**తాత్పర్యము:–** నా వలెనే ఆ హిరణ్యకశిపుడు తపోయోగ నిష్ఠలతో నీ సత్యపథం సాధించగోరి యున్నాడు. బ్రహ్మనగు నేను దీర్ఘాయువు గలవాడను. చాలాకాలం తపస్సుచేసి ఈ సత్యలోక

**హిరణ్యకశిపురువాచ**

**శ్లో॥ కల్పాన్తే కాలసృష్టేన యోఽన్ధేన తమసావృతమ్।**
**అభివ్యనగ్జగదిదం స్వయఞ్జ్యోతిః స్వరోచిషా॥ 26**

**ప్రతిపదార్థము:-** కల్పాంతే=ప్రళయావసానంలో, కాలస్పష్టేన=కాలంచేత సృజింపబడిన ప్రకృతి గుణరూపమైన, అంధేన తమసా=కటిక చీకటి చేత, ఆవృతమ్=క్రమ్మబడిన, ఇదం జగత్=ఈ ప్రపంచాన్ని, యః=ఎవడు, స్వయం జ్యోతిః=స్వయం ప్రకాశుడు, స్వరోచిషా=తన తేజస్సు, అభివ్యనక్=వ్యక్తం కావించేడు. (తర్వాతి శ్లోకంతో అన్వయం).

**తాత్పర్యము:-** కాల పరిణామంలో ప్రకృతి గుణరూపమై, దట్టమైన చీకటి అలముకున్న ఈ ప్రపంచాన్ని స్వయం ప్రకాశుడై యెవడు తన తేజస్సుతో స్పష్టంగా కనిపించేటట్లు చేశాడో, (తరువాతి శ్లోకంతో అన్వయం).

**శ్లో॥ ఆత్మనా త్రివృతా చేదం సృజత్యవతి లుమ్పతి।**
**రజస్సత్త్వతమోధామ్నే పరాయ మహతే నమః॥ 27**

**ప్రతిపదార్థము:-** యః=ఎవడు, త్రివృతా=త్రిగుణాలతో కూడిన, ఆత్మనా=స్వస్వరూపం చేత, ఇదమ్=ఈ జగాన్ని, సృజతి=సృష్టించునో, అవతి=రక్షించునో, లుంపతి=సంహరించునో, అట్టి, రజః సత్త్వతమోధామ్నే=రజస్సు, తమస్సు, సత్వం అనే గుణాలకు ఆశ్రయుడు, మహతే పరాయ =అటువంటి గొప్ప ప్రభువునకు, పరమేశ్వరునకు, నమః=నమస్కారం.

**తాత్పర్యము:-** ఎవడు త్రిగుణాలతో కూడి, ఈ జగాన్ని సృష్టిస్తున్నాడో, రక్షిస్తున్నాడో, లయం చేస్తున్నాడో ఆ రజస్సత్వతమోగుణాలకు ఆశ్రయుడైన గొప్ప ప్రభువు పరమేశ్వరునకు నమస్కరించుచున్నాను.

**శ్లో॥ నమ ఆద్యాయ బీజాయ జ్ఞానవిజ్ఞానమూర్తయే।**
**ప్రాణేన్ద్రియమనోబుద్ధివికారైర్వ్యక్తిమీయుషే॥ 28**

**ప్రతిపదార్థము:-** బీజాయ=జగత్కారణమైన, ఆద్యాయ=ఎల్లవానికి ఆద్యుడైన, జ్ఞాన విజ్ఞాన మూర్తయే=స్వయంగా జ్ఞాన స్వరూపుడు, స్వయం ప్రకాశకుని కొరకు, ప్రాణేంద్రియ మనోబుద్ధి వికారైః=ప్రాణం, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలు పది, మనస్సు, దానికి రూపమైన బుద్ధి మొదలైన రూపాలచే, వ్యక్తిమ్=కార్యరూపాన్ని, ఈయుషే=పొందిన నీకు, నమః=నమస్కారములు.

**తాత్పర్యము:-** జగాలకెల్ల ఆద్యుడై వానికి మూలకారణమైన నిమిత్తకారణం, జ్ఞానరూపమై (స్వయం ప్రకాశకుడు) శబ్దాది విషయకారుడైన, జగత్ప్రకాశకుడైన స్వరూపం గలవాని కొరకు, ప్రాణ ఇంద్రియ దశకాల, మనోబుద్ధులకు రూపమును ఉపాదాన కారణాన్ని కార్యరూపాన్ని పొందినవానికి నీకు నా నమస్కారములు.

**శ్లో॥ త్వమీశిషే జగతస్తస్థుషశ్చ-ప్రాణేన ముఖ్యేన పతిః ప్రజానామ్।**
**చిత్తస్య చిత్తేర్మన ఇన్ద్రియాణామ్-పతిర్మహాన్ భూతగుణాశయేశః॥ 29**





**తాత్పర్యము:-** ఇట్లు దేవతలు విన్నవించగా భగవంతుడు బ్రహ్మ భృగువు, దక్షుడు మొదలైన మహర్షులతో కలసి హిరణ్యకశిపుని ఆశ్రమానికి బయలుదేరాడు.

**శ్లో॥ న దదర్శ ప్రతిచ్ఛన్నం వల్మీకతృణకీచకైః।**
**పిపీలికాభిరాచీర్ణమేదస్త్వఙ్మాంసశోణితమ్॥ 15**

**ప్రతిపదార్థము:-** సః=ఆ బ్రహ్మ, వల్మీకతృణకీచకైః=పుట్టచేత, గడ్డిచేత, వెదురుచేత, ప్రతిచ్ఛన్నమ్=కప్పబడినవాడై, పిపీలికాభి=చీమలచేత, ఆచీర్ణమేదస్త్వఙ్మాంసశోణితమ్= భక్షించబడిన మెదడు, చర్మం, మాంసరక్తాలు కల అసురేంద్రుని, దదర్శ=చూసాడు.

**తాత్పర్యము:-** బ్రహ్మ మేనిపైపుట్ట, కసవు మొలిచి వెదుళ్ళు బలిసి కప్పబడినవాడై చీమలచేత మెదడు, మాంసరక్తాలను భక్షింపబడినవాడై, క్షీణితుడైన ఆ హిరణ్యకశిపుని చూసాడు.

**శ్లో॥ తపన్తం తపసా లోకాన్ యథాభ్రపిహితం రవిమ్।**
**విలక్ష్య విస్మితః ప్రాహ హంసస్తం హంసవాహనః॥ 16**

**ప్రతిపదార్థము:-** తపసా=తపస్సుచేత, లోకాన్=లోకాలను, తపం=తపింపచేయువాడు, అభ్ర పిహితం=మేఘాలచే కప్పబడిన, రవిమ్=రవివలె నున్న, తమ్=ఆ హిరణ్యకశిపుని, విలక్ష్య= గుర్తించి, విస్మితః=ఆశ్చర్యపడి, హంసః=నవ్వుతూ, హంసవాహనః=హంసవాహనుడైన బ్రహ్మ, ప్రాహ=ఇలా అన్నాడు.

**తాత్పర్యము:-** తపస్సుచేత లోకాలను తపింపజేస్తూ మేఘాల చేత కప్పబడిన సూర్యునివలె ఉన్న ఆ హిరణ్యకశిపుని చూసి, హంసవాహనుడైన బ్రహ్మ ఆశ్చర్యపడి నవ్వుతూ ఇలా అన్నాడు.

**బ్రహ్మోవాచ**

**శ్లో॥ ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రం తే తపస్సిద్ధోఽసి కాశ్యప।**
**వరదోఽహమనుప్రాప్తో వ్రియతామీప్సితో వరః॥ 17**

**ప్రతిపదార్థము:-** ఉత్తిష్ఠ, ఉత్తిష్ఠ=లెమ్ము, లెమ్ము,(లే! లే...!),తే భద్రమ్=నీకు శుభం అవుతుంది, తపః సిద్ధః అసి=తపస్సిద్ధుడవయ్యావు, అహమ్=నేను, అనుప్రాప్తః=నీచెంతకు వచ్చాను, ఈప్సితః వరః=నీకిష్టమైన వరము, వ్రియతామ్=వరింతువుగాక!

**తాత్పర్యము:-** ఓ కశ్యపపుత్రా! లే! లే...! నీకు శుభం కలుగుతుంది. నీ తపస్సు ఫలించింది. నీకు వరమివ్వాలని వచ్చాను. నీకిష్టమైన వరం కోరుకో...!

**శ్లో॥ అద్రాక్షమహమేతత్తే హృత్సారం మహదద్భుతమ్।**
**దంశభక్షితదేహస్య ప్రాణా హ్యస్థిషు శేరతే॥ 18**

**ప్రతిపదార్థము:-** అహమ్=నేను, దంశభక్షితదేహస్య=అడవి ఈగలచేత భక్షింపబడిన దేహం కల, తే=నీ యొక్క, మహత్=గొప్పదైన, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, ఏతత్ హృత్సారమ్=ఈ ధైర్యాన్ని, అద్రాక్షమ్=చూసాను, ప్రాణాః హి=ప్రాణాలూ, అస్థిషు=ఎముకలలో, శేరతే హి= శయనించినవి గదా!

**తాత్పర్యము:–** ఓ దైత్యేశ్వరా! అడవి ఈగలు శరీరాన్ని భక్షించిన దేహంతో నీ గొప్ప అద్భుతమైన ఈ ధైర్యాన్ని చూసాను. ఎముకలలో ప్రాణావశిష్టమైన శరీరాన్ని చూసాను.

**శ్లో॥ నైతత్పూర్వర్షయశ్చక్రుర్న కరిష్యన్తి చాపరే।**
**నిరమ్బుర్ధారయేత్ప్రాణాన్ కో వై దివ్యసమాశ్శతమ్॥ 19**

**ప్రతిపదార్థము:–** ఏతత్=ఇట్లు తపమును, పూర్వ ఋషయః=పూర్వం మహర్షులు కూడా, న చక్రుః=చేయరు, అపరే చ=తర్వాత వచ్చువారునూ, న కరిష్యంతి=ఇలా చేయలేరు. నిరంబుః =జలపానంలేనివారై, ప్రాణాన్=ప్రాణాలు, దివ్యసమాః శతం=నూఱు దివ్యవత్సరాలు కలవై, ధారయేత్=ఎవడు నిల్పుకొనగలడు? ఎవ్వడు నిల్పుకోలేడు.

**తాత్పర్యము:–** నీ యట్లు తపస్సును పూర్వ ఋషులు చేసినవారు లేరు. ఇక మీద జేయజాలరు కూడా. నీరు సైతం త్రాగక ప్రాణాలను దేహంలో నూఱు దివ్యవర్షాలు ఎలా నిలుపుకోగలరు?

**శ్లో॥ వ్యవసాయేన తేఽనేన దుష్కరేణ మనస్విభిః।**
**తపోనిష్ఠేన భవతా జితోఽహం దితినన్దన॥ 20**

**ప్రతిపదార్థము:–** దితినందన=ఓ దితిపుత్రా!, మనస్విభిః=బుద్ధిమంతులచేత, దుష్కరేణ=చేయ సాధ్యంకాని, అనేన=ఈ, వ్యవసాయేన=దృఢ సంకల్పరూపమైన ప్రయత్నం చేతనే, అహమ్=నేను, జితః=జయింపబడితిని, తపోనిష్ఠేన=తపోనిష్ఠగల, భవతా=నీచేత, జితః=జయింపబడితిని.

**తాత్పర్యము:–** ఓ దితిపుత్రా! హిరణ్యకశ్యపా! యోగీంద్రులుసైతం చేయజాలని నీ దృఢ సంకల్పానికి నేను మెచ్చాను. నీ తపోనిష్ఠచేత నన్ను గెలిచితివి.

**శ్లో॥ తతస్త ఆశిషస్సర్వా దదామ్యసురపుఙ్గవ।**
**మర్త్యస్య తే హ్యమర్త్యస్య దర్శనం నాఫలం మమ॥ 21**

**ప్రతిపదార్థము:–** అసురపుంగవ=ఓ అసురేంద్ర, తతః=అందువల్ల, తే=నీకు, సర్వాః ఆశిషః =ఎల్లవాంఛలను, దదామి=ఇస్తున్నాను, మర్త్యస్య=మృతిగలవాడవైన, తే=నీకు, అమర్త్యస్య=మరణ ధర్మంలేని, మమ=నాయొక్క, దర్శనమ్=దర్శనము, అఫలమ్=నిష్ఫలం, నహి=కాదు కదా!

**తాత్పర్యము:–** ఓ అసురేంద్ర! నీవు తపోనిష్ఠగలవాడవగుటచేత నీ కెల్ల కోరికలను ఇచ్చెదను. మరణించు స్వభావం గల నీకు అమరుడనగు నా దర్శనం నిష్ఫలం కాదు కదా!

**నారద ఉవాచ**

**శ్లో॥ ఇత్యుక్త్వాదిభవో దేవో భక్షితాఙ్గం పిపీలికైః।**
**కమణ్డలుజలేనౌక్షద్దివ్యేనామోఘరాధసా॥ 22**

**ప్రతిపదార్థము:–** ఇతి+ఉక్త్వా=ఇట్లు చెప్పి, అదిభవః=ప్రథమ జన్ముడైన, దేవః=బ్రహ్మ, పిపీలికైః =చీమలచేత, భక్షిత+అంగమ్=తినబడిన శరీరంపైన, దివ్యేన=ఉత్తమోత్తమమై, అమోఘరాధసా =అమోఘప్రభావంగలదైన, కమండలుజలేన=తన కమండలువులోని జలంతో, ఔక్షత్= ప్రోక్షించేడు.



**తాత్పర్యము:–** ఇట్లని ఆద్యుడగు బ్రహ్మ పిపీలికాలచే భక్షింపబడిన అసురేంద్రుని శరీరం మీద, దివ్యమై, అమోఘ ప్రభావం గల తన కమండలువులోని జలంతో చల్లాడు.

**శ్లో॥ తతః కీచకవల్మీకాత్ సహ ఓజో బలాన్వితః।**
**సర్వావయవసమ్పన్నో వజ్రసంహననో యువా।**
**ఉత్థితస్తప్తహేమ్నో విభావసురివైధసః॥ 23**

**ప్రతిపదార్థము:–** తతః=అంతట, (సః=ఆ అసురపుంగవుడు), సహ ఓజః బలాన్వితః=శరీరపుష్టితో బలంతో కూడినవాడు, సర్వావయసంపన్నః=శిథిలమైన అవయవాలన్నీ పూర్ణమైనవై, వజ్ర సంహననః=వజ్రసమానమై దృఢమైన శరీరం గలవాడై, యువా=యువకుడై, కీచకవల్మీకాత్= ఆ వెదురు పుట్ట నుండి, ఆ కమండులువులోని జలప్రోక్షణంతో, ఏధసః=వృద్ధిచెందినవాడై, విభావసుః ఇవ=అగ్నివలె, తప్తహేమాంభః=పుటము దీసిన పసిడి వన్నెమీఱ, ఉత్థితః=లేచినవాడై.

**తాత్పర్యము:–** ఆ కమండలుపు జల ప్రోక్షణంతో ఆ అసురపుంగవుడు శరీరపుష్టి, బలం కలిగి అన్ని అవయవములు పూర్ణములై కూడగా వజ్రం వలె దృఢశరీరం గలవాడై, యువకుడై ఆ వెదురుపుట్ట నుండి బయటపడెను.

**శ్లో॥ స నిరీక్ష్యామ్బరే దేవం హంసవాహమవస్థితమ్।**
**ననామ శిరసా భూమౌ తద్దర్శనమహోత్సవః॥ 24**

**ప్రతిపదార్థము:–**సః=ఆ హిరణ్యకశిపుడు, అంబరే=ఆకాశంలో, అవస్థితమ్=ఉన్న, హంస వాహనమ్=హంసవాహనంగల, దేవమ్=బ్రహ్మదేవుని, నిరీక్ష్య=చూసి, తద్దర్శన మహోత్సవః =ఆ బ్రహ్మదేవుని చూచుటచే కలిగిన సంతోషం గలిగి, భూమౌ=నేలపై సాగిలి, శిరసా=శిరస్సుతో, ననామ= నమస్కరించాడు.

**తాత్పర్యము:–** హిరణ్యకశిపుడు ఆకాశంలో ఉన్న బ్రహ్మదేవుని చూసి, ఆతని దర్శన భాగ్యానికి సంతోషం కలిగి నేలపై సాగిలి శిరస్సుతో నమస్కరించాడు.

**శ్లో॥ ఉత్థాయ ప్రాఞ్జలిః ప్రహ్వ ఈక్షమాణో దృశా విభుమ్।**
**హర్షాశ్రుపులకోద్భేదో గిరా గద్గదయా గృణన్॥ 25**

**ప్రతిపదార్థము:–** ఉత్థాయ=లేచి, ప్రాంజలిః=చేతులు దోయిలించుకొన్నవాడై, ప్రహ్వః=క్రిందికి వంగి, దృశా=చూస్తూ, విభుమ్=ప్రభువైన, బ్రహ్మను, ఈక్ష్యమాణః=చూస్తున్నవాడై, హర్ష+ అశ్రుపులకః ఉద్భేదః=సంతోషంచేత పులకించి ఉద్భవించిన రోమాంచం కలవాడై, గద్గదయా= డగ్గుత్తికతో, గిరా=వాక్కుచేత, గృణన్=ఇట్లా అన్నాడు.

**తాత్పర్యము:–** ఆపై పైకిలేచి చేతులు దోయిలించుకొన్నవాడై, క్రిందికి వంగి చూస్తూ ప్రభువైన బ్రహ్మను చూస్తున్నవాడై, సంతోషంచేత పులకించి ఉద్భవించిన రోమాంచం కలవాడై, డగ్గుత్తికతో కూడిన వాక్కుచేత ఇట్లా అన్నాడు.

**శ్లో॥ సర్వేషాం లోకపాలానాం మహిమానం యథాత్మనః।**
**తపోయోగప్రభావానాం యన్నరిష్యతి కర్హిచిత్॥ 38**

**ప్రతిపదార్థము:-** తపస్+యోగప్రభావానామ్=తపస్సుచేత, యోగంచేత, సంభవించిన ప్రభావం గల, సర్వేషాం లోకపాలనామ్=ఎల్లదిక్పాలకులకు, యత్=ఏ అణిమాదికమయిన ఐశ్వర్యం, కర్హిచిత్=ఒకప్పుడు, యథా=ఏ ప్రకారము, నష్యతి=నశించదో, తథా=ఆ ప్రకారం, ఆత్మనః= నాకు, మహిమానమ్=అణిమాదిమహిమను ఇవ్వు.

**తాత్పర్యము:-** తపస్సు, యోగం మొదలైన వానివల్ల ఏర్పడిన ప్రభావం గల ఇంద్రాదులగు ఎల్లదిక్పాలురకు నెప్పుడూ నశించని ఏ అణిమాది అష్టసిద్ధులూ గలవో అవి నాకు కలుగునట్లు వరమివ్వు.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**హిరణ్యకశిపోర్వరయాచనం నామ తృతీయోऽధ్యాయః(3)**



**ప్రతిపదార్థము:-** త్వమ్=నీవు, ప్రాణేన=ప్రాణముచే, జగతః=జగత్తునకు, తస్థుషః=సూత్రాత్మ రూపమున, ఈశిషే=నియంతవగుచున్నావు. (ఈ చరాచర ప్రపంచాన్ని నియమాలతో ప్రవర్తింప జేస్తున్నావు). ప్రజానామ్=ప్రజలకు, పతిః=ప్రభువు, తాసామ్=ఆ ప్రాణులయొక్క చిత్తస్య=బుద్ధికి, చిత్తేః=ఆ బుద్ధి పరిణామ భూతమైన చేతనకు (జ్ఞానము) మనస్+ఇంద్రియాణామ్ =మనస్సునకు దానిచే, ఇంద్రియాలకు, పతిః=ప్రభువు, మహాన్=అందువలన నీవే దొడ్డవాడవు, భూతగుణ+ ఆశ్రయ+ ఈశ=ఆకాశాది పంచభూతాలకు వాని గుణాలకు శబ్దాది విషయాలకు దాని వాసనలకు నీ వీశుడవు దీనిచే స్రష్టత్వం తెల్పబడింది.

**తాత్పర్యము:-** నీవే ముఖ్యమైన సూత్రాత్మ లేక అంతర్యామి రూపంలో జంగమస్థావరాలను నియమించు నియంతవై ఉన్నావు. కావున నీవు ప్రజాపతివి. మఱి ఆ ప్రాణుల బుద్ధిని దాని గుణాలను, జ్ఞానం, మనస్సు దానిచే నియమించబడు ఇంద్రియాలకు ప్రభుడవు నీవే. అందువలన మహాత్ముడవు. మఱి ఆకారాది పంచభూతాలకు వాని గుణాలకు శబ్దాది విషయాలకు, వాని వాసనలకు ప్రభువు నీవే. దానిచేత స్రష్టత్వం, జగత్తును సృజించే కర్తృత్వం తెలుపబడింది.

**శ్లో॥ త్వం సప్తతన్తూన్వితనోషి తన్వా - త్రయ్యా చతుర్హోత్రకవిద్యయా చ।**
**త్వమేక ఆత్మాత్మవతా మనాదిరనన్తపారః కవిరన్తరాత్మా॥ 30**

**ప్రతిపదార్థము:-** త్వమ్=నీవు, సప్తతంతూన్=సప్తతంతువులను, వితనోషి=విస్తరిల్ల చేస్తున్నావు. ఎట్లనగా, చతుర్హోత్రక విద్యయా=నలుగురు హోతలు గల కర్మ విషయాలు, త్రయ్యా, తన్వా= ఋగ్యజుస్సామ వేదాల రూపంలో, యాగాలను విస్తరిల్ల చేస్తూ, ఆత్మవతా=ప్రాణులకు, త్వమ్= నీవే, ఆత్మా=ఆత్మవు, అంతరాత్మా=అంతర్యామివై ఉన్నావు, ఎట్లంటే, కవిః=సర్వజ్ఞుడు, ఏకః= అఖండుడు, అనాదిః=జన్మలేనివాడు, అనంతపారః=ఆద్యంతపారములు లేనివాడు.

**తాత్పర్యము:-** త్రయీ తనువున జాతుర్హోత్రవిద్యచే - అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశి, వాజపేయము,అతిరాత్రము, అప్తోర్యామము అను సప్తతంతువులను విస్తరింపజేయుదువు. ఆద్యంతపారములులేని యఖండాత్ముడవై,సర్వజ్ఞుడైన నీవే ప్రాణులకాత్మ భూతుడైన అంతర్యామివి.

**శ్లో॥ త్వమేవ కాలోऽనిమిషో జనానామాయుర్లవాద్యావయవైః క్షిణోషి।**
**కూటస్థ ఆత్మా పరమేష్ఠ్యజో మహాంస్త్వం జీవలోకస్య చ జీవ ఆత్మా॥ 31**

**ప్రతిపదార్థము:-** త్వం ఏవ=నీవే, అనిమేషః=అఖండమైన, కాలః=కాలరూపివై, ఆయుర్లవాద్యా వయవైః=నిమిషం, క్షణం, ముహూర్తం, దినంలోనైన అంగాలచే, జనానామ్=ప్రాణులయొక్క ఆయుః=ఆయువులను, క్షిణోషి=వ్యయంచేస్తూ, ఇట్లు సృష్ట్యాది కర్తవైనా నీవే నిర్వికారుడవై యున్నావు. త్వమ్=నీవు, కూటస్థః=నిర్వికారుడు, అజః=జన్మశూన్యుడు, మహాన్=మహాత్ముడు, జీవలోకస్య=జీవలోకమునకు, జీవః=జీవము, ఆత్మా=ఆత్మవు, పరమేష్ఠీ=జ్ఞానస్వరూపుడవు.

**తాత్పర్యము:-** నీవే కాలాత్ముడువై, లవాదులైన సూక్ష్మావయవములచే జనుల ప్రాణవాయువు లను హరింతువు. జ్ఞానస్వరూపుడవు జన్మశూన్యుడవు, మహాత్ముడు, సర్వజీవజీవనహేతువైన వాడవు నీవే నిర్వికారుడవైన సర్వాత్ముడవు.

**శ్లో॥ త్వత్తః పరం నాపరమప్యనేజ - జ్జగచ్చ కిఞ్చిద్వ్యతిరిక్తమస్తి।**
**విద్యాః కలాస్తే తనవశ్చ సర్వా - హిరణ్యగర్భోఽసి బృహత్త్రిపృష్ఠః॥ 32**

**ప్రతిపదార్థము:–** త్వత్తః=నీ కంటె, పరమ్=ఇతరమైన కారణం, అపరమ్=కార్యం, జగత్=జగత్తు, అనేజత్=స్థావరం, వ్యతిరిక్తమ్=వేరైన, కించిత్ నాస్తి అపి=కొంచెం కూడా లేదు, విద్యాః=వేదాలు, ఉపవేదం మొదలైన విద్యా స్థానాలు, కలాః=వాటి అంగాలగు, శిక్ష వ్యాకరణం మొదలగునవి, తే=నీయొక్క, తనవః=శరీరములే, బృహత్=ఎల్లవానికంటే దొడ్డవాడైనందువల్ల బ్రహ్మవైయున్నా, హిరణ్యగర్భః=హిరణ్యరూపమైన బ్రహ్మాండాన్ని (బంగారు రజంలాంటి జీవరాశుల సమూహం) గర్భంలో గల, త్రిపృష్ఠః=త్రిగుణాత్మకమైన ప్రధానమునకు ఆవల ఉండే వాడవు.

**తాత్పర్యము:–** నీ కంటె వ్యతిరిక్తమైన వస్తువేదైనా ఇంచుక ఉన్న యెడల అప్పుడు దాని వలన నీకు జన్మాది వికారం, నీ కంటె ఇతరాలైన కారణం గానీ, కార్యం గానీ, జంగమం గానీ, స్థావరం గానీ, కొంచెం కూడా లేదు. ఆ విధంగా బోధించే శాస్త్రం కూడా నీ కంటె వ్యతిరిక్తం ఎలాగంటే ఋగ్యజుస్సామాదులగు వేదం, ధనుర్వేద, గాంధర్వాదులైన ఉపవేదాలు, పురాణధర్మ శాస్త్రాలు, వాని అంగాలు, శిక్ష, వ్యాకరణాదులు అన్నీ నీ మూర్తులే. నీకు వ్యతిరేక శాస్త్రం లేదు. ఎల్ల వానికంటె దొడ్డయైన బ్రహ్మవు నీవు. సువర్ణాంశాలైన తేజోరూపంలో ఉన్న జీవరాశుల రూపం అయిన బ్రహ్మాండం నీ గర్భంలోనే ఉన్నదాయె. త్రిగుణాత్మకమైన ప్రధానమునకు పర బ్రహ్మస్వరూపుడవు.

**శ్లో॥ వ్యక్తం విభో స్థూలమిదం శరీరం యేనేన్ద్రియప్రాణమనోగుణాంస్త్వమ్।**
**భుఙ్క్షే స్థితో ధామని పారమేష్ఠ్యే హ్యవ్యక్త ఆత్మా పురుషః పురాణః॥ 33**

**ప్రతిపదార్థము:–**విభో=ఓ ప్రభూ!, వ్యక్తమ్=కార్యమై గోచరించు, ఇదమ్=ఈ జగత్తు, స్థూలమ్ శరీరమ్=నీయొక్క స్థూలదేహం, యేన=ఏ స్థూలశరీరంచేత, ఇంద్రియ ప్రాణ మనో గుణాన్= ఇంద్రియ గుణాలైన శబ్దాదివిషయాలను, సంకల్పాదులను, భుంక్షే=అనుభవిస్తున్న, పారమేష్ఠ్యే= పరమేశ్వరుని రూపమే హరుని స్వరూపంలో, స్థితః=ఉంటూ, హి అవ్యక్తః=ఇంద్రియ గోచరుడవా?, ఆత్మా=ఆత్మా, బ్రహ్మవై ఉన్నావు, పురాణః పురుషః=పురాణ పురుషుడవు.

**తాత్పర్యము:–** ఓ ప్రభూ! కార్యమై కనిపించే ఈ జగమంతా నీ స్థూల శరీరం. దీని ద్వారా ఇంద్రియాల, మనసుల యొక్క గుణాలను, శబ్దాది విషయాలను, సంకల్పాదులను హరుని రూపంలో అనుభవింతువు నువ్వ అవ్యక్తుడవగు ఆత్మ, పురాణ పురుషుడవై ఉన్నావు.

**శ్లో॥ అనన్తావ్యక్తరూపేణ యేనేదమఖిలం తతమ్।**
**చిదచిచ్ఛక్తియుక్తాయ తస్మై భగవతే నమః॥ 34**

**ప్రతిపదార్థము:–** అనంత=ఓ నాశరహితుడా, యేన=ఏ, అవ్యక్తరూపేణ=ఇంద్రియాది మనో వాక్కులకు గోచరించని రూపంచేత, ఇదమ్=ఈ వ్యక్తమైన విశ్వం, అఖిలమ్=సమస్తమూ, తతమ్=వ్యాపించినదో, చిత్+అచిత్+శక్తియుక్తాయ=చిత్+శక్తి అంటే విద్య, జ్ఞానశక్తి, అచిత్+ శక్తి=మాయ ఈ రెండింటితో కూడిన, తస్మై=ఆ, భగవతే=ఆ భగవతునికి, నమః=నమస్కారం.



**తాత్పర్యము:–** ఓ అనంతుడా! ఇంద్రియ మనోవాక్కులకు గోచరముగాని యే నీ రూపంచేత ఇంద్రియ గోచరమయ్యే ఈ విశ్వరూపాన్ని విస్తరింపచేసే చిచ్ఛక్తి అయిన విద్యతో, అచిచ్ఛక్తి అయిన మాయతోకూడిన భగవంతుడైన నీకు నమస్కరించుచున్నాను.

**శ్లో॥ యది దాస్యస్యభిమతాన్ వరాన్మే వరదోత్తమ।**
**భూతేభ్యస్త్వద్విసృష్టేభ్యో మృత్యుర్మాభూన్మమ ప్రభో॥ 35**

**ప్రతిపదార్థము:–** వరద, ఉత్తమ=ఓ వరదుడా, ఉత్తముడా, మే=నాకు, అభిమతాన్ వరాన్=ఇష్ట మైన వరాలను, యది దాస్యసి=ఇత్తువేని, ప్రభో!=ఓ ప్రభువా, త్వద్విసృష్టేభ్యః=నీచేత సృష్టింప బడిన, భూతేభ్యః=భూతాలవలన, మమ=నాకు, మృత్యుః=మృత్యువు, మాభూత్=కలుగకుండు గాక!

**తాత్పర్యము:–** ఓ వరదుడా! ఉత్తముడా! ప్రభువా! నీవు నాకు ఇష్టమైన వరాలను ఇచ్చావంటే నువ్వు సృష్టించిన ఈ సమస్త ప్రాణుల, భూతాల వల్ల నాకు మృత్యుభయం లేకుండునట్లు వరమివ్వు.

**శ్లో॥ నాన్తర్బహిర్దివా నక్తమన్యస్మాదపి చాయుధైః।**
**న భూమౌ నామ్బరే మృత్యుర్న నరైర్న మృగైరపి॥ 36**

**ప్రతిపదార్థము:–** అంతః=లోపలను, బహిః=వెలుపలను, దివానక్త=పగలు, రాత్రి, అన్యస్మాత్= నీ సృష్టికి ఇతరమైన, ఆయుధైః అపి=ఆయుధాలచేత, న భూమౌ=భూమియందు కూడా, న+అంబరే=ఆకాశమునందు కూడ, న నరైః=నరులచేత కూడ, న మృగైః అపి=మృగాలచేత కూడా, మృత్యుః న=నాకు మృత్యువు లేకుండుగాక!,

**తాత్పర్యము:–** గృహాదులలోపల వెలుపల, రాత్రి, పగలు గాని నీ సృష్టికి ఇతరమైన ఏ ఆయుధాల చేతగాని నాకు మృత్యువు లేకుండుగాక. భూమి, ఆకాశాలలో, మానవులతో, జంతువుల చేతిలో కూడా నాకు మృత్యువు లేకుండు గాక!

**శ్లో॥ వ్యసుభిర్వాసుమద్భిర్వా సురాసురమహోరగైః।**
**అప్రతిద్వన్ద్వతాం యుద్ధే హ్యైకపత్యం చ దేహినామ్॥ 37**

**ప్రతిపదార్థము:–** వ్యసుభిః వా=ప్రాణం లేని శిలాదికం చేత, అసుమద్భిర్వా=ప్రాణాలున్న వానిచేత, సుర+అసుర, మహో+ఉరగైః=దేవతలచేత, రాక్షసులచేత, భయంకర సర్పాలచేత నాకు మృత్యువు కలుగకూడదు. అప్రతిద్వంద్వతామ్=యుద్ధంలో నాకు ఎదురు లేనట్లుగా, దేహినామ్=ప్రజలకు, ఐకపత్యమ్=ఏకాధిపత్యాన్ని ఇవ్వు!

**తాత్పర్యము:–** ప్రాణంలేని వానిచేత, ప్రాణం ఉన్నవాని చేత, దేవతల చేత, రాక్షసుల చేత, భయంకరమైన పెద్ద సర్పాల చేత, నాకు మృత్యువు కలుగకూడదు. యుద్ధంలో నాకు ఎవడూ ఎదురించువాడు ఉండకూడదు. ప్రజల మీద ఏకాధిపత్యాన్ని నాకు వరంగా దయచేయి. **(బ్రహ్మణా హిరణ్యకశపవే వరప్రదానమ్)** ఆవిధంగా బ్రహ్మచేత హిరణ్యకశిపునకు వరదానం చేయబడినది.

**శ్లో॥ తస్మిన్ మహేన్ద్రభవనే మహాబలో మహామనా నిర్జితలోక ఏకరాట్।**
**రేమేఽభివన్ద్యాఙ్ఘ్రియుగస్సురాదిభిః ప్రతాపితైరూర్జితచణ్డశాసనః॥ 12**

**ప్రతిపదార్థము:-** తస్మిన్ మహేంద్రభవనే=ఆ ఇంద్రభవనమునందు, మహాబలః=దొడ్డ బల్లిదుడు, మహామనాః=దొడ్డబుద్ధిగలవాడు, నిర్జితలోకః=లోకములను జయించినవాడు, ఏకరాట్= ఏకైక ప్రభువు,ప్రతాపితైః=తన ప్రతాపముతో, సురాదిభిః=దేవతలులోనగువారిచే, అభివంద్యాంఘ్రి యుగః=నమస్కరింపఁదగిన పాదయుగము గలవాడు, ఊర్జితచండశాసనః=బలిష్టమై, తీవ్రమైన ఆజ్ఞగల ఆ యసురేంద్రుడు, రేమే=రమించెను.

**తాత్పర్యము:-** దొడ్డ బల్లిదుడు, దొడ్డమనస్సువాడు, లోకములను జయించినవాడు, తానొక్కడే యంతటికీ ప్రభువైనవాడు, తన ప్రతాపమున బాధనొందిన సురలచే పాదములకు మ్రొక్కబడు చున్నవాడు, నిరంకుశమైన చండశాసనములు గల యసురేంద్రుడా ఇంద్రభవనమునందు సుఖమునందెను.

**శ్లో॥ తమఙ్గ! మత్తం మధునోరుగన్ధినా వివృత్తతామ్రాక్షమశేషధిష్ణ్యపాః।**
**ఉపాసతోపాయనపాణిభిర్వినా త్రిభిస్తపోయోగబలౌజసాం పదమ్॥ 13**

**ప్రతిపదార్థము:-** అంగ=ఓ రాజా!, ఉరుగంధినా=తీవ్ర పరిమళముగలదై, మధునా=మద్యముచేత, మత్తమ్=మత్తుగొన్నవాడు కనుక, వివృత్త తామ్రాక్షమ్=తిరుగుతున్న కెంపు కన్నులు గలవాడునగు, తపోయోగబలౌజసామ్=తపము, యోగము, బలము, శక్తి అనువానికి, పదమ్=స్థానమైన, తమ్=ఆ హిరణ్యకశిపుని, త్రిభిః వినా=బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్గురు తప్ప, అశేషధిష్ణ్యపాః =ఎల్లలోకపాలురు, ఉపాయనపాణిభిః=కానుకలుగొన్న హస్తములతో, ఉపాసత=సేవించిరి.

**తాత్పర్యము:-** ఓ రాజా! మద్యగంధము తీవ్రముగా వెలారించుచు కెంపు కన్నులు గిరగిర తిరుగుచుండ తపమునకు, యోగమునకు, బలమునకు, శక్తికి స్థానమైన ఆ హిరణ్యకశిపుని త్రిమూర్తులు తప్ప తక్కిన ఇంద్రాదులగు లోకపాలురెల్లరు హస్తములందు కానుకలు గొనుచు సేవించిరి.

**శ్లో॥ జగుర్మహేన్ద్రాసనమోజసా స్థితం-విశ్వావసుస్తుమ్బురురస్మదాదయః।**
**గన్ధర్వసిద్ధా ఋషయోఽస్తువన్ ముహుర్విద్యాధరాశ్చాప్సరసశ్చ పాణ్డవ॥ 14**

**ప్రతిపదార్థము:-** పాండవ=ఓ ధర్మరాజా!, మహేంద్రాసనమ్=ఇంద్రసింహాసనమును, ఓజసా= పరాక్రమముచే, స్థితమ్=అధిష్ఠించియున్న ఆ హిరణ్యకశిపుని, విశ్వావసుః=విశ్వావసువను గంధర్వుడు, తుంబురుః=తుంబురుడు, అస్మత్+ఆదయః=మేము మొదలైనవారు, జగుః= గానముచేసితిమి, గంధర్వసిద్ధా ఋషయస్తువన్=గంధర్వులు, ఋషులు, సిద్ధులు, ముహుః =మరి మరి, అస్తువన్=స్తుతించిరి.

**తాత్పర్యము:-** తన శక్తి మహత్వమున ఇంద్రసింహాసనమున వెలుగొందు నా యసురేంద్రుని విశ్వావసువు, తుంబురుడు, నేను మొదలయినవారము గానము చేసితిమి. గంధర్వులు, సిద్ధులు, ఋషులు, విద్యాధరులు, అప్సరలు మరి మరి శ్లాఘించిరి.



## శ్రీః

# అథ చతుర్థోఽధ్యాయః

ఈ చతుర్థాధ్యాయంలో హిరణ్యకశిపుడు వరాలను పొంది అన్నిలోకాలను, లోకపాలు రను జయించి విష్ణుద్వేషంతో వారందర్నీ బాధించటాన్ని వర్ణించాడు.

**నారద ఉవాచ**

**శ్లో॥ ఏవం వృతశ్శతధృతిర్హిరణ్యకశిపోరథ।**
**ప్రాదాత్తత్తపసా ప్రీతో వరాంస్తస్య సుదుర్లభాన్॥ 1**

**ప్రతిపదార్థము:-** ఏవం వృతః=ఇట్లు వరాలను కోరబడినవాడైన, శతధృతిః=బ్రహ్మ, అథ=తర్వాత,తస్య హిరణ్యకశిపోః=ఆ హిరణ్యకశిపునకు, తత్+తపసా ప్రీతః=వాని తపస్సునకు సంతోషించినవాడై, సుదుర్లభాన్=బాగా దుర్లభాలైన, వరాన్=వరాలను, ప్రాదాత్=ఇచ్చెను.

**తాత్పర్యము:-** ఈ విధంగా తనను వరాలను కోరిన ఆ హిరణ్యకశిపునకు, బ్రహ్మ సంతోషించి, హిరణ్యకశిపుని తపస్సుకు మెచ్చుకొని దుర్లభాలైన వరాలను ఇచ్చాడు.

**బ్రహ్మోవాచ**

**శ్లో॥ తాతేమే దుర్లభాః పుంసాం యాన్ వృణీషే వరాన్మమ।**
**తథాపి వితరామ్యఙ్గ వరాన్ యదపి దుర్లభాన్॥ 2**

**ప్రతిపదార్థము:-** తాత=ఓ వత్సా!, మమ=నావల్ల, యాన్ వరాన్=ఏ వరాలను, వృణీషే=కోరుకొని పొందావో, ఇమే=ఈ వరాలు, పుంసామ్=పురుషులు, దుర్లభాః=పొందదానికి శక్యం కాదు. తథాపి=అట్లయినా, అంగ=ఓ హిరణ్యకశిపుదా!, యత్=ఏ కారణం చేత, అపి దుర్లభాన్= పొందదానికి మిక్కిలి సాధ్యంకానివైనాగాని, వరాన్=వరాలను, (తుభ్యమ్=నీకోసం), వితరామి= ఇస్తున్నాను.

**తాత్పర్యము:-** ఓ వత్సా! నువ్వు కోరిన వరాలు సామాన్యంగా పురుషులు పొందదానికి సాధ్యం కాదు. అయినా అటువంటి దుర్లభాలైన వరాలను నీకు ఇస్తున్నాను.

**శుక ఉవాచ**

**శ్లో॥ తతో జగామ భగవానమోఘానుగ్రహో విభుః।**
**పూజితోఽసురవర్యేణ స్తూయమానః ప్రజేశ్వరైః॥ 3**

**ప్రతిపదార్థము:-** తతః=అంతట, భగవాన్=భగవంతుడు, అమోఘ+అనుగ్రహః=గొప్పదైన అనుగ్రహం గల, విభుః=ప్రభువైన బ్రహ్మ, అసురవర్యేణపూజితః=అసురేంద్రుని చేత పూజింప బడ్డవాడై, ప్రజేశ్వరైః=లోకపాలురచేత, స్తూయమానః=స్తుతింపబడుచు, జగామ=తన లోకానికి చేరుకున్నాడు.

**తాత్పర్యము:-** అనంతరం గొప్ప అనుగ్రహం గలవాడైన భగవంతుడైన బ్రహ్మ అసురేంద్రుని చేత పూజితుడై లోకపాలురు స్తుతిస్తూండగా తనలోకానికి చేరుకున్నాడు.

**శ్లో॥ ఏవం లబ్ధవరో దైత్యో బిభ్రద్ధేమమయం వపుః**
**భగవత్యకరోద్ద్వేషం భ్రాతుర్వధమనుస్మరన్॥ 4**

**ప్రతిపదార్థము:-** ఏవమ్=ఈ ప్రకారం, దైత్యః=దైత్యుడయిన హిరణ్యకశిపుడు, లబ్ధవరః=బ్రహ్మ వలన వరాలను పొందినవాడై, హేమమయమ్=బంగారు ఛాయగల, వపుః=శరీరాన్ని, బిభ్రమ్=ధరించినవాడై, భ్రాతుః=తన సోదరుని యొక్క, వధమ్=వధను, అనుస్మరన్=స్మరిస్తూ, భగవతి =భగవంతునియందు, ద్వేషమ్=పగను, అకరోత్=పూనాడు.

**తాత్పర్యము:-** ఆ ప్రకారం దైత్యరాజు హిరణ్యకశిపుడు నలువ నుండి వరాలను పొంది, సువర్ణమయమైన శరీరఛాయ కలవాడై తన సోదరుని చంపిన ఆ భగవంతుని మీద పగను పూనాడు.

**శ్లో॥ స విజిత్య దిశస్సర్వా లోకాంశ్చ త్రీన్ మహాసురః**
**దేవాసురమనుష్యేన్ద్రాన్ గన్ధర్వగరుడోరగాన్। 5**

**శ్లో॥ సిద్ధచారణసాధ్యాదీనృషీన్ పితృపతీన్ మునీన్।**
**యక్షరక్షఃపిశాచేశాన్ ప్రేతాన్ భూతపతీనపి॥ 6**

**ప్రతిపదార్థము:-** సః=ఆ, మహాసురః=దొడ్డ అసురుడు, సర్వాదిశః=ఎల్ల దిశలను, త్రీన్‌లోకాన్ చ=మూడులోకాలను కూడా, విజిత్య=జయించి.

**తాత్పర్యము:-**ఆ దొడ్డ యసురుడు ఎల్లదిక్కులను మూడులోకాలను, దేవతలను, నరేంద్రులను, గంధర్వులను, గరుడులను, ఉరగులను, సిద్ధచారణ సాధ్యులను, ఋషులను, పితృదేవతలను, మునులను, యక్షులను, రాక్షసులను, పిశాచ ప్రభువులను, ప్రేతాలను, భూతపతులను కూడా జయించి.

**శ్లో॥ సర్వసత్త్వపతీఞ్జిత్వా వశమానీయ విశ్వజిత్।**
**జహార లోకపాలానాం స్థానాని సహ తేజసా॥ 7**

**ప్రతిపదార్థము:-** సర్వసత్త్వపతీన్=ఎల్ల ప్రాణులకు పతులైన వారలను, జిత్వా=జయించి, వశం+ఆనీయ=లోఁగొన్నవాడై, విశ్వజిత్=విశ్వజేతయై, తేజసా సహ=తేజముతో గూడ, లోక పాలానామ్=లోకపాలురయొక్క, స్థానాని=స్థానములను, జహార=హరించెను.

**తాత్పర్యము:-** ఎల్ల ప్రాణి సమూహములకు పతులైన వారినెల్ల జయించి లోఁగొని, విశ్వజేతయై ఇంద్రాదిలోక పాలుర స్థానాలను, (వారున్న లోకములను) వారి తేజముతో కూడా నపహరించెను.

**శ్లో॥ దేవోద్యానశ్రియా జుష్టమధ్యాస్తే స్మ త్రివిష్టపమ్।**
**మహేన్ద్రభవనం సాక్షాన్నిర్మితం విశ్వకర్మణా।**
**త్రైలోక్యలక్ష్మ్యాయతనమధ్యువాసాఖిలర్ధిమత్॥ 8**

**ప్రతిపదార్థము:-** దేవ+ఉద్యానశ్రియా=దేవతల నందనవనలక్ష్మిచేత, జుష్టమ్=కూడియున్నది,





సాక్షాత్=సాక్షాత్తు, విశ్వకర్మణా=విశ్వకర్మచేత, నిర్మితమ్=నిర్మితమైనది, త్రైలోక్యలక్ష్మ్యాయతనమ్ =త్రైలోక్యలక్ష్మీనివాసమును,అఖిలర్ధిమత్=సర్వసమృద్ధితోసంపన్నమైన, త్రివిష్టపమ్=స్వర్గమున, మహేన్ద్ర భవనమ్=ఇంద్రభవనమును, అధ్యాస్తే స్మ=ఆక్రమించెను, అధ్యువాస=నివాసము పెట్టెను.

**తాత్పర్యము:-** దేవతలనందనవన లక్ష్మిచేత కూడియున్నది. సాక్షాత్తు విశ్వకర్మచే నిర్మితమైనది. త్రైలోక్యలక్ష్మీనివాసమును, స్వర్గమున సర్వసమృద్ధి సంపన్నమైన ఇంద్రభవనమును ఆక్రమించెను, అందు నివాసమును పెట్టెను.

**శ్లో॥ యత్ర విద్రుమసోపానా మహామరకతా భువః**
**యత్ర స్ఫాటికకుడ్యాని వైదూర్యస్తమ్భపఙ్క్తయః॥ 9**

**ప్రతిపదార్థము:-** యత్ర=ఏ ఇంద్రభవనమునందు, విద్రుమసోపానాః=పగడాలమెట్లు, మహా మరకతాః=దొడ్డ గరుడపచ్చల కట్టడాలుగల,భువః=ప్రదేశాలు,యత్ర=ఎచ్చోట, స్ఫాటికకుడ్యాని =స్ఫటికమణుల గోడలను, వైదూర్యస్తంభపంక్తయః=వైఢూర్యమణులస్తంభముల వరుసలు చెలువొందునో...

**తాత్పర్యము:-** ఏ ఇంద్రభవనమునందు పగడముల మెట్లును, దొడ్డ గరుడ పచ్చలు దాపిన నేలలను స్ఫటికముల గోడలు, వైఢూర్యముల స్తంభముల చెలువొందునో...

**శ్లో॥ యత్ర చిత్రవితానాని పద్మరాగాసనాని చ।**
**పయః ఫేననిభాశ్శయ్యా ముక్తాదామపరిచ్ఛదాః॥ 10**

**ప్రతిపదార్థము:-** యత్ర=ఏ ఇంద్రభవనము, చిత్రవితానాని=రంగురంగులు గల, పద్మరాగ+ ఆసనాని చ=కెంపుల పీఠములును, పయః ఫేననిభాః=పాలనురుగువంటి తెల్లనైన, శయ్యాః= సెజ్జెలును, ముక్తాదామపరిచ్ఛదాః=ముత్యాలదండలు వ్రేలాడుటలుగలవై వెలయుచున్నవో,

**తాత్పర్యము:-** ఏ ఇంద్రభవనమునందు పలువిధములగు మేలుకట్టుతో కెంపుల పీఠములును, ముత్యాల పీఠములు వ్రేలాడుచున్నవైన, పాలవలెను, నురుగువలెను తెల్లనైన పానుపులను చెలువొందుచున్నవో....

**శ్లో॥ కూజద్భిర్నూపురైర్దేవ్యశ్శబ్దయన్త్య ఇతస్తతః**
**రత్నస్థలీషు పశ్యన్తి సుదతీస్సున్దరం ముఖమ్॥ 11**

**ప్రతిపదార్థము:-** కూజద్భిః=మ్రోగుచున్న, నూపురైః=అందెలచే, దేవ్యః=దేవేరులు, ఇతస్తతః =ఇటునటు, శబ్దయంత్యః=సందడిచేయుచున్నవారై, సుదతీః=దేవాంగనులు, రత్నస్థలీషు= రత్నస్థలములయందు, సుందరం ముఖమ్=తమ అందమైన ముఖమును, పశ్యంతి=చూచు చుందురు.

**తాత్పర్యము:-** ఎచట అందెలు మ్రోగుచుండ నటు నిటు సందడి చేయుచు సంచరించుచున్న దేవేరులుగలరో, ఎచట దేవతాస్త్రీలు రత్నస్థలాలలో తమ సుందర ముఖములను చూచుకొను చుందురో ....

**ప్రతిపదార్థము:–** తేషామ్=ఆ సురలకు, అరూపా మేఘనిస్స్వనా=వక్రరహితమై మేఘధ్వనిచే కకుభః=దిక్కులను, సన్నాదయంతీ=ప్రతిధ్వనింపజేయుచు, సాధూనామ్=సత్పురుషులకు, అభయంకరీ=అభయదానమిచ్చునదైన, వాణి=భగవంతుని వాణీ, ఆవిరభూత్= ప్రాదుర్భవించి వినవచ్చెను.

**తాత్పర్యము:–** ఇట్లు ప్రార్థించు సురలకు వక్తలేనిదై మేఘధ్వనివలె గంభీరమై దిక్కులు ప్రతిధ్వనించునట్లు చేయుచు, సాధుల కభయమిచ్చునదైన భగవద్వాణి వినవచ్చెను.

**శ్లో॥ మా భైష్ట విబుధశ్రేష్ఠాస్సర్వేషాం భద్రమస్తు వః।**
**మద్దర్శనం హి భూతానాం సర్వశ్రేయోపపత్తయే॥ 26**

**ప్రతిపదార్థము:–** విబుధశ్రేష్ఠాః=ఓ దేవతాశ్రేష్ఠులారా!, మా భైష్ట=భయపడకుడు. సర్వేషాం వః =మన కెల్లరకు, భద్రం అస్తు=శుభమగును, మత్+దర్శనమ్=నా దర్శనము, నా వాక్య శ్రవణము, భూతానామ్=ఎల్లభూతములకు, సర్వశ్రేయాన్ ఉపపత్తయే హి=ఎల్ల శ్రేయముల ప్రాప్తికి కారణ మగును.

**తాత్పర్యము:–** ఓ సురోత్తములారా! మీరు భయపడకుడు. మన కెల్ల క్షేమము కలుగును. నా దర్శనము వల్ల, నా మాట వినుటవల్ల ఎల్ల భూతములకు సర్వశ్రేయములు పొందుటకు హేతువగును.

**శ్లో॥ జ్ఞాతమేతస్య దౌరాత్మ్యం దైతేయాపసదస్య యత్।**
**తస్య శాన్తిం కరిష్యామి కాలం తావత్ప్రతీక్షత॥ 27**

**ప్రతిపదార్థము:–** దైతేయాపసదస్య=దైత్యాధముడైన, తస్య=ఆ హిరణ్యకశిపుని యొక్క, దౌరాత్మ్యమ్ =దురుద్దేశము, యత్=ఏది కలదో అది, మే జ్ఞాతమ్=నాకు తెలిసినది, తస్య=వానికి, శాంతిమ్ కరిష్యామి=గర్వము అణచి వేసెదను, కాలం తావత్=కొంత కాలము మాత్రము, ప్రతీక్షత=వేచి యుండుడు.

**తాత్పర్యము:–** దైత్యాధముడైన ఆ హిరణ్యకశిపుడు దుర్మతియై గావించు చేష్టలనన్నియు నాకు తెలియును. వాని గర్వము అణచి వేసెదను. వాని దుష్టచేష్టలను పొడవడంతును. కొంతకాలము మాత్రము మీరు వేచియుండుడు.

**శ్లో॥ యదా దేవేషు వేదేషు గోషు విప్రేషు సాధుషు।**
**ధర్మే మయి చ విద్వేషస్స వా ఆశు వినశ్యతి॥ 28**

**ప్రతిపదార్థము:–** యదా=ఏ ప్రకారము, వేదేషు=వేదములందు, దేవేషు=దేవతలందు, గోషు= గోవులయందు, విప్రేషు=విప్రులయందు, సాధుషు=సాధువులయందు, ధర్మే=ధర్మము నందు, మయి చ=నాయందు, విద్వేషః=పగసాధించువాడు, సః=ఆ యసురుడు, ఆశువా= శీఘ్రముగనే, వినశ్యతి=నశించును.

**తాత్పర్యము:–** వేదములను, దేవతలను, గోవులను, విప్రులను, సాధువులను, ధర్మమును, నన్ను ద్వేషించు ఆ యసురుడు త్వరలోనే నశించును.



**శ్లో॥ స ఏవ వర్ణాశ్రమిభిః క్రతుభిర్భూరిదక్షిణైః।**
**ఇజ్యమానో హవిర్భాగానగ్రహీత్ స్వేన తేజసా॥ 15**

**ప్రతిపదార్థము:–** సః ఏవ=ఆ హిరణ్యకశిపుడే, వర్ణ+ఆశ్రమిభిః=బ్రాహ్మణాది వర్ణము, గృహస్థాది ఆశ్రమము గల ద్విజులచే చేయు, భూరిదక్షిణైః=ఎక్కువ దక్షిణలుగల, క్రతుభిః=యాగములచే, ఇజ్యమానః=యాజింపబడుచున్నవాడై, స్వేనతేజసా=తన తేజమున, హవిర్భాగాన్=హవిర్భాగము లను, అగ్రహీత్=గ్రహించెను.

**తాత్పర్యము:–** గృహస్థులగు బ్రాహ్మణులెల్లరు ఆ హిరణ్యకశిపుని గూర్చి వివిధ భూరి దక్షిణలుగల యజ్ఞములు యజించుచుండ, ఆ యసురేంద్రుడు తన తేజోబలమున హవిర్భాగములనెల్ల గ్రహించుచుండెను.

**శ్లో॥ అకృష్టపచ్యా తస్యాసీత్ సప్తద్వీపవతీ మహీ।**
**తథా కామదుఘా ద్యౌశ్చ నానాశ్చర్యపదం నభః॥ 16**

**ప్రతిపదార్థము:–** సప్తద్వీపవతీ=ఏడు దీవులు గలదైన, మహీ=భూమి, తస్య=ఆ అసురేంద్రునికి, అకృష్టపచ్యా=దున్నకయే ఫలించునది, ఆసీత్=అయె, తథా=ఈ ప్రకారము, ద్యౌః=స్వర్గము, కామదుఘాః=కోరికలు పిదుకునో, నభః=ఆకసము, నానాశ్చర్యపదమ్=ఎల్ల ఆశ్చర్యములకు నెలవైనది.

**తాత్పర్యము:–** ఆ యసురేంద్రునికి స్వర్గమిట్లు కోర్కెలు పిదుకుచుండెనో ఆకసమిట్లు ఎల్ల ఆశ్చర్యములకు పట్టైవెలిగెనో అట్లే ఏడుదీవులు గల భూమియు దున్నకయే ఫలించునదయ్యెను.

**శ్లో॥ రత్నాకరాశ్చ రత్నౌఘాంస్తత్పత్న్యశ్చోహురూర్మిభిః।**
**క్షారశీధుఘృతక్షౌద్రదధిక్షీరామృతోదకాః॥ 17**

**ప్రతిపదార్థము:–** రత్నాకరాః చ=రత్నములకు శ్రేష్ఠమణులకు స్థానమైన సముద్రము, తత్+ పత్న్యః=ఆ సముద్ర భార్యలు నదులును, ఊర్మిభిః=అలలచే, రత్న+ఓఘాన్=రత్నములు మొత్తములు, క్షారశీధుఘృతక్షౌద్రదధిక్షీరామృతోదకాః=ఉప్పు సంద్రము, ఇక్షురస, ఘృత, సుర, దధి, క్షీర, శుద్ధోదక సముద్రములు, ఊహుః=వహించుచున్నవి.

**తాత్పర్యము:–** ఉప్పునీటి సముద్రము, చెఱుకు పాలసముద్రము, సురా సముద్రము, నేయి సముద్రము, పెరుగు సముద్రము, పాలసముద్రము, మంచి నీటి సముద్రము అను ఏడు సముద్రములును, ఆ సముద్ర భార్యలు గంగలోనగు నదులును ఆ యసురేంద్రునికి తమ యలల ద్వారా రత్నములు వహించి సమర్పించుచుండెను.

**శ్లో॥ శైలా ద్రోణీభిరాక్రీడం సర్వర్తుషు గుణాన్ ద్రుమాః।**
**దధార లోకపాలానామేక ఏవ పృథగ్గుణాన్॥ 18**

**ప్రతిపదార్థము:–**శైలాద్రోణీభిః=కొండ చరియలచే తగు, ఆక్రీడమ్=ఆతని క్రీడా స్థానమును, సర్వర్తుషు=వసంతాదులగు నెల ఋతువులలో,స్వగుణాన్=తమ ధర్మములను పుష్పఫలాదికము గల, ద్రుమాః=వృక్షములు, దధార=వెలయించెను, ఏకఏవ=అతడొక్కడయ్యు, లోకపాలానామ్

=ఇంద్రాది లోకపాలురయొక్క, పృథక్+గుణాన్=భిన్నములగు వర్షదహనశోషణాది గుణములను, దధార=ధరించెను.

**తాత్పర్యము:-** కొండచరియ లందలి క్రీడాస్థానములను వసంతాది ఋతువులందు, వృక్షములన్నింటినీ పుష్పఫలాదికములు గలవానినిగా చేసెను. హిరణ్యకశిపుడు తానొక్కడయ్యు ఇంద్రాగ్ని వాయులలోనగు దిక్పాలుర ధర్మములయిన వర్షించుట, దహించుట, శోషింప జేయుటలోనగునవి కలవాడై యుండెను.

**శ్లో|| స ఇత్థం నిర్జితకకుబేకరాడ్విషయాన్ ప్రియాన్।**
**యథోపజోషం భుఞ్జానో నాతృప్యదజితేన్ద్రియః॥ 19**

**ప్రతిపదార్థము:-** సః=ఆ హిరణ్యకశిపుడు, ఇత్థమ్=ఈ ప్రకారము, నిర్జితకకుప్=జయించిన దిక్కులు గలవాడు, ఏకరాట్=ఏకచ్ఛత్రాధిపతియై, ప్రియాన్=ఇష్టములైన, విషయాన్=ఇంద్రియ సుఖములను, యథా ఉపజోషమ్=ప్రీతికి తగినట్లుగా, ఉపభుంజానః=అనుభవించుచున్నవాడు అయి,అజితేంద్రియః=ఇంద్రియములను జయించనివాడైననూ,న+అతృప్యత్=తృప్తిపొందలేదు.

**తాత్పర్యము:-** ఆ హిరణ్యకశిపుడిట్లు దిశలనెల్ల జయించి ఇష్టోపభోగములను అనుభవించుచు జితేంద్రియుడు కానివాడై తృప్తి గాంచని వాడయ్యెను.

**శ్లో|| ఏవమైశ్వర్యమత్తస్య దృప్తస్యోచ్ఛాస్త్రవర్తినః।**
**కాలో మహాన్ వ్యతీయాయ బ్రహ్మశాపముపేయుషః॥ 20**

**ప్రతిపదార్థము:-** ఏవమ్=ఇట్లు, ఐశ్వర్యమత్తస్య=సంపద లేక ప్రభుత్వ సంపదచేత మత్తుడై, దృప్తస్య=గర్వితుడై, ఉచ్ఛాస్త్రవర్తినః=ధర్మశాస్త్ర పథము నతిక్రమించి నడచుచున్న, బ్రహ్మశాపమ్ =బ్రాహ్మణశాపమును, ఉపేయుషః=పొందిన యా యసురేంద్రునకు, మహాన్‌కాలః=చాలా కాలము, వ్యతీయాయ=గడిపెను.

**తాత్పర్యము:-** ఇట్లు ప్రభుత్వ సంపదచే నొడలు తెలియనివాడై గర్వించి, వేదశాస్త్ర ధర్మముల నుల్లంఘించి ప్రవర్తించుచు, బ్రాహ్మణశాపమును పొందిన ఆ యసురేంద్రుడైన హిరణ్యకశిపుడు చాల కాలము జగము లేలెను.

**శ్లో|| తస్యోగ్రదణ్డసంవిగ్నాస్సర్వే లోకాస్సపాలకాః।**
**అన్యత్రాలబ్ధశరణాశ్శరణం యయురచ్యుతమ్॥ 21**

**ప్రతిపదార్థము:-** తస్య+ఉగ్రదండసంవిగ్నాః=తపోబలముచే తీవ్రమైన దండనముచే వ్యథపడిన వారై, సర్వేలోకాః=ఎల్లప్రజలు, సపాలకాః=ఇంద్రాదిదిక్పాలురను గూడినవారై, అన్యత్ర= ఇతరత్ర, అలబ్ధశరణాః=రక్షణము పొందనివారై, అచ్యుతమ్=విష్ణువుని, శరణం యయుః=శరణుపొందారు.

**తాత్పర్యము:-** హిరణ్యకశిపుడు తపోబలమున తమను తీవ్రముగా దండించుచుండ మనః క్షోభము పొంది దేవతలు లోనగు నెల్ల ప్రజలు ఇంద్రాది లోకపాలురను గూడి ఎచ్చోటను తమను రక్షించువారిని కానక శ్రీ మహావిష్ణువును శరణు పొందారు.





**శ్లో|| తస్యై నమోఽస్తు కాష్ఠాయై యత్రాత్మా హరిరీశ్వరః।**
**యద్గత్వా న నివర్తన్తే శాన్తాస్సన్న్యాసినోఽమలాః॥ 22**

**ప్రతిపదార్థము:-** యత్ర=ఎచ్చోటి యందు, ఆత్మా=పరమాత్మయు, ఈశ్వరః=పరమేశ్వరుడు, హరిః=విష్ణువున్నాడో, శాంతాః=రాగద్వేషాలు లేక నెమ్మదియై, అమలాః=నిష్పాపులునగు, సన్యాసినః=సర్వసంగపరిత్యాగులు, యద్=ఏది, గత్వా=పొంది, న నివర్తంతే=మరలిరారో, తస్యై కాష్ఠాయై=ఆ దిక్కునకు, నమః=నమస్కారము.

**తాత్పర్యము:-** ఎచ్చోట హరి పరమేశ్వరుడు భాసిల్లుచుండునో, రాగద్వేషరహితులు నిష్పాపులు సర్వసంగపరిత్యాగులు దేనిని పొంది మరలిరారో, ఆ హరియున్న దిక్కునకు నమస్కారములు.

**శ్లో|| ఇతి తే సంయతాత్మానస్సమాశ్శాన్తధియోఽమలాః।**
**ఉపతస్థుర్హృషీకేశం వినిద్రా వాయుభోజనాః॥ 23**

**ప్రతిపదార్థము:-** ఇతి=ఇట్లు, తే=ఆ దేవతలు, సంయత+ఆత్మానః=కట్టుబాటు నొందిన శరీరములు గలవారై, సమాః=సమచిత్తులై, శాంతధియః=రాగద్వేషాదులు లేని బుద్ధిగలవారై, అమలాః=నిర్మలాంతఃకరణులై, వినిద్రాః=నిద్రలేనివారై (అజ్ఞానములేక), వాయుభోజనాః= గాలి మాత్రము ఆహారముగా గలవారై, హృషీకేశమ్=సర్వేంద్రియములకు ప్రభువైన హరిని, ఉపతస్థుః =సేవించిరి.

**తాత్పర్యము:-** ఇట్లు అసురులు వారి (తమ తమ) శరీరములను నియమబద్ధములు చేసి మనస్సునేకాగ్రము చేసికొని రాగద్వేషాలు లేని చిత్తము గలవారై, పాపరహితులై, నిద్రలేక, ఆహారము లేక గాలి మాత్రము భోజనముగా (ఉచ్ఛ్వాస నిశ్వాసములు మాత్రము జరుపుచు) సర్వేంద్రియాధ్యక్షుడగు హరిని సేవించిరి.

***శ్లో|| ఓన్నమో భగవతే వాసుదేవాయ మహాత్మనే।***
***విశుద్ధానుభవానన్దసన్దోహాయ యతోఽభయః॥ 24***

**ప్రతిపదార్థము:-**భగవతే=షడ్గుణైశ్వర్యసంపన్నుడును, వాసుదేవాయ=సర్వాంతర్యామియయ్యు, మహాత్మనే=దొడ్డకనికరము గలవాడను, విశుద్ధానుభవానందసందోహాయ=అవిద్యా దోషము లేని పరిశుద్ధమైన జ్ఞానానుభవముచే ఆనందసుఖములయొక్క సమూహము కలవాని కొఱకు, అభయః=అభయదానము లభింపజేసేవాడైన ఆ హరికి, ఓం నమః=ప్రణవపూర్వకముగా నమస్కారములు.

**తాత్పర్యము:-**జ్ఞానైశ్వర్యాది షడ్గుణసంపూర్ణుడును, ఎల్లప్రాణుల హృదయమందు అంతర్యామియై కరుణకలవాడైన ఆ వాసుదేవుడు దొడ్డ మనస్సుతో కనికరము కలవాడు, స్వచ్ఛమైన జ్ఞాన ప్రకాశమున సుఖానందములు పరంపరముగా గలవాడు, ఆశ్రితుల కెల్ల నభయదానమొసంగు శ్రీహరికి ప్రణవపూర్వకముగా నమస్కరించుచున్నాను.

**శ్లో|| తేషామావిరభూద్వాణీ అరూపా మేఘనిస్స్వనా।**
**సన్నాదయన్తీ కకుభః సాధూనామభయఙ్కరీ॥ 25**

విష్ణువనుగ్రహముచే పట్టువడిన చిత్తము గలవాడై జడునకువలె జగమిట్టిదని తెలియనేరక ఉండును.

**శ్లో॥ ఆసీనః పర్యటన్నశ్నన్ శయానః ప్రపిబన్ బ్రువన్।**
**నానుసన్ధత్త ఏతాని గోవిన్దపరిరమ్భితః॥ 39**

**ప్రతిపదార్థము:–** ఆసీనః=కూర్చొనుచు, పర్యటన్=తిరుగుతూ, అశ్నన్=భుజించుచు, శయానః =పరుండుచు, ప్రపిబన్=త్రాగుచు, బ్రువన్=మాట్లాడుతూ, గోవింద పరిరంభితః=గోవిందునితో తన్మయత్వమును పొందినవాడై, ఏతాని=ఈ విధంగా, న+అనుసంధత్త=వానిని గావించినట్లు మనసున తలంచడు.

**తాత్పర్యము:–** ప్రహ్లాదుడు గోవిందుని యందు తాదాత్మ్యమును పొందినవాడై ఆసీనుడు, సంచరించువాడు, భుజించువాడు, పరుండువాడు, నీరుత్రాగువాడు, వచించువాడునయ్యు వానిని చేసినట్లు మనస్సున తలంపడు.

**శ్లో॥ క్వచిద్రుదతి వైకుణ్ఠచిన్తాశబలచేతసః।**
**క్వచిద్ధసతి తచ్చిన్తాహ్లాద ఉద్గాయతి క్వచిత్॥ 40**

**ప్రతిపదార్థము:–** వైకుంఠచింతాశబలచేతసః=వైకుంఠుని చింతతో కూడిన చిత్తము గలవాడై, క్వచిత్=ఒకప్పుడు, రుదతి=ఏడ్చును, తత్+చింతాహ్లాద=ఆ హరిచింతనచే హాయిని గాంచిన వాడై, క్వచిత్=ఒకప్పుడు, హసతి=నవ్వును, క్వచిత్=ఒకప్పుడు, ఉద్గాయతి=బిగ్గఱగా పాడును.

**తాత్పర్యము:–** వైకుంఠుని చింతతో ఏకాగ్రమైన చిత్తముగలవాడై, ప్రహ్లాదుడు ఒకప్పుడు రోదనము చేయును, హరిచింతనముచే మనస్సు సంతోషముతో నిండినవాడై ఒకప్పుడు నవ్వును. ఒకప్పుడు బిగ్గఱగా పాడును.

**శ్లో॥ క్వచిత్తద్భావనాయుక్తస్తన్మయోఽనుచకార హ।**
**నదతి క్వచిదుత్కణ్ఠో విలజ్జో నృత్యతి క్వచిత్॥ 41**

**ప్రతిపదార్థము:–** క్వచిత్=ఒకప్పుడు, తత్+భావనాయుక్తః=ఆ విష్ణువు యొక్క భావములతో కూడినవాడై, తన్మయః=ఆ విష్ణువే తానై, అనుచకార హ=ఆ విష్ణు చేష్టలు గావించుచు, క్వచిత్=ఒకప్పుడు, ఉత్కంఠః=ముక్తకంఠంతో బిగ్గరగా, నదతి=అఱచును, క్వచిత్=ఒకప్పుడు, విలజ్జః=సిగ్గువీడినవాడై, నృత్యతి=నాట్యము చేయును.

**తాత్పర్యము:–** ఒకప్పుడు, ఆ విష్ణు భావనములతో కూడి ఆ విష్ణువేతానై ఆ విష్ణుచేష్టలు చేయుచు, ఒకప్పుడు కంఠమెత్తి బిగ్గఱగా నామ సంకీర్తనము చేయును. ఒకప్పుడు సిగ్గువీడి నృత్యము చేయును.

**శ్లో॥ క్వచిదుత్పులకస్తూష్ణీమాస్తే సంస్పర్శనిర్వృతః।**
**అస్పన్దప్రణయానన్దసలిలామీలితేక్షణః॥ 42**

**ప్రతిపదార్థము:–** క్వచిత్=ఒకప్పుడు, ఉత్పులకః=మేను గగుర్పాటు పొందినవాడు, సంస్పర్శ





**శ్లో॥ నిర్వైరాయ ప్రశాన్తాయ స్వసుతాయ మహాత్మనే।**
**ప్రహ్లాదాయ యదా ద్రుహ్యేద్ధనిష్యేఽపి వరోర్జితమ్॥ 29**

**ప్రతిపదార్థము:–** నిర్వైరాయ=ద్వేషభావములేనివాడు, ప్రశాంతాయ=రాగద్వేషములేనివాడు, మహాత్మనే=మహనీయుడు, స్వసుతాయ=తన పుత్రుడైన, ప్రహ్లాదాయ=ప్రహ్లాదుని కొరకు, యదా=ఎప్పుడు, ద్రుహ్యేత్=ద్రోహ మాచరించునో, వరోర్జితమ్ అపి=బ్రహ్మవరములను గల వానినైనను, హనిష్యే =వధించెదను.

**తాత్పర్యము:–** పగ సాధించు మనస్సులేక శాంతుడై, నా భక్తుడై, తన పుత్రుడైన ప్రహ్లాదుని ఎప్పుడు హింసింప మొదలిడునో అప్పుడే హిరణ్యకశిపుని, బ్రహ్మవరమున బలిసిన వానినైనను వధించెదను.

**నారద ఉవాచ**

**శ్లో॥ ఇత్యుక్తా లోకగురుణా తం ప్రణమ్య దివౌకసః।**
**న్యవర్తన్త గతోద్వేగా మేనిరే చాసురం హతమ్॥ 30**

**ప్రతిపదార్థము:–** లోకగురుణా=లోకములకు తండ్రియైన హరిచే, ఇతి+ఉక్తాః=ఇట్లు చెప్పబడిన వారై, దివౌకసః=దేవతలు, తమ్=ఆ విష్ణువును గూర్చి, ప్రణమ్య=నమస్కరించి, గత+ఉద్వేగాః =మనః క్షోభము తొలగినవారై, న్యవర్తంత=మరలిపోయిరి, అసురమ్=హిరణ్యకశిపుడు, హతమ్=చచ్చిన వానిగానే, మేనిరే=తలంచిరి.

**తాత్పర్యము:–** లోకపితయైన శ్రీహరి ఇట్లు వచించగా విన్న దేవతలు ఆ విష్ణువుకు ప్రణమిల్లి మనఃక్షోభముల శాంతింపజేసుకొన్నవారై ఇక ఆ యసురేంద్రుడు చచ్చినట్లే అని తలంచిరి.

**శ్లో॥ తస్య దైత్యపతేః పుత్రాశ్చత్వారః పరమాద్భుతాః।**
**ప్రహ్లాదోఽభూన్మహాంస్తేషాం గుణైర్మహదుపాసకః॥ 31**

**ప్రతిపదార్థము:–** తస్య దైత్యపతేః=ఆ దైత్యప్రభువునకు, పుత్రాః=పుత్రులు, చత్వారః=నలుగురు, పరమాద్భుతాః=మిగుల నచ్చెరువు గొల్పు నడవడి గలవారు గలిగిరి. తేషామ్=వారిలో, ప్రహ్లాదః =ప్రహ్లాదుడు, గుణైః=గుణములచే,మహాన్=దొడ్డవాడు,మహత్+ఉపాసకః=పెద్దల సేవించువాడు, అభూత్=అయ్యెను.

**తాత్పర్యము:–** ఆ దైత్యప్రభువునకు నలుగురు పుత్రులు మిగులనచ్చెరువు గొల్పు నడవడి గలవారు గలిగిరి. వారి యందు ప్రహ్లాదుడు దొడ్డ గుణములు గలవాడును పెద్దల సేవించువాడు అయ్యెను.

**శ్లో॥ బ్రహ్మణ్యశ్శీలసమ్పన్నస్సత్యసన్ధో జితేన్ద్రియః।**
**ఆత్మవత్సర్వభూతానామేకః ప్రియసుహృత్తమః॥ 32**

**ప్రతిపదార్థము:–** బ్రహ్మణ్యః=బ్రాహ్మణ భక్తుడు, శీలసంపన్నః=శీలసంపన్నుడు, సత్యసంధః =నిక్కమగు ప్రతినగలవాడు, జితేంద్రియః=ఇంద్రియములను జయించినవాడు, సర్వ భూతానామ్

=ఎల్లప్రాణులకు, ఆత్మవత్=పరమాత్మవలె, ఏకః=ఒక్కడై, ప్రియసుహృత్తమః=ఇష్టుడు, మేలుచేయువాడు అయ్యెను.

**తాత్పర్యము:–** (ఆ ప్రహ్లాదుడు) బ్రాహ్మణులందు భక్తుడు, శీలసంపన్నుడు సత్య ప్రతిన కలవాడు అయి, ఇంద్రియములను జయించినవాడు, పరమాత్మవలె నొక్కడై సర్వభూతములకు ఇష్టుడు, మేలుచేయువాడు అయ్యెను.

**శ్లో॥ దాసవత్సన్నతార్యాంఘ్రిః పితృవద్దీనవత్సలః।**
**భ్రాతృవత్సదృశస్నిగ్ధో గురుష్వీశ్వరభావనః।**
**విద్యార్థజనరూపాద్యైర్మానస్తమ్భవివర్జితః॥ 33**

**ప్రతిపదార్థము:–** దాసవత్=దాసునివలె, సన్నతార్యాంఘ్రిః=నమస్కరించిన పెద్దల పాదములు గలవారు, పితృవత్=తండ్రివలె, దీనవత్సలః=దీనులందు దయాళుడును, భ్రాతృవత్=తోబుట్టు మీద, సదృశస్నిగ్ధః=సమానులందు స్నేహితుడు, గురుషు=గురువులందు, ఈశ్వరభావనః= పరమేశ్వరభావనము గలవాడు, విద్యార్థజనరూపాత్=విద్య, ధనము, వంశము, సౌందర్యము లోనగు వానిచే, మానస్తంభవివర్జితః=అభిమానము, ఉన్మత్తత లేనివాడై యుండెను.

**తాత్పర్యము:–** ఆ ప్రహ్లాదుడు పెద్దల పాదములకు దాసుడువలె నమస్కరించుచు, దీనులను తండ్రివలె ప్రేమించుచు, స్నేహితులందు సోదరుడువలె సముడైయుండును. గురువులను పరమేశ్వరుల గావించుచు, విద్య, ధనము, వంశము, రూపములోనగు వానిచే గర్వింపక మత్తుడుగాక యుండెను.

**శ్లో॥ నోద్విగ్నచిత్తో వ్యసనేషు నిఃస్పృహః-శ్రుతేషు దృష్టేషు గుణేష్వవస్తుదృక్।**
**దాన్తేన్ద్రియప్రాణశరీరధీస్సదా-ప్రశాన్తకామో రహితాసురోఽ సురః॥ 34**

**ప్రతిపదార్థము:–** వ్యసనేషు=సప్తవ్యసనములందు, ఉద్విగ్నచిత్తః=కలతచెందు మనస్సు గలవాడు, శ్రుతేషు=వేదముల వలన వినవచ్చు స్వర్గాదులందు, గుణేషు=ఇంద్రియ గోచరము లగు విషయేంద్రియ సుఖములందు, అవస్తుదృక్=సత్యదృష్టిలేనివాడును, నిఃస్పృహః=కోరిక, దాంతేంద్రియప్రాణశరీరధీః=నియమించబడిన ఇంద్రియములు, ప్రాణము, శరీరము, చిత్తము కలవాడు, సదా=ఎల్లప్పుడు, ప్రశాంతకామః=కామమడంచినవాడు, రహితాసురః=అసురభావము లేనివాడు, అసురః=అసురుడు ప్రహ్లాదుడు ప్రవర్తించెను.

**తాత్పర్యము:–** జూదము, పానము మొదలైన సప్తవ్యసనములందు మనస్సు లగ్నము కానీక శ్రుతివచించు స్వర్గాదిభోగములందు ఇంద్రియ గోచరములైన రాజ్యసుఖములందును, సత్యములు గావనెడు దృష్టిచే వాంఛలేనివాడు, ఇంద్రియ ప్రాణ మనస్సులను, శరీరములను నియమమున పెట్టినవాడు, కామాభిలాషను అడంచినవాడు, అసురభావరహితుడై అసురుడైన ప్రహ్లాదుడు ప్రవర్తించెను.

**శ్లో॥ యస్మిన్ మహద్గుణా రాజన్ దృశ్యన్తే కవిభిర్ముహుః।**
**న తేఽ ధునాపధీయన్తే యథా భగవతీశ్వరే॥ 35**



**ప్రతిపదార్థము:–** రాజన్=ఓ రాజా!, యస్మిన్=ఏ ప్రహ్లాదునందు, మహద్గుణాః=దొడ్డ గుణములు, కవిభిః=జ్ఞానులచేత, ముహుః=పలుమారు, గృహ్యంతే=కనుగొనబడినవై, తే=ఆ గుణములు, భగవతి=భగవంతుడైన, యథా ఈశ్వరే=పరమేశ్వరునియందు, అధునా= ఇప్పటికినీ, న అపధీయంతే=తిరోహితములు గావు.

**తాత్పర్యము:–** ప్రహ్లాదునందు దొడ్డగుణములు గలవని విజ్ఞానులు కనుగొన్నారు. ఆ గుణము లెప్పుడును భగవంతుడు, పరమేశ్వరునందులేక వీనియందు మాయమైపోక వెలుంగుచునే యున్నవి.

**శ్లో॥ యం సాధుగాథాస్సదసి రిపవోఽ పి సురా నృప।**
**ప్రతిమానం ప్రకుర్వన్తి కిముతాన్యే భవాదృశాః॥ 36**

**ప్రతిపదార్థము:–** నృప=ఓ రాజా!, సురాః=దేవతలు, రిపవః=శత్రువులైనను, సదసి=సభల యందు, సాధుగాథాః=సాధు కథలు (ప్రసంగమునందు), యమ్=ఏ ప్రహ్లాదుని, ప్రతిమానమ్= దృష్టాంతముగా, ప్రకుర్వంతి=కావించుదురో, అన్యే=ఇతరులు, భవాదృశాః=నీవంటివారలు, కిముతాన్యే=సరిపోలరని వేరుగ చెప్పవలెనా! తప్పక దృష్టాంతమును గైకొందురు.

**తాత్పర్యము:–** దేవసభయందు, సాధుగాథలను గురించి ప్రస్తావన వచ్చినప్పుడు శత్రువులైనను దేవతలు ప్రహ్లాదుని సాధుచరితుని దృష్టాంతముగా గైకొందురు. మరి ఇతరులు మీవంటి వారు ఉదాహరింతురు వేఱే చెప్పనేల?

**శ్లో॥ గుణైరలమసఙ్ఖ్యేయైర్మాహాత్మ్యం తస్య సూచ్యతే।**
**వాసుదేవే భగవతి యస్య నైసర్గికీ రతిః॥ 37**

**ప్రతిపదార్థము:–** యస్య=ఎవనికి, భగవతి వాసుదేవే=భగవంతుడైన వాసుదేవునియందు, నైసర్గికీ=స్వభావసిద్ధమైన రతి లేక ఆసక్తి గలదో, అసంఖ్యేయైః=లెక్కింపశక్యముగాని, గుణైః =గుణములచేనై, తస్య=ఆ ప్రహ్లాదుని యొక్క, మాహాత్మ్యమ్=ప్రభావమును, సూచ్యతే= సూచింప బడుచున్నది.

**తాత్పర్యము:–** ఎవనికి వాసుదేవునియందు సహజమైన భక్తి లేక ఆసక్తి గలదో గణింపశక్యముగాని గుణములుచేనైన ఆ ప్రహ్లాదుని మాహాత్మ్యమును నేను నీకు కొంతసూచించుచున్నాను లేక చెప్పుచున్నాను.

**శ్లో॥ న్యస్త క్రీడనకో బాలో జడవత్తన్మనస్తయా।**
**కృష్ణగ్రహగృహీతాత్మా న వేద జగదీదృశమ్॥ 38**

**ప్రతిపదార్థము:–** న్యస్త క్రీడనకః=ఆటలయందు పాల్గొనువాడైన, బాలః=బాలుడయ్యు, తత్+ మనస్తయా=ఆ విష్ణునందు మనస్సుగలవాడగుచో, కృష్ణగ్రహగృహీతాత్మా=ఆ విష్ణువుయొక్క అనుగ్రహముచే గ్రహింపబడిన చిత్తము గలవాడై, జడవత్=జడుని వలె, ఈదృశమ్ జగత్=జగము ఇట్టిదని, న వేద=ఎఱుంగడు.

**తాత్పర్యము:–** ఆటలాడ నీడువచ్చిన బాలుడయ్యు, ప్రహ్లాదుడు విష్ణువునందు మనసు గలవాడై,

పరా=ఇతరుడను, అసత్+గ్రహ+ఆశ్రయమ్=అసత్యమైనదని గ్రహించుటకు ఆశ్రయమైన ఆ శాస్త్రమును, న మేనే=తలచలేదు.

**తాత్పర్యము:-** ప్రహ్లాదుడు గురువు చెప్పిన పాఠమును వినును. అట్లే పఠించును. గాని ఈ దండనీతిశాస్త్రము స్వపర భేదమును తెల్పునది. తాను వేఱు ఇతరుడు వేఱు లేక వీడు మిత్రుడు, వీడు శత్రువు అని అసత్యమును గ్రహింపనాశ్రయమైనది. గనుక ఇది మంచి శాస్త్రముగాదని తలంచెను.

**శ్లో॥ ఏకదాసురరాట్ పుత్రమఙ్కమారోప్య పాణ్డవ।**
**పప్రచ్ఛ కథ్యతాం వత్స మన్యతే సాధు యద్భవాన్॥ 4**

**ప్రతిపదార్థము:-** పాండవ!=ఓ ధర్మరాజా!, ఏకదా=ఒకప్పుడు, అసురరాట్=అసురేంద్రుడు, పుత్రమ్=పుత్రుని ప్రహ్లాదుని, అంకం ఆరోప్య=ఒడిని కూర్చుండ బెట్టుకొని, వత్స!=ఓ ప్రియ కుమార! భవాన్=నీవు, యత్=దేనిని, సాధు=మంచిదని, మన్యతే=తలంతువో, కథ్యతామ్=దానిని చెప్పుదువుగాక! అని, ప్రపచ్ఛ=ప్రశ్నించెను.

**తాత్పర్యము:-** ఒకనాడసురేంద్రుడు పుత్రుని బ్రహ్లాదుని ఒడియందు గూర్చుండబెట్టుకొని నాయనా నీకు ఏది మంచిదని తలంతువో అద్దానిని చెప్పుము అని ప్రశ్నించెను.

**ప్రహ్లాద ఉవాచ**

**శ్లో॥ తత్సాధు మన్యేఽ సురవర్య దేహినాం-సదా సముద్విగ్నధియామసద్గ్రహాత్।**
**హిత్వాత్మపాతం గృహమన్ధకూపం-వనం గతో యద్ధరిమాశ్రయేత॥ 5**

**ప్రతిపదార్థము:-** అసురవర్య!=ఓ అసురశ్రేష్ఠుడా!, అసత్+గ్రహాత్=నేను నాది అను అహంకార మమకార రూపమైన మిథ్యాభినివేశము వలన, సదా=ఎల్లప్పుడు, సముద్విగ్నధియామ్=క్షోభను పొందిన మనస్సుగల, దేహినామ్=ప్రాణులకు, ఆత్మపాతమ్=తాను, అధఃపతనమగుటకు కారణమను, అంధకూపమ్=చీకటి నూతివంటిదైన మోహమును ఆశ్రయించి, గృహమ్=గృహమును, హిత్వా=వదిలి, వనం గతః=అడవికి వెళ్ళి, హరిమ్=హరినిగురించి, ఆశ్రయేత=ఆశ్రయించుట, యత్=ఏది కలదో, తత్=అది, సాధుమన్యే=మంచిదని తలంచెను.

**తాత్పర్యము:-** నేను నీవు, నేను నాది అని అహంకారమమకారములచే నిలుకడ లేక కలత నొందుచున్న దేహధారులు తమ అధః పతనమునకు తామే కారణము, చీకటి నూతి వంటిదైన మోహమును కలిగించు ఇల్లు వీడి కానకు వెళ్ళి శ్రీహరిని ఆశ్రయించుటయే లెస్సయని తలంచెను.

**నారద ఉవాచ**

**శ్లో॥ శ్రుత్వా పుత్రగిరో దైత్యః పరపక్షసమాహితాః।**
**జహాస బుద్ధిర్బాలానాం భిద్యతే పరబుద్ధిభిః॥ 6**

**ప్రతిపదార్థము:-** దైత్యః=దైత్యుడు, పరపక్షసమాహితాః=తనకు శత్రువైన విష్ణుపక్షమునందు, పరినిష్ఠితుడైన, పుత్రగిరః=పుత్రుని మాటలు, శ్రుత్వా=విని, బాలానామ్=బాలురయొక్క, బుద్ధిః





నిర్వృతః=విష్ణువును స్పృశించు భావనచేనైన ఆనందముగలవాడై, అస్పంద=చలించని, ప్రణయ=ప్రేమచేనైన, ఆనందసలిల=ఆనందముచే జనించిన బాష్పములచే, ఆమీలిత= ఇంచుక తెఱువబడిన, ఈక్షణః=కన్నులుగలవాడై, తూష్ణీం ఆస్తే=మిన్నక కూర్చుండియుండును.

**తాత్పర్యము:-** ఒకప్పుడు ప్రహ్లాదుడు విష్ణువును స్పృశించినట్లు భావనచేనైన సుఖముగలవాడై మేను గగుర్పొడువ స్థిరమైన ప్రేమచేనైన ఆనందబాష్పములచే ఇంచుక తెఱచిన కన్నులు గలవాడై మిన్నకుండును.

**శ్లో॥ స ఉత్తమశ్లోకపదారవిన్దయోర్నిషేవయాకిఞ్చనసఙ్గలబ్ధయా।**
**తన్వన్ పరాం నిర్వృతిమాత్మనో ముహుర్దుస్సఙ్గదీనస్యమనశ్శమం వ్యధాత్॥ 43**

**ప్రతిపదార్థము:-** సః=ఆ ప్రహ్లాదుడు, ఆకించన సంగలబ్ధయా=సర్వసంగపరిత్యాగులైన వారి స్నేహముచేత లభించిన, ఉత్తమశ్లోకపదారవిందయోః=పుణ్యశ్లోకుడైన, హరిపాదకమలముల యొక్క, నిషేవయా=సేవచేత, ముహుః=పలుమారు, ఆత్మనః=తనకు, పరాం నిర్వృతిమ్=పరమానందమును, తన్వన్=విస్తరింపజేయు,దుస్సంగదీనస్య=దుష్టసాంగత్యమున విషయా సక్తిచే, దీనస్య=దీనుడైన తన యొక్కయు, మనఃశమమ్=మనశ్శాంతిని, వ్యధాత్=కావించెను.

**తాత్పర్యము:-** ఆ ప్రహ్లాదుడు సర్వసంగ పరిత్యాగులైన వారి స్నేహముచే లభించినదైన ఆ శ్రీ హరిపాదారవిందములయొక్క సేవచే తాను పరమానందమును విస్తరించుచు దుష్టసాంగత్యమున లేక విషయాసక్తిచే దీనుడైన తనకును అన్యునికి మనశ్శాంతి గావించెను.

**శ్లో॥ తస్మిన్ మహాభాగవతే మహాభాగే మహాత్మని।**
**హిరణ్యకశిపూ రాజన్నకరోదఘమాత్మజే॥ 44**

**ప్రతిపదార్థము:-** రాజన్=ఓ రాజా!, మహాభాగవతే=దొడ్డభగవద్భక్తుడు, మహాభాగే=పరమ పూజ్యుడు, మహాత్మని=మహాత్ముడైన, ఆత్మజే తస్మిన్=ఆత్మజుడైన ఆ ప్రహ్లాదునందు, హిరణ్యకశిపుః =హిరణ్యకశిపుడు, అఘమ్=ద్రోహమును, అకరోత్=చేసెను.

**తాత్పర్యము:-** ఓ రాజా! దొడ్డ విష్ణుభక్తుడై, పరమ పూజ్యుడు మహాత్ముడు తన పుత్రుడైన, ఆ ప్రహ్లాదునికి హిరణ్యకశిపుడు ద్రోహమాచరించెను.

**యుధిష్ఠిర ఉవాచ**

**శ్లో॥ దేవర్ష ఏతదిచ్ఛామో వేదితుం తవ సువ్రత।**
**యదాత్మజాయ శుద్ధాయ పితాధాత్సాధవే హ్యఘమ్॥ 45**

**ప్రతిపదార్థము:-** దేవర్షే!=ఓ దేవమునీ! నారదా!, సువ్రత=చక్కని వ్రతములు కలవాడా!, పితా= తండ్రి హిరణ్యకశిపుడు, యత్=ఏకారణమువలన, శుద్ధాయ=నిరపరాధియు, సాధవే=సాధు చరిత్రుడు అగు, ఆత్మజాయ=పుత్రుని కొరకు, అఘమ్=ద్రోహమును, అదాత్=కావించెను, ఏతత్=దానిని తవ=నీ వలన, వేదితుమ్=ఎఱుంగ, ఇచ్ఛామి=కోరుచున్నాను.

**తాత్పర్యము:-** ఓ దేవర్షీ! సువ్రతా!, నిరపరాధియు, సాధుచరిత్రగలవాడు, అయిన ఆ ప్రహ్లాదుని

కొఱకు తండ్రియైన హిరణ్యకశిపుడు ఏల ద్రోహం ఆచరింపబూనాడు? ఆ విషయము నీ వలన నెఱుంగగోరెదను.

**శ్లో॥ పుత్రాన్ విప్రతికులాంశ్చ పితరః పుత్రవత్సలాః।**
**ఉపాలభన్తే శిక్షార్థం నైవాఘమపరో యథా॥ 46**

**ప్రతిపదార్థము:-** పుత్రవత్సలాః=పుత్రులందు వాత్సల్యముగల, పితరః=తండ్రులు, విప్రతి కూలాన్=ప్రతికూలురైన, పుత్రాన్=పుత్రులను, శిక్షార్థమ్=మంచి మార్గమున శిక్షించుటకు, ఉపాలభంతే=ఆక్షేపింతురు, అపరః యథా=శత్రువులువలె, అఘమ్=ద్రోహమును, న ఏవ= చేయరు గదా!

**తాత్పర్యము:-** పుత్రులందు వాత్సల్యముగల తండ్రులు పుత్రులు ప్రతికూలురుగా ప్రవర్తించు వారగుదురేని వారలను మంచి మార్గమున త్రిప్పుటకు సద్బోధగావించి మీరు చేయు పని సరిగాదని ఆక్షేపించి వాగ్రూపములో దండింతురుగానీ ద్రోహము హింసచేయరు గదా!

**శ్లో॥ కిముతానువశాన్ సాధూంస్తాదృశాన్ గురుదేవతాన్।**
**ఏతత్ కౌతూహలం బ్రహ్మన్నస్మాకం విధమ ప్రభో।**
**పితుః పుత్రాయ యద్ద్వేషో మరణాయ ప్రయోజితః॥ 47**

**ప్రతిపదార్థము:-** బ్రహ్మన్=ఓ విప్రోత్తమా!, ప్రభో!=ఓ ప్రభూ!, అనువశాన్=అనుకూలురును, సాధూన్=సాధువులు రాగాది దోషములు లేనివారు, గురుదేవతాన్=తండ్రియే దైవముగా గలవారు నగు, తాదృశాన్=తమ పుత్రులను గూర్చి, కిముత=(తండ్రులు ద్రోహమాచరింపరని) మఱి ఏమి చెప్పదగును, పితుః=తండ్రియొక్క, యత్ ద్వేషః=ఏ ద్వేషము, పుత్రాయ=పుత్రుని కొఱకు, మరణాయ=మరణము కొరకు, ప్రయోజితః=ప్రవర్తించునది ఏది, అస్మాకమ్=మా యొక్క ఏతత్=ఈ, కౌతూహలమ్=వినగోరు వేడుకను, విధమ=తొలగించు, ఎందువలన పుత్రుని మీద ఏ ద్వేషముగలదో అది పితృమరణము కొఱకు ప్రయుక్తమైనది. కావున ఈ కౌతూహలమును తొలగించుము.

**తాత్పర్యము:-** అనుకూలురై రాగాదులు లేనివారై తండ్రియే దైవముగా నెంచునట్టి పుత్రులను గురించి తండ్రులు ద్రోహము ఆచరింపరని వేఱే చెప్పవలయునా! ఓ విప్రోత్తమా! ప్రభూ! తండ్రి ద్వేషమేది గలదో అది పుత్రుని మరణమునకు ప్రయుక్తమైనది. మరి యా ద్వేషమే పితృమరణమునకు కారణమైనది. ఇది వింతగా నున్నది. దానిని వినగోరు మాకు ఈ విషయము చెప్పి మా కౌతూహలమును తొలగింపుము.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే ప్రహ్లాదచరిత్రే హిరణ్యకశిపు దిగ్విజయ ప్రహ్లాద సాధుభావ వర్ణనం చతుర్థోఽధ్యాయః(4)**





## శ్రీః

## అథ పఞ్చమోఽధ్యాయః

ఈ పంచమాధ్యాయంలో గురువువలన అధ్యయనం చేసిన విద్యను త్యజించి విష్ణుమూర్తి స్తుతియందు ఆసక్తుడైన సుతుని దైత్యుడు విషసర్పాలచే హింసింపగోరియు అందుకు సమర్థుడు కాలేదని వర్ణింపబడును. భగవద్భక్తియే విద్వేషమునకు కారణమని చెప్పుచున్నాడు.

**నారద ఉవాచ**

**శ్లో॥ పౌరోహిత్యాయ భగవాన్ వృతః కావ్యః కిలాసురైః।**
**చణ్డామర్కౌ సుతౌ తస్య దైత్యరాజగృహాన్తికే॥ 1**

**ప్రతిపదార్థము:-** భగవాన్=భగవంతుడు, కావ్యః=శుక్రుడు, పౌరోహిత్యాయ=పౌరోహిత్య వృత్తి నవలంబించియుండుట కొఱకు, అసురైః=అసురులచే, వృతః కిల=వర్ణించిరి గదా! తస్య=ఆ శుక్రుని యొక్క సుతౌ=పుత్రులు, చండ+అమర్కౌ=చండుడు, అమర్కులు అనువారు, దైత్యరాజ గృహాంతికే=దైత్య ప్రభువగు హిరణ్యకశిపుని గృహము సమీపము నందుండిరి.

**తాత్పర్యము:-** పూర్వము అసురులు శుక్రభగవానుని తమకు పురోహితునిగా వరించి గ్రహించిరి. ఆయన కుమారులు చండుడు, అమర్కులు అనువారు ఇరువురు హిరణ్యకశిపునాశ్రయించి ఆయన గృహసమీపమున నుండిరి.

**శ్లో॥ తౌ రాజ్ఞా ప్రాపితం బాలం ప్రహ్లాదం నయకోవిదమ్।**
**పాఠయామాసతుః పాఠ్యానన్యాంశ్చాసురబాలకాన్॥ 2**

**ప్రతిపదార్థము:-** తౌ=వారిద్దరు, రాజ్ఞా=రాజయిన హిరణ్యకశిపునిచే, ప్రాపితమ్=పంపబడిన, బాలం ప్రహ్లాదమ్=బాలుడైన ప్రహ్లాదుని, నయకోవిదమ్=నీతిశాస్త్ర పండితునిగా, పాఠ్యాన్= దండనీతి మొదలగు శాస్త్రములను, అన్యాన్=తోడి, అసురబాలకాన్=అసురబాలకుల తోడ, పాఠయామాసతుః=పఠింపజేసిరి.

**తాత్పర్యము:-** ఆ చండుడు, అమర్కులు ప్రభువు అయిన హిరణ్యకశిపునిచే తమ కడకు పంప బడిన బాలుడగు ప్రహ్లాదుని గ్రహించి ఇతరులగు అసుర బాలకులతో చేర్చి నీతిశాస్త్ర పండితు డగునట్లుగా దండనీతి మొదలగు శాస్త్రములనుఁజదివించిరి.

**శ్లో॥ యత్తత్ర గురుణా ప్రోక్తం శుశ్రువేఽనుపపాఠ చ।**
**న సాధు మనసా మేనే స్వపరాసద్గ్రహాశ్రయమ్॥ 3**

**ప్రతిపదార్థము:-** తత్ర=ఆ పాఠశాలలో, గురుణా=గురునిచేత, యత్=ఏది, ప్రోక్తమ్=చెప్ప బడెనో, శుశ్రువే=దానిని విని (ప్రహ్లాదుడు), అనుపపాఠ=అద్దానిననుసరించియట్లే పఠించెను, అసాధు=దండనీతి పాఠము మంచిదని, మనసా న మేనే=మనసుచేత తలంచలేదు, స్వ=తాను,

విద్యను చెప్పక ఇతరమేమో జెప్పి మాకు అపకీర్తి కలిగించుచు కులమునకు నాశనముతెచ్చు చెడుబుద్ధిగల ఈ ప్రహ్లాదునకు నాలుగవ ఉపాయమైన దండమే తగినది.

**శ్లో॥ దైతేయచన్దనవనే జాతోఽయం కణ్టకద్రుమః।**
**యన్మూలోన్మూలపరశోర్విష్ణోర్నాలాయితోఽర్భకః॥ 17**

**ప్రతిపదార్థము:-** అయమ్=ఈ ప్రహ్లాదుడు, దైతేయచందనవనే=దైత్యులను గంధపు చెట్ల తోపునందు, కంటకద్రుమః=ముళ్ళచెట్టువలె, జాతః=జనించినాడు, యన్మూలోన్మూలపరశోః=ఏ దైత్యచందన వనముయొక్క మూలమును మొదలంట పెగ్గలించివేయు గొడ్డలియైన, విష్ణోః=విష్ణువునకు, అర్భకః=ఈ బాలుడు, నాలాయితః=కట్టె అగుచున్నాడు.

**తాత్పర్యము:-** ఈ ప్రహ్లాదుడు దైత్యులను గంధపు చెట్లతోపునందు ముళ్ళచెట్టయి జనించి యున్నాడు. ఆ తోపును సమూలముగా నిర్మూలించుటకు గొడ్డలియైన విష్ణువునకు ఈ బాలుడు కట్టెయగుచున్నాడు. గొడ్డలి కట్టె లేకున్న వృక్షములు ఖండింపలేరు. కావున విష్ణువు వీని మూలమున దైత్యులను నాశముచేయును అని భావము.

**శ్లో॥ ఇతి తం వివిధోపాయైర్భీషయంస్తర్జనాదిభిః।**
**ప్రహ్లాదం గ్రాహయామాస త్రివర్గస్యోపపాదనమ్॥ 18**

**ప్రతిపదార్థము:-** ఇతి=ఇట్లని, తమ్=ప్రహ్లాదుని, తర్జన+ఆదిభిః=బెదిరింపులతో, వివిధోపాయైః=సామాదులగు చతుర్విధోపాయములచే, భీషయమ్=భయపెడుతూ, ప్రహ్లాదమ్=ప్రహ్లాదుని, త్రివర్గస్య=ధర్మార్థ కామములను ప్రతిపాదించుచు, ఉపాదనమ్=ప్రతిపాదకమైన శాస్త్రమును, గ్రాహయామాస=చదివించిరి.

**తాత్పర్యము:-** ఇట్లు చండమార్కులు గురుపుత్రులు సామదానభేదదండోపాయములను చతుర్విధోపాయములచే బెదిరించి భయపెట్టుచు, ధర్మార్థ కామములను త్రివర్గములను ప్రతిపాదించు శాస్త్రమును ప్రహ్లాదుని చదివించిరి.

**శ్లో॥ తత ఏవం గురుర్జ్ఞాత్వా జ్ఞాతోపాయచతుష్టయమ్।**
**దైత్యేన్ద్రం దర్శయామాస మాతృమృష్టమలఙ్కృతమ్॥ 19**

**ప్రతిపదార్థము:-** తతః=తర్వాత, గురుః=గురుపుత్రుడు, ఏవమ్=ఇవ్విధమున, జ్ఞాతజ్ఞేయ చతుష్టయమ్=తెలియబడిన సామాదులగు చతుర్విధోపాయాలను అన్నింటిలోనగు వానినిగా, జ్ఞాత్వా=తెలుసుకొని, దైత్య+ఇంద్రమ్=దైత్య ప్రభువగు హిరణ్యకశిపుని వద్దకు, మాతృమృష్టమ్=తల్లిచే స్నానము జేయించబడి, అలంకృతమ్=అలంకరించబడిన ప్రహ్లాదుని, దర్శయామాస=కొనిపోయి చూపించెను.

**తాత్పర్యము:-** తర్వాత గురువు సామదానభేదదండోపాయములన్నింటినీ ప్రహ్లాదుడు తెలిసిన వాడయ్యెనని యెఱింగి తల్లి స్నానాదులు చేయించి అలంకరించిన ప్రహ్లాదుని తీసుకొనిపోయి దైత్యప్రభువగు హిరణ్యకశిపునికి జూపించెను.

**శ్లో॥ ప్రణమన్తం పదోర్బాలం ప్రతినన్ద్యాశిషాసురః।**
**పరిష్వజ్య చిరం దోర్భ్యాం పరమాం ప్రాప నిర్వృతిమ్॥ 20**





=బుద్ధి, పరబుద్ధిభిః=ఇతరుల బోధనలచే, భిద్యతే=భేదమును పొందుచుండును, (కదా! అని), జహాస=నవ్వెను.

**తాత్పర్యము:-** దైత్య ప్రభుడు హిరణ్యకశిపుడు పుత్రుడగు ప్రహ్లాదుడు వచించిన వాక్యములు తనకు శత్రువైన విష్ణువును గ్గడించునవియున్న వాటిని విని బాలుర బుద్ధి ఇతరులు బోధించు దానిని బట్టి భేదించుచుండును కదా! అని నవ్వెను.

**శ్లో॥ సమ్యగ్విధార్యతాం బాలో గురుగేహే ద్విజాతిభిః।**
**విష్ణుపక్షైః ప్రతిచ్ఛన్నైర్న భిద్యేతాస్య ధీర్యథా॥ 7**

**ప్రతిపదార్థము:-** ప్రతిచ్ఛన్నైః=మారువేషములేసికొని తెలియరాకున్న, విష్ణుపక్షైః=విష్ణువంక వారగు భాగవతులు భగవద్భక్తులచే, అస్య=ఈ ప్రహ్లాదునికి, ధీః=బుద్ధి, యథా=ఏ ప్రకారము, న భిద్యేత=భేదభావముపొందదో, బాలః=బాలుడు ప్రహ్లాదుడు, గురుగేహే=గురుగృహము నందు, ద్విజాతిభిః=ద్విజులగు చండామర్కులచే, సమ్యక్=చక్కగా, విధార్యతామ్=విచారించి బోధింప బడును గాక!

**తాత్పర్యము:-** గురుగృహమునందెవరో విష్ణుభక్తులు మాఱు వేషములు వేసుకొని వచ్చి వీనికి విష్ణుబోధలు చేసి వీని బుద్ధిని మార్చుచున్నారు. కావున గురువులు జాగ్రత్త వహించి అట్టి బుద్ధి కలుగజేయక సరియైన మార్గమున విద్యను బోధింపుడనెను.

**శ్లో॥ గృహమానీతమాహూయ ప్రహ్లాదం దైత్యయాజకాః।**
**ప్రశస్య శ్లక్ష్ణయా వాచా తమపృచ్ఛన్ హి సామభిః॥ 8**

**ప్రతిపదార్థము:-** దైత్యయాజకాః=దైత్యపురోహితులు, గృహం ఆనీతమ్=ఇంటికి తీసుకు వచ్చిన, ప్రహ్లాదమ్=ప్రహ్లాదుని, ఆహూయ=పిలిచి, శ్లక్ష్ణయా=మృదువైన, వాచా=వాక్కుచే, ప్రశస్య=ప్రశంసించి, సామభిః=శాంతివచనములచే, తమ్=ఆ ప్రహ్లాదుని, అపృచ్ఛన్ హి=ఇట్లు ప్రశ్నించిరి.

**తాత్పర్యము:-** దైత్యపురోహితులైన చండామర్కులు ప్రహ్లాదుని ఇంటికిగొని వచ్చి, మృదు వచనమున వానిని ప్రశంసించుచు మృదువైన మాటలచే వానినిట్లు ప్రశ్నించిరి.

**శ్లో॥ వత్స! ప్రహ్లాద! భద్రం తే సత్యం కథయ మా మృషా।**
**బాలానతి కుతస్తుభ్యమేష బుద్ధివిపర్యయః॥ 9**

**ప్రతిపదార్థము:-** వత్స! ప్రహ్లాద!=నాయనా ప్రహ్లాదా!, తే=నీకు, భద్రమ్=శుభమగును, సత్యమ్=సత్యమును, కథయ=చెప్పుము, మామృషా=అబద్ధము చెప్పకుము, బాలాన్=ఈ బాలురందరి కంటెను, అతి=అతిక్రమించి, తుభ్యమ్=మీకు, ఏషః బుద్ధివిపర్యయః=ఈ బుద్ధివైపరీత్యము, కుతః=ఎట్లు వచ్చినది.

**తాత్పర్యము:-** నాయనా! ప్రహ్లాదా! నీకు శుభమగు గాక! నీవు నిజము చెప్పుము. అబద్ధము చెప్పకుము. ఈ బాలురందరి కంటెను నీకు విష్ణుపక్షమైన బుద్ధి వైపరీత్యము ఎక్కడ నుంచి వచ్చినది? మేము చెప్పము కదా!

**శ్లో॥ బుద్ధిభేదః పరకృత ఉతాహో తే స్వతోఽ భవత్।**
**భణ్యతాం శ్రోతుకామానాం గురూణాం కులనన్దన॥ 10**

**ప్రతిపదార్థము:–** కులనందన=వంశమును సంతోషపెట్టువాడా!, తే=నీకు, బుద్ధిభేదః=బుద్ధి వైపరీత్యము, పరకృతః=ఇతరుల బోధనచే నేర్పడినది, అహో=అహో! స్వతః=స్వయముగానే, అభవత్=కలిగినదా, శ్రోతుకామానామ్=వినగోరుచున్నాము, గురూణామ్=గురువులమైన మాకు, భణ్యతామ్=చెప్పుము.

**తాత్పర్యము:–** నీ కీ బుద్ధిభేదము, విష్ణుపక్షమును వాక్రుచ్చుతలంపు నీకెవరైన నితరులు బోధించువారి వలన ఏర్పడినదా! లేక నీకు సహజముగనే కలిగినదా! వినగోరు గురువులము మాకు చెప్పుము.

**ప్రహ్లాద ఉవాచ**

**శ్లో॥ పరస్స్వేత్యసద్గ్రాహః పుంసాం యన్మాయయాకృతః।**
**విమోహితధియాం దృష్టస్తస్మై భగవతే నమః॥ 11**

**ప్రతిపదార్థము:–** పరః=ఇతరుడు, స్వాత్మా ఇతి చ=తాను అను, అసద్గ్రాహః=మిథ్యాభినివేశము, అసత్యమైన తలంపు, యత్+మాయయా=ఏ విష్ణుమాయచే, విమోహితధియామ్= మోహమును పొందిన బుద్ధిగల, పుంసాం=పురుషులకు, కృతః=చేయబడినది, దృష్టః=చూడ బడినది అయిన, తస్మై=ఆ, భగవతే=విష్ణుభగవానునకు, నమః=నమస్కారము.

**తాత్పర్యము:–** పరుడు తాను అను మిథ్యాభినివేశము ఏ విష్ణుమాయచే మోహమును పొందిన చిత్తము గల పురుషులు కలుగుచున్నారో ఆ విష్ణుభగవానునకు నమస్కారము.

**శ్లో॥ స యదానువ్రతః పుంసాం పశుబుద్ధిర్విభిద్యతే।**
**అన్య ఏష తదాన్యోఽహమితి భేదగతాసతీ॥ 12**

**ప్రతిపదార్థము:–** సః=ఆ భగవంతుడు, యదా=ఎప్పుడు, అనువ్రతః=అనుకూలుడగుచున్నాడో, తదా=అప్పుడు, పుంసామ్=పురుషులకు, పశుబుద్ధిః=పశువులకువలెనున్న బుద్ధి, విభిద్యతే=భేదింప బడుచున్నది, ఏషః=ఇతడు, అన్యః=ఇతరుడు, అహమ్=నేను, అన్యః=ఇతరుడను, భేదగతాసతీ= భేదమునునొందియుండుచున్నదై, విభిద్యతే=భేదమును పొందుచున్నది.

**తాత్పర్యము:–** ఆ భగవంతుడెప్పుడు అనుకూలుడగునో అప్పుడు పురుషులకు వీడన్యుడు, నేనన్యుడను అను భేదబుద్ధి వైతొలగుచున్నది.

**శ్లో॥ స ఏష ఆత్మా స్వపరేత్యబుద్ధిభిః-దురన్వయానుక్రమణో నిరూప్యతే।**
**ముహ్యన్తి యద్వర్త్మని వేదవాదినో-బ్రహ్మాదయో హ్యేష భినత్తి మే మతిమ్॥ 13**

**ప్రతిపదార్థము:–** దురన్వయానుక్రమణః=ఇట్టివాడని వర్ణించి చెప్పుటకు దుర్ఘటమైన, సః=ఆ, ఏషః ఆత్మా=ఈ పరమాత్మను, స్వపర ఇతి=తాను ఇతరుడు అని, అబుద్ధిభిః=అవివేకముచే, నిరూప్యతే= నిరూపించబడుచు, యత్+వర్త్మని=ఏ పరమాత్మ పథమునందు, వేదవాదినః= వేదార్థవాదులగు, బ్రహ్మాదయః=బ్రహ్మాలోనగు దేవతలు సైతం, ముహ్యంతి= మోహమును పొందుదురు, ఏషః=ఈ పరమాత్మయే, మే మతిమ్=నా బుద్ధిని, భినత్తి=భేదింప జేయుచున్నాడు.

**తాత్పర్యము:–** ఏ పరమాత్మ ఇట్టివాడని వర్ణించి చెప్పుటకు దుర్ఘటమైన ఆ పరమాత్మను తాననియు ఇతరుడనియు అవివేకులు తలంచుదురు. ఏ పరమాత్మ తత్త్వమెఱుంగుటయందు బ్రహ్మాదిదేవతలు సైతం మోహమును పొందుచుందురో ఆ పరమాత్మయే నాకు ఈ భేదబుద్ధిని భేదించుచున్నాడు.

**శ్లో॥ యథా భ్రామ్యత్యయో బ్రహ్మన్ స్వయమాకర్షసన్నిధౌ।**
**తథా మే భిద్యతే చేతశ్చక్రపాణేర్యదృచ్ఛయా॥ 14**

**ప్రతిపదార్థము:–** బ్రహ్మన్=విప్రోత్తమా!, అయః=ఉక్కు, యథా=ఏ ప్రకారము, ఆకర్షసన్నిధౌ= అయస్కాంత సమీపము నందు, స్వయం భ్రామ్యతి=స్వయముగానే ఆకర్షింపబడుచున్నదో, తథా=ఆ ప్రకారమే, మే చేతః=నా చిత్తము, యదృచ్ఛయా=తనకు తానే, చక్రపాణేః=మహావిష్ణు సన్నిధియందు, భిద్యతే=భేదమును పొందుచున్నది, ఏ తపోదానఫలమో ఇది తెలియదు.

**తాత్పర్యము:–** ఇనుము, సూదంటురాయి సమీపమునందుండి తనకు తానే యెట్లు ఆకర్షింపబడు చున్నదో అట్లే నా బుద్ధి స్వయముగానే ఇతరుల నాదేశములేకయే చక్రపాణి సన్నిధిని ఆకర్షింపబడుచున్నది. ఇది ఏ తపోదానాధికములకు ఫలమో తెలియదు.

**నారద ఉవాచ**

**శ్లో॥ ఏతావద్బ్రాహ్మణాయోక్త్వా విరరామ మహామతిః।**
**తం సునిర్భర్త్స్య కుపితః స దీనో రాజసేవకః॥ 15**

**ప్రతిపదార్థము:–**మహామతిః=దొడ్డబుద్ధిగలప్రహ్లాదుడు, ఏతావత్=ఇంతమాత్రము, బ్రాహ్మణాయః =గురువులగు చండమార్కులకు, ఉక్త్వా=చెప్పి, విరరామ=మిన్నకుండెను, రాజసేవకః=రాజ సేవకుడు అయిన, సః=ఆ గురుపుత్రుడు, దీనః=దీనుడై, కుపితః=కోపించినవాడై, తమ్=ఆ ప్రహ్లాదుని, సునిర్భర్త్స్య=మిక్కిలి బెదిరించుచు ఇట్లనెను.

**తాత్పర్యము:–** గొప్పబుద్ధిగలవాడైన ప్రహ్లాదుడు గురుపుత్రునికింత మాత్రము వచించి సంభాషణ చాలించెను. రాజసేవకుడైన ఆ గురుపుత్రుడు ప్రహ్లాదుడట్లు వచించినందులకు దిగులొందుచు, కోపగించుచు ఆ ప్రహ్లాదుని బెదిరించుచు నిట్లు చెప్పెను.

**శ్లో॥ ఆనీయతామరే వేత్రమస్మాకమయశస్కరః।**
**కులాఙ్గారస్య దుర్బుద్ధేశ్చతుర్థోఽస్యోదితో దమః॥ 16**

**ప్రతిపదార్థము:–** అరే=ఓరీ సేవక!, వేత్రమ్=బెత్తము, ఆనీయతామ్=తీసుకురమ్ము, అస్మాకమ్= మాకు, అయశస్కరః=అపకీర్తి తెచ్చాడు, వీడు, కులాంగారస్య=దైవకులమునాశము చేయు, దుర్బుద్ధేః=ఈ చెడుబుద్ధి, అస్య=వీనికి, చతుర్థః=నాలుగవదైన, దమః=దండోపాయము తప్పదు.

**తాత్పర్యము:–** ఓరీ సేవకా! బెత్తము తీసుకొని రమ్ము. ఈ ప్రహ్లాదుడు మేము చెప్పిన రాజనీతి

**ప్రతిపదార్థము:–** కృష్ణే=విష్ణువునందు, మతిః=బుద్ధి, పరతః=ఇతరులవలనను, స్వతః వా= స్వయముగ గాని, మిథః=పరస్పరముగ గాని, గృహవ్రతానామ్=గృహమందే చింతగలవారును, అదాంతగోభిః=విరామములేని ఇంద్రియములచే, తమిస్రమ్=సంసారమును, విశతామ్= ప్రవేశించువారును, పునః పునః=మాటిమాటికి, చర్వితచర్వణానామ్=చేసిన పనులే చేసి పొందిన సుఖమునే పొందుచున్నవారలకు, న అభిపద్యేత=పొందుటకు గాదు.

**తాత్పర్యము:–** గృహ చింతనగలిగి ఇంద్రియసుఖములయెడ దృష్టిలేనివారై పలుమాఱు చేసిన పనులే చేయుచు పొందిన సుఖములనే పొందువారికి విష్ణునందు భక్తి పరులవలన గాని స్వయముగా గానీ పరస్పరముగా గాని లభింపగానేరదు.

**శ్లో॥ న తే విదుస్స్వార్థగతిం హి విష్ణుం దురాశయా యే బహిరర్థమానినః।**
**అన్ధా యథాన్ధైరుపనీయమానా వాగీశతన్త్యామురుదామ్ని బద్ధాః॥ 31**

**ప్రతిపదార్థము:–** యే హి=ఎవ్వడు, దురాశయాః=విషయవాసనలను బొందిన అంతఃకరణము గలవారు, తే హి=వారే, స్వార్థగతిమ్=తమయందె పురుషార్థం గమ్యమైన, విష్ణుమ్=విష్ణుని, న విదుః=ఎఱుంగరు, బహిరర్థమానినః=ప్రత్యక్షముగా కనుపట్టు శబ్దాది విషయసుఖములందు అభిమానముగలవారై అదియె గొప్పదని తలంచు శీలముగలవారు కనుకనే, అంధైః=అంధులచే, ఉపనీయమానాః=గొనిపోఁబడు అంధాతులు, యథా అంధాః=గర్వమునందు అంధులవలె మార్గమును గుర్తెఱుంగనివారై గుంటల యందు పడిపోవుచు, వాగీశతంత్యామ్=పరమేశ్వరుని తంత్రమైన వేదమను దీర్ఘమైన రజ్జువునందు, ఉరుదామ్ని=గొప్పవైన బ్రాహ్మణములను పగ్గములు గలదాని, బద్ధాః=కామ్య కర్మలచే బద్ధులగుచున్నారు.

**తాత్పర్యము:–** విషయావిష్టచిత్తులకు విష్ణునందు భక్తి సుదూరము అగును. వరుణుని దిశ యందుండు వస్తువుకై ఇంద్రునిదిశకు పోవువాడెట్లు పొందును. విషయవాసనలు పొందిన అంతఃకరణము గలవారు తమయందే పురుషార్థమై ముక్తిస్థానమైన విష్ణువు నెఱుంగలేరు. ఏలయన వారు ప్రత్యక్షముగా గన్పట్టు శబ్దాది విషయ సుఖములే గొప్పవని తలంచు స్వభావము గలవారు గనుక అంధులచే, గొనిపోఁబడు అంధులెట్లు గుంటలలో బడుదురో, దాని నెఱుంగరో అట్లే వీరు పరమేశ్వరుని తంత్రమైన బ్రాహ్మణములను పగ్గముగలదైన వేదమను దొడ్డ రజ్జునందు బంధింపబడినవారగుదురు. కామ్య కర్మలచే బద్ధులగుచున్నారు. విషయాసక్తచిత్తులకు విష్ణుభక్తి దూరము. తూర్పుదెస బోవువారికి పడమటనున్న వస్తువు లభింపదు.

**శ్లో॥ నైషాం మతిస్తావదురుక్రమాఙ్ఘ్రిం స్పృశత్యనర్థాపగమో యదర్థః।**
**మహీయసాం పాదరజోఽభిషేకం నిష్కిఞ్చనానాం న వృణీత యావత్॥ 32**

**ప్రతిపదార్థము:–** నిష్కించనానామ్=నిరసించిన విషయేచ్ఛలయం దభిమానము గల, మహీయసామ్=మిక్కిలి దొడ్డవారైన భక్తులయొక్క, పాదరజోఽభిషేకమ్=పాదధూళిచేనగు అభిషేకము, యావత్=ఎంతవరకు, న వృణీత=కోరబడదో, తావత్=అంతవరకు, ఏషామ్= వారియొక్క, మతిః=బుద్ధి, ఉరుక్రమాంఘ్రిమ్=విష్ణువు పాదమును, న స్పృశతి=స్పృశించదు, యదర్థః=ఏ ఉరుక్రముని అంఘ్రిని స్పృశించిన మతికిఁబ్రయోజనము, అనర్థ+అపగమః=దుః





**ప్రతిపదార్థము:–** పదోః=పాదములకు, ప్రణమన్తమ్=పడి నమస్కరించి, బాలమ్=దైత్య కుమారుడు, అసురః=హిరణ్యకశిపుడు, ఆశిషా=దీవెనచే, ప్రతినంద్య=అభినందించి, దోర్భ్యామ్ =బాహువులచే, చిరమ్=తడవుకాలము, పరిష్వజ్య=ఆలింగనము చేసుకొని, పరమామ్ =అత్యంతమగు, నిర్వృతిమ్=ఆనందమును, ప్రాప=పొందెను.

**తాత్పర్యము:–** తనపాదములకు నమస్కరించు పుత్రుని ప్రహ్లాదుని హిరణ్యకశిపుడు ఆశీస్సులచే నభినందించి బాహువులలో చిరకాలము ఆలింగనముచేసుకొని పరమానందమును బొందెను.

**శ్లో॥ ఆరోప్యాఙ్కమవఘ్రాయ మూర్ధన్యశ్రుకణామ్బుభిః।**
**ఆసిఞ్చన్ వికసద్వక్త్రమిదమాహ యుధిష్ఠిర॥ 21**

**ప్రతిపదార్థము:–** యుధిష్ఠిర=ఓ ధర్మరాజా!, అంకమ్=ఒడిని, ఆరోప్య=కూర్చుండబెట్టి, మూర్ధని= శిరస్సును, అవఘ్రాయ=మూర్కొని, అశ్రుకణాంబుభిః=ఆనందబాష్పములచే, ఆసించన్= తడుప బడుచు, వికసద్వక్త్రమ్=వికాసమును పొందిన ముఖముగల కుమారునితో, ఆహ=ఇట్లు పలికెను.

**తాత్పర్యము:–** హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని ఒడియందుఁగూర్చుండబెట్టుకొని శిరము మూర్కొని ఆనందబాష్పములచే తడుపుచు మోము వికసిల్లిన కుమారునితో నిట్లు వచించెను.

**హిరణ్యకశిపురువాచ**

**శ్లో॥ ప్రహ్లాద! ఉచ్యతాం తాత! స్వధీతం కిఞ్చిదుత్తమమ్।**
**కాలేనైతావతాయుష్మన్ యదశిక్షద్గురోర్భవాన్॥ 22**

**ప్రతిపదార్థము:–** ప్రహ్లాద!=ప్రహ్లాదా!, తాత!=ఓ నాయనా!, ఆయుష్మన్=ఓ ఆయుష్మంతుడా!, ఏతావతా=ఇంతమాత్రము, కాలేన=కాలముచే, గురోః=గురువువలన, భవాన్=నీవు, యత్= దేనిని, అశిక్షత్=అభ్యసించావో, స్వధీతమ్=చక్కగా చదివినదియు, ఉత్తమమ్=మేలైనదానిని, కించిత్ =కొంచెము, ఉచ్యతామ్=వచించుము.

**తాత్పర్యము:–** ఓ ప్రహ్లాదా! ఓ వత్స! ఆయుష్మంతుడా! ఇంతకాలము నీవు నీ గురువువలన అభ్యసించినది చక్కగా తెలుసుకొన్న మంచి విషయము కొంచెము వచించుము.

**ప్రహ్లాద ఉవాచ**

**శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్।**
**అర్చనం వన్దనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్॥ 23**

**ప్రతిపదార్థము:–** విష్ణోః=విష్ణువు యొక్క, శ్రవణమ్=వినుట, కీర్తనమ్=కీర్తించుట, స్మరణమ్= స్మరించుట, పాదసేవనమ్=పాదములను సేవించుట, అర్చనమ్=పూజించుట, వందనమ్= నమస్కరించుట, దాస్యమ్=(కర్మ సమర్పణం) సేవ, సఖ్యమ్=స్నేహము, ఆత్మనివేదనమ్=తన దేహమును సమర్పించుట.

**తాత్పర్యము:–** విష్ణు కథలను వినుట, హరినామము సంకీర్తనము చేయుట, విష్ణుస్వరూపాదు లను స్మరించుట, విష్ణుపాదములకు పరిచర్య చేయుట, విష్ణువిగ్రహాదులను పూజించుట,

విష్ణుమూర్తు లకు నమస్కరించుట, తాను చేసిన కర్మలను విష్ణువునకు సమర్పించుట, విష్ణుందు విశ్వాసము కలిగియుండుట, దేహసమర్పణము, గోవులు, అశ్వములు, యజమానునిచే గొనబడిన దైనప్పుడు వానికి వాని దేహపోషణాదులచింత ఎట్లు లేదో అట్లే దేహము విష్ణువునకు సమర్పించి వాని గురించిన చింత లేకుండుట....

**శ్లో॥ ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవలక్షణా।**
**క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీతముత్తమమ్॥ 24**

**ప్రతిపదార్థము:–** ఇతి=ఈ చెప్పబడిన, నవలక్షణా=తొమ్మిది విధములైన, భక్తిః=భక్తి, పుంసా=అభ్యసించిన పురుషునిచే, భగవతి=భగవంతుడగు, విష్ణౌ=విష్ణునందు, అర్పితా=సమర్పించబడినది, క్రియతే చేత్=చేయబడినది అగునో, తత్=దానిని, అధీతమ్=చదువబడినదో, ఉత్తమమ్=ఉత్తమమైన దానినిగా, మన్యే=తలంచెదను.

**తాత్పర్యము:–** ఇట్టి తొమ్మిది విధములైన భక్తి పురుషు డవలంబించి, భగవంతుడైన విష్ణునందు సమర్పించినవాడయినచో అదియె చదివినవాని యందెల్ల నుత్తమమైన దానినిగా తలంతును. నేను గురువుల వలన జదివి అభ్యసించిన దట్టిదేదియు లేదని భావము.

**నారద ఉవాచ**

**శ్లో॥ నిశమ్యైతత్సుతవచో హిరణ్యకశిపుస్తదా।**
**గురుపుత్రమువాచేదం రుషా ప్రస్ఫురితాధరః॥ 25**

**ప్రతిపదార్థము:–** హిరణ్యకశిపుః=హిరణ్యకశిపుడు, తదా=అప్పుడు, ఏతత్=ఈ, సుతవచః=పుత్రునివచనములు, నిశమ్య=విని, రుషా=క్రోధముచే, ప్రస్ఫురిత+అధరః=అదరుచున్న పెదవులు గలవాడై, గురుపుత్రమ్=గురుపుత్రునిగురించి, ఇదం ఉవాచ=ఈ విధంగా పలికెను.

**తాత్పర్యము:–** హిరణ్యకశిపుడు తన పుత్రుడు వచించిన ఈ మాటలు విని క్రోధముతో పెదవు లదరుచుండ, గురుపుత్రునితో ఇట్లనెను.

**హిరణ్యకశిపురువాచ**

**శ్లో॥ బ్రహ్మబన్ధో కిమేతత్తే విపక్షం శ్రయతాసతా।**
**అసారం గ్రాహితో బాలో మామనాదృత్య దుర్మతే॥ 26**

**ప్రతిపదార్థము:–** బ్రహ్మబంధో=బ్రాహ్మణాధమా!, దుర్మతే=దుష్టబుద్ధిగలవాడా!, కిం ఏతత్ తే=ఇదియేమి?, విపక్షమ్=శత్రుపక్షం, శ్రయతా=ఆశ్రయించిన, అసతామ్=అహితకారియైన, త్వయా=నీచేత, బాలః=బాలుడు ప్రహ్లాదుడు, అపారమ్=నిస్సారమైన విద్యను, గ్రాహితః= గ్రహించాడు.

**తాత్పర్యము:–** ఓ బ్రాహ్మణాధమా! చెడ్డ బుద్ధి గలవాడా! ఇదేమి ఇట్లు చేసితివి? కేవలము అనుచితము గావించితవి. శత్రుపక్షమును ఆశ్రయించి అహితమాచరించువాడవై నన్ను లెక్కపెట్టక బాలునికి నిస్సారమైన దుర్బోధ కావించితివి.

**శ్లో॥ సన్తి హ్యసాధవో లోకే దుర్మైత్రాశ్ఛద్మవేషిణః।**
**తేషాముదేత్యఘం కాలే రోగః పాతకినామివ॥ 27**





**ప్రతిపదార్థము:–** లోకే=లోకమునందు, దుర్మైత్రాః=చెడుస్నేహము గలిగి, ఛద్మవేషిణః=కపట వేషముగల, అసాధవః=దుర్జనులు, సంతిహి=కలరుగదా! కాలే=సమయమాసన్నమైనప్పుడు, పాతకినామ్=పాపులకు, రోగః ఇవ=వ్యాధివలె, తేషామ్=వారికి, అఘమ్=విద్వేషాధికము, ఉదేతి=ఉదయించుచున్నది.

**తాత్పర్యము:–** బ్రహ్మ హత్య చేసినవాడు క్షయరోగి యగును. సురాపానము చేసినవాడు నల్లని దంతములు గలవాడగును. స్వర్ణము దొంగిలించినవాడు పుచ్చిన గోళ్ళు గలవాడగును. ఇది ధర్మశాస్త్రము. లోకమునందు పైకి స్నేహము కలిగిన కపటవేషధారులు దుర్జనులుందురు. కాలము వచ్చినప్పుడు పాపాత్ములకు రోగములు గలిగినట్లు వారికిని ద్రోహబుద్ధి జనించుచున్నది.

**గురుపుత్ర ఉవాచ**

**శ్లో॥ న మత్ప్రణీతం న పరప్రణీతం సుతో వదత్యేష తవేన్ద్రశత్రో।**
**నైసర్గికీయం మతిరస్య రాజన్ నియచ్ఛ మన్యుం కదదాః స్మ మా నః॥ 28**

**ప్రతిపదార్థము:–**ఇంద్రశత్రో=ఓ ఇంద్రునికి విరోధమైనవాడా!, రాజన్=ఓ రాజా!, ఏషః తవ సుతః=ఈ నీ పుత్రుడు, మత్ప్రణీతమ్=నాచే బోధింపబడిన దానిని, న వదతి=చెప్పడు, పర ప్రణీతమ్=పరులు బోధించిన దానిని, న=చెప్పడు, అస్య=ఇతనికి, ఇయం మతిః=ఈ బుద్ధి, నైసర్గికీ=స్వభావ సిద్ధమైనది, మన్యుమ్=కోపమును, నియచ్ఛ=నిగ్రహింపుము, నః=మాకు, కత్=దోషము, మా స్మ అదాః=కలిగింపకుము. మాయందు దోషారోపణము సేయకుము. ఇంద్రశత్రువగు నీకు బ్రాహ్మణుల యందు గోపము అనుచితము.

**తాత్పర్యము:–** ఓ ఇంద్ర విరోధి! రాజా! నీ పుత్రుడు నేను చెప్పిన దానిని చెప్పడు. పరులు చెప్పిన దానినీ చెప్పడు. నేనుగాని పరులుగాని ఇట్లు బోధచేయము. వానికి ఈ బుద్ధి స్వభావ సిద్ధముగనే యేర్పడినది. కోపమును నిగ్రహింపుము. మా పై దోషము పెట్టవలదు.

**నారద ఉవాచ**

**శ్లో॥ గురుణైవం ప్రతిప్రోక్తో భూయ ఆహాసురస్సుతమ్।**
**న చేద్గురుముఖీయం తే కుతోఽభద్రాసతీ మతిః॥ 29**

**ప్రతిపదార్థము:–**గురుణా=గురునిచే, ఏవమ్=ఈ ప్రకారము, ప్రతిప్రోక్తః=బదులు చెప్పబడినవాడై, అసురః=అసురుడు అయిన హిరణ్యకశిపుడు, సుతమ్=పుత్రుని గురించి, ఏవమ్=ఈ రీతిగ, ప్రోక్తం=చెప్పెను, అభద్ర=ఓ అమంగళశీలుడా!, తే=నీకు, అసతీ=చెడ్డదై, ఇయమ్=ఈ, మతిః=బుద్ధి, గురుముఖీ=గురువాక్యమున జనించినది, న చేత్=కాదేని, కుతః=ఎట్లు కలిగినది?

**తాత్పర్యము:–** ఇట్లు గురుపుత్రుడు చెప్పగా విని అసురుడు పుత్రునితో నిట్లనెను. ఓ అమంగళ శీలుడా! నీకు ఈ చెడుబుద్ధి గురు బోధించినది కాదేని యెట్లు కలిగినది? అని ప్రశ్నించెను.

**ప్రహ్లాద ఉవాచ**

**శ్లో॥ మతిర్న కృష్ణే పరతః స్వతో వా మిథోఽభిపద్యేత గృహవ్రతానామ్।**
**అదాన్తగోభిర్విశతాం తమిస్రం పునః పునశ్చర్వితచర్వణానామ్॥ 30**

**తాత్పర్యము:–** రాక్షసుల శూల ప్రహ్లాదములన్నియు వృధాకాగాఁజూచి హిరణ్యకశిపుడు ఏమి ఇది విచిత్రము! వాడిట్లు ఆయుధములచేతనుఁ జావకున్నాఁడని శంకించి వాని వధింప పెక్కు ఉపాయములను నిర్బంధముఁగావించెను.

**శ్లో॥ దిగ్గజైర్దన్దశూకైశ్చ అభిచారావపాతనైః।**
**మాయాభిస్సన్నిరోధైశ్చ గరదానైరభోజనైః॥ 43**

**ప్రతిపదార్థము:–** దిగ్గజైః=దిగ్గజములచేతను, దందశూకైః=సర్పరాజములచేత, అభిచార+ అవపాతనైః=మంత్ర బలముచేత జనించిన కృత్యలచేత గిరులనుండి లోయలలోకి, సన్నిరోధైశ్చ =నవరంధ్రముల నిరోధము చేయగల, మాయాభిః=మాయలచేత, గరదానై=విషముపెట్టుట చేత, అభోజనైః=భోజనము పెట్టక ఉపవాసముల చేతను వధింప ప్రయత్నము చేసెను.

**తాత్పర్యము:–** ఆ హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని వధింప నెంచి వానిని దిగ్గజములచేఁ ద్రొక్కించెను. నాగుబాములచే కటిపించెను. మరణహోమములు చేయు కృత్యలను ప్రయోగించెను. అకస్మాత్తుగా పిడుగులు లోనగునవి పడునట్లు మాయలను జేసెను. నవరంధ్రములను మూయించెను. విషాన్నములు తినిపించెను. భోజనము పెట్టక ఉపవాసము చేయించెను.

**శ్లో॥ హిమవాయ్వగ్నిసలిలైః పర్వతాక్రమణైరపి।**
**న శశాక యదా హన్తుమపాపమసురస్సుతమ్।**
**చిన్తాం దీర్ఘతమాం ప్రాప్తస్తత్కర్తుం నాభ్యపద్యత॥ 44**

**ప్రతిపదార్థము:–** హిమవాగ్నిసలిలైః=మంచు, గాలి, నిప్పు, నీరు లోనగువానిచే, పర్వత+ ఆక్రమణైః అపి=పర్వతములపై నుంచుటచేతను కూడను, యదా=ఎప్పుడు, అసురః=అసురుడు, అపాపమ్=పాపరహితుడైన, సుతమ్=పుత్రుని, హంతుమ్=చంపుటకు, నశశాక=సమర్థుడు కాలేదు, తదా=అప్పుడు, దీర్ఘతమామ్=మిక్కిలి అధికమైన, చింతామ్=చింతను, ప్రాప్తః= పొందినవాడు, తత్+కర్తుమ్=ఆ పుత్రుని వధించుటకు, న+అభ్యపద్యత=పొందలేదు, శక్తుడు కాలేదు.

**తాత్పర్యము:–** మంచు, గాలి, నీరు, అగ్ని లోనగు వానిచే పర్వతములపై నుంచుట చేతను కూడా హిరణ్యకశిపుడు పుత్రుని వధింపలేకపోయెను. అప్పుడతడు మిగుల చింత నొంది ఆ సుతుని జంప శక్తుడుగాకుండెను.

**శ్లో॥ ఏష మే బహ్వసాధూక్తో వధోపాయాశ్చ నిర్మితాః।**
**తైస్తైర్ద్రోహైరసద్ధర్మైర్ముక్తః స్వేనైవ తేజసా॥ 45**

**ప్రతిపదార్థము:–** ఏషః=ఈ ప్రహ్లాదుడు, మే=నాచే, బహు=మిక్కిలి, అసాధు=పరుషముగా, ఉక్తః=చెప్పబడినాడు, వధోపాయాః చ=చంపుటకు తగిన ఉపాయాలను, నిర్మితాః=చేయ బడినవి, తైః తైః=ఆయా, మోహైః=హీనములచే, అసత్+ధర్మైః=అపకారములచే అభిచారిక క్రియలచే బాధింపబడి, స్వేన= స్వయమైన, తేజసా ఏవ=తేజము చేతనే, ముక్తః=విడువబడెను, కొట్టబడలేదు.





ఖరూపమైన సంసారమును తొలగించునదైన మహాత్ముల అనుగ్రహము లేకపోవుటవలన తత్త్వ నిగ్రహము గలుగదు. వారికి మోక్షమును గలుగదు.

**తాత్పర్యము:–** విషయ సుఖాభిలాషమును నిరసించి దొడ్డవారైన భగవద్భక్తుల పాదముయొక్క ధూళిని తమ శరీరములుసోక ప్రార్థించనివారి బుద్ధి సంసారమను అనర్థమును దొలగించునదైన విష్ణుపాదములను స్పృశింపలేదు.

**శ్లో॥ ఇత్యుక్త్వోపరతం పుత్రం హిరణ్యకశిపూ రుషా।**
**అన్ధీకృతాత్మా స్వోత్సఙ్గాన్నిరస్యత మహీతలే॥ 33**

**ప్రతిపదార్థము:–** ఇతి+ఉక్త్వా=ఇట్లని చెప్పి, ఉపరతమ్=విరమించిన, పుత్రమ్=పుత్రుని, హిరణ్య కశిపుః=హిరణ్యకశిపుడు, రుషా=క్రోధముచేత, అంధీకృతాత్మా=గుడ్డివాడుగ చేయబడిన బుద్ధి కలవాడై, స్వ+ఉత్సంగాత్=తనతొడనుండి,మహీతలే=నేలయందు, నిరస్యత=త్రోసివేసెను.

**తాత్పర్యము:–** ఇట్లు చెప్పి మిన్నకున్న పుత్రుని జూచి హిరణ్యకశిపుడు క్రోధముతో బుద్ధి గుడ్డిదికాగా, వివేకములేక తన తొడమీదున్న పుత్రుని నేలమీదికి త్రోసివేసెను.

**శ్లో॥ ఆహామర్షరుషావిష్టః కషాయీభూతలోచనః।**
**వధ్యతామాశ్వయం వధ్యో నిస్సారయత నైరృతాః॥ 34**

**ప్రతిపదార్థము:–** అమర్షరుషా=అసహనముచే గూడి రోషముచే, ఆవిష్టః=ఆవరింపబడినవాడై, కషాయీభూతలోచనః=కెంపులయిన కన్నులుగలవాడునై, ఆహ=ఇట్లు పలికెను, నైరృతాః=ఓ రక్కసులారా!, అయమ్=వీడు, వధ్యః=వధింపదగినవాడు, నిస్సారయత=వెలుపలికి లాగుకొని పొండు, ఆశు=శీఘ్రముగా, వధ్యతామ్=వధింతురు గాక!

**తాత్పర్యము:–** అసహనముచే క్రోధము పెంపొంద కనుగవకెంపుగదురగా ఓ రాక్షసులారా! వీడు వధింపదగినవాడు. కావున తక్షణమే వీనిని వధింపుడనెను.

**శ్లో॥ అయం మే భ్రాతృహా సూనం హిత్వా స్వాన్ సుహృదోఽధమః।**
**పితృవ్యహన్తుర్యః పాదౌ విష్ణోర్దాసవదర్చతి॥ 35**

**ప్రతిపదార్థము:–** నూనమ్=నిజముగా, మే=నాయొక్క, భ్రాతృహా=సోదర ఘాతకుడు కదా!, అధమః=ఈ అధముడు, స్వాన్=స్వీయులైన, సుహృదః=స్నేహితులను, బంధువులను, హిత్వా= వదలి, యః=ఎవడు, పితృవ్యహంతుః=పినతండ్రిని జంపిన, విష్ణోః=విష్ణునియొక్క, పాదౌ=పాదము లను, దాసవత్=సేవకునివలె, అయమ్=వీడు, అర్చతి=పూజించుచున్నాడు.

**తాత్పర్యము:–** వీడు నిజముగా నా సోదర ఘాతకుడుగా నున్నాడు. ఈ అధముడు బంధు మిత్రులను వదలి పినతండ్రిని జంపిన విష్ణుపాదములను సేవకునివలెఁబూజించుచున్నాడు.

**శ్లో॥ విష్ణోర్వాసాధ్వసౌ కిన్ను కరిష్యత్యసమఞ్జసః।**
**దుస్త్యజం సౌహృదయం పిత్రోరజహాత్పఞ్చహాయనః॥ 36**

**ప్రతిపదార్థము:–** అసౌ=ఈ, అసమంజసః=చెడు నడవడి గలవాడు, అసాధు=దుర్జనుడు, విష్ణోః

వా=విష్ణునికైన, కిం ను కరిష్యతి=ఏమి చేయగలడు, పంచహాయనః=ఐదు సంవత్సరములు కలవాడయ్యు, పిత్రోః=తల్లిదండ్రులపైన, దుస్త్యజమ్=త్యజింపరానిదైన, సౌహృదమ్=ప్రేమను, అజహాత్=త్యజించెను.

**తాత్పర్యము:–** ఔరా! విష్ణువైనను విశ్వసింపనివాడైన వీనినెట్లు స్వీకరించెను? వీడు చెడు నడతగల దుష్టుడైనవాడు. విష్ణునందు మాత్రము ఎంత భక్తి గలవాడగును. ఐదేండ్ర బాలుడై యుండియు విడువరాని తల్లిదండ్రులపైని ప్రేమను వీడు త్యజించెను.

**శ్లో॥ పరోఽప్యపత్యం హితకృద్యథౌషధం**
**స్వదేహజోఽప్యామయవత్ సుతోఽహితః।**
**ఛిన్ద్యాత్తదఙ్గం యదుతాత్మనోఽహితం**
**శేషం సుఖం జీవతి యద్వివర్జనాత్॥ 37**

**ప్రతిపదార్థము:–** పరః=ఇతరుడైనను శత్రుపక్షమున జనించినవాడైనను, యథా+ఔషధం=ఔషధం వలె, హితకృత్=హితకారుడైనా, అపత్యమ్=వాడు పుత్రుడయినా, స్వదేహజః=తనకు జనించిన పుత్రుడైనా, సుతః=కొడుకైనా, అహితః=చెడుచేయువాడైనా, ఆమయవత్=వ్యాధివలె త్యజింప దగును. అది అట్లుండనిమ్ము. మమకారమునకు ఆస్పదమగు వాని వధించుట యెట్లనిన, స్వమ్=తనదైన మమతాస్పదమైన, అంగమ్=కరచరణాదికమగు అవయవం, ఆత్మనః=తనకు, అహితమ్=చెడు కలిగించునదైనను, ఛింద్యాత్=దానిని ఖండించవలసిందే, యత్+వివర్జనాత్=దేనిని విసర్జించుట వలన, శేషమ్=మిగిలిన అంగములు, సుఖం జీవతి=బ్రతుకును.

**తాత్పర్యము:–** శత్రుపక్షమున జనించినవాడైనను, పాపమాచరించువాడైనను, పుత్రునితో సమానమైన గ్రహింపదగినవాడగునేని, తనకు వారసుడగు పుత్రునిపైన అహితమాచరించు వాడగునేని వాడు వ్యాధివలె తప్పక త్యజించదగినవాడు. తనకు ప్రియమైన కరచరణాదులగు నంగములలో నేదేని వ్రణములచే దుష్టమగునేని దానిని ఖండించివేసినచో తక్కిన అవయవములు లెస్సయైయుండును గదా!

**శ్లో॥ సర్వైరుపాయైర్హన్తవ్యస్సమ్భోజశయనాసనైః।**
**సుహృల్లిఙ్గధరశ్శత్రుర్మునేర్దుష్టమివేన్ద్రియమ్॥ 38**

**ప్రతిపదార్థము:–** సుహృత్+లింగధరః=పుత్రవేషధారియైన, శత్రుమ్=శత్రువైనవాడు, సర్వైః=సమస్తమై, ఉపాయైః=ఉపాయములచే, సంభోజశయనాసనైః=విషభోజనాదులచే పడక శయనాది ఆసనాది ఉపాయాదులచేత, మునేః=మునియొక్క దుష్టం+ఇంద్రియమ్ ఇవ=చెడు ఇంద్రియము లచే, హంతవ్యః=చంపనగును.

**తాత్పర్యము:–**వీడు పుత్రవేషధారియైన శత్రువు. కావున వీనిని విషభోజనాదులచేత శయనాసనాదు లందు ఎల్ల ఉపాయములచే మునిదుష్టేంద్రియములచే చంపనగును.

**శ్లో॥ నైరృతాస్తేఽవమాదిష్టా భర్త్రా వై శూలపాణయః।**
**తిగ్మదంష్ట్ర కరాళాస్యాస్తామ్రశ్మశ్రుశిరోరుహాః॥ 39**



**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ ప్రకారము, భర్త్రా=ప్రభువుచే, తే=ఆ, నైరృతాః=రాక్షసులు, శూల పాణయః=శూలహస్తులై, తిగ్మదంష్ట్రకరాళాస్యాః=తీక్ష్ణములైన కోరలు భయంకరములైన ముఖములు గలవారై, తామ్రశ్మశ్రుశిరోరుహాః=ఎఱ్ఱనైన మీసములు గడ్డములు తలవెంట్రుకలు గలవారునై, ఆదిష్టాః=ఆదేశింపబడినారు.

**తాత్పర్యము:–** ప్రభువగు హిరణ్యకశిపునిచే ఆ రాక్షసులు శూలహస్తులై, తీక్ష్ణమైన కోరలు, భయంకరమైన ముఖములుగలవారు, ఎఱ్ఱని మీసములు గడ్డములు, తలవెంట్రుకలు గలవారు ప్రహ్లాదుని వధింపుడని ఆజ్ఞాపింపబడినారు.

**శ్లో॥ నదన్తో భైరవాన్నాదాంశ్ఛిన్ధి భిన్ధీతి వాదినః।**
**ఆసీనం చాహనఞ్ఛూలైః ప్రహ్లాదం సర్వమర్మసు॥ 40**

**ప్రతిపదార్థము:–** భైరవాన్=దారుణములైన, నాదాన్=కేకలను, అరుపులను, నందతః=అఱచుచు, ఛింధి=చీల్చుము, భింధి=పగిలించుము, ఇతి=అని, వాదినః=వాదించుచు, ఆసనమ్=నేలపై కూర్చున్న, ప్రహ్లాదమ్=ప్రహ్లాదుని, సర్వమర్మసు=ఎల్ల అవయవముల ఆయువుపట్టులందు, శూలైః=శూలములచే, ఆహనన్=పొడిచిరి.

**తాత్పర్యము:–** దారుణముగా నఱచుచు ఆ రాక్షసులు బాలుడైన ప్రహ్లాదుని చీల్చుడు, పగిలింపుడు అని అరచుచు నేలపైన కూర్చున్న ప్రహ్లాదుని యెల్ల అవయవములను శూలములచే పొడిచిరి.

**శ్లో॥ పరే బ్రహ్మణ్యనిర్దేశ్యే భగవత్యఖిలాత్మని।**
**యుక్తాత్మన్యఫలా ఆసన్నపుణ్యస్యేవ సత్క్రియాః॥ 41**

**ప్రతిపదార్థము:–** పరే=పరమేశ్వరుడును, బ్రహ్మణి=నిర్వికారుడైన బ్రహ్మము, అనిర్దేశ్యే= ఇంద్రియ గోచరుడు గాని వాడు, భగవతి=నిరతిశయైశ్వర్యము గలవారు, అఖిలాత్మని= శాస్త్రవిదులను సైతము నియంతయైనవాడు అగు విష్ణువునందు, యుక్త+ఆత్మని=ఉంచిన మనస్సుగల ప్రహ్లాదుని యందు, అపుణ్యస్య=దైవభక్తిలేనివానియొక్క, సత్క్రియాః ఇవ=దొడ్డ ప్రయత్నములువలె, వారి ప్రహారములు, అఫలాః=నిష్ప్రయోజనములు, ఆసన్=అయినవి.

**తాత్పర్యము:–** పరమేశ్వరుడు నిర్వికారుడగు బ్రహ్మమై ఇంద్రియ విషయములకు గోచరము కానందున అనిర్దేశ్యుడై నిరతి యైశ్వర్యవంతుడగు భగవంతుడై, శాస్త్రవాదులను సైతము నియమించువాడగు అఖిలాత్ముడైన విష్ణునందు మనస్సును చక్కగా పేర్చియున్న యా ప్రహ్లాదు నందు ఆ రాక్షసుల శూలపు పోట్లు పుణ్యహీనులు, దేశభక్తిలేని వాని ప్రహారములు వమ్మయ్యెను.

**శ్లో॥ ప్రయాసేఽపహతే తస్మిన్ దైత్యేన్ద్రః పరిశఙ్కితః।**
**చకార తద్వధోపాయాన్ నిర్బన్ధేన యుధిష్ఠిర॥ 42**

**ప్రతిపదార్థము:–** యుధిష్ఠిర!=ఓ ధర్మజా!, ప్రయాసే=వధించు శ్రమే, అపహతే సతి=ప్రతిహతము కాగా, దైత్యేంద్రః=దైత్యప్రభువైన హిరణ్యకశిపుడు, పరిశంకితః=ఏమి వాడు చావలేదని శంకను పొందినవాడై, నిర్బంధేన=నిర్బంధముతో, తత్+వధ+ఉపాయాన్=ఆ ప్రహ్లాదుని వధించుటకు పెక్కు ఉపాయములను, చకార=చేసెను.

**శ్లో॥ తే తు తద్గౌరవాత్ సర్వే త్యక్తక్రీడాపరిచ్ఛదాః।**
**బాలా న దూషితధియో ద్వన్ద్వారామేరితేహితైః॥ 56**

**ప్రతిపదార్థము:-** తే=ఆ, బాలాః తు=బాలురైతే, తత్ గౌరవాత్=ఆ ప్రహ్లాదునియందుగల గౌరవము వలన, సర్వే=ఎల్లరు, త్యక్తక్రీడాపరిచ్ఛదాః=వదలిన ఆటవస్తువులు గలవారై, ద్వంద్వ+ ఆరామ+ ఈరిత+ఈహితైః=సుఖదుఃఖముల రూపమైన సంసారమందు రమించు గురులచే చెప్పబడిన అర్థకామవాంఛలచే, నదూషితధియః=కలుషితముగాని బుద్ధికలవారైరి.

**తాత్పర్యము:-** ఆ బాలురు ప్రహ్లాదునెడ గల గౌరవము వలన నతడు పిలిచినంతనె తమ ఆట పరికరములను అన్నింటినీ వదలినవారై, సుఖదుఃఖరూపమైన సంసారమునందు ఆసక్తులైన గురు లుపదేశించిన త్రివర్గముచే కలుషితముగాని బుద్ధగలవారై ప్రహ్లాదుని సమీపించిరి.

**శ్లో॥ పర్యుపాసత రాజేన్ద్ర తన్న్యస్తహృదయేక్షణాః।**
**తానాహ కరుణో మైత్రో మహాభాగవతోఽసురః॥ 57**

**ప్రతిపదార్థము:-** రాజేంద్ర!=ఓ ధర్మరాజా!, తత్+న్యస్తహృదయ+ఈక్షణాః=ఆ ప్రహ్లాదుని యందుంచిన మనసు, చూపుగలవారై, పర్యుపాసత=ప్రహ్లాదునిసేవించిరి, కరుణః=దయగలవాడు, మైత్రః=స్నేహితుడు, మహాభాగవతః=దొడ్డ భగవద్భక్తుడు, అసురః=అసురుడు అయిన ప్రహ్లాదుడు, తాన్ ఆహ=వారలను గురించి యిట్లు చెప్పెను.

**తాత్పర్యము:-** ఆ ప్రహ్లాదునందు ఆ బాలురు తమతమ చూపులు, మనసులు గలవారై ఆతనిని సేవించిరి. అప్పుడు దయ, స్నేహములచే భగవద్భక్తుడు అసురకుమారుడు ఆ ప్రహ్లాదుడు వారితో నిట్లు చెప్పెను.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**నవధాభక్తివర్ణనం నామ పఞ్చమోఽధ్యాయః(5)**



**తాత్పర్యము:-** ఈ ప్రహ్లాదుని పరుషభాషణచే నొడ్డించితిని, చంపుటకన్ని విధములు గావించితిని, మారణహోమములు చేయించితిని, వాని నన్నింటిని వీడు తన తేజము నపహరించి చెక్కు చెదరకుండా ఉండెను.

**శ్లో॥ వర్తమానోఽవిదూరే వా బాలోఽప్యజడధీరయమ్।**
**న విస్మరతి మానార్యం శునశ్శేప ఇవ ప్రభుః॥ 46**

**ప్రతిపదార్థము:-** అవిదూరే=నా సమీపమునందు, వర్తమానః వా=ఉండుచున్నవాడైనను, బాలః అపి=బాలుడైనను, అయమ్=వీడు, అజడధీః=నిర్భయచిత్తుడు, శునఃశేపః ఇవ=శున శ్శేపుడు వలె, ప్రభుః=జితేంద్రియుడై, మా అనార్యమ్=నా యొక్క అకార్యము లేక అన్యాయమును శత్రుత్వమునైన, న విస్మరతి=స్మరింపడు లేక స్వభావమును త్యజింపడు అనుదానికి దృష్టాంతము, శునఃశేపః ఇవ=కుక్క తోకవలె, కుక్క తోకవలె యెట్లువంకరగా నుండునో అట్లే తన స్వభావము వీడకున్నాడు.

**తాత్పర్యము:-** వీడు నా చెంతనున్నను బాలుడైనను నిర్భయచిత్తుడైయున్నను, శునఃశేపుడువలె జితేంద్రియుడై నేఁజేసిన అపకారము నేమాత్రము స్మరింపడు. పూర్వము శునఃశేపుడను వానిని హరిశ్చంద్రునికి అతని తల్లిదండ్రులు యజ్ఞపశువుగా విక్రయించెను. అట్లు చేసిన తల్లిదండ్రుల యపకారమును తలంపక వారికి నెదిరియై విశ్వామిత్రు నాశ్రయించి అగోత్రము వాడయ్యె, లేక కుక్కతోక యెట్లు చక్కగా కట్టిననూ దాని వంకర వీడదో అట్లే వీడునూ ఎంత బాధించినను తన స్వభావము వీడకున్నాడు.

**శ్లో॥ అప్రమేయానుభావోఽయమకుతశ్చిద్భయోఽమరః।**
**నూనమేతద్విరోధేన మృత్యుర్మే భవితా న వా॥ 47**

**ప్రతిపదార్థము:-** అయమ్=వీడు, అప్రమేయ+అనుభావః=కొలది అనరాని ప్రభావము కలవాడు, అకుతశ్చిత్+భయః=దేనివలనను భయములేనివాడు, ఏతత్+విరోధేన=వీనితోడి విరోధముచే, నూనమ్=నిశ్చయము, మే=నాకు, భవితా న వా=కలుగకుండునా లేక, మృత్యుః=మృత్యువు.

**తాత్పర్యము:-** వీడు ఇంతయని చెప్పవీలుగాని ప్రభావము గలవాడు. వీనికి దేనివలన భయము లేదు. వీనితోని విరోధించినందున నాకు మృత్యువు కలుగు నా ఏమి? నాకెట్లు మృత్యువు కలుగును. వరప్రభావముఁగలదు కదా!

**శ్లో॥ ఇతి తఞ్చిన్తయా కిఞ్చిద్మ్లానశ్రియమధోముఖమ్।**
**చణ్డామర్కావౌశనసౌ వివిక్త ఇతి హోచతుః॥ 48**

**ప్రతిపదార్థము:-**ఇతి=ఇట్లు అని, తం చింతయా=పుత్రవిషయమైన చింతచేత, కించిత్=కొంచెం, మ్లానశ్రియమ్=వాడిన కాంతి గలిగి, అధోముఖమ్=తలవంచుకొనియున్న హిరణ్యకశిపునితో, ఔశనసౌ=శుక్రాచార్యుల పుత్రులు, చండామర్కాః=చండామర్కులు, వివిక్తే=ఏకాంతమునందు, ఇతిహ+ఊచతుః=ఇట్లని వచించిరి.

**తాత్పర్యము:-** ఇట్లు పుత్రుని గురించి చింతించుచు, కాంతి తగ్గిన మోము వంచుకొనియున్న హిరణ్యకశిపుని చూచి శుక్రుని పుత్రులు చండామర్కులు ఏకాంతమున ఇట్లు వచించిరి.

శ్లో॥ జితం త్వయైకేన జగత్త్రయం భ్రువోః
విజృమ్భణత్రస్తసమస్తధిష్ణ్యపమ్।
న తస్య చిన్త్యం తవ నాథ చక్ష్మహే
న వై శిశూనాం గుణదోషయోః పదమ్॥ **49**

**ప్రతిపదార్థము:-** ప్రభో!=ఓ దైత్యేంద్రా!, ఏకేన=అసహాయుడైన, త్వయా=నీ యొక్కనిచే, జగత్త్రయమ్=ముజ్జగములు, జితమ్=జయించబడినవి, తవ=నీయొక్క విజృంభణత్రస్తసమస్త ధిష్ణ్యపమ్=కనుబొమల కదలికల మాత్రముచేతనే భయపడిన ఎల్లలోకపాలురుగల, నాథ!=ఓ ప్రభువా!, తస్య=ఆ ప్రహ్లాదుని గురించి, చిన్త్యమ్=చింతింపదగిన, న చక్ష్మహే=ఏమియు చూడము, శిశూనామ్=పసివారియొక్క గుణదోషయోః=మంచిచెడ్డలకు, పదం న వై=విషయము కాదు.

**తాత్పర్యము:-** ఓ దైత్యేంద్రా!, నీకనుబొమల కదలిక మాత్రమున ఎల్ల దిక్పాలకులు గడగడ లాడించిన అసహాయశూరుండవైన నీ వొక్కడవే ఈ మూడు లోకములను జయించితివి. నీవు ఈ నీ పుత్రుని గురించి చింతవపడవలసినంత కారణము మాకేమి కన్పట్టుటలేదు. పిల్లల ప్రవర్తన మంచిచెడ్డలు నిర్ణయింపఁగుతి గానేరు. పిల్లలు నిలకడగా పద్ధతి నుండువారు గారు. మారుచుందురు.

శ్లో॥ ఇమం తు పాశైర్వరుణస్య బద్ధ్వా-నిధేహి భీతో న పలాయతే యథా।
బుద్ధిశ్చ పుంసో వయసార్యసేవయా-యావద్గురుర్భార్గవ ఆగమిష్యతి॥ **50**

**ప్రతిపదార్థము:-** యావత్=ఎంతలో, గురుః=గురువు, భార్గవః=శుక్రుడు, ఆగమిష్యతి= రాగలడు అనుచు, యథా=ఏ ప్రకారము, భీతః=భయపడి, న పలాయతే=పరుగెత్తిపోకుండగ, ఇమమ్=ఈ ప్రహ్లాదుని,వరుణస్యపాశైః=వరుణునిపాశములచేత, బద్ధ్వా=కట్టబడినవానినిగ, నిధేహి=చేయుము, పుంసః బుద్ధిః=పురుషుని బుద్ధి, వయసా=వయసుచేత, ఆర్యసేవయా= పెద్దలసేవచేత చక్కబడ వచ్చును.

**తాత్పర్యము:-** గురువు శుక్రుడు వచ్చు వరకు భీతుడై పరుగెత్తిపోకుండ ఈ ప్రహ్లాదుని వరుణ పాశములచే బంధించియుంచు. వీనిబుద్ధి వయస్సుచేతను పెద్దలసేవ చేతనుఁజక్కబడవచ్చును.

శ్లో॥ తథేతి గురుపుత్రోక్తమనుజ్ఞాయేదమబ్రవీత్।
ధర్మా హ్యస్యోపదేష్టవ్యా రాజ్ఞాం యే గృహమేధినామ్॥ **51**

**ప్రతిపదార్థము:-** గురుపుత్ర+ఉక్తమ్=గురుపుత్రులచే చెప్పబడిన దానికి, అనుజ్ఞాయ=అట్లేయని అంగీకరించి హిరణ్యకశిపుడు, ఇదం అబ్రవీత్=ఈమాట చెప్పెను, యే=ఏది, రాజ్ఞామ్= రాజులకు, గృహమేధినామ్=గృహస్థులకు, ధర్మాః+హి=ధర్మములు గలవానిని, అస్య=వీనికి, ఉపదేష్టవ్యాః=ఉపదేశింపదగినవనెను.

**తాత్పర్యము:-** గురుపుత్రులు చెప్పినదానికి సమ్మతించి హిరణ్యకశిపుడు వారితో మీరు రాజులకు గృహస్థులకు ఆవశ్యకములను ధర్మములను వీనికి ఉపదేశింపుడని చెప్పెను.



శ్లో॥ ధర్మమర్థం చ కామం చ నితరాం చానుపూర్వశః।
ప్రహ్లాదాయోచతూ రాజన్ ప్రశ్రితావనతాయ చ॥ **52**

**ప్రతిపదార్థము:-** రాజన్!=ఓ ధర్మజా!, ప్రశ్రిత+అవనతాయ=వినయముతో నమ్రుడునగు, ప్రహ్లాదాయ=ప్రహ్లాదునికి, ధర్మం అర్థం చ కామం చ=ధర్మమును, అర్థమును, కామమును, అనుపూర్వశః=క్రమపద్ధతిని, నితరామ్=మిక్కిలిగ, ఊచతుః=ఉపదేశించిరి.

**తాత్పర్యము:-** అంత నా చండామర్కులు వినయముతో నమ్రుడైన ఆ ప్రహ్లాదునికి ధర్మ అర్థ కామములను క్రమముగా చక్కగా తెలియునట్లు బోధించిరి.

శ్లో॥ యథా త్రివర్గం గురుభిరాత్మనే హ్యుపశిక్షితమ్।
న సాధు మేనే తచ్ఛిక్షాం ద్వన్ద్వారామోపవర్ణితామ్॥ **53**

**ప్రతిపదార్థము:-** యథా=శాస్త్రపద్ధతిని, గురుభిః=గురువులచే, ఆత్మనే=తనకొఱకు, ఉపశిక్షితమ్ =వరుసగా బోధింపబడినదైనను, త్రివర్గమ్=ధర్మార్థకామములను త్రివర్గమును, ద్వంద్వ ఆరామ ఉపవర్ణితామ్=రాగద్వేషాదులచేతను, విషయసుఖములందు రమించు వారిచే వర్ణింపబడిన, తత్+శిక్షామ్=వారి బోధను, న సాధు మేనే=మంచిదని తలచలేదు.

**తాత్పర్యము:-** గురువులు తనకు శాస్త్ర విధి ననుసరించి బోధించిన త్రివర్గమును (ధర్మార్థ కామములను) రాగద్వేషాదులచేతను విషయసుఖములందు రమించు వారి బోధనను గాని ప్రహ్లాదుడు మంచిదని తలచలేదు.

శ్లో॥ యదాచార్యః పరావృత్తో గృహమేధీయకర్మసు।
వయస్యైర్బాలకైస్తత్ర సోపహూతః కృతక్షణైః॥ **54**

**ప్రతిపదార్థము:-** యదా=ఎప్పుడు, ఆచార్యః=గురువు, గృహమేధీయకర్మసు=గృహస్థుల కర్మ లందు, పరావృత్తః=మరలియుండెనో, తత్ర=అప్పుడు, వయస్యైః= స్నేహితులచేత, కృతక్షణైః =క్రీడకొఱకుపొందిన సమయముగల, బాలకైః=బాలురచే, తత్ర=అక్కడకు, సః=ప్రహ్లాదుడు, ఉపహూతః=సమీపమునకు పిలువబడెను.

**తాత్పర్యము:-** ఆచార్యులు చండామర్కులు గృహస్థకర్మలందు నిమగ్నులుకాగా, తోడి చెలికాండ్రు, బాలురు ఆటలాడుటకు అది సమయమని గుర్తించి ప్రహ్లాదుని తమ చెంతకు పిలిచిరి.

శ్లో॥ అథ తాన్ శ్లక్ష్ణయా వాచా ప్రత్యాహూయ మహాబుధః।
ఉవాచ విద్వాంస్తన్నిష్ఠాం కృపయా ప్రహసన్నివ॥ **55**

**ప్రతిపదార్థము:-** అథ=అంత, మహాబుధః=గొప్పజ్ఞానియైన ప్రహ్లాదుడు, తాన్=ఆ బాలురను, శ్లక్ష్ణయా=మృదువైన, వాచా=వాక్కుచేత, ప్రత్యాహూయ=మరల తన దగ్గరకు పిలిచి, కృపయా= వారి యందు దయతో, ప్రహసన్ ఇవ=నవ్వుచున్నవానివలె, విద్వాన్=ఆ భగవత్తత్త్వ మెఱింగిన వాడు, తత్ నిష్ఠామ్=జన్మమరణాది లక్షణము, ఉవాచ=వచించెను.

**తాత్పర్యము:-** అంత గొప్ప జ్ఞాని భగవత్తత్త్వమెఱింగినవాడు అయిన ఆ ప్రహ్లాదుడు ఆ బాలురను పిలిచి జన్మమరణాది లక్షణమైన గురువుల సంసారనిష్ఠను గురించి వివరించెను.

పుష్కలమ్=బలిష్ఠమైయుండునో, న విపద్యేత=కార్య సమర్థము కాదు, వేగముగా, అంతయును, క్షేమాయ=తన క్షేమము కొరకు, మోక్షము కొరకు, యతేత=ప్రయత్నింపవలయును.

**తాత్పర్యము:–** సంసారమును బొందిన నరుడు నేర్పుగలవాడనైనచో ఎంతవరకు శరీరము బల సమృద్ధిగలదైయుండునో వ్యాధిగ్రస్తమై నాశమునకు గురికాదో అంత లోపలనే తన క్షేమమునకు మోక్షమునకు ప్రయత్నము తప్పక చేయవలెను.

**శ్లో॥ పుంసో వర్షశతం హ్యాయుస్తదర్థమజితాత్మనః।**
**నిష్ఫలం యదసౌ రాత్ర్యాం శేతేఽన్ధం ప్రాపితస్తమః॥ 11**

**ప్రతిపదార్థము:–** అజితాత్మనః=మనో జయములేని, పుంసః=పురుషునియొక్క, వర్షశతమ్=నూరు సంవత్సరములు, ఆయుః=ఆయువు, తత్+అర్ధమ్=దానిలో సగము, నిష్ఫలమ్=వ్యర్థమగు, యత్=ఏ కారణము, అసౌ=ఈపురం, రాత్ర్యామ్=రాత్రియందు, అంధం తమః=నిద్రను, ప్రాపితః=పొందినవారై, శేతే=పరుండియుండును.

**తాత్పర్యము:–** మనోజయములేని పురుషుని నూఱువత్సరముల ఆయువులోని సగము భాగము నిష్ఫలమైపోవుచున్నది. ఏలయన రాత్రియందు తెల్లవార్లూ నిద్రించుచున్నారు.

**శ్లో॥ ముగ్ధస్య బాల్యే కైశోరే క్రీడతో యాతి వింశతిః।**
**జరయా గ్రస్తదేహస్య యాత్యకల్పస్య వింశతిః॥ 12**

**ప్రతిపదార్థము:–** ముగ్ధస్య=మూఢునికి, బాల్యే=మిక్కిలి చిన్నతనము నందు, కైశోరే=కొంత పెద్దవాడైన కౌమారదశయందు, క్రీడతః=క్రీడించువానికి, వింశతిః=ఇరువది సంవత్సరములు, యాతి=గడచును, జరయా=ముసలితనముచే, గ్రస్తదేహస్య=ఆవరింపబడిన దేహము గలిగి, అకల్పస్య=స్వాధీనములేని మేను కలిగినవానికి, వింశతిః=ఇరువది సంవత్సరములు, యాతి=గడచును.

**తాత్పర్యము:–**పసినిష్టమై,బాలుడై,మూఢుడై క్రీడించువానికి ఇరువది ఏండ్లు కడచి పోవుచున్నవి. ముసలితనమును ఆవరించి ఆశక్తుడైనప్పుడు ఇరువది సంవత్సరములు గడచును.

**శ్లో॥ దురాపూరేణ కామేన మోహేన చ బలీయసా।**
**శేషం గృహేషు సక్తస్య ప్రమత్తస్యాపయాతి హి॥ 13**

**ప్రతిపదార్థము:–** దురాపూరేణ=దుఃఖములతో నంతట నిందించునట్టి, కామేన=కామముచేత, బలీయసా=బలిష్ఠమైన, మోహేన=అవివేకముచేతను, గృహేషు=గృహకృత్యములందు, సక్తస్య=ఆసక్తుడై, ప్రమత్తస్య=ఏమాఱినవానికి, శేషమ్=తక్కిన పది సంవత్సరములు యాతి హి=గడచి పోవును కదా!

**తాత్పర్యము:–** దుఃఖములతో నిందించు కామముచేతను బలిష్ఠమైన మోహముచేత గృహధర్మము లందాసక్తుడై అప్రమత్తుడైన వానికి తక్కిన పది సంవత్సరములు గడచిపోవును.

**శ్లో॥ పశ్యధ్వం మతివైతథ్యం జ్ఞాతీనాం నః కుటుమ్బినామ్।**
**శ్రేయోఽభిఘాతాదాయాసాదీహతామనుసంస్మృతిమ్॥ 14**



## శ్రీః
## అథ షష్ఠోఽధ్యాయః

ఈ షష్ఠాధ్యాయమందు గురుడు గృహకృత్యమునందు నిమగ్నమైయుండ ప్రహ్లాదుడు దైత్య కుమారులను కనికరించి వారికి నారదుడు వచించిన పరతత్వమును ఉపదేశించెను.

**ప్రహ్లాద ఉవాచ**

**శ్లో॥ హన్తార్భకా మే శృణుత వచో వస్సర్వతశ్శివమ్।**
**వయస్యాన్ పశ్యత మృతాన్ క్రీడతో మా ప్రమాద్యత॥ 1**

**ప్రతిపదార్థము:–** హంత!=ఔరా!, అర్భకాః=ఓ బాలులారా!, వః=మీకు, సర్వతః=అన్నివిధముల, శివమ్=క్షేమకరమైన, వచః=మాటను, మే=నావలన, శ్రుణుత=వినుడు, మృతాన్=చనిపోయిన వారలను, వయస్యాన్=స్నేహితులను, పశ్యత=చూడు, క్రీడతః=క్రీడించుచున్నవారై, మా ప్రమాద్యత=ప్రమాదము చెందకుడు.

**తాత్పర్యము:–** అహో! ఓ బాలులారా! మీ కన్నివిధముల క్షేమం కలిగించు మాటను చెప్పెదను వినుడు. మన తోడి బాలకులు కొందఱు చనిపోవుటను జూడుడు. మీరు ఆటలాడుచు ఏమరు పాటు చెందకుడు.

**శ్లో॥ న పురాపి వయం బాలా ఆత్మనోఽథ ప్రియైషిణః।**
**గురూక్తమపి న గ్రాహ్యం యదనర్థేఽర్థకల్పనమ్॥ 2**

**ప్రతిపదార్థము:–** పురా అపి=పూర్వము వలె ఇప్పుడు, వయమ్=మనము, న బాలాః=బాలురము కాము, అథ=మరి, ఆత్మనః=మనకు, ప్రియైషిణః=ఇష్టమైన వానిని కోరువారము కావలయును, యత్=ఏది, అనర్థే=కీడు కలిగించుదానియందు, అర్థకల్పనమ్=మేలైన ప్రయోజనము కలిగించు నను కల్పించిన, గురూక్తమ్=గురువు చెప్పినదానిని, న గ్రాహ్యమ్=గ్రహింపదగినది కాదు.

**తాత్పర్యము:–** మనము పూర్వము వలె మిగుల చిన్నవారము కాము. కావున మనకు మేలగు వానిని కోరువారము కావలయును. గురువు అనర్థము తెచ్చిపెట్టువానిని అర్థవంతములని మనకు ఉపదేశించుచున్నారు. వానిని మనము గ్రహింపకూడదు.

**శ్లో॥ యదుక్త్వా న ప్రబోధ్యేత సుప్తస్త్వజ్ఞాననిద్రయా।**
**న శ్రద్ధ ధ్యాన్మతం తస్య యథాన్ధోహ్యన్ధనాయకః॥ 3**

**ప్రతిపదార్థము:–** యత్=ఏది, ఉక్త్వా=చెప్పబడినదో, అజ్ఞాన నిద్రయా=అజ్ఞానమనే నిద్రచే, సుప్తః=నిద్రపోయినవాడు, న ప్రబుధ్యేత=మేల్కొనడో, అంధనాయకః=అంధుడు మార్గదర్శి నాయకుడు, యథా అంధః=అంధుడు ఎట్లగునో, తస్య మతమ్=ఆ గురుని మతమును, న శ్రద్ధ=శ్రద్ధ వహింపవలదు.

**తాత్పర్యము:-** ఏ మాట చెప్పబడినదో అజ్ఞానమను నిద్రచే మైమఱపించినవారు మేల్కొన్నచో అట్టి గురుని మతమగు నుపదేశమును మనము శ్రద్ధవహింపవలదు. ఏలయన అంధుని మార్గదర్శిగా పెట్టుకొన్నవాడు అంధుడే యగును. అట్లు మనము చేయవలదు.

**శ్లో॥ కశ్శత్రుః క ఉదాసీనః కిం మిత్రం కోఽ ర్థ ఆత్మనః।**
**భవత్స్వవినయైః కి స్యాద్దైవం సమ్పద్విపత్ప్రదమ్॥ 4**

**ప్రతిపదార్థము:-** ఆత్మనః=తనకు ఆత్మకు, కః శత్రుః=పగవాడెవ్వడు, కః ఉదాసీనః=మిన్నకున్న వాడెవ్వడు?, కిం మిత్రమ్=స్నేహితుడెవ్వడు?, కః అర్థః= ఏది ప్రయోజనము, భవత్సు=మీ యందు, అవినయైః=అణకువలేని చేష్టలచే, కిం స్యాత్=ఏమి ప్రయోజనము, దైవమ్=దైవము, సంపత్+ విపత్+ప్రదమ్=సంపదను, ఆపదను కష్టసుఖములను ఇచ్చునది.

**తాత్పర్యము:-** ఆత్మకు ఎవ్వడు శత్రువు, ఉదాసీనుడెవ్వడు?, మిత్రుడెవ్వడు?, ప్రయోజనమేది? అవిధేయులైయుండు మీకు ప్రయోజనమేమిటి?, ఎల్లరకు కష్టసుఖములను కలిగించునదే దైవము విధియగును.

**శ్లో॥ యో న హింస్యాద్ధర్మకామానాత్మనో వై జనస్య చ।**
**పునస్త్రిలోకే యో హేతుస్సమ్మతోఽ ర్థోఽ తిదుర్లభః॥ 5**

**ప్రతిపదార్థము:-** యః=ఎవడు, ఆత్మనః=తనకును, జనస్య చ=తన జనమునకు, ధర్మకామాన్= సంభవించు ధర్మకామములను, న హింస్యాత్=నాశనము చెయ్యడో, పునః త్రిలోకే=ముల్లోకము లందు, యః=ఏది, హేతుః=శుభకరము, సంమతః=పెద్దలకు సమ్మతమైన, అర్థః=ప్రయోజనము, అతిదుర్లభః=మిక్కిలి దుర్లభము.

**తాత్పర్యము:-** ఎవడు తనకును తనవారికిని లభించు ధర్మకామములను హతమార్చడో అట్టివానికి ఏది మేలునకు కారణమై పెద్దలకు సమ్మతమై అత్యంత ప్రయోజనకరమైన వస్తువేది గలదో అది లభింపదు. నిరర్థకమైన క్రియలచేతను, భాషణములచేతను, ఆయువు వ్యయమై పోవుటను ఎఱుంగని వారలను గురించి, దయాళువై ప్రహ్లాదుడు పుణ్యాత్ముడు భాగవతధర్మమును వచించు చున్నాడు.

**శ్లో॥ కౌమర ఆచరేత్ప్రాజ్ఞో ధర్మాన్ భాగవతానిహ।**
**దుర్లభం మానుషం జన్మ తదప్యధ్రువమర్థదమ్॥ 6**

**ప్రతిపదార్థము:-** ప్రాజ్ఞః=బుద్ధిమంతుడు, ఇహ=ఈ జగమున, కౌమారే=బాల్యమునందు, భాగవతాన్=భగవత్సంబంధములైన, ధర్మాన్=పూజ, ధ్యానాదులు, ధర్మములను, ఆచరేత్= ఆచరించవలెను, మానుషం జన్మ=మనుష్య జన్మము, దుర్లభమ్=సామాన్యముగా లభించునది కాదు, అర్థదమ్=ఫలమునందు, తత్+అపి=ఆజన్మమైన, అధ్రువమ్=స్థిరమైనది కాదు.

**తాత్పర్యము:-** బుద్ధిమంతుడైనవాడు ఇహమున బాల్యము నుండియే భగవద్భక్తికి సంబంధించిన ధర్మములను, భగవంతునకు శ్రవణకీర్తన, పూజాధ్యానాదుల నవలంబించి ఆచరించవలెను. ఏలయన మనుష్యజన్మము అంత సులభముగా లభించునది కాదు. మోక్షమను పరమార్థమునకు



ఆధారమైన ఈ జన్మము సైతము స్థిరమైనది కాదు. కాబట్టి తన ఇంద్రియసుఖములను గురించి ప్రయాసపడు పనులు చేయకూడదు. మఱి స్వర్గాది భోగముల నొసంగు కామ్య కర్మలను జేయ వలయును.

**శ్లో॥ యథా హి పురుషస్యేహ విష్ణోః పాదోపసర్పణమ్।**
**యదేష సర్వభూతానాం ప్రియ ఆత్మేశ్వరస్సుహృత్॥ 7**

**ప్రతిపదార్థము:-** యథా హి=అది అట్లే, ఇహ=ఈ జగమందు, పురుషస్య=నరునకు, విష్ణోః =మహావిష్ణువుయొక్క, పాద+ఉపసర్పణమ్=పాదభజనకు, యథా హి=అనురూపము, యోగ్యము గదా!, యత్=ఎందువలన అనగా, ఏషః=ఈ విష్ణువు, సర్వభూతానామ్= ఎల్లభూతములకు, ప్రియః=ఇష్టుడు, ఈశ్వరః=ప్రభువు, సుహృత్=మేలుచేయు మిత్రుడు.

**తాత్పర్యము:-** నరునకీ జగమున విష్ణుపాదభజనమే మిక్కిలి యోగ్యమైనది. ఏలయన ఆ విష్ణువే ఎల్లప్రాణికోటికీ ప్రియుడు, ప్రభువు మేలు కావించు స్నేహితుడునై యున్నాడు.

**శ్లో॥ సుఖమైన్ద్రియకం దైత్యా దేహయోగేన దేహినామ్।**
**సర్వత్ర లభ్యతే దైవాద్యథా దుఃఖమయత్నతః॥ 8**

**ప్రతిపదార్థము:-** హే దైత్యాః=ఓ దైత్యులారా!, దేహినామ్=జీవులకు, దేహయోగేన=దేహ సంబంధముచే, ఇంద్రియకం సుఖమ్=ఇంద్రియములకు సంబంధించిన సుఖం, సర్వత్ర=అన్ని వేళలా, యథా=ఏ ప్రకారము, దుఃఖమ్=దుఃఖము, అయత్నతః=ప్రయత్నములేక, దైవాత్=పూర్వ జన్మ కర్మమున, అదృష్టము వలన, లభ్యతే=లభించును.

**తాత్పర్యము:-** జీవులకు దేహంబంధముచే ఇంద్రియ సంబంధమగు సుఖము సైతము ప్రయత్నము లేకయే సంభవించు దుఃఖము పూర్వజన్మకర్మమున లభించును.

**శ్లో॥ తత్ప్రయాసో న కర్తవ్యో యత ఆయుర్వ్యయః పరమ్।**
**న తథా విన్దతే క్షేమం ముకున్దచరణామ్బుజమ్॥ 9**

**ప్రతిపదార్థము:-** యతః=దేనివలన, పరమ్=కేవలము, ఆయుః=ఆయువు, వ్యయః=వ్యయమై పోవును, తతః=అందువలన, తత్=ఆ ఇంద్రియ సుఖమును గురించి, ప్రయాసః=శ్రమ, న కర్తవ్యః=చేయదగదు, తథా=ఆ విధముగా, క్షేమమ్=క్షేమమును, న విందతే=పొందదు, ముకుంద చరణాంబుజమ్=విష్ణుపాదములసేవ వలన క్షేమమును పొందును.

**తాత్పర్యము:-** కావున ఇంద్రియ సుఖము పొందుటకు ప్రయాసపడవలదు. దీనివలన కేవలము ఆయువు వ్యయమగునే కాని ఇక నేమి ప్రయోజనము లేదు. అట్టి ప్రయత్నము గలవానికి క్షేమము లేదు. విష్ణుపాదముల సేవ వలన లభించు క్షేమమును లభింపదు.

**శ్లో॥ తతో యతేత కుశలః క్షేమాయ భవమాశ్రితః।**
**శరీరం పౌరుషం యావన్న విపద్యేత పుష్కలమ్॥ 10**

**ప్రతిపదార్థము:-** తతః=అందువలన, కుశలః=నేర్పుగలవారు, భవమాశ్రితః=సంసారమును ఆశ్రయించినవారు, పౌరుషమ్=పురుషరూపమైన, శరీరమ్=శరీరము, యావత్=ఎంతవరకూ,

వాడై, అశాంతకామః=శాంతింపని కామమును గలవాడై, కుటుంబీ=ఈ సంసారి, తత్=పరవిత్తమును, హరతే=అపహరించుచున్నాడు.

**తాత్పర్యము:-** ధనకనకవస్తువాహనాదులందు ఎల్లప్పుడును నిమగ్నమైన చిత్తం గలవాడై, ఇతరుల ధనమును హరించువానికి చనిపోయినపుడు నరకాదులను యున్నప్పుడు దండనాదులను ఎఱుంగు చున్నవాడయ్యును. అట్లెఱింగినవాడయు ఇంద్రియములను జయించనివాడై శాంతింపని కామమును గలవాడై ఈ సంసారి పరవిత్తమును, అపహరించుచున్నాడు.

**శ్లో॥ విద్వానపీత్థం దనుజాః కుటుమ్బం-పుష్ణన్ స్వలోకాయ న కల్పతే వై।**
**యః స్వీయపారక్యవిభిన్నభావస్తమః ప్రపద్యేత యథా విమూఢః॥ 24**

**ప్రతిపదార్థము:-** దనుజాః=ఓ రాక్షసులారా!, విద్వాన్ అపి=విద్వాంసుడైనను, ఇత్థమ్=ఇట్లు, కుటుంబమ్=తన కుటుంబమును, పుష్ణన్=పోషించుకొనుచు, స్వలోకాయ=ఆత్మ పరామర్శ కొఱకు, న కల్పతే=సమర్థుడు కాడు, స్వీయపారక్యవిభిన్నభావః=ఇది తనది, ఇది పరులది అను భేద భావమును గలవాడై, తమః=నరకమును, ప్రపద్యేత=పొందుచున్నాడు.

**తాత్పర్యము:-** విద్వాంసుడైనను ఇట్లు తన కుటుంబమును పోషించుకొనుచు, ఆత్మ పరామర్శనమునకు సమర్థుడు కాడు. మఱి ఎవ్వడు ఇది తనది ఇది పరునిది అని భేదభావము గలవాడో వాడు మూఢునివలె నరకమును బొందుచున్నాడు.

**శ్లో॥ యతో న కశ్చిత్ క్వచ కుత్ర విద్వాన్ దీనః స్వమాత్మానమలం సమర్థః।**
**విమోచితుం కామదృశాం విహార క్రీడామృగో యన్నిగడో విసర్గః॥ 25**

**ప్రతిపదార్థము:-** యతః=ఎందువలన, కశ్చిత్=ఏ ఒక్కడును, విద్వాన్=విద్వాంసుడు, క్వచ=ఏకాలమునందు, కుత్ర=ఎక్కడను, అలమ్=మిక్కిలి, దీనః=లంపటుడై, ఆత్మానమ్=ఆత్మస్వరూపుడై, స్వమ్=తనను, విమోచితుమ్=విముక్తిగావించుటలో, నసమర్థమ్=సమర్థుడు కాడో, అందువలననే, కామదృశామ్=కామాభిలాషదృష్టిగల స్త్రీల యొక్క, విహారక్రీడామృగః=విహారసాధనమైన క్రీడ కొఱకై జంతువై, యత్=ఏ స్త్రీలయందు, నిగడః=సంకెలతో సమానమైన, విసర్గః=పుత్రాది రూపము గలవాడు అగుచున్నాడు.

**తాత్పర్యము:-** ఎందువలన పండితుడైనను ఏ ఒక్కడును ఏకాలమందును ఎచ్చోటను మిక్కిలి సంసారలాలపట్యముగలవాడై సంసారబంధము నుండి తనను వదిలించుకొనుటకు సమర్థుడు కాకున్నాడో అందువలననే అతడు కామదృష్టిగల స్త్రీలకు విహారసాధనమైన తాను క్రీడాజంతు వగుచు వారియందు తనయంశమున బుత్రుల జనింపజేసి ఆ పుత్రాదిరూప సంకెలగలవాడై బద్ధుడగుచున్నాడు.

**శ్లో॥ తతో విదూరాత్ పరిహృత్య దైత్యా దైత్యేషు సఙ్గం విషయాత్మకేషు।**
**ఉపేత నారాయణమాదిదేవం స ముక్తసఙ్గైరిషితోఽపవర్గః॥ 26**

**ప్రతిపదార్థము:-** దైత్యాః=ఓ దైత్యులారా!, తతః=అందువలన, విషయాత్మకేషు=విషయసుఖము లందు మనసుగలవాడైన, దైత్యేషు=దైత్యులయందు, సంగమ్=స్నేహమును, విదూరాత్ పరిహృత్య





**ప్రతిపదార్థము:-** శ్రేయః+అభిఘాతాత్=శ్రేయస్సును (సద్గతిని) హతమార్చునదై, అయాసాత్=శ్రమవలన, అనుసంస్మృతిమ్=ఇంద్రియసుఖాదికమును గూర్చి, ఈహతామ్=కోరుచు, కుటుంబినామ్=గృహస్థులైన, నః=మనము, మన యొక్క, జ్ఞాతానామ్=బంధువులయొక్క మతివైతథ్యమ్=మనస్సుయొక్క నిష్ఫలమోచనమును, పశ్యధ్యమ్=చూడుడు.

**తాత్పర్యము:-** తమకు గలుగు సద్గతిని జెడగొట్టునదైన శ్రమవలన ఇంద్రియసుఖాభిలాషను స్మరించుచు గృహస్థులైన మనవారి మనోవైపరీత్యమునుఁజూడుము.

**శ్లో॥ నానాయోనిషు గర్భాదిష్వవస్థాసు సదాపదామ్।**
**కాయమాపతనం బిభ్రత్కిం విన్దేచ్ఛం స్వరాడపి॥ 15**

**ప్రతిపదార్థము:-** నానాయోనిషు=పెక్కుప్రాణులందు, గర్భాదిషు=గర్భములంజొచ్చి జన్మించి పెరుగుచు, అవస్థాసు=జాత్యాది బాల్యాది అవస్థలందు, సదా=ఎల్లప్పుడు, ఆపదామ్=ఆపదలను, ఆపతనమ్=నాశనమును పొందు, కాయమ్=శరీరము, బిభ్రత్=భరించు, స్వరాట్+అపి=ఇంద్రుడైనను, శమ్=సుఖమును, కిం విందేత్=ఏమి పొందును.

**తాత్పర్యము:-** నరపశుపక్ష్యాది యోనులంబొంది వాని గర్భములందు జొచ్చి జన్మించి పెరుగుచు బాల్యాది దశల నొందుచు నెల్లప్పుడూ ఆపద లందు నాశనమును పొందుచున్న శరీరమును ధరించిన ఇంద్రుడైనను ఏమి సుఖమును పొందును.

**శ్లో॥ కిం దుష్టం కర్మం కిం స్వస్తి యతః కాలః క్రియాపణః।**
**యేన క్షణే హి తస్యాంతం నేయాజ్జన్మశతైరపి॥ 16**

**ప్రతిపదార్థము:-** దుష్టం కర్మ=చెడుకర్మ, కిమ్=ఏది?, స్వస్తి కిమ్=మంచి కర్మ ఏది?, యతః =దేనివలన, కాలః=కాలము, క్రియాపణః=క్రియావ్యాపారముగలది, యేన=ఏ కాలముచే, క్షణే హి=క్షణకాలమునందు, తస్య=ఆ ఆసక్తికి, అంతమ్=చివరను, జన్మగతైః అపి=నూఱుజన్మముల చేతనూ, న+ఇయాత్=పొందలేదు.

**తాత్పర్యము:-** ఏది చెడు కర్మ? ఏది మంచి కర్మ? దేనివలన కాలము క్రియామాత్ర వ్యవహారము గలదైయున్నదో ఏ కాలమున క్షణముందు ఆసక్తికి అంతమును నరుడు నూఱు జన్మములైనను పొందలేదు.

**శ్లో॥ కో గృహేషు పుమాన్ సక్తమాత్మానమజితేన్ద్రియః।**
**స్నేహపాశైర్దృఢైర్బద్ధముత్సహేత విమోచితుమ్॥ 17**

**ప్రతిపదార్థము:-** పుమాన్=పురుషుడు, కః=ఎవ్వడు, అజిత+ఇంద్రియః=ఇంద్రియములను జయించనివాడు, గృహేషు=గృహధర్మములచే, సక్తం ఆత్మానమ్=బుద్ధిని, స్నేహపాశైః=స్నేహ పాశములచే, బద్ధమ్=కట్టబడిన దానిని, విమోచితమ్=విడుదల చేయుచు, ఉత్సహేత=ఉత్సహించును.

**తాత్పర్యము:-** ఇంద్రియములను జయించని ఏ పురుషుడు గృహదారాది సుఖములందు సక్తమైన బుద్ధిని స్నేహపాశములచే బద్ధమైన దానిని సడలింప నుత్సాహము గలవాడగును. ఎవ్వడు కానేరడు.

**శ్లో॥ కో న్వర్థతృష్ణాం విసృజేత్ ప్రాణేభ్యోఽపి గరీయసీమ్।**
**యం క్రీణాత్యసుభిః ప్రేష్ఠైస్తస్కరః సేవకో వణిక్॥ 18**

**ప్రతిపదార్థము:–** యమ్=ఏ అర్థమును, తస్కరః=చోరుడు, సేవకః=సేవకుడు, వణిక్=వ్యాపారి, ప్రేష్ఠైః=అత్యంత ప్రియములైన, అసుభిః=ప్రాణములచే, క్రీణాతి=కొనుచున్నారు కదా!, ప్రాణేభ్యః+అపి=ప్రాణములకంటెను, గరీయసీమ్=గొప్పవైన, అర్థతృష్ణామ్=ధనాశను, కః ను విసృజేత్=ఎవ్వడు విసర్జించును.

**తాత్పర్యము:–** చోరుడు, యుద్ధ భటుడు, వణిజుడు వీరు మువ్వురు అత్యంత ప్రేమాస్పదములైన తమ ప్రాణములనొసగి ధనమార్జించుచున్నారో ప్రాణములకంటెను దొడ్డదైన ఆ ధనతృష్ణను ఎవడు విసర్జించును?

**శ్లో॥ కథం ప్రియాయా అనుకమ్పితాయాస్సఙ్గం రహస్యం రుచిరాంశ్చ మన్త్రాన్।**
**సుహృత్సు తత్స్నేహసితశ్శిశూనాం కలాక్షరాణామనురక్తచిత్తః॥ 19**

**ప్రతిపదార్థము:–** అనుకంపితాయాః=దయతో కూడినదైన, ప్రియాయాః=ప్రియురాలియొక్క, రహస్యమ్=ఏకాంతమందు జరిగిన, సంగమ్=సంగమమును, సుహృత్సు=స్నేహితులయందు ఏర్పడిన, రుచిరాన్=మనోజ్ఞములైన, మంత్రాన్=సల్లాపములను, తత్+స్నేహసితః=ఆ ప్రియురాండ్రులోనగు వారియొక్క స్నేహముచే బంధింపబడినవాడు, కలాక్షరాణామ్=అవ్యక్త మధురములైన అక్షరములుగల, శిశూనామ్=శిశువులయొక్క, సంగమ్=స్నేహమును, కథమ్=ఎట్లు, అనురక్తచిత్తః=అనురక్తచిత్తుడు, (త్యజేత)

**తాత్పర్యము:–** తనయందు ప్రేమగల ప్రియురాలి రహస్యసంగమమును స్మరించుచూ స్నేహితుల మనోజ్ఞమునలైన సంభాషణలను దలంచుచు వచ్చీరాని మధురములైన మాటలు మాటలాడు శిశువుల స్నేహాన్ని అనురాగ చిత్తుడెట్లు వీడును.

**శ్లో॥ పుత్రాన్ స్మరంస్తా దుహితౄర్హృదయ్యా భ్రాతౄన్ స్వసౄర్వా పితరౌ చ దీనౌ।**
**గృహాన్ మనోజ్ఞోరుపరిచ్ఛదాంశ్చవృత్తీశ్చ కుల్యాః పశుభృత్యవర్గాన్॥ 20**

**ప్రతిపదార్థము:–** పుత్రాన్=పుత్రులను, తాః=మామగారి యింటనున్న, హృదయ్యాః=హృదయంగమైన, దుహితౄః=కూతుళ్ళను, భ్రాతౄన్=సోదరులను, స్వసౄః=చెల్లెండ్రను, దీనౌ=దీనులను, పితరౌ=తల్లిదండ్రులను, మనోజ్ఞ+ఉరుపరిచ్ఛదాన్=మనోహరములైన, గొప్పవైన, శయ్యాసనాదులు గల, గృహాన్=గృహములు, కుల్యాః వృత్తీః చ=కుటుంబపరంపరాగత జీవన వృత్తులను, పశుభృత్యవర్గాన్=పశువులను, భృత్యుల సమూహమును, స్మరన్=స్మరించుట ఎట్లు త్యజింపగలడు? (కథం త్యజేత)

**తాత్పర్యము:–** పుత్రులను, మామగారి యింటనున్న కూతుళ్ళను, భ్రాతలను, చెల్లెండ్రను, దీనులైన తల్లిదండ్రులను మనోహరములైన విలువగల గృహోపకరణములు శయ్యాసన పీఠాదులు గల గృహములను కులపరంపరాగతములై తన జీవనమునకై వృత్తులను, పశువులను భృత్యులను స్మరించువాడు వానిపై మమత నెట్లు వీడును?



**శ్లో॥ త్యజేత కోశస్కృదివేహమానః కర్మాణి లోభాదవితృప్తకామః।**
**ఔపస్థ్యజైహ్వ్యం బహు మన్యమానః కథం విరజ్యేత దురన్తమోహః॥ 21**

**ప్రతిపదార్థము:–** కోశస్కృత్+ఇవ=పట్టుపురుగు తన గూడును నిర్మించుకొని దానికి ద్వారము సైతము లేకుండా మూసివేసుకొనును, కర్మాణి=కామ్య కర్మలను, ఈహమానః=కోరుచున్నవాడు, లోభాత్=లోభమువలన, అవితృప్తకామః=తృప్తిపొందని కామము గలవాడు, దోషదర్శమున విరక్తుడైన, త్యజేత=త్యజించును కదా!, ఔపస్థ్యజైహ్వ్యమ్=శిశ్నమువలనను, జిహ్వవలనను గలుగు సుఖమే, బహు మన్యమానః=అధికముగాదలచుచున్న, దురంతమోహః=తుదిగాంచని అవివేకము గలవాడై, కథం విరజ్యేత=ఎట్లు విరక్తిపొందును.

**తాత్పర్యము:–** పట్టుపురుగు తన గూడును కట్టుకొనుచు ద్వారము సైతము మూసుకొని దాని యందుజేరి రాలేక నశించును. అట్లే నరుడు ఫలములు గోరి కర్మలుఁజేయుచు తృప్తి చెందనివాడు విరక్తుడై గాని వానినెట్లు త్యజించును. మఱి శిశ్నము వలనను, జిహ్వ వలనను గలుగు సుఖమే అధికము అని తలంచువాడెట్లు వానియందు విరక్తిపొందును.

**శ్లో॥ కుటుమ్బపోషాయ వియన్నిజాయుర్న బుధ్యతేఽర్థం విహతం ప్రమత్తః।**
**సర్వత్ర తాపత్రయదుఃఖితాత్మా నిర్విద్యతే న స్వకుటుమ్బరామః॥ 22**

**ప్రతిపదార్థము:–** కుటుంబపోషాయ=తనదార పుత్రాదులను పోషించుట కొఱకై, వియన్=క్షీణించిపోవు, నిజ+ఆయుః=తన ఆయువును, విహతమ్=కొట్టునదైన, అర్థమ్=మోక్షరూపమైన పురుషార్థమును, ప్రమత్తః=మత్తుగలవాడై, న బుధ్యతే=ఎఱుంగడు, సర్వత్ర=అన్నివిధముల, తాపత్రయదుఃఖితాత్మా=ఆధ్యాత్మికాది త్రివిధతాపత్రయములచే దుఃఖమును పొందుచున్న దేహమానములు గల, స్వకుటుంబరామః=తన కుటుంబమునందు రతి కలవాడై, న నిర్విద్యతే=నిర్వేదమును పొందడు.

**తాత్పర్యము:–** ఈ గృహస్థు తన దారపుత్రులను పోషించుట కొఱకై క్షీణించిపోవు తన ఆయువును గాని అలభ్యమైపోవు మోక్షమును గాని మత్తుగొన్నవాడై యెఱుగనేరడు. మఱియు ఎల్లెడల ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అనెడు (శారీరక మానసికములగు ఆధివ్యాధులు, సర్పవృశ్చికాద్యుపద్రవములు) అతివృష్టి క్షామాద్యుత్పాతములు మున్నగునవి తనను దుఃఖింప జేయుచున్నను సంసారాసక్తుడై విరక్తుడు కానేరడు.

**శ్లో॥ విత్తేషు నిత్యాభినివిష్టచేతా విద్వాంశ్చ దోషం పరవిత్తహర్తుః।**
**ప్రేత్యేహ చాథాప్యజితేన్ద్రియస్త దశాన్తకామో హరతే కుటుమ్బీ॥ 23**

**ప్రతిపదార్థము:–** విత్తేషు=ధనకనకవస్తువాహనాదులందు, నిత్యాభినివిష్టచేతాః=ఎల్లప్పుడును నిమగ్నమైన చిత్తం గలవాడై, పరవిత్తహర్తుః=ఇతరుల ధనమును హరించు వానికి, ప్రేత్య=చనిపోయినప్పుడు, దోషమ్=నరకాదులను యున్నప్పుడు దండనాదులను, విద్వాన్ చ=ఎఱుంగుచున్నవాడయ్యును, తథా=అట్లెరింగినవాడయు, అజితేంద్రియః=ఇంద్రియములను జయించని

**శ్లో॥ జ్ఞానం తదేతదఖిలం దురవాపమాహ**
**నారాయణో నరసఖః కిల నారదాయ।**
**ఏకాన్తినాం భగవతస్తదకిఞ్చనానాం**
**పాదారవిన్దరజసాప్లుతదేహినాం స్యాత్॥ 35**

**ప్రతిపదార్థము:-** తత్+ఏతత్+అఖిలమ్=ఇది యంతయు, జ్ఞానమ్=జ్ఞానమగు ఇదంతయు, నరసఖః=నరఋషిసఖుడైన, నారాయణః=నారాయణఋషి, నారదాయ=శ్రోతయగు నారదునికి, దురవాపమ్=సామాన్యులకు పొంద వీలుకాదని దుర్లభమని, ఆహ కిల=చెప్పెను కద!, అట్లగుచో మావంటి వారికెట్లు అధికారము గలుగును అని శంకింపవలదు. భగవతః=భగవంతునియొక్క, ఏకాంతినామ్=ఏకాంతభక్తులై, అకించ నానామ్=ఇతరమైన ప్రయోజనమేదియు లేనివారలైన హరియొక్క, పాదారవిన్దరజసా=పాదరజస్సుచే, ఆప్లుతదేహినామ్=స్నానము చేయబడిన దేహముగల వారలకు, తత్=ఆజ్ఞానము, స్యాత్=కలుగును. కేవలముత్తములకే కలుగును.

**తాత్పర్యము:-** పూర్వము నరఋషిసఖుడైన నారాయణ ఋషి శ్రోతయగు నారదునకు ఉపదేశించు ఈ జ్ఞానము సామాన్యులకు లభించదని చెప్పెను. కాని అనన్య ప్రయోజనమేదియు లేనివారలై ఏ భగవంతునికి ఏకాంత భక్తులై హరి పాద రజస్సుచే స్నానము చేయబడిన దేహము గల వారికి కలుగుననెను.

**శ్లో॥ శాన్తోఽభయో విగతతృట్పరమాత్మ తత్త్వ**
**బోధోదయేన విధుతాత్మ పరిభ్రమాక్షః।**
**యోనోఽవధూతవపుషా పరమేణ చష్టే**
**సుప్తం సముత్థితమివాత్మ వికల్పభేదమ్॥ 36**

**ప్రతిపదార్థము:-** పరమాత్మతత్త్వబోధోదయేన=పరమాత్మతత్త్వ బోధముచే, విధుతాత్మ పరిభ్రమాక్షః=నిరసించి తన్ను పరిభ్రమింప సంసార చక్రము గలవాడు, యః=ఎవడు, నః=మనకు, పరమేణ అవధూత వపుషా=అవధూత వేషముచే, ఆత్మవికల్పభేదమ్=తనను దేహేంద్రియాదులను నా వికల్పించుకొను భేదము, సుప్తమ్=నిద్రపొందినదై, సముత్థిత మివ=మేల్కొనినట్లు, శాంతః =శాంతుడు, అభయః=అభయుడు, విగతతృట్=పోయిన ఆశను కలవాడు అని, నః చష్టే=మాకు చెప్పెను.

**తాత్పర్యము:-** ఎవడు మనలో పరమాత్మబోధ ముదయించటచే తన్ను భ్రమింపజేయు సంసార చక్రమును నిరసించి ఉత్తమమైన అవధూత వేషమును దాల్చి నిద్రయందు లేక స్వప్న మందు గన్పించిన దాని మేల్కొన్నప్పుడు తాను దేహేంద్రియాదులను వికల్పించుకొని ఆ సత్యము గావించుచు శాంతుడు అభయుడు విగతతృష్ణుడు అగునని చెప్పఁబడును.

**శ్లో॥ శ్రుతమేతన్మయా పూర్వం జ్ఞానం విజ్ఞానసంయుతమ్।**
**ధర్మం భాగవతం శుద్ధం నారదాద్దేవదర్శనాత్॥ 37**

**ప్రతిపదార్థము:-** ఏతత్జ్ఞానమ్=ఈ భగవద్విషయకమైన జ్ఞానము, పూర్వమ్=పూర్వము, మయా=





=పరిహరించి, ఆదిదేవమ్=ఆదిదేవుడైన, నారాయణమ్=నారాయణుని, ఉపేత=పొందినవాడై, సః=అతడు, ముక్తసంగైః=సంసారాసక్తి వీడిన ముముక్షులచే, అపవర్గః=మోక్షము, ఇషితః= కోరబడినవాడై ఉన్నాడు.

**తాత్పర్యము:-** అందువల్ల ఓ దైత్య కుమారులారా! మీరు విషయసుఖమును గోరు దైత్యుల స్నేహమును దూరముగా పరిహరించి ఆది దేవుడైన నారాయణుని శరణు పొందుడు. అతడే సంసారాసక్తిని వీడిన ముముక్షులచే కోరబడిన మోక్షరూపుడైయున్నాడు.

**శ్లో॥ నహ్యచ్యుతం ప్రీణయతో బహ్వాయాసోఽసురాత్మజాః।**
**ఆత్మత్వాత్సర్వభూతానాం సిద్ధత్వాదిహ సర్వతః॥ 27**

**ప్రతిపదార్థము:-** అసురాత్మజాః=ఓ అసురకుమారులారా! అచ్యుతమ్=అచ్యుతుని, ప్రీణయతః =పూజధ్యానాదులచే సంతుష్టుగావించినవానికి, బహు ఆయాసః=ఎక్కువ ప్రయాస, నహి=లేదు, సర్వభూతానామ్=ఎల్లభూతములకు, ఆత్మత్వాత్=ఆత్మీయతవలన, ఇహ=ఇక్కడ, సర్వతః=ఎల్లడల, అన్నింటియందు, సిద్ధిత్వాత్=సిద్ధించియుండుటవలన.

**తాత్పర్యము:-** ఓ అసుర కుమారులారా! ఆ నారాయణుని ధ్యానించి పూజించు వానికి అతి ప్రయాస ఏమియూ లేదు. ఏలయన అతడు ఎల్ల భూతములకు ఆత్మీయమైయున్నాడు ఇచట ఎచ్చోట పరిశీలించినను అచ్చోట సిద్ధముగా కన్పట్టుచుండును. ఆత్మయై అంతట సిద్ధించినవాడై యున్నాడు అను రెండు హేతువులను ఉపపాదించుచున్నాడు.

**శ్లో॥ పరాపరేషు భూతేషు బ్రహ్మాన్తః స్థావరాదిషు।**
**భౌతికేషు వికారేషు భూతేష్వథ మహత్సు చ॥ 28**

**ప్రతిపదార్థము:-** పర+అపరేషు=ఉత్కృష్టం నికృష్టమైన విధములైన, బ్రహ్మాంతః స్థావరాదిషు= బ్రహ్మదేవుడు చివరగా గల చెట్లులోనగు స్థావరములగు, భూతేషు=జీవులందు, భౌతికేషు= పంచమహాభూతముల సంబంధులై, వికారేషు=నామరూప వికారములు పొంది, జీవులు కాని ఘటపటాది పదార్థములందును, అథ మహత్సు చ=దొడ్డవైన, భూతేషు=పంచమహాభూతము లందును.

**తాత్పర్యము:-** పెద్ద చిన్న మంచి చెడు మేలు కీడు అను ధర్మములు పొంది వివిధములై బ్రహ్మ దేవుడు తుదిగా గలిగిన పర్వత వృక్ష స్థావర పదార్థములగు తావులందును కేవలము భూత వికారమువలనై జీవులు కానివైన ఘటపటాది వస్తువులందు మఱియు పంచభూతము లందును.

**శ్లో॥ గుణేషు గుణసామ్యే చ గుణవ్యతికరే తథా।**
**ఏక ఏవ పరో హ్యాత్మా భగవానీశ్వరోఽవ్యయః॥ 29**

**ప్రతిపదార్థము:-** గుణేషు=సత్వరజస్తమోగుణములందును, గుణసామ్యే చ=త్రిగుణములందు సామ్యతగల ప్రధానము నందును, తథా=ఆ ప్రకారము, గుణవ్యతికరే=గుణముల వైషమ్యమును పొందిన మహదహంకారములందును, పరః=బ్రహ్మస్వరూపుడు, ఆత్మ పరమాత్మ, భగవాన్= భగవంతుడు, ఈశ్వరః=ఈశ్వరుడు, అవ్యయః=నాశరహితుడు, ఏకః ఏవ=ఒక్కడే యున్నాడు.

**తాత్పర్యము:-** సత్వరజస్తమో గుణములందును ఆ త్రిగుణములు సామ్యత నొందిన ప్రధానము లందును అట్లు గుణవైషమ్యమును పొందిన మహత్తత్త్వము అహంకారములోనగు వాని యందును, పరబ్రహ్మస్వరూపుడు పరమాత్మ, భగవంతుడు, పరమేశ్వరుడు, అవ్యయుడు ఒక్కడే యున్నాడు.

**శ్లో॥ ప్రత్యగాత్మస్వరూపేణ దృశ్యరూపేణ చ స్వయమ్।**
**వ్యాప్యవ్యాపకనిర్దేశ్యో హ్యనిర్దేశ్యోఽ వికల్పితః॥ 30**

**ప్రతిపదార్థము:-** ప్రత్యగాత్మస్వరూపేణ=ద్రష్టయు భోక్తయునగువారి స్వరూపముచేత, దృశ్యరూపేణ =దృశ్యము, భోగ్యమునగు దేహాదుల రూపముచేత, వ్యాప్యకతయా=వ్యాప్యమనగా దృశ్యము వ్యాపకుడనగా ద్రష్ట అను రూపము నిర్దేశింపదగినవాడై, అనిర్దేశ్యః=ఇట్టివాడని నిర్దేశింప వీలు కానివాడు, వికల్పితః హి=పై విధముగా మాయచే వికల్పించబడియున్నాడు.

**తాత్పర్యము:-** పరమాత్మ ఇట్టివాడని నిర్దేశింప వీలు కాని వాడయ్యు తాను ప్రాణుల హృదయం పొంది ద్రష్టయై కర్మఫలభోక్తయగు జీవుడై దృశ్యమగు ప్రపంచస్వరూపుడై భోగ్యములగు దేహాది రూపుడై యుండుచున్నాడు.

**శ్లో॥ కేవలానుభవానన్దస్వరూపః పరమేశ్వరః।**
**మాయయాన్తర్హితైశ్వర్య ఈయతే గుణసర్గయా॥ 31**

**ప్రతిపదార్థము:-** కేవల+అనుభవ+ఆనందస్వరూపః=ముఖ్యముగా అనుభవించదగు ఆనందమే స్వరూపముగా గలవాడగు, పరమేశ్వరః=పరమేశ్వరుడు, మాయయా=మాయచే సృజించు, అంతర్హిత+ఐశ్వర్యః=కనపబడని ఐశ్వర్యము, ప్రభుశక్తి సంపదకలవాడై, గుణసర్గయా= గుణములచే, ఈయతే=వెలుగుంచున్నాడు.

**తాత్పర్యము:-** కేవలము సమాధియందు అనుభవించదగు ఆనందస్వరూపుడగు పరమేశ్వరుడు త్రిగుణముల సృజించునదైన మాయచే కానరాకుండ నావరింపబడిన తన ఐశ్వర్యము కలవాడై వెలుంగుచున్నాడు.

**శ్లో॥ తస్మాత్సర్వేషు భూతేషు దయాం కురుత సౌహృదమ్।**
**భావమాసుర మున్ముచ్య యాయా తుష్యత్యధోక్షజః॥ 32**

**ప్రతిపదార్థము:-** తస్మాత్=అందువలన, అసురం భావమ్=అసురము, పరహింసాత్మకమగు భావమును, ఉన్ముచ్య=వదలి, సర్వేషు భూతేషు=ఎల్లభూతములందు, దయామ్=దయను, సౌహృదమ్=స్నేహమును,కురుత=కావింపుము, యయా=ఏమాయచే, అధోక్షజః=విష్ణువు, తుష్యతి =సంతోషించును.

**తాత్పర్యము:-** ఆ భగవంతుడే ఎల్లతావులందున్నాడు కావున మీరు మీ హింసాత్మకమగు ఆ అసురభావమును విసర్జించి ఎల్లప్రాణులపై దయను, స్నేహమును జూపుము. దానిచే మహావిష్ణువు సంతోషించును.



**శ్లో॥ తుష్టే చ తత్ర కిమలభ్యమనన్త ఆద్యే**
**కిం తైర్గుణవ్యతికరాదిహ యే స్వసిద్ధాః।**
**ధర్మాదయః కిమగుణేన చ కాంక్షితేన**
**సారంజుషాం చరణయోరుపగాయతాం నః॥ 33**

**ప్రతిపదార్థము:-** అనంతః=అనంతుడు, ఆద్యే=ఆద్యుడు, తుష్టే చ=సంతుష్టుడు అగునేని, కిం అలభ్యమ్=లభించనిదేది కలదు, యమ్=ఏ, వ్యతికరాత్=గుణముల పరిణామమువలన, స్వసిద్ధాః =ప్రయత్నముచే సిద్ధించినట్లు, ధర్మ+ఆదయః=ధర్మ అర్థ కామాదులు గలవో, తైః గుణైః=ఆ గుణములచే, కిమ్=ఏమి ప్రయోజనము, అగుణేన=గుణరహితమై మోక్షముచే, కాంక్షితేన= కోరబడిన, కిమ్=ఏమి ప్రయోజనము,మోక్షము గూడ పనిలేదు, ఉపగాయతామ్=ఆ భగవంతుని గురించి పాడుచు, చరణయోః=ఆయన పాదములయొక్క, సారమ్=అమృతమును, జుషామ్= గ్రోలుచున్న, నః=మనకు.

**తాత్పర్యము:-** అనంతుడు, ఆద్యుడునగు విష్ణువు సంతుష్టుడగునేని పొందరానిదేదిగలదు? సర్వము సులభమగును. భగవంతుని కీర్తించుచు ఆయన చరణ కమలముల అమృతమును పానము చేయుచున్న మనకు గుణపరిణామము నేర్పడు ధర్మార్థకామములను వాని వలన నేమి ప్రయోజనము గలదు? నిర్గుణమైన మోక్షమును గోరుట చేతను ఏమి ప్రయోజనము గలదు?

**శ్లో॥ ధర్మార్థకామ ఇతి యోఽభిహితస్త్రివర్గ**
**ఈక్షా త్రయీ నయదమౌ వివిధా చ వార్తా।**
**మన్యే తదేతదఖిలం నిగమస్య సత్యం**
**స్వాత్మార్పణం స్వసుహృదః పరమస్య పుంసః॥ 34**

**ప్రతిపదార్థము:-** ధర్మార్థకామః ఇతి=ధర్మము అర్థము కామము అని, యః=ఏ, త్రివర్గః= త్రివర్గము, అభిహితః=చెప్పబడినదో దానికొఱకే ఈక్షాదులు చెప్పబడినవో, ఈక్షా=ఆత్మ విద్య, త్రయీ=కర్మ విద్య, నయదమౌ=నీతి, దండము, వివిధా చ=పెక్కు విధములైన, వార్తా=జీవిక కృషి మొదలైన వృత్తులు, తత్+ఏతత్+అఖిలమ్=ఇది అంతయు, నిగమస్య=త్రైగుణ్య విషయమైన వేదము యొక్క ప్రతిపాద్యమని, మన్యే=తలచెదను, సత్యమ్=సత్యమైనచో, నిస్త్రైగుణ్య లక్షణమైన, స్వసుహృదః=తనకు సుహృత్తైన, పరమస్య పుంసః=పరమ పురుషునకు, స్వ+ఆత్మార్పణమ్=తన్ను సమర్పించుటయే.

**తాత్పర్యము:-** త్రైగుణ్య విషయము లేదా నిస్త్రైగుణ్యభావము ధర్మార్థకామములని చెప్పబడు త్రివర్గము కొఱకే ఆత్మవిద్య (తర్కశాస్త్రము), కర్మవిద్య (మీమాంస) రాజనీతి, దండనము మొదలైన శాస్త్రములు పెక్కువిధములు, కృషి వాణిజ్యాదులగు జీవికలు ఇవి యున్నచో చెప్పబడిన వని తలంచెదను. నిజమగు సత్యమేది యనినచో పరమపురుషునకు తనను తాను సమర్పించు కొనుటయే యగును.

**తాత్పర్యము:-** ఇంద్రునిచే పట్టుకొని లాగుకొని పోవుచుండగా మిగుల భయమును ఆక్రోశమును పొందుచు కురరీ (గొఱ్ఱె) మృగమువలె నేడ్చుచున్నట్టి మా తల్లికి యాదృచ్ఛికముగా నా మార్గ మందు తటస్థపడి నారదుడు చూచెను.

**శ్లో॥ ప్రాహ చైనాం సురపతే నేతుమర్హస్యనాగసమ్।**
**ముఞ్చ ముఞ్చ మహాభాగ సతీం పరపరిగ్రహమ్॥ 8**

**ప్రతిపదార్థము:-** సురపతే!=హే సురేంద్రా!, అనాగసమ్=అపరాధమే తెలియని, ఏనామ్=ఈమెను, నేతుమ్=కొనిపోవుటకు, న+అర్హసి=తగవు, మహాభాగ!=ఓ పూజ్యుడా!, పరిపరిగ్రహమ్=ఇతరుల భార్యయై, సతీమ్=పతివ్రతయైన ఈమెను, ముంచ ముంచ=విడువము, విడువుము ప్రాహ= పలికెను.

**తాత్పర్యము:-** ఓ సురేంద్రా! నిరపరాధియగు నీమెను నీవు కొనిపోవదగదు సుమా! ఓ మహాభాగా! ఈ పర కళత్రమైన, పతివ్రతను విడువుము విడువుము అని పలికెను.

**ఇన్ద్ర ఉవాచ**

**శ్లో॥ ఆస్తేఽస్యా జఠరే వీర్యమవిషహ్యం సురద్విషః।**
**ఆస్యతాం ప్రసవో యావత్ మోక్ష్యేఽర్థపదవీం గతః॥ 9**

**ప్రతిపదార్థము:-** అస్యాః=ఈమె యొక్క, జఠరే=గర్భమందు, సురద్విషః=దేవశత్రువైన హిరణ్య కశిపునియొక్క, అవిషహ్యమ్=సహింపకూడని, వీర్యమ్=తేజస్సు, ఆస్తే=ఉన్నది, ప్రసవః=ఈమె ప్రసవము, యావత్=ఎంత పర్యంతమగునో, ఆస్యతామ్=అంత వరకూ ఇచ్చటనే యుండు గాక!, అర్థపదవీమ్=తర్వాత నాప్రయోజనమైన మార్గమును (అనగా ఈమెకు జనించు శిశువును వధించి ఆమెను వదిలెదను), గతః=పొందినవాడనై, మోక్ష్యే=ఈమెను విడవగలను.

**తాత్పర్యము:-** ఈమె ప్రసవించు వరకు నా దగ్గరనే యుండును గాక. ఈమె గర్భమున సురవైరియైన హిరణ్యకశిపుని తేజము గలదు. ఈమె ప్రసవించిన తర్వాతనే నా ప్రయోజనమును సాధించి అనగా ఆ శిశువును వధించి వదలెదను.

**నారద ఉవాచ**

**శ్లో॥ సోఽయం నిష్కిల్బిషః సాక్షాన్మహాభాగవతో మహాన్।**
**న త్వయా ప్రాప్స్యతే సంస్థామనన్తానుచరో బలీ॥ 10**

**ప్రతిపదార్థము:-** సః అయమ్=ఈమె గర్భమందున్న ఆ యీ శిశువు, నిష్కిల్బిషః=పాపరహితుడు, సాక్షాత్=ప్రత్యక్షముగా, మహాన్=దొడ్డవాడైన, మహాభాగవతః=గొప్పభక్తుడు, అనంత+అనుచరః =విష్ణువు సహాయుడుగాగలవాడు, త్వయా=నీచే, సంస్థామ్=మృత్యువును, న ప్రాప్స్యతే=పొందదు, బలీ=బలాఢ్యుడు.

**తాత్పర్యము:-** ఈమె గర్భమున నున్న శిశువు పాపరహితుడు, గొప్పవాడు, గొప్ప భగవద్భక్తుడు, విష్ణు సహాయము గలవాడు, బలీయుడు, నీచే మృత్యువు పొందదు.



నాచేత, విజ్ఞాన సంయుతమ్=అనుభవముతో కూడినది, భాగవతమ్=భగవత్సంబంధి, శుద్ధమ్ =శుద్ధమైన, ధర్మమ్=ధర్మమును, దేవదర్శనాత్=భగవద్దర్శనము గల, నారదాత్=నారదుని వలన, శ్రుతమ్=వినబడెను.

**తాత్పర్యము:-** పూర్వము నేను భగవంతుని దర్శించిన నారదుని అనుభవముతో గూడినదై భగవత్సంబంధియునగు శుద్ధమైన ధర్మమైన ఈ జ్ఞానమును వింటిని.

**దైత్యపుత్రా ఊచుః**

**శ్లో॥ ప్రహ్లాద త్వం వయం చాపి నర్తేఽన్యం విద్మహే గురుమ్।**
**ఏతాభ్యాం గురుపుత్రాభ్యాం బాలానామపి హీశ్వరౌ॥ 38**

**ప్రతిపదార్థము:-** ప్రహ్లాద!=ఓ ప్రహ్లాద!, త్వమ్=నీవు, వయం చ=మేమును, బాలానామ్= బాలురకును, ఈశ్వరౌ=మనలను శాసించుతేనియందు, ఏతాభ్యామ్=ఈ గురుపుత్రులే, అన్యం గురుమ్=గురుపుత్రులువినా ఇతరమైన గురుని, న విద్మహే=గుర్తెరుంగము, నర్తే=నీకునూ.

**తాత్పర్యము:-** ఓయీ ప్రహ్లాద! నీకు గాని, మాకు గాని, బాలురకు గాని గురుశాసనులైన ఈ ఇరువురు గురుపుత్రులు తప్ప ఇతరులెవ్వరును గురువున్నట్లు గానము. నీ కెవ్వరు ఈ జ్ఞానము బోధించిరో మఱి ఆ గురువుల కడకు వచ్చుటకు మాకును నేల నారదుని దగ్గఅకు పోవుటకు అది ఎట్లు కుదురును. మిక్కిలి చిన్నవారమైన బాలురమగు మనలను గురులు శాసించుచుండ మఱి ఇతరమగు చోటుకి పోవుట కవకాశమెట్లు?

**శ్లో॥ బాలస్యాన్తఃపురస్థస్య మహత్సఙ్గో దురన్వయః।**
**ఛిన్ధి నః సంశయం సౌమ్య స్యాచ్చేద్విస్రమ్భకారణమ్॥ 39**

**ప్రతిపదార్థము:-** అంతఃపురస్థస్య=అంతఃపురమున నుండు, బాలస్య=బాలునికి, మహత్ సంగః =మహాత్ముల సంబంధము, దురన్వయః=దుర్ఘటము. సౌమ్య!=ఓ సౌమ్యుడా! విస్రంభకారణమ్= విశ్వాసహేతువు,స్యాత్ చేత్=అగునెడల, నః సంశయమ్=మా సంశయమును, ఛిన్ధి=పోగొట్టుము.

**తాత్పర్యము:-** అంతఃపురమున నుండు బాలునికి మహాత్ములతో కూడుకొనుట ఎట్లు సంభవించును? నమ్మదగు కారణము చెప్పి మా సంశయమును పోగొట్టుము.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**ప్రహ్లాదేన బాలానాం బ్రహ్మజ్ఞానవర్ణనం నామ షష్ఠోఽధ్యాయః(6)**

## శ్రీః
## అథ సప్తమోఽధ్యాయః

ఈ సప్తమాధ్యాయమందు తాను మాతృగర్భమునందున్నప్పుడు నారదుడు ఉపదేశించెనని ప్రహ్లాదుడు శిష్యులకు విశ్వాసము సిద్ధించుటకై ఆ విషయమును వర్ణించెను.

**నారద ఉవాచ**

**శ్లో॥ ఏవం దైత్యసుతైః పృష్టో మహాభాగవతోఽసురః।**
**ఉవాచ స్మయమానంస్తాన్ స్మరన్మదనుభాషితమ్॥ 1**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఇట్లు, దైత్యసుతైః=దైత్య పుత్రులచే, పృష్టః=ప్రశ్నింపబడినవాడై, మహాభాగవతః=దొడ్డ భగవద్భక్తుడై, అసురః=అసురకుమారుడైన ప్రహ్లాదుడు, స్మయమానన్=నవ్వుచు, మత్+అనుభాషితమ్=నేను (నారదుడు) భాషించిన దానిని, స్మరన్=స్మరించుచు, తాన్=ఆ దైత్యపుత్రుల గుంచి, ఉవాచ=వచించెను.

**తాత్పర్యము:–** ఇట్లు దైత్య కుమారులు తన్ను ప్రశ్నింప దొడ్డ భగవద్భక్తుడు ప్రహ్లాదుడు నవ్వుచూ నేను జేసిన ఉపదేశవాక్యములను స్మరించుచు ఆవారలకిట్లనెను.

**ప్రహ్లాద ఉవాచ**

**శ్లో॥ పితరి ప్రస్థితేఽస్మాకం తపసే మన్దరాచలమ్।**
**యుద్ధోద్యమం తదా చక్రుర్విబుధా దానవాన్ ప్రతి॥ 2**

**ప్రతిపదార్థము:–** అస్మాకమ్=మాయొక్క పితః=తండ్రి (హిరణ్యకశిపుడు), తపసే=తపము కఱకు, మందర+అచలమ్=మందర గిరికి, ప్రస్థితే=ప్రయాణమై పోయినవారు కాగా, తదా=అప్పుడు, విబుధాః=దేవతలు, దానవాన్ ప్రతి=దానవులపై, యుద్ధోద్యమమ్=యుద్ధ ప్రయత్నమును, చక్రుః =చేసిరి.

**తాత్పర్యము:–** మా తండ్రి తపము చేయుటకు మందర పర్వతమునకు ప్రయాణమై పోగా ఆ సమయము కనిపెట్టి దేవతలు దానవులపై యుద్ధమునకు ప్రయత్నించిరి.

**శ్లో॥ పిపీలికైరహిరివ దిష్ట్యా లోకోపతాపనః।**
**పాపేన పాపోఽభక్షీతి వాదినో వాసవాదయః॥ 3**

**ప్రతిపదార్థము:–** లోక+ఉపతాపనః=లోకమునకు మిగుల తాపమును కలిగించువాడు, పాపః =పాపియైన హిరణ్యకశిపుడు, పాపేన=తన పాపముచేత, అహిః ఇవ=సర్పము వలె, పిపీలికైః =చీమలచే, అభక్షి ఇతి=కఱువబడినందువలన భక్షింపబడెనని, దిష్ట్యా వాదినః=హర్షముతో వచించుచు, వాసవాదయః=ఇంద్రాదిదేవతలు చెప్పిరి.

**తాత్పర్యము:–** లోకములనన్నింటిని బాధించు పాపాత్ముడా హిరణ్యకశిపుడు సర్పమువలె తన పాపముచేతనే చీమలచేఁ గఱువబడెనని సుఖముగ వచించుచు ఇంద్రాదులు తెల్పిరి.



**శ్లో॥ తేషామపి బలోద్యోగం నిశమ్యాసురయూథపాః।**
**వ్యధమానాస్సురైర్భీతా దుద్రువుస్సర్వతో దిశమ్॥ 4**

**ప్రతిపదార్థము:–**తేషాం+అపి=ఆ దేవతలయొక్క, బల+ఉద్యోగమ్=దండెత్తివచ్చిన ప్రయత్నమును, నిశమ్య=విని, అసురయూథపాః=అసురసేనా నాయకులు, సురైః=దేవతలచేత, వధ్యమానాః =చంపబడుదురు అని, భీతాః=భయపడి, సర్వతోదిశమ్=అన్ని దిక్కులకు, దుద్రువుః=పరుగెత్తిరి.

**తాత్పర్యము:–** ఆ దేవతలు దండెత్తి వచ్చుటను విని అసురసేనా నాయకులు మనలను వధింతురని సురలకు భయపడి నలుగడలకు బరువెత్తి పోయిరి.

**శ్లో॥ కళత్రపుత్రవిత్తాప్తాన్ గృహాన్ పశుపరిచ్ఛదాన్।**
**నాపేక్షమాణాస్త్వరితాః సర్వే ప్రాణపరీప్సవః॥ 5**

**ప్రతిపదార్థము:–** కళత్ర పుత్ర మిత్రాః=భార్య, పుత్రులు ధనములు గలవారై, తాన్=ఆ, గృహాన్= గృహములు, పశుపరిచ్ఛదాన్=పశువులను గృహోపకరణములను, న+అవేక్షమాణాః=అపేక్షించని వారగుచు, త్వరితాః=తొందరపడుతూ, సర్వే=ఎల్లరు, ప్రాణపరీప్సవః=ప్రాణరక్షణాసక్తులైరి.

**తాత్పర్యము:–** వారు భార్యాపుత్రులను, ధనముతోను గూడి గృహములను, పశువులను శయ్యాసనాది గృహోపకరణములను వీడి వానియందు అపేక్షలేనివారై ప్రాణరక్షణాసక్తులై త్వరగా పరువెత్తిపోయారు.

**శ్లో॥ వ్యలుమ్పన్ రాజశిబిరమమరా జయకాఙ్క్షిణః।**
**ఇన్ద్రస్తు రాజమహిషీం మాతరం మమ చాగ్రహీత్॥ 6**

**ప్రతిపదార్థము:–**జయకాంక్షిణః=జయముచే ప్రకాశించు, అమరాః=దేవతలు, రాజశిబిరమ్=రాజు వసించు నగరును, వ్యలుంపన్=సర్వము నపహరించి నాశనము చేసిరి, ఇంద్రః తు=ఇంద్రుడు మాత్రము, రాజమహిషీమ్=రాజు పట్టపుదేవిని, మమ=నాయొక్క, మాతరమ్=తల్లియైన ఆమెను, అగ్రహీత్=పట్టుకొనెను.

**తాత్పర్యము:–** జయప్రకాశకులగు సురలు అమూల్యములగు సర్వవస్తువులు కొల్లగొట్టుచు రాచనగరును హతమార్చిరి. ఇంద్రుడు మాత్రము రాజుయొక్క పట్టపుదేవియగు మా తల్లిని పట్టుకొనెను.

**శ్లో॥ నీయమానాం భయోద్విగ్నాం రుదతీం కురరీమివ।**
**యదృచ్ఛయాగతస్తత్ర దేవర్షిర్ద దృశేన్ పథిః॥ 7**

**ప్రతిపదార్థము:–** యదృచ్ఛయా=స్వేచ్ఛమై, తత్ర=అచ్చోటికి, యదృచ్ఛయా=యాదృచ్ఛకముగా ఆగతః=వచ్చిన,దేవర్షిః=నారదుడు, నీయమానామ్=ఇంద్రునిచే కొనిపోబడుతున్న, భయోద్విగ్నామ్ =భయముచే దిగులుపడినదియు, కురరీం ఇవ=కురరీమృగమువలె (గొఱ్ఱె), రుదతీమ్=ఏడ్చు చున్నదియును, పథి=మార్గమునందు, దదృశే=చూసెనో.

**ప్రతిపదార్థము:-** హేమకారః=స్వర్ణకారుడు, స్వర్ణశిలలున్న భూములందు, తత్=ఆ, అభిజ్ఞః =స్వర్ణమున్నదని తెలిసినవాడు, యథా=ఏ ప్రకారము, గ్రావసు=ప్రకాశించు స్వర్ణ కణములు గల శిలలందు, యోగైః=కొలిమియందుబెట్టి, తథా=అట్లే, అధ్యాత్మవిత్=ఆత్మజ్ఞానము గలవాడు, క్షేత్రేషు=పరమాత్మ ప్రవేశించు క్షేత్రములైన, దేహేషు=దేహములందు, ఆత్మయోగైః=ఆత్మ ప్రాప్తి గలిగించు ధ్యానాదులచే, శ్రవణాదులచే, బ్రహ్మగతిమ్=బ్రహ్మత్వమును, లభేత= పొందును.

**తాత్పర్యము:-** స్వర్ణకారుడు స్వర్ణములభించు క్షేత్రములందు ఇట స్వర్ణము లభించునని యెఱింగిన వాడై స్వర్ణకణములు స్ఫురించు శిలలను గొనివచ్చి కొలిమియందుంచి, యూది, అగ్ని జ్వాలల ద్వారా వానిలో నుండి స్వర్ణమునెట్లు పొందుచున్నాడో అట్లే ఆధ్యాత్మవిదుడు పరమాత్మయున్న క్షేత్రములైన దేహములందు బ్రహ్మప్రాప్తి కనుకూలములగు శ్రవణాదులు ధ్యానాదులు లోనగు యోగములచే బ్రహ్మత్వమును బొందుచున్నాడు.

**శ్లో॥ అష్టౌ ప్రకృతయః ప్రోక్తాస్త్రయ ఏవ హి తద్గుణాః।**
**వికారా షోడశాచార్యైః పుమానేకస్సమన్వయాత్॥ 22**

**ప్రతిపదార్థము:-** ఆచార్యైః=కపిలాదులగు ఆచార్యులచే, ప్రకృతయః=ప్రకృతులు సృష్టికి మూల కారణములు మూలప్రకృతి, మహదహంకార తన్మాత్రలు, అష్టౌ=ఎనిమిదియు, త్రయః ఏవహి= సత్వాదులు మూడే. తద్గుణాః=ఆ ప్రకృతి గుణములే కాని భిన్నములు గావు, వికారాః=వికృతులు ఆ ప్రకృతులవలన జనించినవి, షోడశ=ఇంద్రియములు పది. మనస్సు,పంచభూతములు చేరి పదునాఱనియు, సమన్వయాత్=వీనియందు సాక్షియైయున్నాడు, పుమాన్=పురుషుడు, ఏకః= ఒకడు అని, ప్రోక్తాః=చెప్పబడినది.

**తాత్పర్యము:-** సాంఖ్యదర్శన ప్రవర్తకుడు కపిల మహర్షిలోనగు ఆచార్య పురుషులు మూల ప్రకృతి మహత్తత్వము అహంకారము, శబ్దస్పర్శరూప రసగంధములగు ప్రకృతులు (ప్రకృతి యనగా తాను మఱి యొక వస్తువును బుట్టించునది) ఎనిమిది, అవియు ఆ మూల ప్రకృతియొక్క గుణములు, సత్త్వరజస్తమస్సులను మూడనియు, ఆ ప్రకృతుల వలన జనించిన వికృతులు, జ్ఞానేంద్రియ పంచ కర్మేంద్రియ పంచకము, మనస్సు, పంచ మహాభూతములు అని పదునాఱును వీనియందు సాక్షియైయుండు పురుషుడు ఒక్కడని చెప్పిరి.

*మూలప్రకృతిరవికృతిర్మహదాద్యాః ప్రకృతివికృతయస్సప్త।*
*షోడశక స్సువికారో న ప్రకృతి న వికృతిః పురుషః॥*

మూల ప్రకృతి యెప్పుడును వికృతి కాదు. ఇది సత్వరజస్తమస్సులను మూడు గుణములు గలది. ఈ ప్రకృతి వలన అహంకారము. దీనివలన మహత్తత్త్వము, దానివలన పంచతన్మాత్రలు జనించినవి. కావున ఇవి ప్రకృతి యొక్క వికృతులునై తర్వాతి ఇంద్రియాదులను జనింపఁ జేయునవి. కావున ప్రకృతులునై ఉన్నవి. వికృతులని చెప్పబడు ఇంద్రియ దశకము మనస్సు పంచ మహాభూతములు ఆ తన్మాత్రల వలన జనించిన వికృతులు. ఇవి కేవలము వికృతులే యగును. ఏలయన వాని వలన జనించు వస్తువేదియు లేదు. కావున ఇవి ప్రకృతులుగావు.



**శ్లో॥ ఇత్యుక్తస్తాం విహాయేన్ద్రో దేవర్షేర్మానయన్ వచః।**
**అనన్తప్రియభక్త్యైనాం పరిక్రమ్య దివం యయౌ॥ 11**

**ప్రతిపదార్థము:-** ఇతి+ఉక్తః=ఇట్లు చెప్పబడినవాడై, ఇంద్రః=ఇంద్రుడు, దేవర్షేః=నారదుని యొక్క వచః=మాటను, మానయాన్=గౌరవించుచు, తామ్=ఆమెను, విహాయ=వీడి, అనంత ప్రియభక్త్యా =విష్ణునకు ప్రియుడైన నా భక్తిచే, ఏనామ్=ఈమెను గురించి, పరిక్రమ్య=ప్రదక్షణము చేసి, దివం యయౌ=స్వర్గమునకు పోయెను.

**తాత్పర్యము:-** ఇట్లు నారదుడు చెప్పగా విని ఇంద్రుడు నారదుని మాటను గౌరవించుచు విష్ణుప్రియుడైన నాయొక్క భక్తిచే ఈమెకు ప్రదక్షిణము చేసి స్వర్గమునకు పోయెను.

**శ్లో॥ తతో మన్మాతరమృషిస్సమానీయ నిజాశ్రమమ్।**
**ఆశ్వాస్యేహోష్యతాం వత్సే యావత్తే భర్తురాగమః॥ 12**

**ప్రతిపదార్థము:-** తతః=అంత, ఋషిః=నారదుడు, మాతరమ్=మా తల్లిని, నిజ+ఆశ్రమమ్=తన ఆశ్రమమును గురించి, సమనీయ=కొనిపోయి, ఆశ్వాస్య=ఓదార్చి, వత్సే=ఓ అమ్మాయీ, యావత్ =ఎంతవరకూ, తే భర్తుః=నీ భర్త యొక్క, ఆగమః=రాక కలుగునో, తావత్=అంతవరకూ, ఇహ=ఇక్కడ, ఉష్యతామ్=వసింపుమనెను.

**తాత్పర్యము:-** అంతట నారదమహర్షి ఆమెను తన ఆశ్రమమునకు గొనిపోయి ఓ అమ్మాయీ నీ భర్త మరలి వచ్చునంత వరకూ ఇచ్చటనే యుండుమనెను.

**శ్లో॥ తథేత్యవాత్సీద్దేవర్షేరన్తి సాప్యకుతోభయా।**
**యావద్దైత్యపతిర్ఘోరాత్తపసో న న్యవర్తత॥ 13**

**ప్రతిపదార్థము:-** సా అపి=మాతల్లియు, తథా+ఇతి=అట్లేయని, దేవర్షేః=దేవర్షియైన నారదుని, అంతి=సమీపమున, అకుతోభయా=ఎవరి వలన భయములేనిదై, యావత్=ఎంతవరకు, దైత్యపతిః =హిరణ్యకశిపుడు, ఘోరాత్=ఘోరమైన, తపసా=తపస్సునుండి, న న్యవర్తత=మరలి రాలేదో అంతవరకూ అచ్చటనే యుండెను.

**తాత్పర్యము:-** అట్లే యని దేవర్షి దగ్గర మాతల్లి యెవరివలనను భయములేనిదై దైత్యపతి ఘోరమైన తపస్సు నుండి మరలివచ్చు వరకూ అచ్చటనే యుండెను.

**శ్లో॥ ఋషిం పర్యచరత్తత్ర భక్త్యా పరమయా సతీ।**
**అన్తర్వత్నీ స్వగర్భస్య క్షేమాయేచ్ఛాప్రసూతయే॥ 14**

**ప్రతిపదార్థము:-** తత్ర=ఆ నారదుని ఆశ్రమమందు, అంతర్వత్నీ=గర్భవతియైన మాతల్లి, స్వగర్భస్య=తన గర్భముయొక్క, క్షేమాయ=క్షేమము కొఱకు, ఇచ్ఛాప్రసూతయే=ఇష్టముతో తన భర్త వచ్చిన తర్వాత ప్రసవించుట కొఱకును, పరమయా=ఉత్తమమైన, భక్త్యా సతీ=భక్తితో గూడినదై, ఋషిమ్=ఆ నారదుని, పర్యచరత్=పరిచరించెను.

**తాత్పర్యము:-** ఆ యాశ్రమమునందు గర్భవతియైన మా తల్లి తన గర్భములోని శిశువు

క్షేమము కొఱకు, ఇష్టముతో తన భర్త మరలివచ్చిన తర్వాత ప్రసవించుట కొఱకును మిక్కిలి భక్తితో ఆ నారదునికి శుశ్రూష చేయుచునుండెను.

**శ్లో॥ ఋషిః కారుణికస్తస్యాః ప్రాదాదుభయమీశ్వరః।**
**ధర్మస్య తత్త్వం జ్ఞానం చ మామప్యుద్దిశ్య నిర్మలమ్॥ 15**

**ప్రతిపదార్థము:-** కారుణికః=దయాళువైన, ఋషిః=నారదుడు, తస్యాః=ఆమె శోకశాంతికై, ధర్మస్యతత్త్వమ్=భాగవతధర్మములేక భక్తియొక్క లక్షణమును, నిర్మలం జ్ఞానం చ=ఆత్మనాత్మ వివేకమును, తత్ ఉభయమ్=ఆ రెండును, ఈశ్వరః=సమర్థుడైన అతడు, మామపి=నన్ను కూడ, ఉద్దిశ్య=ఉద్దేశించి, ప్రాదాత్=ఉపదేశించెను.

**తాత్పర్యము:-** పరమ దయాళువైన ఆ నారదుడు ఆమెకు శోకశాంతికై భక్తి లక్షణమును, నిర్మలమైన ఆత్మానాత్మ వివేకమును, నన్నుగూడ నుద్దేశించి ఈ రెండును ఆమెకు ఉపదేశించెను.

**శ్లో॥ తత్తు కాలస్య దీర్ఘత్వాత్ స్త్రీత్వాన్మాతుస్తిరోదధే।**
**ఋషిణానుగృహీతం మాం నాధునాప్యజహాత్ స్మృతిః॥ 16**

**ప్రతిపదార్థము:-** ఋషిణా=నారదునిచే, అనుగృహీతమ్=అనుగ్రహించబడిన, తత్+తు=ఆ భక్తి, ఆ జ్ఞానము, కాలస్య=కాలముయొక్క, దీర్ఘత్వాత్=పొడవైన దగుటను, స్త్రీత్వాత్=స్త్రీయగుటవలన, మాతుః=మా తల్లి, తిరోదధే=అంతర్భాగ ప్రాణినైన, మామ్=నన్ను, అధునాపి=ఇప్పటికీ, స్మృతిః =ఆ జ్ఞప్తి, న అజహాత్=వదలలేదు.

**తాత్పర్యము:-** ఋషి అనుగ్రహించిన ఆ భక్తి, జ్ఞానము ఉభయమూ చాలాకాలమైనందున స్త్రీ యగుటవలనను మా తల్లి వానిని మరచిపోయెను. కాని ఆ భక్తి జ్ఞానముల స్మృతి ఇప్పుడు కూడా నన్ను వీడలేదు.

**శ్లో॥ భవతామపి భూయాన్మే యది శ్రద్దధతే వచః।**
**వైశారదీ ధీః శ్రద్ధా చ స్త్రీబాలానాం చ మే యథా॥ 17**

**ప్రతిపదార్థము:-** మే వచః=నామాట, యది శ్రద్దధతే=విశ్వసింపబడినదగునేని, భవతాం అపి=మీకును, స్త్రీబాలానామ్=స్త్రీలకు, బాలురకు, మే=నాకు, యథా=వలె, వైశారదీ=దేహాదికము గల అహంకారమును ఛేదించునటువంటివై, ధీః శ్రద్ధా=బుద్ధి విశ్వాసము గలుగును. (భూయత్)

**తాత్పర్యము:-** మీరు నా మాటను విశ్వసింతురేని స్త్రీలకు బాలురకు, నాకు ఎట్లో అట్లే మీకును దేహాద్యహంకారమును బోగొట్టునదై, నిపుణమై బుద్ధిబలము విశ్వాసము గలుగును.

**శ్లో॥ జన్మాద్యాష్షడిమే భావా దృష్టా దేహస్య నాత్మనః।**
**ఫలానామివ వృక్షస్య కాలేనేశ్వరమూర్తినా॥ 18**

**ప్రతిపదార్థము:-** జన్మ+ఆద్యాః=జననములోనగు, (అస్తి=కలదు, జాయతే=జనించుచున్నది, వర్ధతే=పెరుగుచున్నది, పరిణామతే=వృద్ధిపొందుచున్నది, అపక్షీయతే=తగ్గుచున్నది, వినశ్యతి= నశించుచున్నది), షట్=ఆఱును, భావాః=వికారములు, వృక్షస్య=వృక్షమునకు, ఫలానాం ఇవ=ఫలములు వలె, ఈశ్వరమూర్తినా=పరిణమింపజేయు సమర్థమైన స్వరూపముగల, కాలేన=కాలముచేత, దేహస్య=దేహమునకు గన్పట్టుచున్న, ఆత్మనః=ఆత్మకు, న=లేదు.



**తాత్పర్యము:-** జన్మాదులగు షడ్భావ వికారములు అస్తి, జాయతే, వర్ధతే , పరిణామతే, అపక్షీయతే, వినశ్యతే-కలదు, జనించుచున్నది, పెరుగుచున్నది, పరిణమించుచున్నది, కృశించుచున్నది, నశించుచున్నది అను వృక్షమునకు ఫలములట్లు వికారములు గలిగింప సమర్థమైన మూర్తిగల కాలముచే దేహమునకు బాల్యయౌవనాదులగు నవస్థలు చూపట్టుచున్నది. ఆత్మకు కన్పట్టుటలేదు.

**శ్లో॥ ఆత్మా నిత్యోఽవ్యయశ్శుద్ధో హ్యే ఏకః క్షేత్రజ్ఞ ఆశ్రయః।**
**అవిక్రియస్స్వదృగ్ హేతుర్వ్యాపకోఽసఙ్గ్యనావృతః॥ 19**

**ప్రతిపదార్థము:-**ఆత్మా=ఆత్మ, నిత్యః=నిత్యుడు, ఆత్మనాశములేనిది సుమా!, అవ్యయః=క్షీణించు వాడు కాదు, శ్రుతి-ఋతో అక్షరే పరమే వ్యోమన్, శుద్ధః=దోషరహితుడు, ఏ కాలుష్యము లేనివాడు, శ్రుతి-నిరవద్యం నిరంజనం... నిర్దోషి. దీనిచే నంతయును, ఏకః=ఒక్కడు, శ్రుతి -ఏకమేవాద్వితీయా-రెండవదిలేనివాడు. ఏకః క్షేత్రజ్ఞః-దేహాధికము అంత నెఱింగినవాడు, ఆశ్రయః=సర్వజగమునకు ఆశ్రయుడు, శ్రుతి-యస్మిన్ ద్యౌః పృథివీ. అవిక్రియః=వికారములు లేనివాడు,శ్రుతి-నిష్కలం నిష్క్రియం శాంతమ్, స్వదృక్=స్వయంప్రకాశకుడు, ఆత్మజ్యోతి, హేతుః =జగత్కారణుడు, శ్రుతి-స ఇమాన్ లోకాన్... వ్యాపకః=అంతటను వ్యాపించినవాడు, అసంగీ=ఏ సంగము ఆసక్తి లేనివాడు, శ్రుతి-అసంగో హ్యయం పురుషః..., అనావృతః= దేనిచేత నావృతుడు కానివాడు, శ్రుతి-పూర్ణస్య పూర్ణమాదాయ...

**తాత్పర్యము:-** ఆ యాత్మ నిత్యుడు అనగా నాశములేని శుద్ధుడు, ఏ కాలుష్యము లేనివాడు, అవ్యయుడు, క్షీణించనివాడు, ఒక్కడు, ఇతరములేనివాడు, ఎల్లశరీరములందు క్షేత్రజ్ఞుడై జీవరూపమును జీవునకి మూలమైయుండువాడు సర్వజగదాశ్రయుడు, వికారరహితుడు, స్వయం ప్రకాశుడు, జగత్కారణుడు, సర్వవ్యాపి, దేనిచే నావరింపబడనివాడు.

**శ్లో॥ ఏతైర్ద్వాదశభిర్విద్వానాత్మనో లక్షణైః పరైః।**
**అహం మమేత్యసద్భావం దేహాదౌ మోహజం త్యజేత్॥ 20**

**ప్రతిపదార్థము:-** ఆత్మనః=ఆత్మయొక్క, ఏతైః పరైః=ఈ ఉత్కృష్టమైన, ద్వాదశభిః=12, లక్షణైః =లక్షణములచే, దేహాదౌ=దేహము కంటె భిన్నమైనదని, విద్వాన్=ఎఱింగినవాడు, మోహజమ్= అజ్ఞానమున జనించి, అహం మమ=నేను, నాదియను, అసత్+భావమ్=మిథ్యా దృష్టి, అనిత్య భావము, త్యజేత్=త్యజించు.

**తాత్పర్యము:-** ఈ చెప్పబడిన పండ్రెండు విధములైన శ్రేష్ఠములైన ఆత్మలక్షణములతో దేహాదికము కంటె ఆత్మ భిన్నమైనదేని యెఱింగిన విద్వాంసుడు అ జ్ఞానమున జీవించి దేహాదికము నందు నేను నాది అని అజ్ఞానవశమున జీవించి అసద్భావమును మిథ్యాదృష్టిని త్యజించు.

**శ్లో॥ స్వర్ణం యథా గ్రావసు హేమకారః క్షేత్రేషు యోగైస్తదభిజ్ఞ ఆప్నుయాత్।**
**క్షేత్రేషు దేహేషు తథాత్మయోగైరధ్యాత్మవిద్బ్రహ్మగతిం లభేత॥ 21**

ఏర్పడిన కర్మలకు మూలమైన అజ్ఞానమును దహించునదై బుద్ధియొక్క ప్రవాహరూపమైన జాగ్రదాద్యవస్థల నుపరమింపజేయునది. (శబ్దాది విషయములను పైన చెప్పబోవు యోగమును అభ్యసింపవలెను).

**శ్లో॥ తత్రోపాయసహస్రాణామయం భగవతోదితః।**
**యదీశ్వరే భగవతి భక్తిస్స్యాద్యైర్యథా రతిః॥ 31**

**ప్రతిపదార్థము:-** తత్ర=ఆ యజ్ఞాన నాశము, ఉపాయసహస్రాణామ్=వేనవేలు ఉపాయములను, అయమ్=ఈ యోగము, భగవతా=భగవంతునిచేత, ఉదితః=చెప్పబడినది. యథా=నియమ ప్రకారమనుష్ఠించిన, యైః=ఏ ధర్మములచే, ఈశ్వరే=ఈశ్వరుడైన, భగవతి=భగవంతునియందు, రతిః యత్=ఆసక్తిరూపమైన, భక్తిః=భక్తి, స్యాత్=కలుగునో.

**తాత్పర్యము:-** ఆ యజ్ఞానమును బోదోలుటకు వేనవేలు ఉపాయములు గలవు. వానియందు చక్కగా ననుష్ఠించిన ఏధర్మములచే పరమేశ్వరుడైన భగవంతునియందు ఆసక్తిరూపమైన భక్తి కలుగునో అదియే మేలని భగవంతుడు వచించెను.

**శ్లో॥ గురుశుశ్రూషయా భక్త్యా సర్వలబ్ధార్పణేన చ।**
**సఙ్గేన సాధుభక్తానామీశ్వరారాధనేన చ॥ 32**

**ప్రతిపదార్థము:-**గురుశుశ్రూషయా=గురువుల శుశ్రూషచేత, భక్త్యా=ప్రేమచేత, సర్వలబ్ధార్పణేన=తనకు లభించిన దానినంతటిని భగవంతునికి అర్పించుటచేత, సాధుభక్తానామ్=సాధువులైన భక్తులయొక్క, సంగేన=స్నేహముచేత, ఈశ్వర+ఆరాధనేన చ=పరమేశ్వరుని ధ్యానించి, పూజించుటచేతను

**తాత్పర్యము:-** ఆ యోగము గురుశుశ్రూషచేతను, భక్తిచేతను, తన సర్వలాభములను సమర్పించుట చేతను, సాధువులగు భక్తుల స్నేహము చేతను పరమేశ్వరుని ధ్యానించి, పూజించుట చేతను ఆచరింపవలెను.

**శ్లో॥ శ్రద్ధయా తత్కథాయాం చ కీర్తనైర్గుణకర్మణామ్।**
**తత్పాదామ్బురుహధ్యానాత్తల్లిఙ్గేక్షార్హణాదిభిః॥ 33**

**ప్రతిపదార్థము:-** తత్+కథాయామ్=ఆ భగవంతుని చరిత్రమందు, శ్రద్ధయా=శ్రద్ధతోడనూ, గుణకర్మణామ్=ఆ భగవంతుని గుణములను, చేసెడు కర్మలను, కీర్తనైః=కీర్తించుటచేతను, తత్+పాద+అంబురుహధ్యానాత్=ఆ భగవంతుని పాదారవిందముల ధ్యానము వలన, తత్+లింగ +ఈక్షణ+అర్హణ+ఆదిభిః=ఆ భగవంతుని మూర్తుల సందర్శనము, పూజ, వందనము లోనగు వానిని కామించుట చేతను, చేయనగును.

**తాత్పర్యము:-** భగవచ్చరిత్రమును శ్రద్ధతో వినుటను, భగవంతుని గుణములను ఆతని గుణ, కృత్యములను కీర్తించుట చేత, భగవంతుని పాదకమలములను ధ్యానించుట, భగవంతుని మూర్తులను సందర్శించుట,పూజించుట,నమస్కరించుటలోనగు వానిచే యాగమనుష్ఠించవలెను.





**శ్లో॥ దేహస్తు సర్వసఙ్ఘాతో జగత్తస్థురితి ద్విధా।**
**అత్రైవ మృగ్యః పురుషో నేతి నేతీత్యతత్త్యజన్॥ 23**

**ప్రతిపదార్థము:-** సర్వసంఘాతః=పైన పేర్కొన్న మూల ప్రకృతి మొదలు పురుషుడు వరకు గల '25' తత్త్వములు అన్నింటి కూడిక గల, దేహః=దేహము, జగత్=జంగమము, మనుష్యాదికము, తస్థుః=స్థావరము, వృక్షాదికము, ఇతి ద్విధా=అని రెండు విధములగును, పురుషః=పరమాత్మయగు పురుషుడు, అత్రైవ=ఈ దేహము నందే, న+ఇతి న+ఇతి+ఇతి=ఇది కాదు ఇది కాదు అని, అతత్=ఆత్మలేని అనాత్మలగు దేహాదికమును, త్యజన్=విసర్జించి, పొందదగిన వాడు.

**తాత్పర్యము:-** పై శ్లోకమునందు పేర్కొన్న మూల ప్రకృతి మొదలు పురుషుడు వరకు గల ఇరువది యైదు తత్త్వములు అన్నింటి కూడిక గల ఈ దేహము జంగమము మనుష్య మృగ జంతుపక్ష్యాదికము, స్థావరము వృక్షాదికములు అని రెండు విధములు. ఈ దేహమునందే ఆ పురుషుడు వెదకదగినవాడగుచున్నాడు. ఎట్లనగా ఇది కాదు ఇది కాదు (ఇది ఆత్మకాదనుట) అని అత్మలేని దేహేంద్రియాదులను విసర్జించుచు పోయినచో వీనికంటె వేఱుగ నుండు ఆ పురుషుడు పొందశక్యమగుచున్నాడు.

**శ్లో॥ అన్వయవ్యతిరేకేణ వివేకేనోశతాత్మనా।**
**సర్గస్థానసమామ్నాయైర్విమృశద్భిరసత్వరైః॥ 24**

**ప్రతిపదార్థము:-** అన్వయ వ్యతిరేకేణ=అన్వయము చేతను, హారమునందలి మణులందు అంతట సూత్రము చొచ్చి అనుస్యూతమై యుండుట అన్వయము. వ్యతిరేకములచేత, మణులవలన సూత్రమునకు వలె ఒక మణి నుండి మరియొక మణికి మాత్రము పోవుచుండును గాని మణిపోదు. ఏ మణి ఎచ్చటనుండునో అచ్చటనే యుండును. మొదట మణికి తర్వాత మణుల సంబంధము లేక వ్యతిరేకము. మఱి అన్ని మణుల సంబంధము కలిగియున్నను సూత్రము వానికంటె వేఱుగనుండుట.

మఱి నేను ఇచ్చగించుచున్నాను ఎఱుగుచున్నాను. ద్వేషించుచున్నాను. అను జ్ఞాన రూపము లైన బుద్ధేచ్ఛాదులకు జ్ఞాతయందు అహమర్థమును జెప్పుట. అన్వయము-నా శిరము, నా పాణి నా పాదము అనుట వ్యతిరేకము. ఇట్లు అన్వయ వ్యతిరేకములుగల, వివేకేన=వివేకముచే ఒక్కొక్క మణికిని సూత్రము వేఱైయున్న, ఉశత= శుద్ధమైన, ఆత్మనా=మనస్సుచేతను, సర్గస్థాన సమామ్నాయైః=సృష్టి, స్థితి, సంహారములచేత, "యతో వా ఇమాని భూతాని జాయంతే" అని ఇట్లు శ్రుతిలోనగు వానిచే చెప్పబడి సర్గాదులను సాధనము చేతను, అసత్వరైః=వ్యాకులచిత్తులు కానివారై, విమృశద్భిః=విచారించువారిచే, ఆ పురుషుడు వెదుకబడుచున్నాడు.

**తాత్పర్యము:-** మణిహారమున మణులందంతట సూత్రము అను స్యూతమైయున్నదను అన్వయము. అట్లును స్యూతమైయున్నను మణులవలన వేఱైయున్నదనుట వ్యతిరేకము అను నీ రెండును గల వివేకము చేతను (అనగా దేహేంద్రియాదులంతట వర్తించి జాగ్రదాదులవస్థ లందు మూడింట యందుండుట అన్వయము. వానికి వేఱైయున్నాను. అనుట వ్యతిరేకము.)

నిర్మలమైన మనస్సుచేతను, జగము సృష్టి, స్థితి, సంహారాదుల అనుసంధానము చేతను నిర్వ్యాకుల చిత్తులై విచారించువారిచే ఆ పురుషుడు వెదుకబడుచున్నాడు.

**శ్లో॥ బుద్ధేర్జాగరణం స్వప్నస్సుషుప్తిరితి వృత్తయః।**
**తా యేనైవానుభూయన్తే సోఽధ్యక్షః పురుషః పరః॥ 25**

**ప్రతిపదార్థము:–** బుద్ధేః=బుద్ధియొక్క, జాగరణమ్= జాగ్రత్త, స్వప్నః=కల, సుషుప్తిః=నిద్ర, ఇతి=అను, తాః=ఆ, వృత్తయః=అవస్థలు, యేన=ఎవనిచే, ఏవం అనుభూయంతే=అనుభవింప బడుతున్నవో, సః=అతడు, అధ్యక్షః=సాక్షియై, పరః=పరమాత్మయు, పురుషః=పురుషుడైయున్నాడు.

**తాత్పర్యము:–** బుద్ధి వృత్తులైన జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడింటి నెవడు ననుభవించుచున్నాడో సాక్షియై వీనికన్నింటికీ దూరుడైయున్నాడో వానిని అన్వేషింతును.

**శ్లో॥ ఏభిస్త్రివర్ణైః పర్యస్తైర్బుద్ధిభేదైః క్రియోద్భవైః।**
**స్వరూపమాత్మనో బుద్ధ్యేద్గంధైర్వాయుమివాన్వయాత్॥ 26**

**ప్రతిపదార్థము:–** అతః=అందువలన, ఏభిః=ఈ, బుద్ధిభేదైః=బుద్ధియొక్క పరిణామములు, పర్యస్తైః =అనాత్మధర్మములగుటచేత అంతట నిరసింపబడినదియు, త్రివర్ణైః=త్రిగుణాత్మకములును, క్రియా+ఉద్భవైః=కర్మజన్యములచే, ఆత్మనః స్వరూపమ్=ఆత్మ స్వరూపము, బుద్ధ్యేత్ అన్వయాత్ =బుద్ధియందు అన్వయించియుండుటవలన, ఇందు, గంధైః=కుసుమ ధర్మములైన గంధములచే, వాయుం ఇవ=వాయువు వలె.

**తాత్పర్యము:–** త్రిగుణాత్మకములై అనాత్మధర్మములగుటచే నంతట నిరసింపబడినవై ఈ కర్మ జన్యములైన బుద్ధి పరిణామములందు అనగా బుద్ధియే త్రిగుణాత్మకమై నందునను కర్మ, కర్తయైనందునను ఈ అవస్థలు బుద్ధికే యగును. ఆత్మమాత్రము బుద్ధియందు అన్వయించి యుండుట వలన పుష్పగంధములచే నాశ్రయించబడిన వాయువువలె ఆ యవస్థలు గలవాడు వలె తోచుచున్నాడు.

**శ్లో॥ ఏతద్ద్వారో హి సంసారో గుణకర్మనిబన్ధనః।**
**అజ్ఞానమూలోఽపారోఽపి పుంసస్స్వప్న ఇవేష్యతే॥ 27**

**ప్రతిపదార్థము:–** సంసారః=ఈ సంసారము, ఏతత్+ద్వారః హి=బుద్ధి ద్వారా కలిగినదా లేక బుద్ధియొక్క అవస్థల ద్వారా కలిగినది కాని స్వయముగా గాదు. ఏలయన, గుణకర్మ నిబంధనః =బుద్ధియొక్క ఏ గుణములు కర్మలు గలవో వానిచే కట్టుబడి యుండునది. అట్లే, అజ్ఞానమూలః =అజ్ఞానము కారణముగా గలది, అపారః=మిథ్యయైనది, పుంసః=పురుషునికి, స్వప్నః+ఇవ= స్వప్నము వలె, ఇష్యతే=పొందబడుచున్నది, వాయువునకు గంధవంతమగు ద్రవ్య సంబంధము వాస్తవమైన దగుట వలన దృష్టాంతము విషయమని తెలియవలెను.

**తాత్పర్యము:–** ఈ సంసారము బుద్ధి ద్వారకమగును బుద్ధి యొక్క అవస్థల ద్వారా ఏర్పడినది కాని స్వయముగానే ఏర్పడినది గాదు. బుద్ధియొక్క గుణములచేతను, కర్మలచేతను నిబంధింప బడినది. అజ్ఞానమే కారణముగా గలది, మిథ్యా భూతము అనగా అనిర్వాచ్యము. (సత్యాసత్య నిరూపణమునకు దుర్ఘటమైనది). పురుషుడు ఈ సంసారమును స్వప్నము వలె పొందుచున్నాడు. వాయువునకు గంధవంతమగు కుసుమద్రవ్య సంబంధము వాస్తవమగుటవలన దృష్టాంత మిచట విషయమని తెలియవలెను.





**శ్లో॥ మనోమయత్వాత్సర్వేఽస్వప్నజాగరయోస్సమాః।**
**దృష్టానష్టా అపి ధ్యాతుశ్శోకమోహభయప్రదాః॥ 28**

**ప్రతిపదార్థము:–** సర్వే అర్థాః=సమస్తము పదార్థములు, మనోమయత్వాత్=మనోమయము లగుట వలన, స్వప్నజాగరయోః=స్వప్నమునకూ జాగ్రదవస్థలకూ, సమాః=సమములైయున్న, దృష్టాః=చూడబడినవియు, నష్టాః+అపి=నశించినవి అయినను, ధ్యాతుః=వానిని గురించి మననము చేయువానిని, శోకమోహభయప్రదాః=శోకము, మోహము, భయము అనువానిని ఇచ్చునవగుచున్నవి.

**తాత్పర్యము:–** కనిపించు సర్వపదార్థములు మనస్సుచే సంకల్పించబడినవై తోచుచున్నవి. (వాస్తవమున అసత్యములనుట) ఎట్లనగ జాగ్రద్దశ మేల్కొనియున్నప్పుడు కనిపించు పదార్థములు స్వప్నమునందు గనిపించవు. అట్లే స్వప్నమునందు తోచు పదార్థము లేవియు జాగ్రద్దశయందు కనిపించవు. కనుక సర్వపదార్థములు మనస్సంకల్పమాత్రమున తోచుచున్నవి. అట్లా వస్తువులు కనపడి మాయమై పోవుచున్నను వానిని గురించి చింతించు వానికి శోకమోహభయములను దప్పక గలిగించునవగుచున్నవి.

**శ్లో॥ పరస్య నిర్గుణస్యాపి గుణసఙ్గాదనిర్వృతిః।**
**వ్యక్తం జన్మాత్యయో వ్యక్తశ్శయానస్యేహ న స్వతః॥ 29**

**ప్రతిపదార్థము:–** నిర్గుణస్య=గుణరహితుడై, పరస్య+అపి=పరమాత్మునికిని, గుణసంగాత్= గుణముల సంబంధమువలన, అనిర్వృతిః=దుఃఖమును, జన్మ=జన్మము, వ్యక్తమ్=కనబడును, అత్యయః=లయము, వ్యక్తః=కనబడును, శయానస్య=హృదయమునందు శయనించిన వానికి, స్వతః=స్వయముగ, న=అవి కలుగవు.

**తాత్పర్యము:–** నిర్గుణుడైన పరమాత్మకు గుణముల సంపర్కము వలననే దుఃఖము, జన్మము, మరణము గలుగుచున్నవి. హృదయ గృహయందు శయనించినవానికి స్వయముగా జన్మ మరణములు కలుగవు.

**శ్లో॥ తస్మాద్భవద్భిః కర్తవ్యం కర్మణాం త్రిగుణాత్మనామ్।**
**బీజనిర్హరణం యోగః ప్రవాహోపరమో ధియః॥ 30**

**ప్రతిపదార్థము:–** తస్మాత్=అందువలన, భవద్భిః=మీచేత, త్రిగుణాత్మనామ్=త్రిగుణాత్మకము లైన, కర్మణామ్=కర్మలయొక్క, బీజనిర్హరణమ్=అజ్ఞానదహామును, ధియః=బుద్ధియొక్క, ప్రవాహ+ ఉపరమః=జాగ్రదాది రూపమైన దశలను ఉపరమింపజేయు, యోగః=ధ్యానయోగము, కర్తవ్యః =చేయదగినదగును.

**తాత్పర్యము:–** అజ్ఞానమువలన జన్మాదులు కలుగుచున్నవి కావున మీరు త్రిగుణములవలన

**తాత్పర్యము:-** జ్యోతిష్టోమాది రాజసూయాది క్రతువులొనర్చి బడయు స్వర్గాది లోకములన్నియు నశించిపోవునవి, అనిత్యము, పుణ్యము యొక్క తారతమ్యమునననుసరించి హెచ్చుతగ్గులు కలవి మనస్పర్థలకు స్థానమైనవి కావున శ్రుతిస్మృతులచే నెచ్చటను దూషింపబడని, దూషణము వినిగాని, కనిగాని యెఱుగని పరమపురుషుడగు హరిని ఆత్మలాభము కొఱకు ఆత్మస్థిరత్వము కొఱకు శాశ్వత మోక్షము కొఱకు భజింపుడు. తద్యదేహ కర్మచితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే.

**శ్లో॥ యదర్థ ఇహ కర్మాణి విద్వన్మాన్యః సకృన్నరః।**
**కరోత్యతో విపర్యాసమమోఘం విన్దతే ఫలమ్॥ 43**

**ప్రతిపదార్థము:-** యత్+అర్థః=ఏ ప్రయోజనమర్థించి, విద్వాన్=విద్వాంసుడు, మాన్యః=పూజ్యుడు (అభిమానము కలవాడై కర్తనని అహంతో), నరః=నరుడు, అసకృత్=పలుమాఱు, ఇహ=ఈ భూమియందు, కర్మాణి=యాగాది కర్మలు, కరోతి=చేయునో, అతః=వాని సంకల్పికము, విపర్యాసమ్=వ్యతిరిక్తమై, అమోఘమ్=అవశ్యభోగ్యమైన, ఫలమ్=ఫలమును, విందతే=పొందు చున్నాడు.

**తాత్పర్యము:-** ఏ ప్రయోజనమును బడయగోరి సంకల్పించి విద్వాంసుడైన నరుడు తాను కర్తనను అభిమానముగలవాడు (మాని) ఇచ్చటనే యాగాది కర్మలు చేయుచున్నాడు. అతడు తన సంకల్పమునకు విపరీతమై అవశ్య భోగ్యమైన ఫలమును బొందుచున్నాడు.

**శ్లో॥ సుఖాయ దుఃఖమోక్షాయ సఙ్కల్ప ఇహ కర్మణః।**
**స ఆప్నోతీహయా దుఃఖమనీహాయాస్సుఖావృతః॥ 44**

**ప్రతిపదార్థము:-** (యః=ఎవడు), సుఖాయ=సుఖము కొఱకు, దుఃఖమోక్షాయ=దుఃఖము పోవుటకు, కర్మణః=కర్మయొక్క, సంకల్పః=సంకల్పము, ఇహ=ఇచ్చట చేసిన, సః=వాడు, ఈహాయా=అట్టి కోరికచే, క్రియచే, దుఃఖమ్=దుఃఖమును, విందతే=పొందును, అనీహయాః =కోరికలేనందువలన, సుఖ+ఆవృతః=సుఖముతో కూడినవాడగును.

**తాత్పర్యము:-** పూర్వము నిష్కాముడు సుఖముతో కూడినవాడు. తర్వాత ఎవడు నింకను సుఖము కొరకును, దుఃఖము పోవుటకును సంకల్పించి కోరికతో కర్మ ఆచరించునో వాడు దుఃఖమునే పొందును.

**శ్లో॥ కామాన్ కామయతే కామ్యైర్యదర్థమిహ పూరుషః।**
**స వై దేహస్తు పారక్యో భఙ్గురో యాత్యుపైతి చ॥ 45**

**ప్రతిపదార్థము:-** పూరుషః=పురుషుడు, యత్+అర్థమ్=దేనికొరకు, ఇహ=ఈ జగమునందు, కామ్యైః=కామ్యకర్మలచే, కామాన్=కోరికలను, కామయతే=కోరుచున్నాడో, సః=ఆ, దేహః= దేహమైతే, పారక్యః=పరుల సొమ్ము శ్వాసము లోనగువాని భోజ్యములు, ఉపైతి=పొందుచున్నాడు, భంగురః=నాశమై ఒకప్పుడు, యాతి=పోవును.

**తాత్పర్యము:-** పురుషుడు దేని కొఱకు ఇహలోకమందు కామ్య కర్మములను గావించు



**శ్లో॥ హరిస్సర్వేషు భూతేషు భగవానాస్త ఈశ్వరః।**
**ఇతి భూతాని మనసా కామైస్తైస్సాధు మానయేత్॥ 34**

**ప్రతిపదార్థము:-** హరిః భగవాన్=ఆహరి భగవంతుడు, ఈశ్వరః=పరమేశ్వరుడు, సర్వేషు భూతేషు =ఎల్లభూతములయందు, ఆస్త ఇతి=నిలిచియున్నాడు అని, భూతాని=ఎల్లప్రాణులు, తైః కామైః =వాని వాని ఇష్టములచేత, తీర్చుటచే, మనసా=మనసుతో, సాధు=చక్కగా, మానయేత్= గౌరవించవలెను.

**తాత్పర్యము:-** హరి, భగవంతుడు, పరమేశ్వరుడు, ఎల్లభూతములందు నిల్చియున్నవాడని మనస్సుచే నిశ్చయించుకొని, ఆయా ప్రాణుల యభీష్టములను తీర్చుచూ వానిని గౌరవింపవలెను, ఆదరింపవలెను.

**శ్లో॥ ఏభిర్నిర్జితషడ్వర్గైః క్రియతే భక్తిరీశ్వరే।**
**వాసుదేవే భగవతి యయా సంలభతే రతిమ్॥ 35**

**ప్రతిపదార్థము:-** భగవతి=భగవంతుడైన, వాసుదేవే=వాసుదేవునందు, యయా=దేనిచే, రతిమ్=ఆసక్తిని, సంలభతే=పొందుచున్నాడో, నిర్జితషట్+వర్గైః=కామ,క్రోధ,లోభ,మోహ,మద మత్సరము లనెడి ఆఱింటిని జయించిన, ఏభిః=పైన పేర్కొన్న పూజారులచే, ఈశ్వరే= పరమేశ్వరునియందు, భక్తిః=భక్తి, క్రియతే=ఆచరించబడుచున్నదో.

**తాత్పర్యము:-** కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను అరిషడ్వర్గములగు ఆఱింటిని జయించి పైన పేర్కొన్న పూజారుల ద్వారా, పరమేశ్వరునియందు భక్తి ఆచరించినచో భగవానుడగు వాసుదేవునియందు ఆసక్తి కలుగుచున్నది.

**శ్లో॥ నిశమ్య కర్మాణి గుణానతుల్యాన్వీర్యాణి లీలాతనుభిః కృతాని।**
**యదాతిహర్షోత్పులకాశ్రుగద్గదం-ప్రోత్కణ్ఠ ఉద్గాయతి రౌతి నృత్యతి॥ 36**

**ప్రతిపదార్థము:-** లీలాతనుభిః=లీలాసార్థముగ్రహించిన అవతారమూర్తుల రూపమున కావించిన, వీర్యాణి=అద్భుతకృత్యములచేత, కర్మాణి=పనులను, అతుల్యాన్=సాటిలేని, గుణాని=భక్త వాత్సల్యాది గుణములను, నిశమ్య=విని, అతిహర్షోత్పులకాశ్రుగద్గదమ్-అతిహర్ష=మిక్కిలి సంతోషముచే, ఉత్పులక+అశ్రు=జనించిన గగుర్పాటు కన్నీళ్ళచే, గద్గదమ్=కంఠస్వరము డగ్గుత్తిక పడునట్లు, ప్రోత్కంఠః=బిగ్గర కంఠస్వరము కలవాడై, ఉద్గాయతి=గట్టిగా పాడును, రౌతి=అరచును, నృత్యతి=ఆడును.

**తాత్పర్యము:-** భక్తుడైనవాడు పరమేశ్వరుడు, లీలామానుషవిగ్రహుడు భూజగమునందు గావించిన అద్భుతకృత్యములను సాటిలేని భక్తివాత్సల్యాది గుణములను విన్నవాడై మిక్కిలి సంతసము చెలువార, మేను గగుర్పొడువ, కన్నులనుండి ఆనందబాష్పములురాల, గొంతెత్తి భగవంతుని గూర్చి, బిగ్గరగా పాడును, అరచును, ఆడుచుండును.

**శ్లో॥ యదా గ్రహగ్రస్త ఇవ క్వచిద్ధసత్యాక్రన్దతి ధ్యాయతి వన్దతే జనమ్।**
**ముహుశ్శ్వసన్ వక్తి హరే జగత్పతే నారాయణేత్యాత్మమతిర్గతత్రపః॥ 37**

**ప్రతిపదార్థము:-** యదా=ఏ వేళలలోనూ, గ్రహగ్రస్తః ఇవ=పిశాచముచే పట్టుకొన్నవాడు వలె, క్వచిత్=ఒకప్పుడు, హసతి=నవ్వును, ఆక్రందతి=ఏడ్చును, ధ్యాయతి=ధ్యానించును, జనమ్= ప్రజలను గురించి, వందతే=నమస్కరించును, ముహుః=మాటిమాటికి, నారాయణ=ఓ నారాయణ, ఇతి=అని, ఆత్మమతిః=పరమాత్మయందు మనస్సుకలవాడై, శ్వసన్=నిట్టూర్చుచూ, గతత్రపః=పోయిన సిగ్గు కలవాడై, హరే, జగత్పతే=ఓ శ్రీహరీ! జగపతీ! అని, వక్తి=పలుకును.

**తాత్పర్యము:-** ఎప్పుడును పరమాత్మయందు మనసునుంచి, సిగ్గులేనివాడు, పిశాచము పట్టుకొన్న వాడువలె ఒకప్పుడు నవ్వును, ఏడ్చును, ధ్యానించును జనులను గురించి నమస్కరించును, మాటికి మాటికి శ్వాసను విడుచుచు, ఓ హరీ! ఓ జగత్పతీ! ఓ నారాయణ అని పలుకుచుండును.

**శ్లో॥ తదా పుమాన్ ముక్తసమస్తబన్ధనస్తద్భావభావానుకృతాశయాకృతిః।**
**నిర్దగ్ధబీజానుశయో మహీయసా భక్తిప్రయోగేణ సమేత్యధోక్షజమ్॥ 38**

**ప్రతిపదార్థము:-** తదా=అపుడు, పుమాన్=పురుషుడు, ముక్తసమస్తబంధనః=విడువబడిన ఎల్ల సంసార బంధములు గలవాడను, (తత్+భావభావానుకతాశయాకృతిః) తత్ భావ=అహం యొక్క స్వభావ చేష్టితములను, భావ=భావనచే, అనుకృతిః=అనుకరించినవైన, ఆశయ+ఆకృతిః =మనసు, శరీరము గలవాడై, నిర్దగ్ధబీజానుశయః=పూర్తిగా దహింపబడిన అజ్ఞానము కర్మవాసన కలవాడై, మహీయసా=దొడ్డదైన, భక్తిప్రవాహేన / ప్రయోగేణ=భక్తి ప్రవాహముచే, అధోక్షజమ్= ఇంద్రియాతీతు డైన విష్ణువును, సమేతి=పొందుచున్నాడు.

**తాత్పర్యము:-** అట్లు భక్తుడైనప్పుడు పురుషుడు సర్వసంసార బంధములను వీడినవాడును, భగవంతుని గుణకర్మల భావనచే తన్మయములైన మనశ్శరీరములు గలవాడును, అజ్ఞానమును కర్మవాసనలను పూర్తిగా దహింపజేసుకొన్నవాడునై ఆ యధోక్షజుని హరిని బొందుచున్నాడు.

**శ్లో॥ అధోక్షజాలమ్భమిహాశుభాత్మనశ్శరీరిణస్సంసృతిచక్రశాతనమ్।**
**తద్బ్రహ్మనిర్వాణసుఖం విదుర్బుధాస్తతో భజధ్వం హృదయే హృదీశ్వరమ్॥ 39**

**ప్రతిపదార్థము:-** అధోక్షజ+ఆలంబమ్=ఇంద్రియాతీతుడైన మహావిష్ణువు యొక్క ఆలంబము ఆధారము మనస్సుచే స్పర్శము, ఇహా=ఈ భూజగతి యందు, అశుభ+ఆత్మనః=రాగాదులతో గూడిన మనస్సుగల, శరీరిణః=దేహికి, సంసృతి చక్రశాతనమ్=సంసారమను చక్రమును నివర్తింప జేయునదియు, తత్=ఆ యాలంబనమే, అ విష్ణువు, బ్రహ్మనిర్వాణసుఖమ్=బ్రహ్మము నందులయ మొందుట మోక్షరూపమైన సుఖమనియు, బుధాః=విద్వాంసులు, విదుః=ఎరుగుదురు, తతః =అందువలన, హృదయే=హృదయమందు, హృత్+ఈశ్వరమ్= అంతర్యామియైన ఆ విష్ణువును, భజధ్వమ్=సేవింపుము.

**తాత్పర్యము:-** ఇంద్రియముల నధఃకరించి వెలుగు మహావిష్ణువును మనసునకు ఆలంబనము చేసుకొనుట (ధ్యానించుట) ఈ భూతలమునందు రాగాది కలుషితస్వాంతుడైన దేహధారికి నరునకు సంసారచక్ర నివర్తితమనియుండు అదియే ఆ ఆలంబనమే బ్రహ్మమునందు లయించు రూపమైన మోక్షసుఖమనియు, విద్వాంసు లెఱుంగుదురు. కావున మీరు మీ హృదయములందు అంతర్యామియైయున్న ఆ విష్ణువును భజింపుడు.





**శ్లో॥ కోऽతిప్రయాసోऽసురబాలకా హరేరుపాసనే స్వే హృది ఛిద్రవత్ సతః।**
**సత్యాత్మనస్సఖ్యురశేషదేహినాం సామాన్యతః కిం విషయోపపాదనైః॥ 40**

**ప్రతిపదార్థము:-** అసురబాలకాః=ఓ అసుర బాలకులారా!, స్వేహృది=తమ హృదయమందు, ఛిద్రవత్=ఆకాశమువలె, సతః=ఉన్నవాడును, సత్య+ఆత్మనః=సత్యస్వరూపుడును, అశేషదేహినామ్ =సర్వ ప్రాణులకు, సఖ్యుః=స్నేహితుడును అగు, హరేః=హరియొక్క ఉపాసనే=ఉపాసనయందు, కః అతిప్రయాసః=ఎక్కువ శ్రమయేమిగలదు? చాల సుఖమనుట, సామాన్యతః=సూకరము మొదలు ఎల్లప్రాణులకు సాధారణమైన, కిం విషయ+ఉపాదనైః=విషయసుఖములను ఆర్జించుటచే నేమి ప్రయోజనము గలదు?

**తాత్పర్యము:-** ఓ అసురబాలకులారా! తమ హృదయములందు ఆకాశము వలె నుండు సత్యస్వరూపుడు, ఎల్ల ప్రాణులకు సఖుడైన హరి నుపాసించుటయందు ఎక్కువ ప్రయాస యేమి కలదు? (ఏమియూ లేదనుట). కావున సూకరము మొదలు ఎల్ల ప్రాణులకు సాధారణమైన ధనదారాది విషయసుఖములనార్జించుటలో ప్రయోజనమేమి కలదు? ఇట్టి బోధయందు పౌనరుక్త్య దోషములేదు. నారదుడు చెప్పిన దాని ననువదించి చెప్పుట వలన దోషము లేదు.

**శ్లో॥ రాయః కలత్రం పశవః సుతాదయోగృహా మహీ కుఞ్జరకోశభూతయః।**
**సర్వేऽర్థకామాః క్షణభఙ్గురాయుషః కుర్వన్తి మర్త్యస్య కియత్ప్రియం చలాః॥41**

**ప్రతిపదార్థము:-** రాయః=ధనములు, కళత్రమ్=భార్య, పశవః=పశువులు, సుతాదయః=సుతులు లోనగువారు, గృహాః=ఇండ్లు, మహాకుంజర కోశభూతయః=భూమి, ఏనుగులు, ధనాగారములు, ఐశ్వర్యము, సర్వే=సమస్తములైన, అర్థకామాః=అర్థకామములు, చలాః=నిలకడలేని, క్షణభంగు రాయుషః=క్షణములో నశించు ఆయువుగల, మర్త్యస్య=మానవునకు, కియత్ప్రియమ్=ఎంత మాత్రము ప్రియము చేయును?

**తాత్పర్యము:-** ధనములు, భార్య, పశువులు, సుతాదులు, ఇండ్లు, భూమి, ఏనుగులు, ధన కోశము, ఐశ్వర్యములోనగు అర్థకామములన్నియు చలించునవి. క్షణములో నశించు వాయువు గల మానవునికి యే మాత్రము ప్రియము లేక సుఖము కలిగింపగలవు?

**శ్లో॥ ఏవం హి లోకాః క్రతుభిః కృతా అమీ-క్షయిష్ణవస్సాతిశయా న నిర్మలాః।**
**తస్మాదదృష్టశ్రుతదూషణం పరం-భక్త్యైకయా తం భజతాత్మలబ్ధయే॥ 42**

**ప్రతిపదార్థము:-** ఏవం హి=ఈ ప్రకారమే, క్రతుభిః=జ్యోతిష్టోమాదియాగములచే, కృతాః= ఆర్జించిన, అమీ=ఈ, లోకాః=స్వర్గాదిలోకములును, క్షయిష్ణవః=నశించునవి. పుణ్యమయి పోయిన తర్వాత వీడిపోవునవియు, అనిత్యములును, స+అతిశయాః=పుణ్యతారతమ్యము ననుసరించి హెచ్చుతగ్గులు గలవియు, న నిర్మలాః=స్పర్ధలు గలవియునైయున్నవి. తస్మాత్= అందువలన, అదృష్టశ్రుతదూషణమ్=కనని, వినని నిందకలవాడైనను, పరమ్=పరముడైన, తమ్=ఆహరిని, ఏకయాభక్త్యా=ఏకాంత భక్తిచే, ఆత్మలబ్ధయే=ఆత్మలాభము కొఱకు, శాశ్వత సౌఖము-మోక్షము కొఱకు, భజత=సేవింపుము.

=పక్షులు, మృగాః=జంతువులు, అచ్యుతతామ్=అమృతత్వమును, విష్ణుసాయుజ్యమును, మోక్షమును, గతాః=పొందినవి, సంతిః=కలవు కదా!

**తాత్పర్యము:-** దైత్యులు, యక్షులు, రాక్షసులు, స్త్రీలు, శూద్రులు, పాపజీవులు అగు పక్షులు, మృగములు ముకుందుని భజించి విష్ణుసాయుజ్యమును, మోక్షమునుఁబొందినవిఁగలవు.

**శ్లో॥ ఏతావానేవ లోకేఽస్మిన్ పుంసః స్వార్థః పరః స్మృతః।**
**ఏకాన్తభక్తిర్గోవిన్దే యత్ సర్వత్ర తదీక్షణమ్॥ 57**

**ప్రతిపదార్థము:-** గోవిందే=గోవిందునియందు, ఏకాంత భక్తిః=అనన్య భక్తియు, సర్వత్ర=అన్నిచోట్ల, యత్=దేనిని గూడ, తత్+ఈక్షణమ్=ఆ హరినిగాంచుచూ, ఏతావానేవ=ఇంత మాత్రమే, లోకే=ఈ లోకమునందు, పుంసః=పురుషునికి, స్వ+అర్థః=స్వప్రయోజనము, పరః =ఉత్కృష్టమైనది, స్మృతః=చెప్పబడినది.

**తాత్పర్యము:-** గోవిందు నందనన్యభక్తి గలిగియుండుట జగమంతట అన్నిటియందు ఆ హరినే సందర్శించుట వలనను ఇంత మాత్రమే ఈలోకమున పురుషునకు అత్యంత శ్రేష్ఠమైన స్వ ప్రయోజనమని చెప్పబడినది.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**ప్రహ్లాదేన దైత్యపుత్రానుశాసనే బ్రహ్మస్వరూపవర్ణనం నామ సప్తమోఽధ్యాయః(7)**



వాంఛలను వాంఛించుచున్నాడో ఆ దేహమే కుక్కలు నక్కలు భుజించు భక్ష్యమగుచున్నది. క్షణములో నశించుచున్నది. దేహిని వీడిపోవుచున్నది. మరల నొకప్పుడు పొందుచున్నది.

**శ్లో॥ కిము వ్యవహితాపత్యదారాగారధనాదయః।**
**రాజ్యం కోశగజామాత్యభృత్యాప్తా మమతాస్పదాః॥ 46**

**ప్రతిపదార్థము:-** వ్యవ.....దయః - వ్యవహిత=దేహముకంటె భిన్నమైన, అపత్య=సంతానము, దార=భార్యలు, ఆగార=ఇండ్లు, ధనాదయః=ధనములోనగునవి, రాజ్యమ్=రాజ్యము, కోశ=ధన కోశము, గజ=దండు, అమాత్య=మంత్రులు, భృత్య=సేవకులు, ఆప్తాః=ఆప్తులు, మమతాస్పదాః =నా వారు అను మమకారమునకు స్థానమైనవారు. కిము=వారలను గురించి కలియుదురు, ఎడబాయుదురు అని వేరుగ చెప్పవలయునా?

**తాత్పర్యము:-** ఆ నేనను అభిమానించు దేహికి అట్లు తనకు గానిదైపోవుచుండ నిక దేహమునకు వేఱైన దేహ సంబంధమును బట్టి ఏర్పడిన పుత్రులు, భార్యలు, ఇండ్లు, ధనములు లోనగునవి, రాజ్యము, ధనకోశము, సైన్యము, మంత్రులు, భృత్యులు, మిత్రులు వీరెల్ల నా వారను మమకారమునకు ఆస్పదులైనవారు కలసికొనుచు యెడబాయుచు ఉందురు అని వేఱుగ చెప్ప వలయునా?

**శ్లో॥ కిమేతైరాత్మనస్తుచ్ఛైస్సహ దేహేన నశ్వరైః।**
**అనర్థైరర్థసఙ్కాశైర్నిత్యానన్దమహోదధేః॥ 47**

**ప్రతిపదార్థము:-** తుచ్ఛైః=అల్పములును, దేహేన సహ=తన దేహసంబంధముతో, నశ్వరైః= నశించునవియు, అనర్థైః=కీడుతెచ్చునవియు, అర్థసంకాశైః=ప్రయోజనముచేకూర్చువానివలె కన్పట్టునవియగు, ఏతైః=ఈ పుత్ర కళాత్రాదులతో, నిత్య+ఆనందమహోదధేః=శాశ్వత ఆనందామృత రస సముద్రుడైన, ఆత్మనః=పరమాత్మయైన తనకు, కిం=ఏమి ప్రయోజనము.

**తాత్పర్యము:-** తుచ్ఛములై దేహసంబంధముతోఁదీఱిపోవునవై అనర్థమునుఁదెచ్చిపెట్టునవై, అర్థవంతములుగఁగన్పట్టునవైన ఈ దారపుత్రాదులవలన శాశ్వతానందామృతవార్ధియగు పరమాత్మయైన తనకు ఏమి ప్రయోజనము గలదు?

**శ్లో॥ నిరూప్యతామిహ స్వార్థః కియాన్ దేహభృతోఽసురాః।**
**నిషేకాదిష్వవస్థాసు క్లిశ్యమానస్య కర్మభిః॥ 48**

**ప్రతిపదార్థము:-** అసురాః=ఓ అసురబాలకులారా!, నిషేక+ఆదిషు=స్త్రీ సంగమములోనగు, అవస్థాసు=దశలగు, కర్మభిః=కర్మలచే, క్లిశ్యమానస్య=క్లేశములను పొందుచు, దేహభృతః=దేహ ధారియైన జీవునకు, ఇహ=ఈ లోకమునందు, కియాన్=ఎంతమాత్రము, స్వ+అర్థః=స్వ ప్రయోజనము గలదో, నిరూప్యతామ్=నిరూపింతురు గాక!

**తాత్పర్యము:-** ఓ అసురబాలకులార! స్త్రీ సంగమముగావించుచు తద్వారా కలిగిన సంతానమునకు జాతకర్మనామకరణాదులగు కర్మలు గావించుచు, క్లేశపడుచున్న ఈ దేహధారికి (జీవునకు) ఈ లోకమందు ఎంతమాత్రము స్వార్థము (తనమేలు) కలదో మీరే నిరూపింపుడు.

శ్లో॥ కర్మాణ్యారభతే దేహీ దేహేనాత్మానువర్తినా।
కర్మభిస్తనుతే దేహముభయం త్వవివేకతః॥ 49

**ప్రతిపదార్థము:-** దేహీ=ఈ జీవుడు, ఆత్మ+అనువర్తినా=తన్ననుసరించివర్తించునట్టి, దేహేన=దేహముచే, కర్మాణి=వాంఛితకర్మలను, ఆరభతే=మొదలిడి చేయుచున్నాడు, దేహమ్=మరియొక దేహమును, తనుతే=పొందుచున్నాడు, అవివేకతః తు=అవివేకము వలన, ఉభయమ్=కర్మయు, దేహమును పొందును.

**తాత్పర్యము:-** తనకు ప్రారబ్ధవశమున సంభవించి వర్తించు దేహముతో గూడిన ఈ జీవుడు పునర్జన్మమునకు హేతువులైన కామ్యకర్మలను జేసి మరల నొకదేహమును పొందును. మరల కర్మచేయును, ఇట్లు ఆత్మజ్ఞానము లేనందువలన కర్మలు చేసి దేహములను బొందుచుండును.

శ్లో॥ తస్మాదర్థాశ్చ కామాశ్చ ధర్మాశ్చ యదపాశ్రయాః।
భజతానీహయాత్మానమనీహం హరిమీశ్వరమ్॥ 50

**ప్రతిపదార్థము:-** అర్థాః చ=అర్థములును, కామాశ్చ=కామములను ధర్మాశ్చ=ధర్మములను, యదపాశ్రయాః=ఏ హరిని ఆశ్రయముగా గలవో, ఆత్మానమ్=పరమాత్మ, అనీహమ్=ఏ కోర్కెలు లేనివాడైన, ఈశ్వరం=పరమేశ్వరుడైన, హరిమ్=హరిని, అనీహయా=కోర్కెలేమియు లేక, భజత=భజింపుము.

**తాత్పర్యము:-** అందువలన అర్థములును, కామములును, ధర్మములును ఏ హరి ఆశ్రయముగా నున్నవో పరమాత్మ పరమేశ్వరుడు, కోర్కెలు లేనివాడునగు ఆ హరిని నిష్కామముతో నుపాసింపుము.

శ్లో॥ సర్వేషామపి భూతానాం హరిరాత్మేశ్వరః ప్రియః।
భూతైర్మహద్భిః స్వకృతైః కృతానాం జీవసఞ్జ్ఞితః॥ 51

**ప్రతిపదార్థము:-** సర్వేషాం అపి=సమస్తమైన వాటికిని, భూతానాం కృతానామ్=చేయబడిన ప్రాణులకు, హరిః=విష్ణువు, ఆత్మా+ఈశ్వరః ప్రియః=ఆత్మయు, ఈశ్వరుడు, ప్రియుడునై, స్వకృతైః =తాను సృజించిన, మహద్భిః=గొప్పవైన, భూతైః=పంచభూతములచే, జీవసంజ్ఞితః =అంతర్యామియునై ఉన్నాడు.

**తాత్పర్యము:-** తాను సృజించిన పంచమహాభూతములచే నేర్పడిన ఎల్ల ప్రాణులకును హరి ఆత్మయు, ఈశ్వరుడు ప్రియుడునై అంతర్యామియునై యున్నవాడు.

శ్లో॥ దేవోఽసురో మనుష్యో వా యక్షో గన్ధర్వ ఏవ చ।
భజన్ముకున్దచరణం స్వస్తిమాన్ స్యాద్యథోదయమ్॥ 52

**ప్రతిపదార్థము:-** దేవః=దేవత, అసురః=అసురుడు, మనుష్యః వా=మనుష్యుడు, యక్షః=యక్షుడు, గంధర్వః ఏవ వా=గంధర్వుడైననుగాని, ముకుందచరణమ్=హరిపాదములను, యథా భజన్=ఏ ప్రకారము భజించుచుందునో ఆ విధముగానే, ఆ ప్రకారముగానే, ఉదయమ్=అభివృద్ధిని, స్వస్తిమాన్=మంగళముగలవాడు, స్యాత్=అగును.





**తాత్పర్యము:-** దేవతలలో నొకడుగాని, అసురుడు, మనుష్యుడుగాని, యక్షుడు, గంధర్వుడు గాని, ముకుందుని చరణారవిందమును అభ్యుదయము గలిగించు దానిని ఎట్లు భజించుచున్నాడో అందుకనుగుణముగా క్షేమముగలవాడగును.

శ్లో॥ నాలం ద్విజత్వం దేవత్వమృషిత్వం వాసురాత్మజాః।
ప్రీణనాయ ముకున్దస్య న వృత్తం న బహుజ్ఞతా॥ 53

**ప్రతిపదార్థము:-** అసురాత్మజాః=అసురబాలకులారా!, ముకుందస్య=విష్ణువుయొక్క ప్రీణనాయ=సంతోషముకొఱకు, ద్విజత్వమ్=బ్రాహ్మణత్వము, దేవత్వమ్=దేవత్వము, ఋషిత్వమ్=ఋషిత్వము, న+అలమ్=ముఖ్యముగావు,న వృత్తమ్=నడివడికలేక, న బహుజ్ఞతా=ఎక్కువ పాండిత్యమువలదు.

**తాత్పర్యము:-** విష్ణువును సంతోషపెట్టుటకు బ్రాహ్మణుడు, దేవత, ఋషి అను జాతి గలవాడగుట పనిలేదు. వృత్తి లేక ఉద్యోగము ఇట్టిది కావలయునని లేదు. మిక్కిలి పాండిత్యము అవసరం లేదు.

శ్లో॥ న దానం న తపో నేజ్యా న శౌచం న వ్రతాని చ।
ప్రీయతేఽమలయా భక్త్యా హరిరన్యద్విడమ్బనమ్॥ 54

**ప్రతిపదార్థము:-** న దానమ్=దానమువలదు, న తపః=తపస్సు పనిలేదు, న ఇజ్యా=యాగము వలదు, న శౌచమ్=ఆచారము వలదు, న వ్రతాని చ=వ్రతములును వలదు, అమలయా=నిష్కామ నిర్మలమైన, భక్త్యా=భక్తిచే, హరిః=విష్ణువు, ప్రీయతే=సంతసించును, అన్యత్=ఇతరము, విడంబనమ్=కేవలము నటనము మాత్రమే అగును.

**తాత్పర్యము:-** దానమువలదు, తపము వలదు, యాగము వలదు, వ్రతము వలదు, హరి కేవలము నిష్కామ భక్తితో ప్రీతిపొందును.

శ్లో॥ తతో హరౌ భగవతి భక్తిం కురుత దానవాః।
ఆత్మౌపమ్యేన సర్వత్ర సర్వభూతాత్మనీశ్వరే॥ 55

**ప్రతిపదార్థము:-** తతః=అందువలన, దానవాః=ఓ దానవ కుమారులారా!, సర్వత్ర=అంతటను, ఆత్మ+ఔపమ్యేన=తమతో సరిపోల్చుకొనుటచేత, సర్వభూతాత్మని=ఎల్లభూతములకు ఆత్మయై, ఈశ్వరే=పరమేశ్వరుడై, భగవతి=భగవంతుడైన, హరౌ=విష్ణువునందు, భక్తిమ్=భక్తిని, కురుత=కావించుము.

**తాత్పర్యము:-** కావున ఓ దానవ కుమారులారా! ఎల్లప్రాణులు మీ వంటి వారని తలచుచు, ఎల్ల ప్రాణులకు ఆత్మయైన పరమేశ్వరుడైన భగవంతుడైన హరియందు భక్తిని గావింపుము.

శ్లో॥ దైతేయా యక్షరక్షాంసి స్త్రియశ్శూద్రా వ్రజౌకసః।
ఖగా మృగాః పాపజీవాః సన్తి హ్యచ్యుతతాం గతాః॥ 56

**ప్రతిపదార్థము:-** దైతేయాః=దైత్యులు, యక్షరక్షాంసి=యక్షులు, రాక్షసులు, స్త్రియః=స్త్రీలు, శూద్రాః =శూద్రులు, వ్రజ+ఓకసః=గొల్లపల్లెలో నివశించు గొల్లలు, పాపజీవాః=పాపజీవులైన, ఖగాః

**శ్లో॥ జహ్యాసురం భావమిమం త్వమాత్మనః-సమం మనో ధత్స్వ న సన్తి విద్విషః।**
**ఋతేఽజితాదాత్మన ఉత్పథస్థితాత్-తద్ధి హ్యనన్తస్య మహత్సమర్హణమ్॥ 10**

**ప్రతిపదార్థము:-** త్వమ్=నీవు, ఆత్మనః=నీయొక్క, ఇమమ్=ఈ, అసురం భావమ్=అసుర సంబంధ మైనభావమును, జహి=వీడుము, మనః=మనసు, సమమ్=సమముగా, ధత్స్వ=ఉంచుము, ఉత్పథస్థితాత్=అధర్మమార్గమున వర్తించుచు, అజితాత్మనః ఋతే=నిగ్రహములేని మనసు, విద్విషః =శత్రువులు, న సంతి=లేరు, తత్ హి=అట్టి శత్రుభావము లేకుండుట, అనంతస్య=అనంతుడైన హరికి, మహత్= గొప్పదైన, సమర్హణమ్=పూజయగును.

**తాత్పర్యము:-** నీవు నీకు గల అ సురభావమును త్యజించుము. మనసు సమదృష్టిలో నుంచుము. అన్యాయప్రవర్తనముగలదై, నిగ్రహశక్తిలేని మనసు కంటె శత్రువు లెవ్వరు లేరు. నీ మనసే నీకు శత్రువనుట. ఇట్లు శత్రుభావములేకుండుటయే శ్రీహరికి దొడ్డపూజ చేసినట్లు అగును.

**శ్లో॥ దస్యూన్ పురా షణ్ణవిజిత్య లుమ్పతో-మన్యన్త ఏకే స్వజితా దిశో దశ।**
**జితాత్మనోజ్ఞస్య సమస్య దేహినాం-సాధోస్తు మోహప్రభవాః కుతః పరే॥ 11**

**ప్రతిపదార్థము:-** ఏకే=నీవంటివారు కొందఱు బుద్ధిహీనులు, పురా=ముందు, లుంపతః= సర్వస్వమును హరించుచున్న, షట్=ఆర్గురైన, దస్యూన్=శత్రువులను, న విజిత్య= జయింపక. దశదిశః=పది దిక్కులను, స్వజితా=జయించితిమని, మన్యన్తే=తలంచెదరు, జిత+ఆత్మనః =మనసును జయించినవాడు, జ్ఞస్య=విద్వాంసుడు, దేహినామ్=ప్రాణులకెల్ల, సాధోః=సాధు పురుషునకు, మోహప్రభవాః=అవివేకము కలుగువారు, పరే=శత్రువులు, కుతః=ఎక్కడ నుండి వచ్చారు?

**తాత్పర్యము:-** నీవంటి మందమతులు కొందఱు తమ సర్వస్వమును హరించుచున్న కామ క్రోధాదులను అరిషడ్వర్గములను జయింపక మేము పదిదిక్కులును దిగ్విజయము చేసితి మని తలంతురు. మనోనిగ్రహము కలిగి విద్వాంసుడై ఎల్లప్రాణులకు సముడైన సాధు పురుషునికి అవివేకముచే నేర్పడు శత్రువులెట్లు కలుగుదురు? అట్టివారికి శత్రువులే లేరని భావం.

**హిరణ్యకశిపురువాచ**

**శ్లో॥ వ్యక్తం త్వం మర్తుకామోఽసి యోఽతిమాత్రం వికత్థసే।**
**ముమూర్షూణాం హి మన్దాత్మన్ నను స్యుర్విప్లవా గిరః॥ 12**

**ప్రతిపదార్థము:-** మందాత్మన్=ఓ మందబుద్ధి, వ్యక్తమ్=నీ సంగతి నిశ్చితమైనది. త్వమ్=నీవు, మర్తుకామః అసి=చావగోరుచున్నావు, యః=ఏ నీవు, అతిమాత్రమ్=మర్యాదనుమించి, వికత్థసే= వదరుచున్నావు, ముమూర్షూణామ్=మరణింపగోరినవారియొక్క, గిరః=వాక్కులు, విప్లవాః= అసన్విత్రములు, నను స్యుః=కాకుందునా ఏమి? అట్లే యగును.

**తాత్పర్యము:-** ఓ బుద్ధిహీనుడా! నీ తత్త్వము నిశ్చయముగా దెలిసినది. నీవు చావగోరు చున్నావు. ఏలయన నీ నోటికి వచ్చినది అధికప్రసంగము చేయుచు వదరుచున్నావు. మరణింపగోరువారి వాక్కులనస్వితములై కాకుందునా, అట్లే యగును.



## శ్రీః
## అథ అష్టమోఽధ్యాయః

ఈ అష్టమాధ్యాయమునందు దైత్యుడు హిరణ్యకశిపుడు పుత్రుని ప్రహ్లాదుని జంపబోవు చున్నవాడు. ఆవిర్భవించిన నరసింహస్వామిచే చంపఁబడును. ఆ నరసింహమూర్తి బ్రహ్మాది దేవతలచే నుతింపబడినవాడై లోపల కృపయను సుధచే పూర్ణుడై పైకి మాత్రము క్రోధము గలవాడగుచు శత్రుభావమున దన్ను భజించు దైత్యుని హిరణ్యకశిపుని తనలోఁగొనెను.

**నారద ఉవాచ**

**శ్లో॥ అథ దైత్యసుతాస్సర్వే శ్రుత్వా తదనువర్ణితమ్।**
**జగృహుర్నిరవద్యత్వాన్నైవ గుర్వనుశిక్షితమ్॥ 1**

**ప్రతిపదార్థము:-** అథ=అంత, దైత్యసుతాః=దైత్యుల పుత్రులు, సర్వే=ఎల్లరు, తత్+అనువర్ణితమ్=ఆ ప్రహ్లాదునిచే వర్ణింపబడిన హరిభక్తిని, శ్రుత్వా=వని, నిరవద్యత్వాత్=నిర్దోషమగుటవలన, జగృహుః =ఆ భక్తిని గ్రహించిరి, గురుః+అనుశిక్షితమ్=గురువు చెంతను బోధించిన నీతి విద్యను, న + ఏవ=ఏ మాత్రము; స్వీకరింపరైరి.

**తాత్పర్యము:-** అంత దైత్యుల సుతులెల్లరు ప్రహ్లాదుడు వర్ణించి చెప్పిన హరిభక్తిని విని అది నిర్దోషమైయున్నందున గ్రహించిరి. కాని గురుపుత్రులు దగ్గరి చేరి బోధించిన రాజనీతి విద్యను ఏ మాత్రము గ్రహింపరైరి.

**శ్లో॥ అథాచార్యసుతస్తేషాం బుద్ధిమేకాన్తసంస్థితామ్।**
**ఆలక్ష్య భీతస్త్వరితో రాజ్ఞ ఆవేదయద్యథా॥ 2**

**ప్రతిపదార్థము:-** అథ=అంత, ఆచార్యసుతః=శుక్రాచార్యుల పుత్రుడు, ఏకాంతసంస్థితామ్= ఏకాంత భక్తియందు నెలకొన్న లేక ఆత్మనిష్ఠమైన, తేషామ్=ఆ దైత్య కుమారుల యొక్క, బుద్ధిమ్=బుద్ధిని, ఆలక్ష్య=చక్కగా గుర్తించి, భీతః=భీతుడై, త్వరితః=తొందరగా, రాజ్ఞః=రాజగు హిరణ్య కశిపునకు, యథా=ఉన్నస్థితిని, ఆవేదయత్=నివేదించెను.

**తాత్పర్యము:-** అంత శుక్రాచార్యుల పుత్రుడు బాలుర గురువు ఈ దైత్యబాలురు ఏకాంత భక్తిని కలిగి ఆత్మ నిష్ఠగలవారైయుండుటను చూచి భీతుడై పరుగెత్తి పోయి హిరణ్యకశిపునకు వారున్న విధమంతయు నివేదించెను.

**శ్లో॥ శ్రుత్వా తదప్రియం దైత్యో గురుణోక్తం సుతానయమ్।**
**కోపావేశచలద్గాత్రః పుత్రం హన్తుం మనో దధే॥ 3**

**ప్రతిపదార్థము:-** గురుణా=గురుపుత్రునిచే, ఉక్తమ్=చెప్పబడిన, అప్రియమ్=తన కయిష్టమైన, తత్=ఆ, సుతానయమ్=పుత్రుని అవనీతిని, శ్రుత్వా=విని, దైత్యః=దైత్యుడైన హిరణ్యకశిపుడు,

కోప+ఆవేశ+చలత్+గాత్రః=కోపము యొక్క ఉద్రేకముతో వణకుచున్న శరీరము గలవాడై, పుత్రమ్=పుత్రుని ప్రహ్లాదుని, హంతుమ్=చంపుటకు, మనఃదధే=మనస్సున సంకల్పించెను.

**తాత్పర్యము:-** దైత్యుడు హిరణ్యకశిపుడు, గురుపుత్రుడు వచించిన తన పుత్రుని అవినీతిని విని కోపోద్రేకముతో చలించిన శరీరము గలవాడై, తన పుత్రుని వధింపమనమున సంకల్పించెను.

**శ్లో॥ క్షిప్త్వా పరుషయా వాచా ప్రహ్లాదమతదర్హణమ్।**
**ఆహేక్షమాణః పాపేన తిరశ్చీనేన చక్షుషా॥ 4**

**ప్రతిపదార్థము:-** అతత్+అర్హణమ్=అట్టి నిందయే తగని, ప్రహ్లాదమ్=ప్రహ్లాదుని, పరుషయా=కఠినమైన, వాచా=వాక్కుచే, క్షిప్త్వా=తిరస్కరించి, పాపేన=రోషముతో కూడిన పాపముగలదై, తిరశ్చీనేన=వక్రమైన, చక్షుషా=కంటితో, ఈక్షమాణః=చూచున్నవాడై, ఆహ=ఇట్లు పలికెను.

**తాత్పర్యము:-** నిందించుటకు ఏమాత్రము తగనట్టి ప్రహ్లాదుని కఠినమైన మాటలచే తిరస్కరించుచు, రోషముతో కూడిన వక్రమైన కంటితో చూచుచు ఇట్లు పలికెను.

**శ్లో॥ ప్రశ్రయావనతం దాన్తం బద్ధాఞ్జలిముపస్థితమ్।**
**సర్పః పాదాహత ఇవ శ్వసన్ ప్రకృతిదారుణః॥ 5**

**ప్రతిపదార్థము:-** ప్రశ్రయ+అవనతమ్=వినయముచే తలవంచుకున్నవాడు, దాంతమ్=ఇంద్రియములను జయించినవాడు, బద్ధాంజలిమ్=సమకూర్చిన దోయిలి కలవాడై, ఉపస్థితమ్=చెంతనున్న ప్రహ్లాదుని (జూచి) ప్రకృతిదారుణః=స్వభావముచే తనే క్రూరుడైన హిరణ్యకశిపుడు, పాద+ఆహతః=పాదముచే త్రొక్కబడిన, సర్పః+ఇవ=సర్పమువలె, శ్వసన్=శ్వాసను విడుచుచు, ఆహ=ఇట్లు పలికెను.

**తాత్పర్యము:-** వినయమునఁదలవంచిన, జితేంద్రియుడు, చేతులుదోయిలించి చెంత నిలువబడి యున్న ప్రహ్లాదుని జూచి స్వభావముననే మిగుల క్రూరుడైన ఆ హిరణ్యకశిపుడు కాలిచే త్రొక్కబడిన పామువలె నిట్టూర్పునిగడించుచు నిట్లనియె.

**హిరణ్యకశిపురువాచ**

**శ్లో॥ హే దుర్వినీత మన్దాత్మన్ కులభేదకరాధమ।**
**త్వాం తు మచ్ఛాసనోద్ధూత నేష్యామ్యద్య యమక్షయమ్॥ 6**

**ప్రతిపదార్థము:-** హే దుర్వినీత=ఓ చెడునడవడి గలవాడా!, మందాత్మన్!=ఓ అల్పబుద్ధి కలవాడా!, కులభేదకర!=వంశమర్యాదను నాశముచేయువాడు, అధమ=నీచుడా, మత్+శాసన+ఉద్ధూతమ్=నా ఆజ్ఞను ఉల్లంఘించినట్టి, త్వామ్=నిన్ను, అద్య=ఇప్పుడు, యమక్షయమ్=యమాలయమును గూర్చి, నేష్యామి=పంపగలను.

**తాత్పర్యము:-** ఓరీ! అవినీతుడా! బుద్ధిహీనుడా! వంశనాశకరుడా! ఓ అధముడా! నా శాసనము ఉల్లంఘించి ప్రవర్తించు నిన్నిప్పుడే యమలోకమునకు పంపెదను.

**శ్లో॥ క్రుద్ధస్య యస్య కమ్పన్తే త్రయో లోకాస్సహేశ్వరాః।**
**తస్య మేఽభీతవన్మూఢ శాసనం కిమ్బలోఽత్యగాః॥ 7**





**ప్రతిపదార్థము:-** మూఢ=ఓ మూఢుడా!, క్రుద్ధస్య=కోపమొందిన, యస్య=ఎవనికి, సహ+ఈశ్వరాః=ప్రభువులతోగూడిన, త్రయః లోకాః=స్వర్గ, మర్త్య పాతాళ లోకములను ముల్లోకములు, కంపంతే=వణకుచున్నవో,తస్య=ఆ, మే=నాయొక్క, శాసనమ్=ఆజ్ఞను, అత్యగాః=అతిక్రమించుటకు, కిం బలః=నీకు ఏమి బలము గలవాడవు!

**తాత్పర్యము:-** ఓరీ మూర్ఖుడా! ఎవడు కోపము కలవాడైనంతనే ముల్లోకములు, దిక్పాలురతో గడగడలాడి పోవుచున్నాడో, అట్టి నా శాసనమును ఉల్లంఘించితివి. నీవేమీ బలముగలవాడవుగ నున్నావు?

**ప్రహ్లాద ఉవాచ**

**శ్లో॥ న కేవలం మే భవతశ్చ రాజన్సవై బలం బలినాం చాపరేషామ్।**
**పరేఽపరేఽమీ స్థిరజఙ్గమా యే బ్రహ్మాదయో యేన వశం ప్రణీతాః॥ 8**

**ప్రతిపదార్థము:-** రాజన్=ఓరాజా!, కేవలమ్=కేవలము, న మే=నాకే కాదు, భవతః చ=నీకునూ, బలినామ్=బలవంతులైన,అపహేషామ్=ఇతరులకును,సఃవై=ఆహరియే (బలము), పరే=ఉత్తములు, అపరే=అధములునగు, అమీ=ఈ, స్థిరజంగమాః=స్థావరజంగమ ప్రాణులు, యే=ఏ, బ్రహ్మాదయః=బ్రహ్మాలోనగు దేవతలు, యేన=ఏ విష్ణువుచే, వశమ్=అధీనము, ప్రణీతాః=పొందింప బడినారో.

**తాత్పర్యము:-** ఓ రాజా! కేవలము నాకు ఒక్కనికే గాదు నీకును, ఇంకను బలాఢ్యులైన ఇతరులకును ఆ విష్ణువే బలము. మఱి ఉత్తమాధములైన ఈ స్థావర జంగమ ప్రాణులు, బ్రహ్మాదిదేవతలు ఆ హరి వశముననే నిల్చియున్నారు.

**శ్లో॥ స ఈశ్వరః కాల ఉరుక్రమోఽసావోజస్సహస్సత్త్వబలేన్ద్రియాత్మా।**
**స ఏవ విశ్వం పరమః స్వశక్తిభిః సృజత్యవత్యత్తి గుణత్రయేశః॥ 9**

**ప్రతిపదార్థము:-** సః=అతడే, ఈశ్వరః=పరమేశ్వరుడు, కాలః=కాలస్వరూపుడు, ఉరుక్రమః=గొప్పపాదవిక్షేపములు గలవాడు, వామనావతారమున మూడులోకములను మూడు పాదములతో ఆక్రమించినవాడు లేక మిక్కిలి పరాక్రమముగలవాడు. అసౌ=ఇతడు, ఓజః=ఇంద్రియపాటవము, సహః=మనఃపాటవము, సత్త్వమ్=ధైర్యం లేక బుద్ధి, బల=శరీరములకు, ఇంద్రియ=సర్వేంద్రియములకు, ఆత్మా=బలమునిచ్చి ఆశ్రయమిచ్చు ఆత్మ, సః=ఆ హరియే, స ఏవ=ఆ విష్ణువే, పరమః=పరమపురుషుడు, స్వశక్తిభిః=తన జ్ఞానైశ్వర్యాదిశక్తిచే, గుణత్రయేశః=త్రిగుణములకు ప్రభువై, బ్రహ్మవిష్ణురుద్రుల రూపములు పొంది, విశ్వమ్=జగమును, సృజతి=సృజించును, అవతి=రక్షించును, అత్తి=సంహరించును.

**తాత్పర్యము:-** ఆ పరమేశ్వరుడే కాలస్వరూపుడు పాదత్రయమున ముల్లోకములాక్రమించి బహుపరాక్రముకలవాడై ఈ అజుడే పుట్టుకలేనివాడు ఎల్ల ఇంద్రియములకు ఆశ్రయుడైనవాడు, ఆ విష్ణువే త్రిగుణములను గ్రహించి బ్రహ్మవిష్ణురుద్రులరూపములను పొంది జ్ఞానైశ్వర్యాదులగు తన శక్తులచే (ప్రకృతి పురుషులచే) ఈ ప్రపంచమును సృజించును, రక్షించును, హరించును.

ప్రతప్తచామీకరచండలోచనమ్=పుటము పెట్టిన బంగారం వలె పసుపువన్నె గలిగి క్రూరదృష్టి గల నేత్రములు గలదయి, స్ఫురత్ జటాకేసర జృంభితాననమ్=ప్రకాశించు జడలు జూలుచే ఆటోపముతోఁగూడిన ముఖము కలిగినదై, సముత్థితః=ఆ స్థంభము నుండి ఆవిర్భవించెను, కరాళదంష్ట్రమ్=పొడవైన కోరలు గలిగి, కరవాలచంచలక్షురాంతజిహ్వమ్=ఖడ్గమువలె చలించుచు కత్తి వాదరవలె వాడియైన నాలుక గలదియు, భ్రుకుటీ ముఖోల్బణమ్=కనుబొమ ముడుల జంటతో గూడిన ముఖముయొక్క ఉప్పొంగు గలదైన, స్తబ్ధ+ఊర్ధ్వకర్ణమ్=ఉన్నతము లైన శంఖములవలె పైకినిక్కిన చెవులు గలదైన, గిరికందర+అద్భుతమ్=కొండగుహ వలె ఆశ్చర్యకరమైన, వ్యాత్తాస్యనాసమ్=తెఱువబడిన నోరు, ముక్కు కలదియు, హనుభేదభీషణమ్= కణతలు అదరుటచేత భయంకరమైన, దివి స్పృశత్+కాయమ్=ఆకాశమంత శరీరము గలదియు, అదీర్ఘపీవరగ్రీవోరువక్షఃస్థలమ్=పొడవుగానిదై బలిసిన మెడ,తొడలు,ఱొమ్ము ప్రదేశము గలదియు, అల్పమధ్యమమ్=సన్నని నడుము గలదైనది.

చంద్ర+అంశుగౌరైః=చంద్రుని కిరణములవలె తెల్లనైన, తనూరుహైః= రోమములతో, ఛురితమ్=వ్యాపించినదియు, విష్వగ్భుజానీకశతమ్=నలుగడల వ్యాపించిన బాహుశతములు గలదియు, నఖాయుధమ్=గోళ్ళే ఆయుధములుగా గలదియు, దురాసదమ్=దగ్గఱకు రానిదియు, (సర్వ....దానవమ్) సర్వ=సమస్తమైన, నిజ=తనవైన చక్రములోని గల, ఇతర= ఇతరములైన, వజ్రములోనగునవైన, ఆయుధప్రవేక=ఆయుధశ్రేష్ఠములతో, విద్రావిత=వెడల గొట్టబడిన, దైత్యదానవమ్=దైత్యులు, దానవులు గలదైయుండిన,

**తాత్పర్యము:-** ఇట్లు విచారించుచున్న హిరణ్యకశిపుని ముందు ఆ నరసింహరూపము మిక్కిలి భయంకరమై, పుటము పెట్టిన బంగారమువలె పసుపువన్నె గలిగి క్రూర దృష్టి గలిగిన నేత్రములతో ప్రకాశించు జడలు జూలుచే ఆటోపముతో కూడిన ముఖముకలదై ఆ స్తంభము నుండి ఆవిర్భవించెను. అట్లు ఆవిర్భవించిన ఆ నరసింహరూపము పెద్దకోరలు గలదై ఖడ్గమువలె చలించుచు కత్తివాదరవలె బదునైన నాలుక గలదై, బొమముడులచే నుప్పొంగు ముఖముగలదై యుండి, ఉన్నతములై శంఖములవలె, బైకి నిక్కిన చెవులు గలదియు కొండ గుహవలె అచ్చెరువు కొలుపు, తెఱువబడిన నోరు, ముక్కును కలదై కణతలు అదరుటచేత భయంకరమై ఆకసమంత శరీరము కలదై, పొడవుగా కాక బలసిన కంఠము తొడలు వక్షఃస్థలము గలదై, సన్నని నడుము, స్వల్పమైన ఉదరము గలదై యుండి.

చంద్ర కిరణములవలె ధవళములైన రోమములచే వ్యాపించినదై, నలుగడల వ్యాపించిన బాహుశతముగలదై, నఖములే ఆయుధములుగా గలదియు, చెంతకురానిదియు, తనవైన చక్రాదులు, ఇతరమైన వజ్రాదులు లోనగు నాయుధములచే దైత్యదానవుల వెడల గొట్టినదియు అయిన రూపము, ఇదియేమి అని విచారించుచున్న హిరణ్యకశిపుని యెదుట ఆవిర్భవించి నిల్చియుండెను.

**శ్లో॥ ప్రాయేణ మేఽయం హరిణోరుమాయినా వధః స్మృతోఽనేన సముద్యతేన కిమ్।**
**ఏవం విమృశ్యాభ్యపతద్గదాయుధో నదన్నృసింహం ప్రతి దైత్యకుఞ్జరః॥ 24**



**శ్లో॥ యస్త్వయా మన్దభాగ్యోక్తో మదన్యో జగదీశ్వరః।**
**క్వాసౌ యది స సర్వత్ర కస్మాత్ స్తమ్భే న దృశ్యతే॥ 13**

**ప్రతిపదార్థము:-** మందభాగ్యః=ఓ అదృష్టహీనుడా!, మత్+త్వయా=ఏ నీచేత, మత్+అన్యః= నీ కంటె అన్యుడు, జగత్+ఈశ్వరః=జగమునకు ప్రభువు, ఉక్తః=ఉన్నాడు అని చెప్పబడినాడు, యది+అసౌ=ఈ హరియైయున్నవాడగు, క్వ=ఎచ్చట నున్నాడు, సః సర్వత్ర=ఆ పరమేశ్వరుడు అన్నిచోట్లనున్నాడు, కస్మాత్=ఎందువలన, స్తంభే=స్తంభమునందు, న దృశ్యతే=కన్పడదు.

**తాత్పర్యము:-** ఓరి అదృష్టహీనుడా! నీవు జగదీశ్వరుడు, నా కంటె మరియొక్కడున్నాడు అని చెప్పితివి. అతడున్నచో నెక్కడ నున్నాడు చెప్పుము అని నంతనె ప్రహ్లాదుడు ఆ పరమేశ్వరుడు అన్నిచోట్ల నున్నాడనెను. అట్లు అన్నిచోట్ల నతడుండువాడేని ఈ స్తంభమునందేల కనిపించడు?

**శ్లో॥ సోఽహం వికత్థమానస్య శిరః కాయాద్ధరామి తే।**
**గోపాయేత హరిస్త్వాద్య యస్తే శరణమీప్సితః॥ 14**

**ప్రతిపదార్థము:-** సః అహమ్=ఆ నేను, వికత్థమానస్య=ఇట్లు వదరుతున్న, తే=నీకు, శిరః= శిరస్సు, కాయాత్=శరీరము నుండి, హరామి=హరించెదను, హరిః=విష్ణువు, త్వామ్=నిన్ను, అద్య=ఇప్పుడు, గోపాయేత=రక్షించుగాక!, యః=ఎవడు, తే=నీకు, శరణమ్=రక్షకుడుగా, ఈప్సితః =ఇష్టమైనవాడు.

**తాత్పర్యము:-** నేనిప్పుడు నీ శరీరము నుండి నీ శిరస్సును ఖండించెదను. నీవు ఎవనిని శరణుగా కోరియున్నావో ఆ హరి ఇప్పుడు నిన్ను రక్షించును.

**శ్లో॥ ఏవం దురుక్తైర్ముహురర్దయన్రుషా సుతం మహాభాగవతం మహాసురః।**
**ఖడ్గం ప్రగృహ్యోత్పతితో వరాసనాత్ స్తమ్భం తతాడోరుబలః స్వముష్టినా॥ 15**

**ప్రతిపదార్థము:-** ఏవమ్=ఈ ప్రకారము, దురుక్తైః=చెడుమాటలచే, మహాసురః=ఆ దొడ్డ అసురుడు, మహాభాగవతమ్=దొడ్డభగవద్భక్తుని, సుతమ్=సుతుని, మర్దయన్=వ్యథపెట్టుచు, రుషా=కోపముచే, ఖడ్గమ్=ఖడ్గమును, ప్రగృహ్య=పట్టుకొని, వరాసనాత్=శ్రేష్ఠమైన సింహాసనము నుండి, ఉత్పతితః=లేచినవాడై, ఉరుబలః=మిక్కిలి బలముగలవాడు, స్వముష్టినా=తన పిడికిలిచే, స్తంభమ్=స్తంభమును, తతాడ=కొట్టెను.

**తాత్పర్యము:-** దొడ్డ యసురుడు గొప్ప బల్లిదుడు రోషము నిట్లు కఠినోక్తులచే మహాభక్తుడైన పుత్రుని వ్యథపెట్టుచు ఖడ్గమును గ్రహించి, సింహాసనము నుండి లేచి తన పిడికిలితో ఆసౌధము యొక్క స్తంభమును గుద్దెను.

## - శ్రీమన్నరసింహమూర్త్యవతారఘట్టః -

**శ్లో॥ తదైవ తస్మిన్నినదోఽతిభీషణో బభూవ యేనాణ్డకటాహమస్ఫుటత్।**
**యం వై స్వధిష్ణ్యోపగతం త్వజాదయః శ్రుత్వా స్వధామాప్యయమఙ్గ మేనిరే॥ 16**

**ప్రతిపదార్థము:-** అంగ!=హే ధర్మరాజా!, తదా+ఏవ=అప్పుడే, తస్మిన్=ఆ స్తంభము నుండి,

అతిభీషణః=మిగుల భయంకరమైన, నినదః=శబ్దము, బభూవ=కలిగెను, యేన=ఏ శబ్దముచేత, అండ కటహమ్=బ్రహ్మాండము కొప్పెర, అస్ఫుటత్=పగిలెనో, యమ్=ఏ ధ్వని, అజాదయః= బ్రహ్మాదులు, శ్రుత్వా=విని, స్వధిష్ణ్య+ఉపగతమ్=తమ స్థానముల నుండి, తమ స్థానముయొక్క నాశమును లేక ప్రళయముగా, మేనిరే=తలచిరి.

**తాత్పర్యము:-** అట్లు కొట్టిన తక్షణమే ఆ స్తంభము నుండి మిగుల భయంకరమైన శబ్దముత్పన్నమై బ్రహ్మాండ కటాహమును బ్రద్దలు కావించెను. తమ స్థానములవరకు వ్యాపించిన ఆయారావమును విని బ్రహ్మాదులు తమలోకములకు నాశము లేక ప్రళయము వచ్చినదని తలంచిరి.

**శ్లో॥ అభిక్రమన్ పుత్రవధేప్సురోజసా నిశమ్య నిర్హ్రాదమపూర్వమద్భుతమ్।**
**అన్తస్సభాయాం న దదర్శ తత్పదమ్-విత్రసుర్యేన సురారియూథపాః॥ 17**

**ప్రతిపదార్థము:-** పుత్రవధ+ఈప్సుః=పుత్రుని వధింపగోరుచున్న ఆ హిరణ్యకశిపుడు, అపూర్వమ్=పూర్వములేనిదైన, అద్భుతమ్=ఆశ్చర్యమైన, నిర్హ్రాదమ్=ధ్వనిని, నిశమ్య=విని, ఓజసా =బలముతో, తత్+పరమ్=ఆ ధ్వనికి ఆశ్రయమైన దానిని గూర్చి, అంతః=లోపల, సభాయామ్ =సభయందు, అభిక్రమన్=తిరుగుతూ, న దదర్శ=చూడలేకపోయెను, యేన=ఏ శబ్దముచే, సురారియూథపాః=వేల్పులకుపగవారైన అసురుల సముదాయం, విత్రసుః=మిగుల భయపడిరి.

**తాత్పర్యము:-** బలములో బుత్రుని జంపగోరుచున్న ఆ హిరణ్యకశిపుడు అపూర్వమే అద్భుతమైన ఆ ధ్వనిని విని పరుగులాడుచు లోపలి సభయందు ఆ ధ్వనికి ఆశ్రయమైన స్థానమును కనుగొన లేదయ్యెను. ఆ ధ్వనికి అసుర సముదాయమంతా భయపడిరి.

**శ్లో॥ సత్యం విధాతుం నిజభృత్యభాషితం వ్యాప్తిం చ భూతేష్వఖిలేషు చాత్మనః।**
**అదృశ్యతాత్యద్భుతరూపముద్వహంస్తమ్భే సభాయాం న మృగం న మానుషమ్॥ 18**

**ప్రతిపదార్థము:-** నిజభృత్యభాషితమ్=తనసేవకుడైన ప్రహ్లాదుడేమి భాషించెను? అంతటను భగవంతుడున్నాడని. ఆ మాటను, సత్యమ్=నిజము, విధాతుమ్=ఆ ప్రకారము, అఖిలేషు భూతేషు=సర్వభూతములందు, ఆత్మనః=తనయొక్క, వ్యాప్తించ=వ్యాపకత్వమును, సత్యము గావించుట, స్తంభమునందు కన్పించెను. **"భౌతికేష్వథ భావేషు చ మహత్సు చ" "భగవానాస్తే"** ఇతి అని తన భక్తుడేమి భాషించెనో దానిని సత్యమును జేయుచు-ఆ ప్రకారము అత్యద్భుత రూపమ్=దైత్యనాశకమై అపూర్వ రూపమును, ఉద్వహన్=ధరించినవాడై, అదియెందుకనగా నిజభృత్యులగు సనకాదులకు శాపమిచ్చిన తర్వాత అనుతాపమును బొంది, జయ విజయు లేమి భాసించిరో - మూడు జన్మములచే మా శాపము అగుగాక అని. దానిని సత్యము చేయుటకు లేక అత్యద్భుతము బ్రహ్మసృష్టి యందు ఇదివరకు చూడబడనిది, వినబడనిదియునైన రూపమును ధరించు అది, న మృగమ్=మృగాకారము కాదు, న మానుషమ్=మనుష్యాకారము గాదు, అట్టి రూపమును ఉద్వహన్=ధరించి, సభాయాం స్తంభే=సభా మధ్య స్తంభమునందు, అదృశ్యత= కనిపించాడు. అది యెందువలననగా నిజభృత్యుడైన హిరణ్యకశిపుడు బ్రహ్మతో నేమనెను.

**"భూతేభ్య స్త్వద్విసృష్టేభ్యో మృత్యుర్మాభూత్ మమ ప్రభో"** అని. **తథా నాంతర్బహిరితి న నరైరితి న మృగైరితి చ బ్రహ్మణా నిజభృత్యేన** నిజభృత్యులైన బ్రహ్మ ఏమి భాషించెనో అది అట్లే అగుగాక అని" దానిని సత్యము చేయుట కొఱకు ఆ రూపము బ్రహ్మసృజించినది ప్రాణి కాదు, నరుడుగాని మృగము గాని కాదు, సభాగృహము లోపల గాదు, ముంగిలియందును గాదు, వెలుపల గాదు. ఇట్లు వారు భాషించిన దానిని సత్యమునుగా జేయుట కొఱకు. హిరణ్యకశిపుడేమని భాషించెను.

**"నూనమేతద్విరోధేన మృత్యుర్మే భవితా"** ఇతి తథా **"అకుతశ్చిద్భయోఽమరః"** అని. ఏది నిజభృత్యుడైన నారదుడు స్వయముగా ఇంద్రుని గూర్చి బదులు వచించెను. ఇతడు గొప్పవాడు. జన్మమును పొందడు. అనంతానుచరుడు అని. ఇట్లనుటచే తనయొక్క భక్త పక్షపాతికము ఏమని చెప్పెనో దానిని సత్యమునుగా చేయుటకును కనిపించెను.

**"చకారాన్నిజభాషితం చ యత్" "కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి తేషాం అహం సముద్ధర్తా" మృత్యు సంసార సాగరాత్.** ఇట్టి వాక్యములను సత్యము గావించుటకు - అని అర్థము తెలియజేయుటయే. ఇక చాలును.

**శ్లో॥ స సత్త్వమేవం పరితో విపశ్యం స్తమ్భస్య మధ్యాదనునిర్జిహానమ్।**
**నాయం నరో నాపి మృగో విచిత్రమహో కిమేతన్నృమృగేన్ద్రరూపమ్॥ 19**

**ప్రతిపదార్థము:-** సః=ఆ దైత్యుడు, ఏవమ్=ఈ ప్రకారము ధ్వని విని, సత్త్వమ్=ఆ ధ్వనికాశ్రయ మైన విశేషము, పరితః=అంతట, విపశ్యన్=చూచుచు, స్తంభస్య మధ్యాత్=స్తంభము యొక్క మధ్య నుండి అనుసరించి వచ్చి, నిర్జిహానమ్=అవిర్భవించుచున్న, న+అయం నరః=ఇది నరాకారము గాదు, న + అపి మృగః=మృగాకారము గాదు, నృమృగేంద్రరూపమ్=నరసింహ రూపముగా, కిం ఏతత్=ఇది ఏమి, అహో! విచిత్రమ్=ఔరా! ఎంత విచిత్రము.

**తాత్పర్యము:-** దైత్యుడా హిరణ్యకశిపుడు ఆ ధ్వని విని ఆ ధ్వనికాశ్రయమైన ప్రాణ విశేషమును స్తంభమధ్యము నుండి ఆవిర్భవించుచున్న దానినంతటఁజూచుచు ఇదియేమి ఇది నరాకారము గాదు, మృగాకారము గాదు, నరసింహములరూపము గలదిగానున్నది. ఇదియేమి విచిత్రము ఔరా! అని విచారించెను.

**శ్లో॥ మీమాంసమానస్య సముత్థితోఽగ్రతో నృసింహరూపం తదలం భయానకమ్। 20**

**శ్లో॥ ప్రతప్తచామీకరచణ్డలోచనమ్ స్ఫురత్సటాకేసరజృమ్భితాననమ్।**
**కరాళదంష్ట్రం కరవాలచఞ్చల క్షురాన్తజిహ్వం భ్రుకుటీముఖోల్బణమ్॥ 21**

**శ్లో॥ స్తబ్ధోర్ధ్వకర్ణం గిరికన్దరాద్భుతవ్యాత్తాస్యనాసం హనుభేదభీషణమ్।**
**దివిస్పృశత్కాయమదీర్ఘపీవరగ్రీవోరువక్షస్థలమల్పమధ్యమమ్॥ 22**

**శ్లో॥ చన్ద్రాంశుగౌరైశ్ఛురితం తనూరుహైర్విష్వగ్భుజానీకశతం నఖాయుధమ్।**
**దురాసదం సర్వనిజేతరాయుధప్రవేకవిద్రావితదైత్యదానవమ్॥ 23**

**ప్రతిపదార్థము:-** మీమాంసమానస్య=ఇట్లు విచారము చేయుచున్న వానికి, అగ్రతః=ముందు, తత్=ఆ, నరసింహరూపమ్=నరసింహరూపము, అలమ్=మిక్కిలి, భయానకమ్=భయంకరమై,

బాహువులను సమీపించి వచ్చిన వారిని, నఖశస్త్రపార్ష్ణిభిః=గోళ్ళను ఆయుధములు గల హస్తములచే, సహస్రశః=వేలకొలది సైన్యమును, అహత్=వధించెను.

**తాత్పర్యము:-** తన గోళ్ళ మొనలచే హిరణ్యకశిపుని హృదయ కమలమును చీల్చి వాని నటు విడిచి వానియనుచరులాయుధము లెత్తుకొని నలుగడలఁగ్రమ్ముకొని తన బాహు దండముల సమీపమునకు వచ్చిన వారిని వేలకొలది సంఖ్యగల వారిని నఖాయుధములుగల తన హస్తముల వారిని వధించెను.

**శ్లో॥ సటావధూతా జలదాః పరాపతన్ గ్రహాశ్చ తద్దృష్టివిమృష్టరోచిషః।**
**అమ్భోధయః శ్వాసహతా విచుక్షుభుర్నిర్హ్రాదభీతా దిగిభా జహుర్మదమ్॥ 33**

**ప్రతిపదార్థము:-** సటావధూతాః=జడలచే నెగురగొట్టబడి, జలదాః=మేఘములు, పరాపతన్=చీలికలైపోయెను, గ్రహాశ్చ=సూర్యాదిగ్రహములు, తత్‌దృష్టి విముష్టరోచిషః=ఆ నరసింహుని నేత్రదృష్టిచే తిరస్కరింపబడిన తేజముగలవాయెను, అంభోధయః=సముద్రములు, శ్వాసహతాః =ఊర్పులచే గొట్టబడినవై, విచుక్షుభుః=కలత చెందెను, దిక్+ఇభాః=దిగ్గజాలు, నిర్హ్రాదభీతాః =ఆ నరసింహుని సింహనాదముయొక్క మహాశబ్దముచే, ముదమ్=సంతోషమును, జహుః =విడిచినవాయెను, మదమ్=మదజలము, జహుః=వీడినవాయెను.

**తాత్పర్యము:-** జడల విసురున మేఘములు చెల్లాచెదురయ్యెను. ఆ నరసింహుని దృష్టిచే సూర్యాది గ్రహములన్నియు తమ తేజమును గోలుపోయెను. సముద్రములు శ్వాసల తాకిడికి చెడగొట్టబడినవి. ఆ దేవునట్టహాస మహాశబ్దమును విని దిగ్గజములు భీతిల్లి మదజలమును విడిచెను. సంతోషమును విడిచెను.

**శ్లో॥ ద్యౌస్తత్సటోత్క్షిప్తవిమానసఙ్కులా ప్రోత్సర్పత క్ష్మా చ పదాతిపీడితా।**
**శైలాః సముత్పేతురముష్య రంహసా తత్తేజసా ఖం కకుభో న రేజిరే॥ 34**

**ప్రతిపదార్థము:-** ద్యౌః=ఆకాశము, తత్+సటా+ఉత్క్షిప్తవిమానసంకులా=ఆ నరహరి జడలచే పైకి ఎగురగొట్టబడి దేవవిమానములు గుములు గలవయ్యెను. క్ష్మా చ=భూమియు, పదాతి పీడితా=ఆ నరహరిపాదములచే మిగులఁద్రొక్కుడు వడి, ప్రోత్సర్పత=స్వస్థానము నుండి చలించి జరిగెను. అముష్య=ఈ నరహరి యొక్క, రంహసా=వేగముచే, శైలాః=కొండలు, సముత్పేతుః =ఎగిరిపడెను. తత్+తేజసా=ఆ దేవుని తేజముచే, ఖమ్=ఆకాశము, కకుభః=దిక్కులు, న రేజిరే=ప్రకాశింపనివయ్యెను.

**తాత్పర్యము:-** ఆకాశమునందు ఆ దేవుని జడలచేఁ తారుమారైన విమానములు గుములు కూడెను. ఆ నరహరి పాదములచే త్రొక్కుడువడి భూమి స్వస్థానము నుండి కదలికచెందెను. ఆ దేవుని వేగమున కులపర్వతము లెగిరి క్రిందపడెను. ఆ దేవుని తేజముచేనిది ఆకసము, ఇవి దిక్కులని తెలియరావాయెను.

**శ్లో॥ తతస్సభాయాముపవిష్టముత్తమే నృపాసనే సంహృతతేజసం విభుమ్।**
**అలక్షితద్వైరథమత్యమర్షణం ప్రచణ్డవక్త్రం న బభాజ కశ్చన॥ 35**





**ప్రతిపదార్థము:-** ప్రాయేణ=తఱచుగ, ఉరుమాయినా=మహామాయావియైన, హరిణా=విష్ణువు చేత, సముద్యతేన=ఆవిర్భవించిన, అనేన=ఈ నృసింహరూపముచే, మే=నాకు, అయం వధః =ఇటువంటి వధ, స్మృతః=సంకల్పించి, సముద్యతే=ప్రయత్నించబడుచున్నదా ఏమి?, న కిమ్=దానివలన నేమియు కాదు, ఏవమ్=ఈ ప్రకారము, విమృశ్య=విమర్శించి, గదాయుధః =గదను ఆయుధముగా గలవాడై, నదన్=గర్జించుచు, దైత్యకుంజరః=దైత్యులందు ఏనుగు వంటివాడు, శ్రేష్ఠుడు ఆ హిరణ్యకశిపుడు, నృసింహం ప్రతి=ఆ నరసింహమూర్తిని గూర్చి, అభ్యపతత్=పైఁబడెను.

**తాత్పర్యము:-** తఱచుగా దొడ్డమాయలు పన్నువాడైన హరి నా కిట్టిరూపమున వధను సంకల్పించి ప్రయత్నించుచున్నాడు కాబోలు.కాని దానిచే నేమియు కాదు అని విమర్శించి, ఆ దైత్యకుంజరుడు హిరణ్యకశిపుడు గదాహస్తుడై గర్జించి నరసింహమూర్తి నెదుర్కొనెను.

**శ్లో॥ అలక్షితోఽగ్నౌ పతితః పతఙ్గమో యథా నృసింహౌజసి సోఽసురస్తథా।**
**న తద్విచిత్రం ఖలు సత్త్వధామని స్వతేజసా యో ను పురాపిబత్తమః॥ 25**

**ప్రతిపదార్థము:-** అగ్నౌ=అగ్నియందు, పతితః=పడిన, పతంగమః=మిడుత, యథా అలక్షితః =ఏవిధముగా కనబడదో, తథా=ఆ ప్రకారము, సః అసురపి=ఆ యసురుడూ, అలక్షితః=కనుపడని వాడయ్యెను, సత్త్వధామని=సత్త్వగుణప్రధానుడైన హరియందు పడిన తమోగుణయుతుడై పొలబడినవాడై కనబడక, తత్=అది, ను విచిత్రం ఖలు=చిత్రమేమియు గాదు, యః=ఏ హరి, పురా=సృష్ట్యాదియందు, తమః=ప్రళయాకారమైన తమస్సును, న అపిబత్=ఔరా త్రాగెను కదా!

**తాత్పర్యము:-** అగ్నియందుబడిన మిడుతవలె ఆ యసురుడు నరసింహుని తేజమునబడి కానరాడయ్యెను. సత్త్వ ప్రకాశుడైన విష్ణువునందు తమస్స్వభావుడగు దైత్యుడు కానరాకపోవుట అదియొక గొప్ప విచిత్రమేమియు గాదు కదా!. సృష్ట్యాది ఆ మహావిష్ణువు ప్రళయకాలపు తమస్సంతయు లోగొని హరించివేసెను.

**శ్లో॥ తతోఽభిపద్యాభ్యపతన్మహాసురో రుషా నృసింహం గదయోరువేగయా।**
**తం విక్రమన్తం సగదం గదాధరో మహోరగం తార్క్ష్యసుతో యథాగ్రహీత్॥ 26**

**ప్రతిపదార్థము:-** తతః=అంత, మహాసురః=ఆ దొడ్డ అసురుడు, అభిపద్య=వడివడివచ్చి, ఉరు వేగయా=గొప్పవడిగా త్రిప్పుచూ, గదయా=గదచేత, రుషా నృసింహమ్=మాయా నరసింహుని గూడి, అభ్యపతత్=పైఁబడెను, సగదమ్=గదతో కూడి, విక్రమంతమ్=తమపైకి దుముకుతున్న, తమ్=ఆ యసురుని, గదాధరః=గదతో ఆ విష్ణువు / నరసింహుడు, మహా+ఉరగమ్= పెనుబామును, తార్క్ష్యసుతః యథా=గరుత్మంతునివలె, అగ్రహీత్=బడిసి పట్టుకొనెను.

**తాత్పర్యము:-** అంత వచ్చి ఆ దొడ్డ అసురుడు తీవ్రముగా గదను గిరగిర త్రిప్పుచు నరసింహ మూర్తిపై గదిసెను. అట్లు గదను గైకొని తన్నుబైకొను ఆ అసురుని మహావిష్ణువు ఆ నృసింహస్వామి పెనుబామును గరుత్మంతుడు వలె ఆ యసురుని పట్టుకొనెను.

**శ్లో॥ స తస్య హస్తోత్కలితస్తదాసురో-విక్రీడతో యద్వదహిర్గరుత్మతః।**
**అసాధ్వమన్యన్త హృతౌకసోఽమునా-ఘనచ్ఛదా భారత సర్వధిష్ణ్యపాః॥ 27**

**ప్రతిపదార్థము:–**భారత!=ఓ ధర్మరాజా!, విక్రీడితః=చెరలాట మాడుచున్న, గరుత్మతః=గరుత్మంతుని నుండి, అహిః=పాము, సః అసురః=ఆ యసురుడు, తస్య=ఆ నరసింహునియొక్క, హస్త+ఉత్కలితః =హస్తము నుండి తప్పించుకొని బయటపడెను. తదా=అప్పుడు, సర్వదిష్ణ్యపాః=ఎల్లలోకపాలకులు ఈ అసురునిచే, హృతౌకసః=హరింపబడిన స్వస్థానములుగల, ఘనచ్ఛదాః=మేఘములందు దాగుకొన్నవారయి, ఇదియేమి, ఆసాధ్వ=మంచిది కాదని, మన్యంత=తలంచిరి.

**తాత్పర్యము:–** క్రీడించు గరుత్మంతుని నుండి సర్పము వలె ఆ యసురుడు ఆ నరసింహుని హస్తము నుండి తప్పించుకొని యీవలికి రాగా జూచి దేవతలు, ఎల్లలోకపాలకులు తమనుంచి తమ స్థానములను గోలుపోయినవారు మబ్బుచాటు నుండి అయ్యో! వాడు తప్పించుకొనెను. ఇఁక నెట్లు? ఇది మంచిది కాదె అనియుండిరి.

**శ్లో॥ తం మన్యమానో నిజవీర్యశఙ్కితం యద్ధస్తముక్తో నృహరిం మహాసురః।**
**పునస్తమాసజ్జత ఖడ్గచర్మణీ ప్రగృహ్య వేగేన గతశ్రమో మృధే॥ 28**

**ప్రతిపదార్థము:–** నృహరిమ్=నరసింహమూర్తి, యత్+హస్తముక్తః=ఏ హస్తము నుండి విడివడిన వాడైన, తమ్=ఆ నరసింహుని, నిజవీర్యశంకితమ్=తన బలమునకు జంకినవాడిగా, మన్యమానః =తలంచుచున్నవాడై, మహాసురః=తానే బలాఢ్యుడనని యెంచుచు ఆ రాక్షసుడు, మృధే=యుద్ధము నందు, ఖడ్గచర్మణీ=కత్తిడాలును, ప్రగృహ్య=చేతులం బట్టి, గతశ్రమః=శ్రమ ఏమాత్రము లేనివాడై, పునః=మరల,తమ్=ఆ నారసింహుని/నరహరిని, ఆసజ్జత=ఎదుర్కొనెను.

**తాత్పర్యము:–** నరహరి హస్తము నుండి తప్పించుకొన్నవాడై తన బలమును గూర్చి ఆ దేవుడు జంకినడనియు తాను ఆ నరసింహుని కంటె బలాఢ్యుడనియు తలంచుచు ఆ అసురుడు ఖడ్గమును డాలును హస్తములంగొని యుద్ధమునందు ఏమాత్రము శ్రమలేనివాడై వేగముతో మరల నా నరసింహునెదుర్కొనెను.

**శ్లో॥ తం శ్యేనవేగం శతచన్ద్రవర్త్మభిశ్చరన్తమచ్ఛిద్రముపర్యధో హరిః।**
**కృత్వాట్టహాసం ఖరముత్స్వనోల్బణం నిమీలితాక్షం జగృహే మహాజవః॥ 29**

**ప్రతిపదార్థము:–** శ్యేనవేగమ్=డేగవంటి వేగము కలవాడు, శతచంద్రవర్త్మభిః=ఖడ్గము, డాలు అనువానిని త్రిప్పు మార్గములచే, అచ్ఛిద్రమ్=చొచ్చుటకు సందులేనట్లు, ఉపరి=పైనను, అధః =క్రిందికి, చరంతమ్=సంచరించుచున్న, తమ్=ఆ హిరణ్యకశిపుని, హరిః=నరసింహుడు, ఖరమ్ =తీవ్రమైన, అట్టహాసమ్=పెద్ద అఱుపు, కృత్వా=చేసి, ఉత్స్వన+ఉల్బణమ్=మహా శబ్దముచే భయంకరమైన, నిమీలితాక్షమ్=ఆ భయముచేత హరితేజముచే మూసిన కన్నులు గల ఆ అసురుని, మహాజవః=మిక్కిలి వేగముగలవాడై, జగృహే=పట్టుకొనెను.

**తాత్పర్యము:–** డేగవలె వడిగలవాడై ఖడ్గము ఖేటమును జోర వీలుగాక త్రిప్పుచు పైకి క్రిందికి దుముకులాడుచు వచ్చుచున్న వానిని నరసింహుడు తీవ్రమైన మహాతేజముచే, భయంకరమైన అట్టహాసము చేసి, ఆ శబ్దము చేతను తన తేజము చేతను కన్నులు మూసుకొనియున్న ఆ హిరణ్యకశిపుని, మిగుల వేగము గలవాడై పట్టుకొనెను.





**శ్లో॥ విష్వక్ స్ఫురన్తం గ్రహణాతురం హరిః వ్యాళో యథాఖుం కులిశాక్షతత్వచమ్।**
**ద్వార్యూర ఆపాత్య దదార లీలయా నఖైర్యథాహిం గరుడో మహావిషమ్॥ 30**

**ప్రతిపదార్థము:–** విష్వక్=నలువంకల నుండి, స్ఫురంతమ్=వచ్చుచున్నవాడు, గ్రహణాతురమ్ =పట్టుకొనుచటే వివశుడైన ఆ హిరణ్యకశిపుని, కులిశ+అక్షతత్వచమ్=ఇంద్రుని వజ్రాయుధముచే ఛేదింపరాని చర్మము గలవానిని, ఆఖుం యథా=మూషికమును వలె, ద్వారి=సభయందు ద్వారము వెలుపల లోపలను కాక, ఊర్వ=తొడలపై, ఆపాత్య=పడవైచి, భూమి, నభముకాక, గరుడః =గరుడుడు, మహావిషమ్=గొప్పవిషముగల, అహిం యథా=సర్పమును వలె, నఖైః=గోళ్ళచే, ప్రాణముండియు లేనివైన, లీలయా=సునాయాసముగా, పగలు రేయి కాకుండ సంధ్యాకాలము నందు, దదార=చీల్చెను.

**తాత్పర్యము:–** అంతట తిరుగుచుఁ బైకివచ్చువాడై పట్టుబడి వివశుడైన యుద్ధమునందింద్రుని వజ్రాయుధముచేతను ఛేదింపరాని చర్మముగల ఆ యసురుని సర్పము మూషికమును పట్టుకొని లోపల వెలుపల గాకుండుటకై సభాద్వారమునందు గ్రహించి ఊరువునందు పడవైచి (భూమి, ఆకాశము కాకుండను) సంధ్యా కాలమునందు, (పగలు రాత్రి గాకుండగను) సర్పమును గరుడుడు వలె గోళ్ళతో వానిని సునాయాసముగా చీల్చెను.

**శ్లో॥ సంరమ్భదుష్ప్రేక్ష్యకరాళలోచనో వ్యాత్తాననాన్తం విహన్ స్వజిహ్వయా।**
**అసృగ్లవాక్తారుణకేసరాననో యథాన్త్రమాలీ ద్విపహత్యయా హరిః॥ 31**

**ప్రతిపదార్థము:–**సంరంభదుష్ప్రేక్ష్యకరాళలోచనః=కోపోద్రేకముచే చూడశక్యముగానిదై భయంకర మైన నేత్రములు గలవాడు, వ్యాత్తాననాంతమ్=తెఱువబడిన నోటిలోపలనున్న, జిహ్వయా= నాలుకచే, విలిహన్=నాకుచున్నవాడై, అసృక్=నెత్తురుయొక్క, లవైః=బిందువులచేత, ఆక్తా= తడిసిన,అరుణ=ఎఱ్ఱనైన, కేసరాననమ్=తలజూలు వెండ్రుకలు ముఖము కలవాడై, ద్విపహత్యయా =ఏనుగును వధించుటచే, హరిః=సింహము, యథా=వలె, అంత్రమాలీ=ప్రేవులు దండగా గలవాడయ్యెను.

**తాత్పర్యము:–** కోపసంరంభమున భయము గొలుపు నేత్రములు కలవాడును, నోఱు తెరిచి లోపలి నుండి నాలుక నిటునటు పెదవుల మూలల నాకుచున్నవాడును, నెత్తురు బొట్లు తడిసిన జూలు వెండ్రుకలు కల ముఖము కలవాడునై ఆ నరసింహమూర్తి గజమును వధించిన సింహము వలె ఆ యసురుని ప్రేగులు కంఠమున దండవలె వేసుకొనినవాడయ్యెను.

**శ్లో॥ నఖాఙ్కురోత్పాటితహృత్సరోరుహం విసృజ్య తస్యానుచరానుదాయుధాన్।**
**అహన్ సమన్తాన్నఖశస్త్రపార్ష్ణిభిర్దోర్దణ్డయూథోఽనుపథాన్ సహస్రశః॥ 32**

**ప్రతిపదార్థము:–** నఖ+అంకుర=గోళ్ళకొనలచే, ఉత్పాటిత=చీల్చబడిన, హృత్+సరోరుహమ్= హృదయమను కమలము గల హిరణ్యకశిపుని, విసృజ్య=వదలి, తస్య=ఆ హిరణ్యకశిపుని, అనుచరాన్=సేవకులగువారలను, ఉదాయుధాన్=పైకెత్తుకొన్న ఆయుధములు గలవారు, సమంతాత్=నలువైపుల గ్రమ్మకొని, దోర్దండయూథః+అనుపథాన్=దండముల వంటి తన

అది దైత్యాక్రాంతమైనది. దైత్యుని భయమున మోడ్పుచెందినది. ఇప్పుడా భయమును తొలగించి ఆ మా హృదయ కమలములను వికసింపజేసితివి. ఓ ప్రభువా! నీ శుశ్రూషసేయువారికి ఈ త్రైలోక్యము యొక్క ఐశ్వర్యము ఏపాటిది? ఓ నరసింహ స్వరూపా! నీ సేవకులకు ముక్తియే సమ్మతముగాదనినచో నిక ధర్మార్థకామములతో నేమి ప్రయోజనము గలదు?

**ఋషయ ఊచుః**

**శ్లో॥ త్వం నస్తపః పరమమాత్థ యథాత్మతేజో-యేనేదమాదిపురుషాత్మగతం ససర్జ।**
**తద్విప్రలుప్తమమునాద్యశరణ్యపాల-రక్షాగృహీతవపుషా పునరన్వమంస్థాః॥ 45**

**ప్రతిపదార్థము:-** ఆదిపురుషా!=ఓ ఆదిపురుషుడా!, త్వమ్=నీవు, నః=మాకు, యదా=ఎప్పుడు, పరమం తపః=ఉత్తమమైన తపస్సు,ఆత్మతేజః=పరమాత్మవై నీ తేజస్వరూపమైన, ఆత్థ=చెప్పితివో, యేన=ఏ తపస్సుచే, ఆత్మగతం=ఆత్మయగు నీయందు లీనమైయున్న, ఇదమ్=ఈ జగమును, ససర్జ=సృజించితివో, తత్=ఆ తపము, అమునా=ఈ దైత్యులచే కొంపోబడినది. విప్రలుప్తం= మాకు జరుగక విఘ్నము కాగా లోపించినవి. శరణ్యపాల!=ఓ దిక్కైనవాడా!, పాలించువాడా! అద్యఇమురక్షాగృహీతవపుషా=జగద్రక్షణముకై గ్రహించిన శరీరముగల నీచే, పునః=మరలతపము చేయుచు, అన్వమంస్థాః=మాకు అనుజ్ఞ ఇచ్చితివి. అట్టి నీకు నమస్కారము.

**తాత్పర్యము:-** ఓ ఆదిపురుషా! నీవు మాకు పూర్వమెప్పుడు శ్రేష్ఠమైన తపము ఆత్మ ప్రకాశకమైనదని యుపదేశించియుంటివో ఆ తపముచే నీవు నీలో లీనమైన జగమును సృజించితివో ఆ తపము మాకు ఈ దైత్యునిచే బొలిపోయినది. ఓ శరణుడా! ఓ రక్షకుడా! జగము రక్షింప నవతరించిన నీచే నిప్పుడు మరల మాకు తపము చేసుకొనుటకు అనుజ్ఞ నిచ్చితివి. అట్టి నీకు నమస్కారము.

**పితర ఊచుః**

**శ్లో॥ శ్రాద్ధాని నోఽధిబుభుజే ప్రసభం తనూజైర్దత్తాని తీర్థసమయేఽప్యపిబత్తిలామ్బు।**
**తస్యోదరాన్నఖవిదీర్ణవపాద్య ఆర్ఛత్ తస్మై నమో నృహరయేఽఖిలధర్మగోప్త్రే॥ 46**

**ప్రతిపదార్థము:-** నః=మాకు, తనూజైః=పుత్రులచే, దత్తాని=సమర్పింపబడి, శ్రాద్ధాని=శ్రద్ధతో కూడినవైన పిండములును, అధిబుభుజే=ఈదైత్యుడుబలాత్కరించి భుజించెను, తీర్థసమయే=పుణ్య తీర్థస్నాన సమయమందు, తిలాంబు=ఇవ్వబడిన తిలోదకమును సైతము, అపిబత్=ఈతడు త్రాగెను. యః=ఏ నీవు, తస్య=ఆ దైత్యుని యొక్క, నఖవిదీర్ణవపాత్= నఖములచే చీల్చబడిన లోపలి చర్మముగల, ఉదరాత్=గర్భమునుండి, ఆర్ఛత్=వానిని ఆహరించితివి, అఖిలధర్మగోప్త్రే =ఎల్లధర్మములను రక్షించువాడైన, తస్మై=ఆ నృసింహమూర్తియను నీకు, నమః=నమస్కారము.

**తాత్పర్యము:-** ఓ దేవా! మా పుత్రులు మమ్ములనుద్దేశించి శ్రాద్ధములుచేసి మాకై సమర్పించు పిండములను ఈ దైత్యుడు అపహరించెను. మఱి వారు తీర్థస్నానసమయములందు విడిచిన తిలోదకములను వీడు త్రాగెను. నీవు ఈ దైత్యుని కడుపును గోళ్ళతో చీల్చి ఆ మా పిండములను,





**ప్రతిపదార్థము:-** తతః=అంత, సభాయామ్=ఆస్థానము నందు, ఉత్తమే=శ్రేష్ఠమైన, ఆసనే= సింహాసనము నందు, ఉపవిష్టమ్=కూర్చున్నవాడు, సంహృతతేజసమ్=ఉపసంహరించిన పరాక్రమము గలవాడు, అమర్షణమ్=సైరింపరానివాడు, ప్రచండవక్త్రమ్=భయంకరమైన ముఖము కలవాడు, విభుమ్=ప్రభువైన, అలక్షితద్వైరథమ్=కనబడని ప్రతియోధు గలవానిని, కశ్చన=ఒకడును, న బభాజ=సేవించలేదు/సమీపించలేదు.

**తాత్పర్యము:-** తనభృత్యుని ఐశ్వర్యమును ఆశ్చర్యముగానున్న తన కౌతూహలముతో ఆ సభ యందు వాని ఉత్తమ సింహాసనమున నుపవిష్టుడై తేజము నుపసంహరించి తన కెదురెవ్వరు లేనివాడై భయంకర ముఖము గలవాడై సహింపరానివాడైన ఆ నరహరిని ఏ జనుడును సమీపించి సేవింపలేదు.

**శ్లో॥ నిశమ్య లోకత్రయమస్తకజ్వరం తమాదిదైత్యం హరిణా హతం మృధే।**
**ప్రహర్షవేగోత్కలితాననా ముహుః ప్రసూనవర్షైర్వవృషుః సురస్త్రియః॥ 36**

**ప్రతిపదార్థము:-** లోకత్రయమస్తకజ్వరమ్=ముల్లోకములకు శిరోబాధవంటివాడైన, తమ్ ఆదిదైత్యమ్=ఆదైత్యులలో ప్రథముడైన వాడు, హరిణా=విష్ణువుచేత, మృధే=యుద్ధమునందు, హతమ్=చంపబడిన వానినిగా, నిశమ్య=విని, సురస్త్రియః=దేవాంగనలు, ప్రహర్షవేగ+ఉత్కలిత + ఆననాః=సంతోషాతిశయములచే వికసించిన ముఖములుగలవారై, హరిమ్=నరహరిని / నరసింహుని, పునః పునః=మరల మరల, ప్రసూనవర్షైః=పూలవానలచే, వవృషుః=వర్షించిరి.

**తాత్పర్యము:-** ముల్లోకములకు తలనొప్పి వంటివాడైన ఆ హిరణ్యకశిపుడు యుద్ధమునందు శ్రీ హరిచే చంపబడినాడను మాట విని దేవతా స్త్రీలు సంతోషాతిశయమున తమ మోములు వికసిల్ల ఆ నరసింహమూర్తిపై మరల మరల పుష్పవర్షములు గురిపించిరి.

**శ్లో॥ తదా విమానావలిభిర్నభస్తలం దిదృక్షతాం సఙ్కులమాస నాకినామ్।**
**సురానకా దున్దుభయోఽథ జఘ్నిరే గన్ధర్వముఖ్యా ననృతుర్జగుః స్త్రియః॥ 37**

**ప్రతిపదార్థము:-** తదా=అప్పుడు, దిదృక్షతామ్=ఆ అసురవధకుడగు నరసింహుని జూడ గోరిన, నాకినామ్=దేవతలయొక్క, విమానావళిభిః=విమానపంక్తులచే, నభస్తలమ్=ఆకసము, సంకులమ్= క్రిక్కిరియుటను, ఆస=పొందెను, సుర+ఆనకాః=దేవతల యొక్క తప్పెటలు, దుందుభయః= భేరీవాద్యములు, జఘ్నిరే=మ్రోగినవి, గంధర్వముఖ్యాః=గంధర్వముఖ్యులు, జగుః=పాడిరి, స్త్రియః =అప్సరస్త్రీలు, ననృతుః=ఆడిరి.

**తాత్పర్యము:-** అప్పుడా హిరణ్యకశిపు వధను గావించిన నరసింహమూర్తిఁజూడ గోరిన వేల్పుల విమాన పంక్తులు ఆకసమందంతట గ్రిక్కిరిసిపోయెను. దేవతలచే తప్పెటలు, భేరీవాద్యములు వాయించబడెను. గంధర్వులు గానము చేసిరి. అప్సరస్త్రీలు నాట్యము చేసిరి.

**శ్లో॥ తముపవ్రజ్య విబుధాః బ్రహ్మేన్ద్రగిరిశాదయః।**
**ఋషయః పితరస్సద్ధా విద్యాధరమహోరగాః॥ 38**

**ప్రతిపదార్థము:-** విబుధాః=దేవతలు, మహోరగాః=దొడ్డపన్నగములు, తమ్=ఆ నరసింహుని, ఉపవ్రజ్య=సమీపించి.....

**తాత్పర్యము:-** దేవతలు, బ్రహ్మ, ఇంద్రుడు, శివుడు లోనగువారు, ఋషులు, పితరులు, సిద్ధులు, విద్యాధరులు, దొడ్డవారగు పన్నగములు ఆ నరసింహుని సమీపించి....

**శ్లో॥ మనవః ప్రజానాం పతయో గన్ధర్వాప్సరచారణాః।**
**యక్షాః కిమ్పురుషాస్తాత బేతాళాస్సిద్ధకిన్నరాః॥ 39**

**ప్రతిపదార్థము:-** మనవః=మనువులు, ప్రజానాం పతయః=ప్రజాపతులు, గంధర్వాః=గంధర్వులు, అప్సరచారణాః=అప్సరసలు, చారణులు, యక్షాః=యక్షులు, కింపురుషాః=కింపురుషులు, వేతాళాః =భూత బేతాళాలు, సిద్ధకిన్నరాః=సిద్ధులు, కిన్నరులు.....

**తాత్పర్యము:-** మనువులు, ప్రజాపతులు, గంధర్వులు, అప్సరసలు, చారణులు, యక్షులు, కింపురుషులు, భూతబేతాళములు, కిన్నరులు.....

**శ్లో॥ తే విష్ణుపార్షదాస్సర్వే సునన్దకుముదాదయః।**
**మూర్ధ్ని బద్ధాఞ్జలిపుటా ఆసీనం తీవ్రతేజసమ్॥ 40**

**శ్లో॥ ఈడిరే నరశార్దూలం నాతిదూరచరాః పృథక్॥ 41**

**ప్రతిపదార్థము:-** విష్ణుపార్షదాః=విష్ణువుయొక్క పరిషత్తునందు నుండు సభ్యులు, సునంద కుముదాదయః=సునందుడు, కుముదుడు లోనగువారు, సర్వే=ఎల్లరు, మూర్ధ్ని=శిరమునందు, బద్ధాంజలి పుటాః=సమకూడిన దొప్పలవంటి హస్తముల దోయిగలవారై, న+అతిదూరచరాః= ఎక్కువ దూరముగాని చోట నుండుచు, పృథక్=వేఱుగా, ఆసీనమ్=కూర్చుండిన, తీవ్రతేజసమ్= తీక్ష్ణమైన తేజముగల, నరశార్దూలమ్=పురుషోత్తముని, ఈడిరే=స్తుతించిరి.

**తాత్పర్యము:-** విష్ణుపారిషదులగు సునందకుముదాదులు ఎల్లరును వచ్చి కొంత దూరమునందు నిలువబడి శిరములందు హస్తములు జోడించి మ్రొక్కుచు సింహాసనమునందు కూర్చుండి మిగుల తేజముతోనున్న పురుషోత్తముని స్తుతించిరి.

**బ్రహ్మోవాచ**

**శ్లో॥ నతోఽస్మ్యనన్తాయ దురన్తశక్తయే-విచిత్రవీర్యాయ పవిత్రకర్మణే।**
**విశ్వస్య సర్గస్థితిసంయమాన్ గుణైస్స్వలీలయా సన్దధతేఽవ్యయాత్మనే॥ 42**

**ప్రతిపదార్థము:-** అనంతాయ=తుది అనునది లేనివాడు!, దురంతశక్తయే=అపారమైన శక్తి గలవాడు, విచిత్రవీర్యాయ=ఆశ్చర్యకరమైన బలము గలవాడు, పవిత్రకర్మణే=అధర్మనాశకము లైన కార్యములు చేయువాడు, గుణైః=త్రిగుణములచే, విశ్వస్య=జగము యొక్క, సర్గస్థితి సంయమాన్=సృష్టిస్థితిలయములను, స్వలీలయా=స్వీయమైన విలాసమున, సందధతే=చేయు వాడు, అవ్యయాత్మనే=నాశములేని స్వరూపముగల వాని కొఱకు, నతః+అస్మి=నమస్కృతులు.

**తాత్పర్యము:-** అనంతమును నాశరాహిత్యమును బ్రసాదించుట కొఱకు అనంతునికి నమస్కరించు చున్నాను. అనంతత్వమునకు దురంతములైన (అపారములైన) శక్తులు గలవాడను, అచ్చెరువుగొల్పు ప్రభావములు గలవాడు లోకమున పవిత్రముచేయు కర్మలు గలవాడు,



త్రిగుణములచే తనలీలచే జగమున సృష్టి, స్థితి, సంహారములు గావించువాడు, నాశరహిత స్వరూపుడును అగు విష్ణువునకు నమస్కరించుచున్నాను.

**శ్రీ రుద్ర ఉవాచ**

**శ్లో॥ కోపకాలో యుగాన్తస్తే హతోఽయమసురోఽల్పకః।**
**తత్సుతం పాహ్యుపసృతం భక్తం తే భక్తవత్సల॥ 43**

**ప్రతిపదార్థము:-** యుగాంతః=సహస్రయుగములు పరిసమాప్తియగు కాలము, తే=నీకు, కోపకాలః =కోపమునకు, జగత్సంహారమునకు యోగ్యకాలమగును. ఇప్పుడు కోపకాలము కాదు. అల్పకః =మిగుల అల్పుడై, అయం అసురః=ఈ అసురుడు, హతః=చంపబడినాడు, భక్తవత్సల= భక్తులందు ప్రేమ గలవాడా!, తత్+సుతమ్=ఆ యసురుని పుత్రుని, తే భక్తమ్=నీకు భక్తుని, ఉపసృతమ్=సమీపించినవానిని, పాహి=రక్షింపుము.

**తాత్పర్యము:-** ఓదేవా! వేయి మహాయుగములు సమాప్తి గాంచినపుడు నీకు జగములు సంహరించు కోపమునకుఁగాల మగును. ఇప్పుడు కాదు. అత్యల్పుడైన ఈ అసురుడు చంపబడెను. ఓ భక్తవత్సలా! అతని పుత్రుడు నీకు భక్తుడు. నిన్ను చేరియున్నాడు. వీనిని రక్షింపుము. అప్పుడు కోపకాలమనుట ఇప్పుడు కాదనుట అందువలన కోపమును నిర్వృతిచేసుకొనక ప్రహ్లాదుని జంపబోకుము. ఆ కాలమందున్న ఈ కోపము భక్తుని రక్షణ కొఱకు అణచుము. ఇప్పుడా కోపమును విడనాడి వీనిని రక్షింపుము.

**ఇన్ద్ర ఉవాచ**

**శ్లో॥ ప్రత్యానీతాః పరమ భవతా త్రాయతా నస్స్వభాగాః**
**దైత్యాక్రాన్తం హృదయకమలం త్వద్గృహం ప్రత్యబోధి।**
**కాలగ్రస్తం కియదిదమహో నాథ శుశ్రూషతాం తే**
**ముక్తిస్తేషాం న హి బహుమతా నారసింహాపరైః కిమ్॥ 44**

**ప్రతిపదార్థము:-** పరమ=ఓ పురుషోత్తమా! నః=మమ్ములను, త్రాయతా=రక్షించు, భవతా=నీచేత, స్వభాగాః=మావియైన యజ్ఞభాగములు, ప్రత్యానీతాః=మరలగొనిరాబడినవి, హృదయ కమలమ్= హృదయకమలములు, త్వత్+గృహమ్=నీకు గృహమైయుండును, దైత్యాక్రాంతమ్= దైత్యునిచే ఆక్రమింపబడి, ప్రత్యబోధి=ఆ భయమును పోగొట్టుట కొఱకు వికసింపజేయబడినది. నీయొక్క ఉద్యమము త్రైలోక్య ఐశ్వర్యము సాధించుట కొఱకు, నాథ!=ఓ నాథ, తే=నీకు, శుశ్రూషతాం= సేవచేయువారి, కాలగ్రస్తమ్=కాలముచే నాశనము అగు, ఇదమ్=ఈ ఐశ్వర్యము, కియత్=ఎంత మాత్రము అగును. నరసింహ!=ఓ నరసింహ స్వరూపా!, తేషామ్=నీ సేవచేయుభక్తులకు, ముక్తి=మోక్షము, నహి బహుమతా=ఏ మాత్రము ఇష్టము, కిం అపరైః=ఇతర పురుషార్థములచే నేమి ప్రయోజనము.

**తాత్పర్యము:-** ఓ పురుషోత్తముడా! మమ్ములను రక్షింపఁగోరు నీవు మా యజ్ఞభాగములు మాకు మరలవచ్చునట్లు అనుగ్రహించితివి. మా హృదయకమలము నీకు గృహమైయుండునది.

**కిమ్పురుషా ఊచుః**

**శ్లో॥ వయం కిమ్పురుషాస్త్వం తు మహాపురుష ఈశ్వరః।**
**అయం కుపురుషో నష్టో ధిక్కృతః సాధుభిస్సదా॥ 55**

**ప్రతిపదార్థము:–** వయమ్=మేము, కింపురుషాః=కింపురుషులము, త్వమ్ తు=నీవన్నచో, మహాపురుషః ఈశ్వరః=మహాపురుషుడయిన ఈశ్వరుడవు, సాధుభిః=సాధువులచే, సదా=ఎల్లప్పుడు, ధిక్కృతః=నిందింపబడిన, అయమ్=ఈ, కుపురుషః=కుత్సితుడు, నష్టః=నశించెను.

**తాత్పర్యము:–** మేం కింపురుషులము. నీవు మహాపురుషుడవు, ఈశ్వరుడవు. ఎప్పుడునూ సాధుల తిరస్కారము పొందినవాడు నశించెను. గొప్పదైత్యుడు హతుడయ్యెనని.

**వైతాళికా ఊచుః**

**శ్లో॥ సభాసు సత్రేషు తవామలం యశో గీత్వా సపర్యాం మహతీం లభామహే।**
**యస్తాం వ్యనైషీద్వశమేష దుర్జనో దిష్ట్యా హతస్తే భగవన్ యథామయః॥ 56**

**ప్రతిపదార్థము:–** భగవన్=ఓ దేవా!, సభాసు=దేవసభలయందు, సత్రేషు=సత్రయాగములందు, తవ=నీయొక్క, అమలం యశః=స్వచ్ఛమైన యశస్సు, గీత్వా=కీర్తించి, మహతీమ్=గొప్పదైన, దొడ్డదైన, సపర్యామ్=సేవచేతను, లభామహే=పొందువారము, అట్టి మమ్ము, వశమ్=తనకు వశమును, అనైషీత్=పొందజేసే, ఏషః=ఈ, దుర్జనః=దుర్జనుడు, యథా ఆమయః=వ్యాధివలె, హతః=చంపబడెను. తే=నీకు, దిష్ట్యా=మంగళముచేకూరెను.

**తాత్పర్యము:–** ఓ భగవానుడా! మేము దేవసభలందు, సత్రయాగములందు నీ నిర్మలయశమును కీర్తించువారము. నీ దొడ్డసపర్యను పొందుచుండువారము. అట్టి మమ్ము ఆ దైత్యుడు తనకు వశము చేసికొన్నాడు. వాడు వ్యాధివలె నీచేత హతుడయ్యెను. లోకమునకు భద్రము కలిగెను.

**కిన్నరా ఊచుః**

**శ్లో॥ వయమీశ కిన్నరగణాస్తవానుగా దితిజేన విష్టిమమునానుకారితాః।**
**భవతా హరే స వృజినోఽవసాదితో నరసింహ నాథ విభవాయ నో భవ॥ 57**

**ప్రతిపదార్థము:–** ఈశ!=ఓపరమేశ్వరా!, వయమ్=మేము, కిన్నరాః=కిన్నరులము, తవ=నీయొక్క అనుగాః=అనుచరులము, అమునా=ఈ, దితిజేన=దైత్యునిచే, విష్టి=వెట్టిచాకిరికి, అనుకారితాః=నిరంతరము నియోగింపబడితిమి, హరే!=ఓ హరీ, నరసింహ!=ఓ నరసింహా!, నాథ!=ఓ ప్రభో!, భవతా=నీచే, సః=ఆ, వృజినః=పాపాత్ముడు, అవసాదితః=చంపబడెను, నః=మాకు, విభవాయ=సమృద్ధిగా, భవ=అగుగాక.

**తాత్పర్యము:–** ఓ పరమేశ్వరా! ఓ హరి! ఓ నరసింహా! ఓ ప్రభూ! మేము కిన్నరుపము. నీ అనుచరులము. ఆ దైత్యుడు మమ్ములను లేని వెట్టిచాకిలి చేయుటకు నియోగించెను. ఆ పాపాత్ముడు నీచే హతుడయ్యెను. నీవు మా అభివృద్ధికి తోడ్పడుము.

**విష్ణుపార్షదా ఊచుః**

**శ్లో॥ అద్యైతన్నరహరిరూపమద్భుతం తే దృష్టం నః శరణద సర్వలోకశర్మ।**
**సోఽయం తే విధికర ఈశ విప్రశాపాత్తస్యేదం నిధనమనుగ్రహాయ విద్మః॥ 58**





తిలోదకములను యథాప్రకారముగా అనుభవింపుమని మాకు మరల నిచ్చితివి. సర్వధర్మ రక్షకుడైన, నరహరివైన నీకు నమస్కారము చేయుచున్నాము.

**సిద్ధా ఊచుః**

**శ్లో॥ యో నో గతిం యోగసిద్ధామసాధురహార్షీద్యోగతపోబలేన।**
**నానాదర్పం తం నఖైర్విదదార తస్మై తుభ్యం ప్రణమామో నృసింహ॥ 47**

**ప్రతిపదార్థము:–** నృసింహ!=ఓ నృసింహమూర్తి!, యః=ఎవడు, అసాధుః=దుష్టుడై, యోగతపోబలేన=యోగము తపస్సు అనువానిబలముచే,నః=మాయొక్క,యోగసిద్ధామ్=యోగాభ్యాసులచే సిద్ధించిన, గతిమ్=అణిమాదిసిద్ధిని, అహార్షీత్=అపహరించెనో, నానాదర్పమ్=బహువిధములైన అహంకారములుగల, తమ్=వానిని, నఖైః=గోళ్ళచే, విదదార=ఎవడు చీల్చెనో, తస్మై=ఆ, తుభ్యమ్=నీ కొఱకు, ప్రణమామః=నమస్కారము చేయుచున్నాను.

**తాత్పర్యము:–**ఓ నరసింహమూర్తీ, ఏ దైత్యుడు దుష్టుడై తన యోగబలమునను తపోబలమునను మేము యోగశక్తిచే బడసిన మా అణిమాదిసిద్ధిని అపహరించెనో, వివిధములైన అహంకారములు గలవాడైన ఆ దైత్యుని నఖములచే చీల్చి చెండాడిన నీకు మేము ప్రణమిల్లుచున్నాము.

**విద్యాధరా ఊచుః**

**శ్లో॥ విద్యాం పృథగ్ధారణయానురాద్ధాం న్యషేధదజ్ఞో బలవీర్యదృప్తః।**
**స ఏవ సఙ్ఖ్యే పశువద్ధతస్తం మాయానృసింహం ప్రణతాస్స్మ నిత్యమ్॥ 48**

**ప్రతిపదార్థము:–**పృథక్+ధారణయా=ప్రత్యేకించి ధరించుటచేత, అనురాద్ధామ్=సంప్రాప్తమైన, విద్యామ్=అంతర్ధానమగుట లోనగు లక్షణమైన విద్యను, అజ్ఞః=అజ్ఞానియు, బలవీర్యదృప్తః=బలపరాక్రమములచే గర్వించినవాడై, న్యషేధత్=నిషేధించెను, సః+ఏవ=అతడే, సంఖ్యే=యుద్ధమునందు, త్వయా=నీచేత, పశువత్=పశువువలె, హతః=చంపబడెను, మాయా నృసింహమ్=మాయచే నరసింహస్వరూపుడవైన నిన్ను, నిత్యమ్=ఎప్పుడునూ, ప్రణతాః స్మ= మ్రొక్కువారము.

**తాత్పర్యము:–** మేము ప్రత్యేకించిన ప్రయత్నమున జేసి పడసిన అంతర్ధానాది లక్షణమైన మా విద్యను ఆ యసురుడు అజ్ఞుడై బలపరాక్రమములచే గర్వించినవాడై నిషేధించెను. వాడు నీచే యుద్ధమునందు పశువువలెఁ జంపబడెను. ఆ మాయా నరసింహమూర్తివి నీకు మేము ఎల్లప్పుడు నమస్కరించుచున్నాము.

**నాగా ఊచుః**

**శ్లో॥ యేన పాపేన రత్నాని స్త్రీరత్నాని హృతాని నః।**
**తద్వక్షః పాటనేనాసాం దత్తానన్ద నమోఽస్తు తే॥ 49**

**ప్రతిపదార్థము:–** యేన=ఏ అసురునిచే, రత్నాని=మా పడగలపై రత్నములు, స్త్రీ రత్నాని=మా స్త్రీలను రత్నములు, హృతాని=హరింపబడెను, తత్ వక్షః పాటనేన=వాని వక్షమును జీల్చుటచే, ఆసామ్=ఆ స్త్రీలకు, దత్త+ఆనందమ్=ఈయబడిన ఆనందము గలవాడైన, అస్మత్ దత్తానంద=మాకు ఆనందము నిచ్చినవాడా!, తే=నీకు, నమోఽస్తు=నమస్కారమగు గాక!

**తాత్పర్యము:–** ఆ యసురుడు మా ఫణములపై రత్నములను, మా స్త్రీరత్నములను హరించినాడు. వాని వక్షమును జీల్చుటద్వారా మాకు, మా స్త్రీలకును ఆనందమును గలిగించితివి. దేవా! నీకు నమస్కారములు చేయుచున్నాము.

**మనవ ఊచుః**

**శ్లో॥ మనవో వయం తవ నిదేశకారిణో దితిజేన దేవ పరిభూతసేతవః।**
**భవతా ఖలస్స ఉపసంహృతః ప్రభో కరవామ తే కిమనుశాధి కిఙ్కరాన్॥ 50**

**ప్రతిపదార్థము:–** వయమ్=మేము, మనవః=మనువులము, ధర్మపాలకులము, తవ=నీయొక్క, నిదేశకారిణః=ఆజ్ఞను పాలించువారము, దేవ!=ఓదేవా!, దితిజేన=ఆ దైత్యునిచే, పరిభూతసేతవః =ఖండింపబడిన వర్ణాశ్రమధర్మమర్యాదలుగలవారమైతిమి, ప్రభో!=ఓ ప్రభూ!, భవతా=నీచే, సః ఖలః=ఆ దుర్మతి/దుష్టుడు, ఉపసంహృతః=సంహరించబడినాడు, తే=నీకు, కింకరాః =దాసులము, కిం కరవామ=ఏమి చేయుదుము, అనుశాధి=మమ్ములను అనుశాసింపుము.

**తాత్పర్యము:–** ఓ దేవా! ఓ ప్రభూ! మేము మనువులము. ధర్మపాలకులము నీమాట బాలించువారము. ఆ దైత్యుడు వర్ణాశ్రమ ధర్మ మర్యాదలను ఖండించినాడు. నీవు ఆ దుష్టుని సంహరించితివి. మేము నీ కింకరులము మమ్ముల నేమి చేయమందువు. మమ్ములను శాసింపుము.

**ప్రజాపతయ ఊచుః**

**శ్లో॥ ప్రజేశా వయం తే పరేశాభిసృష్టా న యేన ప్రజా వై సృజామో నిషిద్ధాః।**
**స ఏష త్వయా భిన్నవక్షా ను శేతే జగన్మఙ్గళం సత్త్వమూర్తేఽవతారః॥ 51**

**ప్రతిపదార్థము:–** పరేశా=ఓ పరమేశ్వరా!, వయమ్=మేము, తే=నీచే, అభిసృష్టాః=సృజింపబడిన, ప్రజా+ఈశాః=ప్రజాపతులము, యేన=ఏ అసురునిచే, నిషిద్ధాః=నిషేధింపబడినవారమై, ప్రజాః వై=ప్రజలను, న సృజామః=సృజింపకున్నామో, స ఏషః=ఆ ఈయసురుడు, త్వయా=నీచేత, భిన్నవక్షాః=పగిల్చిన వక్షము గలవాడై, శేతే=నేలను పరుండెను, సత్యమూర్తే!=ఓ సత్యమూర్తి!, అవతారః=నీ అవతారము, జగన్మంగళమ్=లోకక్షేమము గదా!

**తాత్పర్యము:–** ఓ పరమేశ్వరా! మేము నీవు సృజించిన ప్రజాపతులము. ఆ యసురుడు, నిషేధించినందున మేము ప్రజలను సృజింపకున్నాము. నీవు వాని వక్షమునుఁజీల్చితివి. వాడు నేలఁబడెను. ఇంక ప్రజలను సృజింపగలము. ఓ సాత్విక స్వరూపా! నీ యవతారము లోకమంగళ దాయకము గదా!

**గన్ధర్వా ఊచుః**

**శ్లో॥ వయం విభో తే నటనాట్యగాయకా యేనాత్మసాద్వీర్యబలౌజసా కృతాః।**
**స ఏష నీతో భవతా దశామిమాం కిముత్పథస్థః కుశలాయ కల్పతే॥ 52**

**ప్రతిపదార్థము:–** విభో!=ఓ ప్రభూ!, వయమ్=మేము, తే=నీ యొక్క, నటనాట్యగాయకాః= నర్తకులము, నృత్యమునందు గాయకులము, వీర్యబల+ఓజసా=పరాక్రమము శక్తి, అనువాని





ప్రభావముగల, యేన=ఏ అసురునిచే, ఆత్మసాత్ కృతాః=స్వాధీనము చేసుకోబడితిమో, స ఏషః =ఆ యీ అసురుడు, భవతా=నీచే, ఇమాం దశామ్=ఇటుల మృతిని, నీతః=పొందెను, ఉత్పథస్థః =ధర్మపథమతిక్రమించినవాడు, కుశలాయ=క్షేమమునకు, కిమ్ కల్పతే=అర్హుడగునా!

**తాత్పర్యము:–** ఓ ప్రభూ! మేము నీ నటకులము నాట్యము నందు గాయకులము. ఆ యసురుని శౌర్యబల ప్రభావమున మమ్ములను తన స్వాధీనము చేసెను. అట్టివాడు నీచే నిట్టి మృతినొందెను. అధర్మ పథవర్తియగువాడు క్షేమమును పొందునా?

**చారణా ఊచుః**

**శ్లో॥ హరే తవాఙ్ఘ్రిపఙ్కజం భవాపవర్గమాశ్రితాః।**
**యదేష సాధుహృచ్ఛయస్త్వయాసురస్సమాపితః॥ 53**

**ప్రతిపదార్థము:–** హరే!=ఓ హరీ!, భవ+అపవర్గమ్=సంసారనివర్తకమైన, తవ=నీయొక్క, అంఘ్రి పంకజమ్=పాదపద్మము, ఆశ్రితాః=ఆశ్రయించినవారము, సాధుహృత్ శయః=సాధువులకు వాని హృదయములందు భయము కలిగించువాడైన, స ఏషః=ఆయీ, అసురః=అసురుడు, భవతా=నీచే, సమాపితః=అంతమొందింపబడినాడు.

**తాత్పర్యము:–** ఓ హరీ! మేము సంసార నివర్తకమైన నీ పాదపద్మముల నాశ్రయించిన వారము. సాధు హృదయములకు భయజనకుడైన యీ యసురుడు నీ చేత అంతమొందింప బడినాడు.

**యక్షా ఊచుః**

**శ్లో॥ వయమనుచరముఖ్యాః కర్మభిస్తే మనోజ్ఞై**
**స్త ఇహ దితిసుతేన ప్రాపితా వాహకత్వమ్।**
**స తు జనపరితాపం తత్కృతం జానతా తే**
**నరహర ఉపనీతః పఞ్చతాం పఞ్చవింశ॥ 54**

**ప్రతిపదార్థము:–** నరహరే!=ఓ నరసింహా!, పంచవింశ=పంచవింశుడైన పరమాత్మ, వయమ్= మేము, మనోజ్ఞైః=మనస్సున కింపైన, కర్మభిః=కార్యములు చేయుటచే, తే=నీయొక్క, అనుచర ముఖ్యాః=అనుచరులలో ముఖ్యులము. ఇహ=ఇక్కడ, తే=ఆమెకు, దితిసుతేన =ఆ దైత్యునిచే, వాహకత్వమ్=రాక్షసులను, ప్రాపితాః=నియమించబడిన, జనపరితాపమ్=ప్రజలను పరితపింప జేయు, స తు=యసురుడైతే, తత్కృతమ్=వాడు చేసినపనిని, జానతా=గుర్తించి, తే=వానికి, పంచతామ్=మరణమును, ఉపనీతః=పొందెను.

**తాత్పర్యము:–** ఓ నరసింహా! చతుర్వింశతితత్త్వము - ఇంద్రియదశకము, పంచతన్మాత్రలు- పంచమహాభూతములు, మహదహంకారములు మనోబుద్ధులు, ప్రకృతి అనువానిని ధరించుచు ఇరువది యైదవదగు పరమాత్మయైనవాడా! నీ మనస్సున కింపైన పనులు చేయు నీ సేవకులయందు ముఖ్యులైనవారము మేము. ఆ దైత్యుడు మమ్ములను ఎల్లరకు వాహనములుగా నియోగించెను. జనులను పరితాపమొందజేయువాడు. వాని పనులను గుర్తించి నీవు వానికి మరణము కలిగించితివి.

**శ్లో॥ అస్తోషీద్ధరిమేకాగ్రమనసా సుసమాహితః।**
**ప్రేమగద్గదయా వాచా తన్న్యస్తహృదయేక్షణః॥ 7**

**ప్రతిపదార్థము:–** ఏకాగ్రమనసా=ఏకాగ్రత నొందిన చిత్తముతో, సుసమాహితః=నిలుకడ నొందినవాడై, తత్+న్యస్తహృదయ+ఈశ్వరః/ఈక్షణః=ఆ నృసింహునందుచిన మనస్సు నేత్రములు కలవాడు, ప్రేమగద్గదయా=ప్రేమచే తొందపాటుపడు వాక్కుచే, హరిమ్=ఆ నరహరిని, అస్తోషీత్ =స్తుతించెను.

**తాత్పర్యము:–** చిత్తము నేకాగ్రము చేసి హృదయమునందు నిల్పి నిలుకడ వహించి ప్రహ్లాదుడు ఆ దేవునందు లగ్నమైన చిత్తమును జూపును గలిగి ప్రేమచే తొట్రిల్లు వాక్కుతో ఆ నరహరిని స్తుతించెను.

**ప్రహ్లాద ఉవాచ**

**శ్లో॥ బ్రహ్మాదయస్సురగణా మునయోఽథ సిద్ధాః**
**సత్త్వైకతానమతయో వచసాం ప్రవాహైః।**
**నారాధితు పురుగుణైరధునాపి పిప్రుః**
**కిం తోష్టుమర్హతి స మే హరిరుగ్రజాతేః॥ 8**

**ప్రతిపదార్థము:–**బ్రహ్మాదయః=బ్రహ్మామున్నగు, సురగణాః=దేవగణములు, మునయః=మునులు, సిద్ధాః=సిద్ధులు, సత్త్వ+ఏకతానమతయోః=సత్త్వగుణముయొక్క దానితో నిండిన మనస్సుగలవారై, వచసామ్=వాక్కులయొక్క ప్రవాహైః=మొత్తము ప్రవాహములచే, అట్లు, పురుగుణైః=పైన చెప్ప బోవు పెక్కుగుణములచేతను, అధునా అపి=ఇప్పటికీ, ఆరాధితుమ్=ఏ దేవుని ఆరాధించుటకు న పిప్రుః=శక్తులు గాలేరో, అట్టి, సః హరిః=ఆ హరి, ఉగ్రజాతేః= ఘోరమైన అసురజాతి వాడినైన, మే=నాచేత, కిమ్=ఎట్లు, తోష్టుమ్=సంతోషము పొందుటకు, అర్హతి=తగును.

**తాత్పర్యము:–** సాత్త్వికులైన చిత్తసమాధానముగల బ్రహ్మాది దేవతలు, మునులు సిద్ధులు వాక్ప్రవాహములచేత బహుగుణములచే ఏ దేవుని స్తుతించుటకు సమర్థులు కాకపోయిరి. ఆ హరిని దారుణమైన అసురజాతియందు జనించిన నా స్తుతికి మాత్రము ఎట్లు సంతోషింప గలడు?

**శ్లో॥ మన్యే ధనాభిజనరూపతపశ్శ్రుతౌజః**
**స్తేజఃప్రభావబలపౌరుషబుద్ధియోగాః।**
**నారాధనాయ హి భవన్తి పరస్య పుంసో**
**భక్త్యా తుతోష భగవాన్ గజయూథపాయ॥ 9**

**ప్రతిపదార్థము:–**ధన=ధనము, అభిజన=సత్కులమున జన్మము, రూప=సౌందర్యము, తపః =తపము, శ్రుతమ్=పాండిత్యము, ఓజః=ఇంద్రియనైపుణ్యము, తేజః=కాంతి, ప్రభావః= ప్రభావము, బల=బలము, పౌరుష=ఉద్యమము, బుద్ధి=ప్రజ్ఞ, యోగాః=అష్టాంగయోగములు, ఈ పంద్రెండు గుణములు,పరస్య=పరమాత్మయైన, పుంసః=పురుషునియొక్క, ఆరాధ్యాయ=



**ప్రతిపదార్థము:–** నరహరిరూప!=ఓ నరసింహమూర్తి!, నః=మాకు, శరణదః=రక్షకులకు, సర్వలోకశర్మ=ఎల్లలోకములకు సుఖమును కలిగించు, ఈశః=పరమేశ్వరుడు, అద్య=ఇపుడు, ఏతత్=ఈ, అద్భుతమ్=అద్భుతమైన అసురవధను, దృష్టమ్=చూడగలిగితిమి. పూర్వము లేనిది, తే=నీ యొక్క, విధికరః=కింకరులను, విప్రశాపాత్=బ్రాహ్మణ శాపమువలన, అయమ్= ఈ అసురుడు అయినాడు. తస్య=వానికి, ఇదం నిధనమ్=ఈ మృతి, విభవాయ=మేలునకే అని, విద్మః=ఎఱుంగు చున్నాము.

**తాత్పర్యము:–** ఓ నరసింహమూర్తి! మాకు శరణుడైనవాడా! ఎల్లలోకములకు సుఖమును గలిగించువాడై అద్భుతమైన అసురవధ నేడు చూడగలిగితిమి. మున్నెన్నడు ఇట్టిది చూడలేదు. నీ కింకరుడు విప్రశాపమున నిట్లు అసురుడైనాడు. వానికి ఈ మరణము వాని మేలునకై అయినదని యెఱుంగుచున్నాము.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**నృసింహావతారే హిరణ్యకశిపుదైత్యవధే నృసింహస్తవో నామ అష్టమోఽధ్యాయః(8)**

### శ్రీః
## అథ నవమోఽధ్యాయః

ఈ అధ్యాయమందు అసురబాలకుడు ప్రహ్లాదుడు బ్రహ్మచే ప్రేరేపింపబడి కోపమును శమింపజేయుట కొరకు భయంకరుడైన నృసింహుని స్తుతించెను.

నారద ఉవాచ

**శ్లో॥ ఏవం సురాదయస్సర్వే బ్రహ్మరుద్రపురస్సరాః।**
**నోపేతుమశకన్మన్యుసంరమ్భం సుదురాసదమ్॥ 1**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ ప్రకారము, సర్వే=ఎల్ల, సుర+ఆదయః=దేవతలు లోనగువారు, బ్రహ్మరుద్రపురస్సరాః=బ్రహ్మ, శివుడు మున్నగ గలవారై దూరము నుండి స్తుతించుచు, మన్యు సంరంభమ్=కోపావేశము గలవాడును, సుదురాసదమ్=మిక్కిలి దరిజేరగలవాడు అగు ఆ నరసింహుడు, ఉపేతుమ్=సమీపించుటకు, న అశకన్=సమర్థులుకారైరి.

**తాత్పర్యము:–** ఇట్లు ఎల్ల సురలు బ్రహ్మను శివుని మున్నిడుకొని దూరము నుండియే స్తుతించుచు కోప సంరంభములో చెనకరానివాడైన నరహరిని సమీపించుటకు సమర్థులుకారైరి.

**శ్లో॥ సాక్షాచ్ఛ్రీః ప్రేషితా దేవైర్దృష్ట్వా తన్మహదద్భుతమ్।**
**అదృష్టాశ్రుతపూర్వత్వాత్ సా నోపేయాయ శఙ్కితా॥ 2**

**ప్రతిపదార్థము:–** సాక్షాత్=ప్రత్యక్షముగా, శ్రీః=లక్ష్మి, దేవైః=సురలచే, ప్రేషితా=పంపబడినదై, తత్+మహత్+అద్భుతమ్=ఆ దేవుని గొప్ప అద్భుతరూపమును, దృష్ట్వా=చూచి, శంకితాగతా= శంకగలదై, అదృష్ట+అశ్రుతపూర్వత్వాత్=పూర్వము కని వినినది కానందుకు, సా=ఆమె, న+ ఉపేయాయ=సమీపించలేదు.

**తాత్పర్యము:–** లక్ష్మీదేవి సాక్షాత్తుగా దేవతలు చెప్పిపంపినను ఆ దేవుని మిక్కిలి ఆశ్చర్యకరమైన రూపమును జూచి అట్టిది ఇదివరకెన్నడు తాను జూచిగాని, వినిగాని యున్నది కానందున శంకించినదై సమీపించలేనిదయ్యెను.

**శ్లో॥ ప్రహ్లాదం ప్రేషయమాస బ్రహ్మావస్థితమన్తికే।**
**తాత ప్రశమయోపేహి స్వపిత్రే కుపితం ప్రభుమ్॥ 3**

**ప్రతిపదార్థము:–**బ్రహ్మ=బ్రహ్మ,అంతికే=సమీపమునందు, అవస్థితమ్=ఉన్న, ప్రహ్లాదమ్= ప్రహ్లాదుని, తాత=ఓ నాయనా!, స్వపిత్రే=మీ తండ్రికై, కుపితమ్=కోపముపొందిన, ప్రభుమ్= ప్రభువైన దేవుని, ప్రశమయ=శాంతుని జేయుము. ఉపేహి=సమీపించుము అని, ప్రేషయామాస= పంపెను.

**తాత్పర్యము:–** అప్పుడు బ్రహ్మదేవునికి కొంత సమీపమునందున్న ప్రహ్లాదుని జూచి, నాయనా!



మీ తండ్రిపై కోపము వహించిన ఆ నారసింహుని శాంతపరచుము అని సమీపమునకు బొమ్మని చెప్పిపంపెను.

**శ్లో॥ తథేతి శనకై రాజన్ మహాభాగవతోఽర్భకః।**
**ఉపేత్య భువి కాయేన ననామ విహితాఞ్జలిః॥ 4**

**ప్రతిపదార్థము:–** రాజన్=ఓ రాజా!, తథా+ఇతి=అట్లేయని, మహాభాగవతః=దొడ్డభక్తుడైన, అర్భకః =బాలుడు ప్రహ్లాదుడు, శనకైః=ఆనరసింహుని సమీపించి, విహితాంజలిః=చేతులు దోయిలించి, విధృత=నేలమీద, కాయేన= శరీరముతో, ననామ=సాగిలబడి మ్రొక్కెను.

**తాత్పర్యము:–** బ్రహ్మ మాటకు అట్లేయని ఆ మహాభాగవతుడగు, బాలుడగు ఆ ప్రహ్లాదుడు మెల్లగా ఆ నరసింహుని సమీపించి చేతులు దోయిలించి సాగిలబడి మ్రొక్కెను.

**శ్లో॥ స్వపాదమూలే పతితం తమర్భకం విలోక్య దేవః కృపయా పరిప్లుతః।**
**ఉత్థాప్య తచ్ఛీర్ష్ణ్యదధాత్ కరామ్బుజం కాలాహివిత్రస్తధియాం కృతాభయమ్॥ 5**

**ప్రతిపదార్థము:–** స్వపాదమూలే=తన పాదముల చెంగట, పతితః=సాగిలబడిన, తం అర్భకమ్ =ఆ బాలుని ప్రహ్లాదుని, విలోక్య=చూచి, దేవః=ఆ నరసింహదేవుడు, కృపయా=కనికరముచేత, పరిప్లుతః=తడిసినవాడై, దయతో కనికరించినవాడై, ఉత్థాప్య=వానినిలేపి, తత్‌శీర్ష్ణ=వాని శిరము, కాలాహివిత్రస్తధియామ్=కాలమనెడు సర్పముచే భయపడిన హృదయము గలవానికి, కృతా భయమ్=అభయదానమిచ్చు, కరాంబుజమ్=తన కరకమలమును, అదధాత్=అతని శిరము నందుంచెను.

**తాత్పర్యము:–** తన యడుగుల చెంగట సాగిలబడిన ఆ ప్రహ్లాద బాలుని చూచి కనికరముతో మెత్తబడిన చిత్తముగలవాడై ఆ నరసింహదేవుడు వానిని లేవనెత్తి కాలమను సర్పముచే భయపడిన చిత్తము గలవారలకు అభయదానమిచ్చు తన హస్తకమలమును వాని శిరమునందుంచెను.

**శ్లో॥ స తత్కరస్పర్శధుతాఖిలాశుభస్సపద్యభివ్యక్తపరాత్మదర్శనః।**
**తత్పాదపద్మం హృది నిర్వృతో దధౌ–హృష్యత్తనుః క్లిన్నహృదశ్రులోచనః॥ 6**

**ప్రతిపదార్థము:–** సః=ఆ ప్రహ్లాదుడు, తత్+కరస్పర్శ=ఆ నృసింహుని చేతి తాకుడుచే, ధుత+ అఖిల+అశుభః=తొలగిన యెల్ల దోషములుగలవాడై, సపది=తక్షణమే,అభివ్యక్త+పరాత్మదర్శనః =సాక్షాత్కరించిన బ్రహ్మజ్ఞానము గలిగి, నిర్వృతః=పరమానందముతో, హృష్యత్+తనుః= గగుర్పొడిచిన మేను గలవాడై, క్లిన్నహృత్=ప్రేమచే తడిసిన మనస్సు గలిగి, అశ్రులోచనః= ఆనంద బాష్పముల తోడి కన్నులు గలిగి, తత్+పాదపద్మమ్=ఆ నరసింహుని పాదకమలము లను, హృది=హృదయమందు, దధౌ=ధరించెను, సాధనముగా గల పరమ పురుషార్థముగ ధరించెను.

**తాత్పర్యము:–** ఆ ప్రహ్లాదు డా దేవుని కరస్పర్శ మాత్రమున సమస్తదోషములు వైదొలగినవాడై, తక్షణమే బ్రహ్మజ్ఞానమొంది సుఖాత్ముడై మేను గగుర్పాటు పొంది కన్నుల నానంద బాష్పములు నెలకొని, ఆ దేవుని పాదపద్మముల వాని హృదయమందు ధరించెను.

లేనందున దాని నుపసంహరింపుమని. ఓయీ! ఇతరులను వధించుట సాధువే ఎందులకు సంతోషించునందులకు పరులకుపద్రవము చేయు సర్పవృశ్చికాదులన నితరుడెవ్వడు జంపినను ఆ వధకు వానివలన మనకు క్షేమము గలిగినదని సాధువు సైతము సంతోషించును గదా! అట్లయిన పెక్కుమందికి సుఖము గలిగించిన ఈ క్రోధమును త్యజించనందువా? లోకములిప్పుడు శాంతి సుఖములను పొంది నీ క్రోధోపసంహారమును ప్రతీక్షించుచున్నవి. అట్లయిన జనులకు మరల భయము లేకుండుటకై క్రోధమును ధరించునందువా! ఈ నీ రూపమును స్మరించుట వలననే భయనివృత్తి గలుగుచున్నందున క్రోధమును ధరింపవలసిన ఆవశ్యకము లేదు.

**శ్లో॥ నాహం బిభేమ్యజిత తేఽతిభయానకాస్య**
**జిహ్వార్కనేత్రభ్రుకుటీరభసోగ్రదంష్ట్రాత్।**
**ఆన్త్రస్రజఃక్షతజకేసరశఙ్కుకర్ణాత్**
**నిర్హ్రాదభీతదిగిభాదరిభిన్నఖాగ్రాత్॥ 15**

**ప్రతిపదార్థము:-** అజిత=ఓ అజయుడా!, అహమ్=నేను, తే=నీయొక్క, అతిభయా..... దంష్ట్రాత్=అతిభయానక=మిగుల భయంకరమైన, ఆస్య=ముఖము, జిహ్వా=నాలుక, అర్కనేత్ర=సూర్యుని వలె జ్వలించు నేత్రములు, భ్రుకుటీరభస=బొమముడియొక్క తీవ్రత, ఉగ్రదంష్ట్రాత్=వాడి కోరలు గలిగిన, ఆంత్రస్రజః=ప్రేగులు మాలికలు గలదై, క్షతజకేసర శంకుకర్ణాత్=నెత్తుటిచే తడిసిన వెండ్రుకలు మేకులవంటి చెవులు గలిగినదై, నిర్హ్రాదభీతదిక్ +ఇభాత్=నీ సింహగర్జనచే బీతి పొందిన దిగ్గజములు గలదై, అరిభిత్+నఖాగ్రాత్=శత్రువును చీల్చిన గోళ్ళు కలదైన నీరూపము వలన, అహమ్=నేను, న బిభేమి=భయపడను.

**తాత్పర్యము:-** ఓ అజయుడా! మిగుల భయంకరమగు ముఖము, నాలుక, సూర్యుని వలె జ్వలించు నేత్రములు, చలించు కనుబొమలు పదునైన భయము కల్పించు కోరలు గలదియు, ప్రేవులు దండలుగలదై నెత్తురుఁదడిసిన జూలు వెండ్రుకలు మేకుల వంటి చెవులు గలదై అట్టహాసముచే దిగ్గజములకు భీతి కల్గించునదై శత్రువును చీల్చివైచిన నఖములు గల నీ రూపును జూచి నేను భయపడను.

**శ్లో॥ త్రస్తోఽస్మ్యహం కృపణవత్సల దుస్సహోగ్ర**
**సంసారచక్రకదనాత్ గ్రసతాం ప్రణీతః।**
**బద్ధః స్వకర్మభిరుశత్తమ తేఽఙ్ఘ్రిమూలం**
**ప్రీతోఽపవర్గశరణం హ్వయసే కదా ను॥ 16**

**ప్రతిపదార్థము:-** కృపణవత్సల=ఓ దీనులందు ప్రేమగలవాడా! ఉశత్తమ=ఓ కమనీయతమ చూడదగినవారిలో శ్రేష్ఠుడా!, దుస్సహ+ఉగ్రసంసారచక్రకదనాత్=సహింపరానిదై భయంకరమైన సంసారమను పైకి క్రిందికి తిరుగుచున్న చక్రమందలి దుఃఖమువలన, త్రస్తః అస్మి=భయపడు వాడ నగుచున్నాను. గ్రసతామ్=ఆ సంసారమునందు హింసించు వానిలో, స్వకర్మభిః=స్వీయ కర్మలచే, బద్ధః=కట్టుపడినవాడనై, ప్రణీతః=కదలకుండ నుంచబడితిని, కదా ను=ఎప్పుడు, ప్రీతః=నా యెడ దయగలవాడవై, అపసర్గశరణం=మోక్ష రూపగృహమైన, తే=నీయొక్క





పూజకొరకై, న భవంతి=ప్రధానములుకావు, ఇతి మన్యే!=అని తెలుసుకొందును, భక్త్యా= కేవలము భక్తిచే,భగవాన్=భగవంతుడు, గజయూథపాయ=గజేంద్రుని కొఱకు, తుతోష= సంతుష్టుడయ్యెను.

**తాత్పర్యము:-** ధనము,సత్కులీనత,సౌందర్యము,తపము,పాండిత్యము,ఇంద్రియసామర్థ్యము, శరీరకాంతి, ప్రతాపము, బలము, ప్రయత్నము, ప్రజ్ఞ, యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధులను అష్టాంగ యోగము లోనగు ఈ పండ్రెండు భగవంతుని ఆరాధించుటకు ప్రధానములు కావని తలంచెను. ఏలయన భగవంతుడు కేవల భక్తిచేతనే గదా గజేంద్రునికై సంతుష్టి గలవాడై రక్షించెను.

**శ్లో॥ విప్రాద్ద్విషడ్గుణయుతాదరవిన్దనాభ-**
**పాదారవిన్దవిముఖాచ్ఛ్వపచం వరిష్ఠమ్।**
**మన్యే తదర్పితమనోవచనేహితార్థ-**
**ప్రాణం పునాతి స కులం న తు భూరిమానః॥ 10**

**ప్రతిపదార్థము:-** ద్విషట్+గుణయుతాత్=పైన పేర్కొన్న రెండు ఆఱులు 12 గుణాలు గల లేక సనత్సుజాతుడు చెప్పిన

***ధర్మశ్చ సత్యం చ దమః శ్రుతం చ అమాత్సర్యం హ్రీ స్తితిక్షానసూయా।***
***దానం చ యజ్ఞశ్చ ధృతిః శమశ్చ వ్రతానివైద్వాదశ బ్రాహ్మణస్య॥***

అని పండ్రెండు గాని కల్గి, అరవిందనాభపాదారవిందవిముఖాత్=పద్మనాభుని పాదపద్మములు భజించుటకు విముఖుడైన, విప్రాత్=విప్రుని కంటె, తత్+అర్పిత మనస్+వచన+ఈహిత+ అర్థప్రాణమ్=ఆ హరియందు సమర్పించబడిన మనస్సు, వాక్కు, కోర్కెలు, ధనము, ప్రాణము గల, శ్వపచమ్=చండాలుని, వరిష్ఠమ్=శ్రేష్ఠునిగా, మన్యే=తలచెదను, ఏలన, సః=భక్తుడైన శ్వపచుడు, కులమ్=తనకులమును, పునాతి=పవిత్రముచేయును. న భూరిమానః=అధిక గర్వము గల ఆ విప్రుడు తనను తాను కూడా పవిత్రునిఁజేసికొనలేడు. మఱి కులమెట్లు పవిత్రమగును.

**తాత్పర్యము:-** పైన పేర్కొన్న పండ్రెండు గుణములు గాని సనత్సుజాతుడు చెప్పిన జ్ఞానాదులు పండ్రెండు గుణములు గాని కలిగి తామరను బొడ్డునందు గల విష్ణు భజనము నందు పెడ మొగము వైచిన బ్రాహ్మణుని కంటె ఆహరియందు తనమనోవాక్కులను వాంఛలను ధన ప్రాణము లను అన్నింటిని సమర్పించిన భక్తుడైన చండాలుడు మేలని నా అభిప్రాయము. ఆ చండాలుడు తాను పవిత్రుడగుటయే గాక తన కులము నంతను పవిత్రము చేయును. మిక్కిలి పొగరుబోతగు ఈ పాఱుడు బ్రాహ్మణుడు తన్నుఁగూడఁబవిత్రుని జేసికొనలేడు. ఇక ధన కులము నుద్ధరించుట యేమున్నది. కనుక పైన పేర్కొన్న పండ్రెండు గుణములు భక్తిలేనివారికి గర్వ కారణములగు చున్నవి. మఱి అట్లయిన ధనాదుల నర్పించుటచే సన్మానమును ప్రాకృత పురుష డపేక్షించునట్లు భగవంతుడు సైతము అట్టి ధనాది సన్మానమును వాంఛించునా యన్నచో వాంఛింపడనుచున్నాడు.

**శ్లో॥ నైవాత్మనః ప్రభురయం నిజలాభపూర్ణో**
**మానం జనాదవిదుషః కరుణో వృణీతే।**

యద్యజ్ఞో భగవతే విదధీత మానం
తచ్చాత్మనే ప్రతిముఖస్య యథా ముఖశ్రీః॥ 11

**ప్రతిపదార్థము:-** ప్రభుః=ప్రభువైన, అయమ్=ఈ భగవంతుడు, నిజలాభపూర్ణః=తన సత్య జ్ఞానానందస్వరూప లాభమున పూర్ణుడు కావున, అవిదుషః=అల్పుడైన, జనాత్=జనునివలన, మానమ్=పూజను, ఆత్మనః=తన ప్రయోజనమునకైన, న వృణీతే=ఇచ్ఛగింపడు, కరుణః =దయాళుడై మంచి కొరకే, జనః=జనము, భగవతే=భగవంతుని కొఱకు, యత్=ఏది, మానమ్= పూజను, యత్=ఏ ధనాధికము, విదధీత=చేయునో, తత్=ఆ పూజ, ముఖశ్రీః=ముఖమందలి తిలకములోనగువాని శోభ, యథా ప్రతిముఖస్య=అద్దమునందు ప్రతిబింబించిన ముఖమునకు కలుగుచున్నదో అట్లే, ఆత్మనే=తమ కొఱకు అగుటు మరిసాక్షాత్తుగా ప్రతిబింబమునకు తిలకము శోభగావించదుగా.

**తాత్పర్యము:-** జగములకు ప్రభుడైన భగవంతుడు సత్యజ్ఞానానంద పూర్ణుడు కావున అల్పుడైన జనుడు చేయు పూజను స్వప్రయోజనమునకై కోరడు. మరి వాని ప్రయోజనమునకే గ్రహించును. జనుడు భగవంతుని గూర్చి ధనాధికముచే నేయే పూజనుఁజేయుచున్నాడో అది ముఖమునందు దిద్దుకొన్న / పెట్టుకొన్న కుంకుమాదుల బొట్టుయొక్క అద్దమునందు ప్రతిఫలించిన ఆ ముఖ ప్రతిబింబమునకే శోభ తెచ్చినట్లు ఆ పూజా ఫలాదికము ఆజనుడికే యగును.

శ్లో॥ తస్మాదహం విగతవిక్లబ ఈశ్వరస్య
సర్వాత్మనా మహి గృణామి యథా మనీషమ్।
నీచోఽజయా గుణవిసర్గమనుప్రవిష్టః
పూయేత యేన హి పుమాననువర్ణితేన॥ 12

**ప్రతిపదార్థము:-** తస్మాత్=ఎందువలన నిట్లు భగవంతుడు భక్తిచేతనే సంతోషించుచున్నాడో అందువలన, అహమ్=నేను, నీచః=నీచుడైన, విగతవిక్లబః=పోయిన శంకకలవాడనై, ఈశ్వరస్య =పరమేశ్వరునియొక్క, మహి=మహిమను, సర్వాత్మనా=పరిపూర్తిగా, సర్వప్రయత్నముచే, యథా మనీషమ్=నా బుద్ధ్యనుసారముగా, గృణామి=వర్ణించెదను, భగవత్తత్త్వ మెఱుంగని వాడయ్యు స్తుతి చేయుటకు కారణము చెప్పుచున్నాడు. అనువర్ణితేన=వర్ణించబడినది, యేన=ఏ భగవంతుని వర్ణనా మహిమ చేత, అజయా=అ విద్యచేతనైన, గుణవిసర్గమ్=త్రిగుణ సృష్టియైన సంసారమున, ప్రవిష్టః=ప్రదేశించిన, పుమాన్=పురుషుడు, పూయేత=పవిత్రుడగునో, ఆ మహిమ కంటే నితరము పురుషుని పవిత్రునిఁజేయజాలవని భావము.

**తాత్పర్యము:-** అందువలన నేను నీచుడనైనను శంకలేక పరమేశ్వరుని మహిమను సర్వ ప్రయత్నముతో నా బుద్ధికందినంతవరకు భగవంతుని మహిమను వర్ణించెదను. ఏవానిని వర్ణించిన మహిమచేతనే పురుషుడు అవిద్యచే త్రిగుణ సృష్టిగా నేర్పడిన సంసారమును ప్రవేశించిన వాడయ్యు పవిత్రుడగుచున్నాడో కాబట్టి ఈ మహిమ కంటె అన్యమేదియు పురుషునిఁబవిత్రుని జేయజాలదు.



శ్లో॥ సర్వే హ్యమీ విధికరాస్తవ సత్త్వధామ్నో
బ్రహ్మాదయో వయమివేశ న చోద్విజన్తః।
క్షేమాయ భూతయ ఉతాత్మసుఖాయ చాస్య
విక్రీడితం భగవతో రుచిరావతారైః॥ 13

**ప్రతిపదార్థము:-** ఈశ=ఓ పరమేశ్వర!, అమీ=ఈ, ఉద్విజంతః=మనోవ్యథచే బాధపడుచున్న, సర్వే=ఎల్లరైన, బ్రహ్మాదయః=బ్రహ్మాలోనగు దేవతలు, సత్త్వధామ్నః=సాత్త్వికమూర్తివైన, తవ=నీ యొక్క, విధికరాః=నీ ఆజ్ఞను గావించువారు భక్తులేగాని అన్యులు గారు. వీరు భక్తులు, శ్రద్ధచేతనే, భగవతః=భగవంతుడవైన నీ యొక్క, రుచిర+అవతారైః=సుందరములైన అవతారములచే, విక్రీడితమ్=వివిధముగా క్రీడించిన క్రీడలు, అస్య=ఈ విశ్వము యొక్క, క్షేమాయ=క్షేమము కొఱకు, భూతయే=ఐశ్వర్యము కొఱకు, ఉత=మఱియు, ఆత్మసుఖాయ= ఆత్మసుఖమునకు, ఆత్మానందము కొఱకుగాని భయోత్పాతము కొఱకు కాదు.

**తాత్పర్యము:-** నీ రూపము, కృత్యమును మనఃక్షోభముతో భయపడుచున్న ఈ బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు లోనగువారు నీశాసనమును గావించునట్టి నీ భక్తులు గాని అసురులమగు మావలె వైరులు గారు. భగవంతుడవైన నీ అవతారకృత్యములు లోకక్షేమమునకు, ఐశ్వర్యమునకు, ఆత్మసుఖమునకుఁ బ్రయోజనకారియగును. యోత్పాదనము గావించుటకు గాదు.

శ్లో॥ తద్యచ్ఛ మన్యుమసురశ్చ హతస్త్వయాద్య
మోదేత సాధురపి వృశ్చికసర్పహత్యా।
లోకాశ్చ నిర్వృతిమితాః ప్రతియాన్తి సర్వే
రూపం నృసింహ విభయాయ జనాః స్మరన్తి॥ 14

**ప్రతిపదార్థము:-** తత్=వీరెల్లరు భయపడియున్నారు కావున, మన్యుమ్=వీరి భయము పోవుటకై నీ కోపమును, యచ్ఛ=ఉపసంహరింపుము. త్వయా=నీచే, అద్య=ఇప్పుడు, అసురః చ=దైత్య ప్రభుడు, హతశ్చ=చంపబడినాడు. ఎందుకై ఈ కోపమో ఆయసురుడు చంపబడినాడనుట - వృశ్చిక సర్పహత్యా=ఇతరునిచే చేయబడిన వృశ్చిక సర్పాదుల వధచే, సాధు అపి=సత్పురుషుడు కూడ, మోదేత=సంతోషించును, లోకాశ్చ=లోకములును, నిర్వృతిమ్=సుఖమును, ఇతాః= పొందినవై, ప్రతియాతి=నీక్రోధోప సంహారమును ప్రతీక్షించుచున్నవి. సర్వేజనాః=ఎల్లజనులు, నృసింహ=ఓ నృసింహమూర్తి, రూపమ్=నీ రూపమును, విభయాయ=భయనివృత్తికై, స్మరంతి= ఇఁక స్మరించుచుందురు.

**తాత్పర్యము:-** ఓ నరసింహా! అందువలన నీ కోపమును ఉపసంహరింపుము. ఈ అసురప్రభుడు నీచేఁజంపబడినాడు. ఇతరుల కుపద్రవము చేయు తేలు, పాములను ఇతరుడు జంపిన యెడల ఆ వధకు సాధువుసైతము సంతసించును గదా! అట్లే ఎల్లలోకములు సుఖమునుపొంది నీ క్రోధోపసంహారమును గూర్చి వేచియున్నవి. ఈ నీ రూపమును జనులెల్లరు ఇక మీద భయ నివృత్తికి స్మరింతురు గాక! ఏ ప్రయోజనమర్థించి ఈ క్రోధము నీకు కలిగినదో ఆ యసురుడు సాధువుల సంతోషము కొఱకు ఇప్పుడు చంపబడినాడు. ఇంక నీ క్రోధముచే నేమి పని

ఓయీ! నాకు గూడా మాయా సంబంధము వలనఁ గర్తృత్వమేర్పడియుండుట వలనను, కర్తృత్వాదులచే గలిగియున్నందువలనను నీ కంటే నాకు ఏమి విశేషము లేదు కదా అన్నచో చెప్పుచున్నాడు.

**శ్లో॥ స త్వం హి నిత్యవిజితాత్మగుణస్స్వధామ్నా**
**కాలో వశీకృతవిసృజ్యవిసర్గశక్తిః।**
**చక్రే విసృష్టమజయేశ్వరషోడశారే**
**నిష్పీడ్యమానముపకర్ష విభో ప్రపన్నమ్॥ 22**

**ప్రతిపదార్థము:-** స్వధామ్నా=నీచిచ్ఛక్తిచేత, నిత్యవిజితాత్మగుణః=ఎప్పుడును జయింపబడిన బుద్ధి కలిగినవాడవు, అజయ=జయింపరానివాడు, ఈశ్వర=పరమేశ్వర!, సః=అ, త్వమ్=నీవు, కాలః =మాయా ప్రేరకుడవైన, కాలస్వరూపుడవై, వశీకృతవిసర్గశక్తిః=వశీకరించుకొన్న కార్య రూపములైన వానిని సృజించు సాధనముల శక్తి గలవాడవై, షోడశారే=పదునాఱు ఆకులు గల,చక్రే=చక్రమునందు, అజయ=నీమాయచే, విసృష్టమ్=విడువబడి, నిష్పీడ్యమానమ్=చెఱకు గడవలె పీల్చి పిప్పిచేయబడుతున్న, ప్రపన్నమ్=నిన్ను శరణుపొందిన నన్ను, విభో!=ఓ ప్రభూ!, ఉపకర్ష=నీ సమీపమునకు లాగుకొనుము.

**తాత్పర్యము:-** నీవు నీ చిచ్ఛక్తిచే బుద్ధి గుణములనెల్ల నెల్లప్పుడు జయించినవాడవైయుండు వాడవు. పరమేశ్వరుడవైన నీవు మాయను ప్రేరేపించు కాలస్వరూపుడవై కార్యరూపములైన జీవాదులను సృజించు సాధనమైన శక్తిని వశపఱచుకొన్నవాడవైయున్నావు. కావున ఓ ప్రభూ! పదునాఱు ఆకులు గల సంసార చక్రమందు నీ మాయచేఁబడవేయబడి చెఱకు గడ పీల్చి పిప్పిచేయఁబడుచు నిన్ను శరణుపొందిన నన్ను నీ సమీపమునకు లాగుకొనుము.

**శ్లో॥ దృష్టా మయా దివి విభోఽఖిలధిష్ణ్యపానా-**
**మాయుశ్శ్రియో విభవ ఇచ్ఛతి యాం జనోఽయమ్**
**యేఽస్మత్పితుః కుపితహాసవిజృమ్భితభ్రూ**
**విస్ఫూర్జితేన లులితా స్స తు తే నిరస్తః॥ 23**

**ప్రతిపదార్థము:-** విభో!=ఓ జగత్ప్రభూ!, అయమ్=ఈ, జనః=సంసారిజనుడు, యామ్=దేనిని, ఇచ్ఛతి=కోరునో, అఖిలధిష్ణ్యపానామ్=ఎల్లలోకపాలురయొక్క, ఆయుః శ్రియః=ఆయువు, సంపదలు, విభవః=వైభవము, మయా=నాచే, దృష్టాః=చూడబడినవి, యే=ఏవి, అస్మత్+పితుః =మా తండ్రియొక్క, కుపిత=కోపమొందిన, హాస=నవ్వుచే, విజృంభితభ్రూవిస్ఫూర్జితేన=భ్రూ భంగము చేతనే, లులితాః=ధ్వంసము చేయబడినవి, సః+తు=అ మా తండ్రిమాత్రము, తే=నీచే, నిరస్తః=హతుడయ్యెను.

**తాత్పర్యము:-** ఓ ప్రభూ! సంసారియగు పురుషుడేదివ్యభోగములను వాంఛించునో ఆ సకల లోకపాలుర యొక్క ఆయుస్సంపదలను వైభవములను నేను గాంచితిని. అవి యన్నియు కోపగించిన మా తండ్రి బొమముడిపాటుననే హతములైనవి. అట్టి మా తండ్రి నీ చే హతు డయ్యెను.





అంఘ్రిమూలమ్=పాదకమలముల సమీపమునకు, కదా ను హ్వయసే=ఎప్పుడు నన్ను బిలుతువో కదా!

**తాత్పర్యము:-** ఓ దీనవత్సలా! ఓ మనోజ్ఞతమా! నేను ఈ సైరింపరాకదారుణమైన సంసార చక్రము నందలి దుఃఖమునకు భయపడుచున్నాను. ఈ సంసారమున హింసించుచున్న స్వకర్మలచే బద్ధుడనై కదలలేక పడియున్నాను. నీవు నాయందు ప్రీతుడవై మోక్షగృహమైన నీ పాదకమలముల చెంతకు నన్నెప్పుడు పిలుతువో గదా!

**శ్లో॥ యస్మాత్ప్రియాప్రియవియోగసంయోగజన్మ-**
**శోకాగ్నినా సకలయోనిషు దహ్యమానః।**
**దుఃఖౌషధం తదపి దుఃఖమతద్ధియాహం**
**భూమన్ భ్రమామి వద మే తవ దాస్యయోగమ్॥ 17**

**ప్రతిపదార్థము:-** భూమన్=ఓ నిత్య సుఖరూపా!, యస్మాత్=ఏ స్వకర్మవలననగు, ప్రియవియోగ+ సంయోగ జన్మశోక+అగ్నినా=ఇష్టములైన వాని యొక్కయు క్రమముగా వీడ్పాటును, కూడికలచేత పుట్టుక గలదై శోకము అను అగ్నిచేత, సకలయోనిషు=మనుష్య పశుపక్ష్యాదికములను ఎల్ల జన్మములందు, దహ్యమానః=దహింపబడుచున్నవాడనైతిని, దుఃఖౌషధమ్=ఆ దుఃఖమునకుఁ బ్రతీకారముజేయు ఔషధమును జూచినను, దుఃఖమ్=అదియు దుఃఖమగుచున్నది, అతత్+ధియా =దేహాదులందభిమాన బుద్ధితో, భ్రమామి=మోహమొందు చున్నాను. తవ=నీయొక్క, దాస్య యోగమ్=సేవారూపయోగమును,నాదు దుఃఖము నిస్తరింపఁజేయు దానిని, వద=ఉపదేశింపుము.

**తాత్పర్యము:-** స్వకర్మలచే బద్ధుడనై ఇష్టములను వీడ్పఱచుచు, అనిష్టములను గూర్చుచు జనించిన శోకమను నగ్నిచే దహింపబడుచున్నాను. ఈ దుఃఖముపశింపఁజేయు ప్రతీకారము సైతము దుఃఖమేయగుచున్నది.దేహాదులనభిమానించుబుద్ధితో మోహమునుఁబొందుచున్నాను. ఓ ప్రభూ! నీదైన దాస్యమను యోగమును నాకుపదేశింపుము అది నా దుఃఖమును నిస్తరింపఁజేయు నుపాయమగును.

**శ్లో॥ సోఽహం ప్రియస్య సుహృదః పరదేవతాయా**
**లీలాకథాస్తవ నృసింహ విరిఞ్చగీతాః।**
**అఞ్జస్తితర్మ్యనుగృణన్ గుణవిప్రముక్తో**
**దుర్గాణి తే పదయుగాలయహంససఙ్గః॥ 18**

**ప్రతిపదార్థము:-** నృసింహ=ఓ నృసింహా!, సః అహమ్=ఆ నేను, ప్రియస్య=ఇష్టుడును, సుహృదః =మేలుగోరు మిత్రుడునైన, పరదేవతాయా=పరదేవతయునైన, తవ=నీయొక్క, విరించగీతాః =బ్రహ్మచేవర్ణింపబడిన, లీలాకథాః=నీ విలాసచరిత్రములను, అనుగృణన్=వర్ణించుచు, స్తుతించుచు, గుణవిప్రయుక్తః=రాగాది గుణములచే మిక్కిలి విడుదలగలవాడ, తే=నీ యొక్క పదయుగ+ఆలయహంససంగః=పాదద్వంద్వమును గృహముగల, జ్ఞానులతోడి సాంగత్యము గలిగినవాడనై, దుర్గాణి=ఆ సంసార దుఃఖములను, అంజః=శీఘ్రముగా, తితర్మి=తరించెదను.

**తాత్పర్యము:-** ఓ నరసింహా! నేను ఇష్టుడు, మేలు చేయు మిత్రుడు, పరదేవతయునైన నిన్ను గూర్చి బ్రహ్మదేవుడు వర్ణించిన నీ లీలాచరిత్రములను గీర్తించుచు, రాగద్వేషాది గుణముల నుండి విముక్తిగాంచి నీ పాదయుగళమును గృహమునాశ్రయించిన జ్ఞానుల సాంగత్యము పడసినవాడనై శీఘ్రముగనే ఆ దుఃఖములను దాటెదను.

**శ్లో॥ బాలస్య నేహ శరణం పితరౌ నృసింహ**
**నార్తస్య చాగదముదన్వతి మజ్జతో నౌః।**
**తప్తస్య తత్ప్రతివిధిర్య ఇహాఞ్జసేష్టః**
**తావత్ప్రభో తనుభృతాం త్వదుపేక్షితానామ్॥ 19**

**ప్రతిపదార్థము:-** తప్తస్య=దుఃఖములచే తాపమొందినవానికి ఆ దుఃఖములనుపశమింపజేయు ప్రతీకారము, ఇహ=ఇహలోకమందు, యః=ఏది, అంజసా=శీఘ్రముగా, న ఇష్టః=ఇష్టము కాకనున్నదో అది, ప్రభో!=ఓ ప్రభూ!, త్వత్+ఉపేక్షితానామ్=నీచే ఉపేక్షితులైనవారిని, తావత్= ఆక్షణమాత్రమే కాని, ఆత్యంతికము పూరి రక్షకము కాదు. నృసింహ!=ఓ నృసింహా!, బాలస్య= బాలునికి, పితరౌ=తల్లిదండ్రులు, ఇహ=ఈ జగమునందు, శరణమ్=రక్షకులు, న=కారు, ఆర్తస్య =రోగబాధితునికి, అగదం చ=ఔషధమును, న=రక్షకము కాదు, ఉదన్వతి=సముద్రమునందు, మజ్జతః=మునిగిపోవుచున్నవానికి, నౌ=ఓడ, న=రక్షకము కాదు.

**తాత్పర్యము:-** ఓ నరసింహా! దుఃఖములచే సంతప్తుడైన వానికి ఆ దుఃఖముల నుపశమింపజేయు ప్రతీకారము నీ భక్తులుగాక నీ కరుణకు దూరులైన నీచే నుపేక్షింపబడిన వారికి ఇహలోకమందు ఏది ఇష్టమై తత్క్షణమే ప్రయోజనకారియని కోరబడుచున్నదో ఆప్రతీకారాదులు తాత్కాలి కోపశమములే యగును గాని మూలముట్టుగా దుఃఖములను పోగొట్టునవి కావు. బాలునికి తల్లిదండ్రులు రక్షకులు గారు. ఏలయనగా వారు బాలునిఁ జక్కగాఁ బోషించుచు రక్షించుచున్నను వారికి తెలియకయే బాలుడు ఒక్కొక్కప్పుడు గోతులు లోనగువానియందు బడి దుఃఖమును బొందుచున్నాడు. అట్లే రోగమునకు ఔషధము రక్షకము గాదు. చక్కని ఔషధసేవ చేసినను మృత్యువు సంభవించుచునేయున్నది. ఆ విధముననే సముద్రమున మునిగిపోవు వానికి ఓడ రక్షకముగాదు. ఒక్కొక్కప్పుడు ఆ ఓడతో గూడ ఆ పురుషుడును మునిగిపోవుచున్నాడు. ఆందువలన నన్నింటికి నీవే రక్షకుండవు గాని ఇతరముగాదని యర్థము. మరియు పై శ్లోకమును కాక్వర్థముచే వ్యాఖ్యానింపదగును.

దుఃఖమున సంతప్తుడైన వానికి ఏది లోకమునందు ఆ దుఃఖమునకు బ్రతీకారముగ బ్రసిద్ధమైయున్నదో అది నీచే నుపేక్షితులైనవారికి తప్పక ఇష్టమగునా! మఱి యేమనగా ఇష్టముగానేరదు. అట్లే బాలాదులకు మాతాపితరులిష్టములగుదురా? కారని భావము.

***శ్లో॥ యస్మిన్ యతో యర్హి యేన చ యస్య యస్మాత్***
***యస్మై యథా యదుత యస్త్వపరః పరో వా।***
***భావః కరోతి వికరోతి పృథక్స్వభావః***
***సఞ్చోదితస్తదఖిలం భవతస్స్వరూపమ్॥ 20***

**ప్రతిపదార్థము:-** *అపరః=అర్వాచీనుడగు ఈవలివాడగు తండ్రిలోనగు వ్యక్తిగాని, పరః=ప్రాచీను* డగు బ్రహ్మలోనగు దేవతగాని, పృథక్+స్వభావః=భిన్నస్వభావము గలవాడై, భావః=కర్తయై, యస్మిన్=దేనియందు, ఏ కర్మయందు, (అధికరణ సప్తమీ విభక్తి), యతః=ఏ నిమిత్తమువలన ఏ యుద్ధశమమును గలిగియనుట, యర్హి చ=ఏ కాలమందును, యేన చ=ఏ కారణముచే లేక ఏ హేతువులచే (కారణకారకము తృతీయా విభక్తి)(ప్రయోజ్యకర్తచే), సంబోధితః=ప్రేరేపింప బడినవాడై, యస్య=ఎవనికి, దేనికి సంబంధియైన, యస్మాత్=దేనివలన (అపాదానకారక పంచమీ విభక్తి) యస్మై=దేని కొరకు (సంప్రధాన కారకం చతుర్థి),యమ్=ఏ ఈప్సితతమమును గూర్చి ఇష్టమును (కర్మకారకము ద్వితీయా విభక్తి), యథా=ఏ ప్రకారముగా, కరోతి=సత్త్వాది గుణముల స్వభావమును, కరోతి=ఉత్పాదించుచున్నాడో, వికరోతి=రూపాంతరమునుగా పొందించు చున్నాడో, తత్+అఖిలమ్=ఆ సమస్తమును, భగవత్స్వరూపమ్=భగవంతుని స్వరూపమేయగును.

**తాత్పర్యము:-** లోకమునందు ఈవలి వారగు తండ్రిలోనగు వ్యక్తిగాని, ప్రాచీనుడైన బ్రహ్మలోనగు దేవతగాని భిన్నభిన్న స్వభావముగలవారు కర్తలై ఏ కర్మయందు ఏ నిమిత్తమున ఏ కాలమందు ఏకారణముచేత దేనికి సంబంధించిన దాని, దేని వలన, దేని కొఱకు, దేని గోరి, దేనిచే ప్రేరేపించబడి, దేని నుత్పాదించుచున్నారో, దేనిని పరిణమింపజేయుచున్నారో అది అంతయు భగవత్స్వరూపమే యగును. ఇందు సప్తవిభక్తులూ చెప్పబడెను.

**శ్లో॥ మాయా మనః సృజతి కర్మమయం బలీయః**
**కాలేన చోదితగుణానుమతేన పుంసః।**
**ఛన్దోమయం యదజయార్పితషోడశారం**
**సంసారచక్రమజ కోఽతితరేత్త్వదన్యః॥ 21**

**ప్రతిపదార్థము:-** అజ!=ఓ పుట్టుక లేనివాడా! పుంసః=పరమపురుషుడవైన నీయొక్క, అనుమతేన= ఈ క్షణరూపమైన అనుగ్రహముచేత, కాలేన=కాలము చేతను, చ+ఉదితగుణా=క్షోభను పొందిన, హెచ్చుతగ్గులను పొందిన త్రిగుణములను గలదై, మాయా=మాయ, కర్మమయమ్=కర్మ మొలకెత్తుటకు మూలమైన కుర్వద్రూపమైననునది-మనస్సును, బలీయః=దుర్జయమైన, ఛందోమయమ్=వేదోక్తకర్మ ప్రధానమై దానిని, సృజతి=సృజించుచున్నది. అజయా=జీవుని యొక్క అవిద్యచేత, యత్=ఏది, అర్పిత=సాధనములై సమర్పింపబడిన, షోడశారమ్=షోడశ వికారములను, సంసారచక్రమ్=సంసారచక్ర స్వరూపమైన మనస్సును, త్వత్+అన్యః=నీ కంటె నితరుడు, నిన్ను భజించనివాడని అర్థము, కః=ఎవ్వడు, అతితరేత్=అతిక్రమించును.

**తాత్పర్యము:-** ఓ అజుడా! పరమ పురుషుడవైన నీ ఈ క్షణరూపమైన అనుగ్రహ మొంది, కాలముచే ప్రేరేపింపబడి తన త్రిగుణము సామ్యావస్థకు, వీడి వ్యత్యాసమును పొందఁగానప్పుడు నీ మాయా కర్మకు మూలమైన మొలకెత్తు కుర్వద్రూపమై దుర్జయమై వేరొక కర్మ ప్రధానమై మనసును సృజించుచున్నది. జీవుని యవిద్యచే జీవునికి సుఖదుఃఖానుభవము కొఱకు ఇంద్రియదశకము, మనసు, పంచతన్మాత్రలు, అను ఆకులు గల సంసారచక్ర మేర్పడుచున్నది. నిన్ను భజించని వాడెవ్వడు సంసారచక్రమును దాట గలడు!

తైః=హేతు భూతములైన ఆ గుణములచే, నానా+ఇవ=పెక్కువిధములైన స్రష్టవలెను రక్షకుడు వలెను, హంతకుడువలెను, అవసితః=తోచుచుందువు.

**తాత్పర్యము:–** అట్లే ఈ స్కాంధ ప్రారంభమున

*శ్లో॥ నిర్గుణోఽపి హ్యజోఽవ్యక్తో భగవాన్ ప్రకృతేః పరః।*
*స్వమాయాగుణమావిశ్య బాధ్యబాధకతాం గతః॥*

జగము సృష్టికి పూర్వమును సృష్టికి కడపటను నీవొక్కడవే సన్మాత్రుడనెడి కారణమవై అవధివైయుండువాడవగుటవలన ఈ జగమంతయు నీ వొక్కడవేయైయున్నావు. అట్లే మధ్య కాలమునందును నీ వొక్కడవేయున్నావు. నీ మాయచే గుణపరిణామమొందిన ఈ జగమును సృజించి లోనప్రవేశించిన వాడవై జగత్స్రష్టవుగాను జగత్పరిపాలకుడవుగను జగత్సంహారకుడవు గను పెక్కువిధములఁదోఁచుచుందువు.

**శ్లో॥ త్వం వా ఇదం సదసదీశ భవాంస్తతోఽన్యో**
**మాయా యదాత్మపరబుద్ధిరియం హ్యపార్థా।**
**యద్యస్య జన్మ నిధనం స్థితిరీక్షణం చ**
**తద్వై తదేవ వసుకాలవదష్టితర్వోః॥ 31**

**ప్రతిపదార్థము:–** ఈశ!=ఓ పరమేశ్వర!, ఇదమ్=ఈ, సత్+అసత్=కార్యకారణాత్మకమైన జగత్తు, (సత్=కారణము,అసత్=కార్యము) త్వం వా=నీవే, నీ కంటె, అన్యః=ఇతరము, ఆద్యంతములందు ప్రత్యేకించి యుండుటవలన, యత్=ఎందువలన ఇట్లు, ఆత్మపరబుద్ధిః=ఇది నాది ఇది పరులది అను బుద్ధి, ఇయమ్=ఇది, అపార్థా=అపార్థమై మాయయే యగును. కార్యకారణములకు పరమ కారణాభేదమును దృష్టాంతముచే సాధించుచున్నారు. యత్=దేనివలన, యస్య=దేనియొక్క, నిధనమ్=జన్మపుట్టుక, ఈక్షణం చ=ప్రకాశమును, నిధనం చ=దేనికి లయము, స్థితి, ఉనికియు కలుగుచున్నదో, తత్+వై=అదియే, అష్టితర్వోః=బీజము కారణమగు తరువు–కార్యము, ఈ రెండు, వసుకాలవత్=పృథ్విజలములవలె, పరమ కారణమగును.

**తాత్పర్యము:–** ఓ పరమేశ! సత్తు అసత్తు అను పేర్లు కలిగి కారణ కార్యరూపమై ఈ జగత్తు నీవే యగుదువు. (సత్తు=కారణము, మాయ, అసత్తు=కార్యము–జగత్తు) నీవు మాత్రము ఈ రెండింటికి వేఱుగా నుందువు. దేనివలన దీనిని పుట్టుక, ప్రకాశము, లయము, స్థితి కలుగు చున్నదో అది ఆ వస్తువు కంటె వేఱు కాదు కదా! కారణమైన బీజమునకు కార్యమైన వృక్షమునకు జల పృథ్వులు ఎట్లు కారణమై ఉన్నవో అట్లే జగమునకు నీవు పరమ కారణమైయున్నావు. వసుకాలవత్=కాలశబ్దముచే గూడియుండుటవల్ల నీలత్వములోనగు అసాధారణ గుణములలో గూడినదగుటయు, పృథ్వియు – వసు శబ్దముచే వస్తు మాత్రము భూత సూక్ష్మమైన రసోదికము జలమై అందు తరువునందే విధముగా పృథ్వీమయ బీజజల మాత్రత్వము, దానికి భూతసూక్ష్మ మాత్రత్వము, గలుగుచున్నదో అట్లే సర్వమైన కార్యకారణాత్మకమైన జగము పరమకారణమే యగును. అట్లే పారమార్ష సూత్రము. ***తదనన్య త్వమారంభణ శబ్దాదిభ్యః–శ్రుతిశ్చ. వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్.***





**శ్లో॥ తస్మాదమూస్తనుభృతామహమాశిషో జ్ఞ**
**ఆయుః శ్రియం విభవమైన్ద్రియమావిరిఞ్చాత్।**
**నేచ్ఛామి తే విలులితానురువిక్రమేణ**
**కాలాత్మనోపనయ మాం నిజభృత్యపార్శ్వమ్॥ 24**

**ప్రతిపదార్థము:–** తస్మాత్=అందువలన, తనుభృతామ్=దేహధారులయొక్క, అమూః=ఈ, ఆశిషః =భోగములను, ఆయుః శ్రియమ్=ఆయువును, సంపదలను, విభవమ్=వైభవమును, ఐంద్రియమ్ =ఇంద్రియ సుఖమును, ఆవిరించాత్=బ్రహ్మభోగానుభవపర్యతము, జ్ఞః=వాని పరిణామ మెఱింగెన, అహమ్=నేను, ఉరువిక్రమేణ=దొడ్డ పరాక్రమముగలిగి, కాలాత్మనః=కాలస్వరూపివైన, తే=నీ చేత, విలులితాన్=విధ్వంసములైన అణిమాదులనుసైతము, న+ఇచ్ఛామి=కోరను, మామ్=నన్ను, నిజభృత్యపార్శ్వమ్=నీ భృత్యులుండు ప్రక్కను గూర్చి, ఉపనయ=పొందింపుము.

**తాత్పర్యము:–** అందువలన నేను దేహధారులు వాంఛించు భోగము, ఆయుషు సంపదలను, వైభవమును, ఇంద్రియసుఖమును బ్రహ్మదేవుని సుఖానుభవము పర్యంతము ఎఱింగియున్నాను. మిక్కిలి పరాక్రమము గలిగి కాలస్వరూపివై నీచే నాశములగు వానినన్నింటినీ నేను వాంఛింపను. కావున ఓ దేవా! నీవు నన్ను నీ సేవకులుండుచోటికి చేర్చుము.

**శ్లో॥ కుత్రాశిషశ్శ్రుతిసుఖా మృగతృష్ణిరూపాః**
**క్వేదం కళేబరమశేషరుజాం విరోహః।**
**నిర్విద్యతే న తు జనో యదపీతి విద్వాన్**
**కామానలం మధులవైః శమయన్ దురాపైః॥ 25**

**ప్రతిపదార్థము:–** శ్రుతిసుఖాః=కేవల శ్రవణ మాత్రముననే సుఖముగలవియు, మృగతృష్ణరూపాః =ఎండమావులవలె మిథ్యారూపములును అగు, ఆశిషః=భోగములు, క్వ=ఎచ్చట, అశేషరుజామ్ =ఎల్లరోగములను, విరోహః=ఉద్భవస్థానమైన, ఇదమ్=ఈ, కళేబరమ్=శరీరము, క్వ=ఎచ్చట, యదః=అట్లయియున్నను, ఇతి=ఇది ఇట్టిది అని, విద్వాన్=ఎఱింగిన, జనః=ఈ జనుడు, దురాపైః =పొందశక్యముగాని, మధులవైః=మధువులైన సుఖలేశములచే, శమయన్=శమింప జేయుచు, కామానలమ్=కామమను నగ్నిని, న నిర్విద్యతే=నిర్వేదము పొందు విరక్తుడు గాడు.

**తాత్పర్యము:–** కేవలము శ్రవణ సుఖావహములై యెండమావులవలె మిథ్యాభూతములైన భోగము లెక్కడ? ఎల్లరోగములకు నుత్పత్తిస్థానమైన ఈ కళేబరము ఎక్కడ? ఇవి యిట్టివని యెఱింగిన పండితుడు సైతము కామమున నగ్నిని సాధింపశక్యముగానివైన మధుబిందుతుల్యము లైన సుఖలేశములచే శమింపజేయుచు విరక్తుడు కాడు.

**శ్లో॥ క్వాహం రజః ప్రభవ ఈశ తమోఽధికేఽస్మిన్**
**జాతస్సురేతరకులే క్వ తవానుకమ్పా।**
**న బ్రహ్మణో న తు భవస్య న వై రమాయా**
**యన్మేఽర్పితశ్శిరసి పద్మకరః ప్రసాదః॥ 26**

**ప్రతిపదార్థము:–** ఈశ!=ఓ ఈశ్వరుడా!, రజః ప్రభవే=రజోగుణముచేతనైన జన్మముగల, తమస్+అధికే=తమోగుణాధికముగల, అస్మిన్=ఈ, సురేతరకులే=అసురవంశమునందు, జాతః=జనించిన, అహమ్=నేను, క్వ=ఎక్కడ?, తవ+అనుకంపా=నీ కృప, క్వ=ఎక్కడ?, న బ్రహ్మణః=బ్రహ్మకులేనిదై, న తు భవస్య=శివునికి లేనిదై, న వై రమాయాః=లక్ష్మికినిలేనిదై, మే=నాయొక్క, శిరసి=శిరమునందు, పద్మకరః=పద్మమువలె సకల సంతాపమును హరించు హస్తము, ప్రసాదః=పురుషార్థరూపమై, అర్పితః ఇతి యత్=అర్పించటనునదైన, తవ+అనుకంపా=నీ కృప, క్వ=ఎక్కడ?

**తాత్పర్యము:–** ఓ పరమేశా! తమోగుణాధికమైన ఈ అసురవంశము రజోగుణముచేతనైన పుట్టుక గలిగి జనించిన నేనెక్కడ? బ్రహ్మకు లభించనిదై, శివునికి ప్రాప్తించనిదై, లక్ష్మికిని లభ్యముకానిదైన నీ పదహస్తము ప్రసాదరూపమై నా శిరము నందుంచుట అను నీ కృపయెక్కడ?

**శ్లో॥ నైషా పరావరమతిర్భవతో నను స్యాత్**
**జన్తోర్యథాత్మసుహృదో జగతస్తథాపి।**
**సంసేవయా సురతరోరివ తే ప్రసాదః**
**సేవానురూపముదయో న పరావరత్వమ్॥ 27**

**ప్రతిపదార్థము:–** ఏషా=ఈ, పర+అవరమతిః=ఈ బ్రహ్మాదులుత్తములు, ఈ అసురుడు నీచుడను హెచ్చుతగ్గుగల బుద్ధి, జంతోః=ప్రాకృత పురుషునివరకే, జగతః=జగమునకు, ఆత్మసుహృదః=ఆత్మకు మిత్రుడవైన, భవతః=నీకు, న స్యాత్=కాదు / లేదు, అట్లయిన నీ ప్రసాదము అంతటనేక రూపమై విలసిల్లును, సంసేవయా=చక్కని సేవచే, సురతరోరివ= కల్పవృక్షము వలె, తే ప్రసాదః=నీ అనుగ్రహము, సేవానురూపమ్=సేవకు తగినట్లు వారివారి యిచ్చానుసారముగా ధర్మాదిపురుషాదులతో, ఉదయః=ఉద్భవించుట అగును. నపరావరత్వమ్ =తారతమ్యస్థితిలేదు. కల్పవృక్షము సేవకుల సంకల్పానుసారము వరమిచ్చును. అట్లే ఇచ్చట మేలుకీడులు లేవు ప్రసాదవైచిత్ర్యక వైషమ్యము లేదు.

**తాత్పర్యము:–** ఈ బ్రహ్మాదులుత్తములు, ఈ అసురుడు నీచుడగు హెచ్చుతగ్గులు గల భేదబుద్ధి ప్రాకృత జనునికి వలె జగమునకు ఆత్మకు మిత్రుడవైన నీ కెన్నటికిని గలుగదు కదా! మఱి అట్లే ఎల్లరియందు నీ యనుగ్రహము సమానముగా లేనందువా? అది నీ పొరపాటు కాదు. వారివారి సేవానురూపమై ధర్మాదిపురుషార్థము వారికి లభించుచున్నది. కల్పవృక్షము తన్ను సేవించువానికి వాని సంకల్పానుసారముగా వాని ఫలమిచ్చును. అన్యథా నొసంగదు. అట్లే నీయనుగ్రహము నిన్ను సేవించువారి భావమును బట్టి భేదముగా కన్పట్టును గాని మఱేదియును కాదు.

**శ్లో॥ ఏవం జనం నిపతితం ప్రభవాహికూపే**
**కామాభికామమను యః ప్రపతన్ ప్రసఙ్గాత్।**
**కృత్వాత్మసాత్ సురర్షిణా భగవన్ గృహీతః**
**సోఽహం కథం ను విసృజే తవ భృత్యసేవామ్॥ 28**





**ప్రతిపదార్థము:–** ప్రభవః అహికూపే=జన్మమను సర్పముతో గూడిన సంసారకూపమునందు, నిపతితమ్=పడినవాడును, కామ+అభికామమ్=ఇంద్రియకాంక్షలను వాంఛించువాడునగు, జనమ్=ఈ జనుని గురించి, ప్రసంగాత్=ప్రసంగవేళ, ప్రపతన్=పడుచున్న, జనమ్=ఈ జనుని, ఏవమ్=ఈ విధముగా, భగవన్ సురఋషిణా=దేవర్షియైన నారదునిచేత, ఆత్మసాత్ కృత్వా=తన యధీనము చేసుకొని, గృహీతః=అనుగ్రహింపబడిన, సః అహమ్=అట్టినేను, తవ భృత్య సేవామ్=నీ భృత్యునిసేవను, కథం ను విసృజే=ఎట్లు విసర్జింతును?

**తాత్పర్యము:–** ఓ భగవాన్! జన్మమను సర్పముతో గూడిన సంసారకూపమునబడ్డ కామాభిలాష గలిగిన దాని బారిపడుచున్న నన్ను నారదుడు తన యధీనము చేసుకొని అనుగ్రహించెను. అట్టి నేను నీ భృత్యుడనై సేవనెట్లు విసర్జింతును. నీ సేవనెట్లు వీడుదును.

**శ్లో॥ మత్ప్రాణరక్షణమనన్త పితుర్వధశ్చ**
**మన్యే స్వభృత్యఋషివాక్యమృతం విధాతుమ్।**
**ఖడ్గం ప్రగృహ్య యదవోచదసద్విధిత్సుః**
**త్వామీశ్వరో మదపరోఽవతు కం హరామి॥ 29**

**ప్రతిపదార్థము:–** అనంత=ఓ అనంతుడా!, మత్ప్రాణరక్షణమ్=నా ప్రాణరక్షణము, పితుఃవధం చ=నన్నుఁజంపనుద్యుక్తుడైన నా తండ్రి వధయును, స్వభృత్య ఋషివాక్యమ్=నీ భక్తుడైన నారద ముని మాటను, ఋతమ్=సత్యమును, విధాతుమ్=గావించుటకో అని, మన్యే=తలంచెదను, అసత్+విధిత్సు=చెడ్డచేయగోరినవాడై మాతండ్రి, ఖడ్గమ్=ఖడ్గమును, ప్రగృహ్య=పట్టుకొని, యత్+అవోచత్=దేనిని జెప్పెవో,మత్+అపరః=రక్షించుగాక!,కమ్= నీశిరస్సును, హరామి=హరించెదను.

**తాత్పర్యము:–** ఓ అనంతుడా! నీవు నా ప్రాణ రక్షణము గావించుటగాని నన్నుఁజంపసిద్ధమైన వచ్చిన నా తండ్రిని వధించుట గాని యీ రెండు నీ భక్తుడు నారదుడు వచించిన వాక్యమును సత్యమని తెలియుటకు చేసితివి. అయుక్తమైన కార్యమునుఁజేయగోరి మా తండ్రి ఖడ్గమును పట్టుకొని నన్నుఁజూచి ఓరి! నా కంటె నితరు డీశ్వరుడుండెనేని నిన్ను రక్షించును గాక! నేను నీ శిరమును ఇదే హరించుచున్నాను.

**శ్లో॥ ఏకస్త్వమేవ జగదేతదముష్య యత్త్వ-**
**మాద్యన్తయోః పృథగవేష్యసి మధ్యతశ్చ।**
**సృష్ట్వా గుణవ్యతికరం నిజమాయయేదం**
**నానేవ తైరవసితస్తదనుప్రవిష్టః॥ 30**

**ప్రతిపదార్థము:–** ఏతత్=ఈ, జగత్=జగము, త్వం ఏవ ఏకః=నీ వొక్కడవై యున్నచో, యత్=ఎందువలన, అముష్య=ఈ జగము యొక్క, ఆది+అంతయోః=ఆదియందును అంతమందును, పృథక్=వేఱుగా, అవేష్యసి=విరమింపజేయగలవు. రక్షవై, సన్మాత్రుడవై, కారణమై, అవధియై వర్తింతువని అర్థము. అందువలన మధ్యతశ్చ=సృష్టిలో మధ్యదైన మధ్యకాలమునందు, నిజమాయయేదమ్=నీ మాయ యిది, గుణవ్యతికరమ్=త్రిగుణముల పరిణామాత్మకమై, ఇదమ్=ఈ జగమును, సృష్ట్వా=సృజించి, తత్+అనుప్రవిష్టః=ఈ జగములోపల ప్రవేశించి,

పాలింతువు. జగత్+ప్రతీపాన్=లోకకంటకులను, హంసి=చంపుదువు. మహాపురుష=ఓ మహానుభావ!, యుగ+అనువృత్తమ్=ఆయాయుగానుకూలమైన, ధర్మమ్=ధర్మమును, పాసి= రక్షింతువు. కలౌ=కలియుగమునందు, ఛన్నః=గూఢముగా నుందువు. యత్=ఎందువలన, సః త్వమ్=ఆ నీవు, త్రియుగః=మూడు యుగముల ఆవిర్భవించువాడవు కనుక త్రియుగుడన బడుదువు.

**తాత్పర్యము:–** ఓ మహాపురుషా! నీవు ఇట్లు నరుడై, జంతువై, ఋషివై, దేవతవై, మీనమై అవతరించి, లోకములను పాలింతువు. లోకకంటకులను నిర్మూలింతువు. కృతాదియుగా నుసారమైన ధర్మమును రక్షింతువు. కృత, త్రేతా, ద్వాపరములను మూడుయుగములందు ఆవిర్భవించువాడవగుటచే త్రియుగుడవనబడుదువు. కలియుగమునందు మాత్రమట్లు ఆవిర్భవించక గూఢముగా నుందువు. ఎందువలన?

**శ్లో॥ నైతన్మనస్తవ కథాసు వికుణ్ఠనాథ**
**సమ్ప్రీయతే దురితదుష్టమసాధు తీవ్రమ్।**
**కామాతురం హర్షశోకభయైషణార్తం**
**తస్మిన్ కథం తవ గతిం విమృశామి దీనః॥ 39**

**ప్రతిపదార్థము:–** వికుంఠనాథ!=ఓ వైకుంఠప్రభూ!, దురితదుష్టమ్=పాపకలుషితమై, అసాధు= బహిర్ముఖమై, తీవ్రమ్=దుర్భరమై, హర్షశోకభయ ఏషనార్తమ్=సంతోషము, శోకము, దుః ఖము అనువానిచేత దారేషణ, ధనేషణ, పుత్రేషణ అను ఏషణ త్రయముచేత తొట్రుపాటు పడుచున్న, ఏతత్=ఈ, మనః=నా మనస్సు, తవ కథాసు=నీ కథలందు, న సంప్రీయతే=ఇష్టమును పొందుట లేదు, దీనః=దీనుడనైన నేను, తస్మిన్=అట్టి నా మనస్సునందు, తవ గతిమ్= నీతత్త్వమును, కథం= ఎట్లు, విమృశామి=ఎట్లు విచారింతును?

**తాత్పర్యము:–** ఓ వైకుంఠనాథ! పాపముచే కలుషితమై బహిర్ముఖమై దుర్భరమై హర్షశోక భయాకులమై దారేషణ, ధనేషణ, పుత్రేషణ అనునానిచే కష్టపడుచున్నదైన నా మనస్సు నీ కథలయందు ప్రీతిపొందకున్నది. అట్టి నా మనస్సునందు దీనుడనైన నేనెట్లు నీ తత్త్వము విచారింతును?

**శ్లో॥ జిహ్వైకతోఽచ్యుత వికర్షతి మావితృప్తా**
**శిశ్నోఽన్యతస్త్వగుదరం శ్రవణం కుతశ్చిత్।**
**ఘ్రాణోఽన్యతశ్చపలదృక్ క్వ చ కర్మశక్తిః**
**బహ్వ్యః సపత్న్య ఇవ గేహపతిం లునన్తి॥ 40**

**ప్రతిపదార్థము:–** అచ్యుత!=ఓ అచ్యుత!, జిహ్వా=నాలుక, అవితృప్తా=తృప్తిని గాంచదో, ఏకతః =ఒక ప్రక్కకు, మధురాదిరసములవంకకు, వికర్షతి=ఆకర్షించుచున్నది, శిశ్నః=శిశ్నము, అన్యతః =ఇతరముగా, కామేచ్ఛను, త్వక్=త్వగింద్రియము, ఉదరమ్=కడుపు, క్షుధాసంతప్తుని=ఏ కొంచెము ఆహారముతోను, శ్రవణం=చెవి, కుతశ్చిత్=ఏ మధురశ్రవణమున, ఘ్రాణః=నాసిక, అన్యతః =గంధాదికము, చపలదృక్=చలించునేత్రము రూపాదికమునకు, కర్మశక్తిః= కర్మేంద్రియములు,





**శ్లో॥ న్యస్యేదమాత్మని జగద్విలయామ్బుమధ్యే**
**శేషేఽత్మనా నిజసుఖానుభవో నిరీహః।**
**యోగేన మీలితదృగాత్మని పీతనిద్రః**
**తుర్యే స్థితో న తు తమో న గుణాంశ్చ యుఙ్క్షే॥ 32**

**ప్రతిపదార్థము:–** ఇదం జగత్=ఈ జగమును, ఆత్మని=నీయందు, న్యస్య=ఉంచి, నిజసుఖ+ అనుభవః=స్వసుఖమే అనుభవముగా గలవాడవై, నిరీహః=నిష్క్రియుడవై, విలయ+అంబుమధ్యే= ప్రళయజలమధ్యమందు, స్వతః=స్వయముగా, శేషే=శయనింతువు. అట్లయి జీవునికి వలె నాకు సామ్యమును బట్టి నిద్రయనుచున్నారని చెప్పుచున్నాడు. యోగేన=యోగముచే, మీలితదృక్ =మూసిన కన్నులు గలవాడవై, ఆత్మనిపీతనిద్రః=స్వరూప ప్రకాశముచే నిర్జించిన నిద్రగలవాడవై, తుర్యే=అవస్థాత్రయాతిరిక్తమైన, తురీయావస్థయు, స్వరూపమునందు, స్థితః=ఉంటున్న నీవు, న తు తమః=సుప్తుడువలె నిద్రను గాని, న గుణాంశ్చ=జాగ్రత్స్వప్నములవలె విషయములను గాని కాదు.

**తాత్పర్యము:–** ఈ జగమును నీయందు లయింపఁజేసుకొని స్వసుఖానుభవము గలవాడవై నిష్క్రియుడవై ప్రళయార్ణవము నడుమ శయనింతువు. అట్లు శయనించిన నీకు జీవునికివలె తమోరూపమైన నిద్ర నిన్నంటదు. నీకు బహిర్వ్యాపారములు వుండవు. అందువలన నిద్రయని చెప్పుట కాని వేఱుకాదు.

యోగముచే కన్నులు మూసుకొని స్వరూప ప్రకాశముచే నిద్రను నిర్జించి జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలకుఁబైనుండు తురీయావస్థయందు ఉంటున్న తమోరూప నిద్రగాని, జాగ్రత్స్వప్నములందువలె శబ్దాదిగుణములుగాని నిన్ను అంటవు.

**శ్లో॥ తస్యైవ తే వపురిదం నిజకాలశక్త్యా**
**సఞ్చోదితప్రకృతిధర్మణ ఆత్మగూఢమ్।**
**అమ్భస్యనన్తశయనాద్విరమత్సమాధే**
**ర్నాభేరభూత్ స్వకణికావటవన్మహాబ్జమ్॥ 33**

**ప్రతిపదార్థము:–** అంభసి=ప్రళయార్ణవమునందు, అనంతశయనాత్=శేషపర్యంకము నుండి, విరమత్ సమాధేః=విరమించిన సమాధిగల నీవు, నిజకాలశక్త్యా=స్వీయమైన కాలశక్తిచే, సంచోదిత ప్రకృతి ధర్మణః=ప్రేరేపింపబడి ప్రకృతి ధర్మములై సత్త్వాదీగుణములు గలవాడు, తస్యైవ=ఆతనివైన, తే=నీయొక్క, నాభేః=పొక్కిలి నుండి, స్వకణికావటవత్=సూక్ష్మమైన తన బీజము నుండి వటవృక్షము వలెను, ఆత్మనిగూఢః=నీ యందేదాగియున్న, ఇదమ్=ఈ జగము, మహాబ్జమ్=దొడ్డకమలమై, అభూత్=జనించెను. తస్య+ఏవ=ఆ నీవు జలమునందు శయనించి యుండుట. తే=నీ యొక్క వపుః=శరీరము, ఇదమ్=ఈ జగమున ఇతరము కాదు. ఏలయన మధ్యకాలమునందును నీవే యుందువు.

**తాత్పర్యము:–** ప్రళయార్ణవమందు శయనించిన నీ శరీరమే ఈ జగమగును. వేఱుగాదు. మధ్యకాలమందు నీవే వెలసియుందువు. ప్రళయజలము లందు శేషశయ్య నుండి సమాధి

చాలించినవాడవై స్వకీయమైన కాలశక్తిచే ప్రేరేపింపబడి ప్రకృతి ధర్మములను సత్త్వాది గుణములు గలవాడవైన నీ నాభి నుండి సూక్ష్మమైన వటబీజము నుండి వటవృక్షమువలె నీయందు నిగూఢ మైన ఈ లోకమను పద్మము జనించెను.

**శ్లో॥ తత్సమ్భవః కవిరతోఽన్యదపశ్యమానః**
**త్వాం బీజమాత్మని తతం సబహిర్విచిన్త్య।**
**నావిన్దదబ్జశతమప్సు నిమజ్జమానో**
**జాతేఽఙ్కురే కథముహోపలభేత బీజమ్॥ 34**

**ప్రతిపదార్థము:-** తత్+సంభవః=ఆ పద్మమునందు జన్మముగల, కవిః=బ్రహ్మ, అతః=ఈ పద్మము కంటె, అన్యత్=ఇతరమును, అపశ్యమానః=చూడనివాడు అగు, సః=అతడు, అబ్దశతమ్ =నూఱు సంవత్సరములు, అప్సు=ఉదకములందు, నిమజ్జమానః=మునుగుచున్నవాడును. బహిః=వెలుపల, విచన్యత్=వెదకుచు, బీజమ్=ఉపాదానకారియగు, ఆత్మని=తనయందు, తతః=వ్యాపించియున్న, త్వామ్=నిన్ను, న అవిందత్=ఎఱుంగలేదయ్యెను, అది యుక్తము, ఊహ!. అహో!=ఆహా!, అంకురే=మొలక, జాతే సతి=మొలచినది కాగా, బీజమ్=ఆ యంకురము అనుగతమైన కారణమైన బీజములే యగును. కథమ్=ఎట్లు, వెలుపల, ఉపలభేత=పురుషుడు చూచును.

**తాత్పర్యము:-** ఆ పద్మమునందుద్భవించిన బ్రహ్మదేవుడా పద్మము కంటె నన్యమేదియు జూడనివాడై కేవలము బాహ్య దృష్టి గలిగి కారణమరయుచు జలమునందు నూఱు వత్సరములు మునుంగు చున్నవాడు, ఉపాదానకారణమై తనయందు వ్యాపించియున్న నిన్నెఱుంగలేదయ్యెను. అది యుక్తము. మొలకమొలిచిన తర్వాత విత్తన మెవ్వడేని కనజాలునా?

**శ్లో॥ స త్వాత్మయోనిరతివిస్మిత ఆస్థితోఽబ్జమ్**
**కాలేన తీవ్రతపసా పరిశుద్ధభావః।**
**త్వామాత్మనీశ భువి గన్ధమివాతిసూక్ష్మమ్**
**భూతేన్ద్రియాశయమయే వితతం దదర్శ॥ 35**

**ప్రతిపదార్థము:-** సః తు=ఆ, ఆత్మయోనిః=బ్రహ్మ, అతివిస్మితః=మిగుల నచ్చెరువొంది, మరల వచ్చి, అబ్జమ్=కమలమును, ఆస్థితమ్=అధిష్ఠించియుండె. కాలేన=చాలాకాలముచే, తీవ్రతపసా =దృఢమైన ధ్యానము, పరిశుద్ధభావః=నిర్మలభావములుగలవాడై, ఈశః=ఓ పరమేశ!, భువి= భూమియందు, గంధమ్=గంధగుణమును వలె, అతిసూక్ష్మమ్=మిగుల సూక్ష్మముగానున్న, త్వామ్=నిన్ను, భూత+ ఇంద్రియాశయమయే=పంచమహాభూతములు, ఇంద్రియములు, మనోబుద్ధులతో గూడిన ఆత్మని తన శరీరమునందే, వితతమ్=వ్యాపించి యున్నవానిని, దదర్శ=సన్మాత్రరూపమున ఉపాదాన కారణమైయున్నవానిని ఎఱింగెను.

**తాత్పర్యము:-** ఓ పరమేశ! ఆ బ్రహ్మమిగుల నచ్చెరు వొంది మరలివచ్చి కమలమును జేరి చాల కాలము దృఢమగు ధ్యానముచేసి భూమియందు గంధగుణమునువలె అతి సూక్ష్మమైన పంచభూతములు, ఇంద్రియమనోబుద్ధులతో కూడిన తన శరీరమునందు వ్యాపించియున్న నిన్ను కనుంగొనెను.





**శ్లో॥ ఏవం సహస్రవదనాఙ్ఘ్రిశిరఃకరోరు**
**నాసాస్యకర్ణనయనాభరణాయుధాఢ్యమ్।**
**మాయామయం సదుపలక్షితసన్నివేశం**
**దృష్ట్వా మహాపురుషమాప ముదం విరిఞ్చః॥ 36**

**ప్రతిపదార్థము:-** ఏవమ్=ఈ ప్రకారము, సహస్రవదనాంఘ్రి....ఢ్యమ్=వెయ్యి ముఖములు, పాదములు, శిరములు, కరములు, ఉరువులు, నాసికలు, ముఖములు, నేత్రములు, కర్ణములు ఆభరణములు అను వానితో కూడినవాడు, మాయామయమ్=మాయ ప్రధానముగా గలవాడు, సత్+ఉపలక్షిత సన్నివేశమ్=ఉన్నట్టి ప్రపంచముచే కన్పట్టుచున్న పాదాది రచనలు గలవాడైన, మహాపురుషుని, దృష్ట్వా=చూచి, విరించః=బ్రహ్మ, ముదమ్=సంతోషమును, ఆప=పొందెను.

**తాత్పర్యము:-** వేయి శిరములు, పాదములు, కరములు, ఊరువులు, నాసికలు, ముఖములు, నేత్రములు ఆభరణములుగా గలవాడైన, మాయా ప్రధానుడై ప్రపంచముచే దృశ్యమగుచున్న పాదాది రచనగలవాడై ప్రపంచములనుగా భూమి, ఆకాశములోనగునవి అవయవములు గలవాడైన మహాపురుషుని నిన్ను చూచి సంతోషమును పొందెను.

**శ్లో॥ తస్మై భవాన్ హయశిరస్తనువం చ బిభ్రత్**
**వేదద్రుహావతిబలౌ మధుకైటభాఖ్యౌ।**
**హత్వానయచ్ఛ్రుతిగణాంస్తు రజస్తమశ్చ**
**సత్త్వం తవ ప్రియతమాం తనుమామనన్తి॥ 37**

**ప్రతిపదార్థము:-** భవాన్=నీవు, హయశిరః తనువమ్=హయగ్రీవ స్వరూపము, బిభ్రత్=ధరించు చున్నవాడై, రజస్తమశ్చ=రజస్తమోగుణరూపులైన, వేదద్రుహౌ=వేదద్వేషులును, అతిబలౌ=మిగుల బలముగలవారును, మధుకైటభాఖ్యౌ=మధుకైటభులను పేరుగలవారిని, హత్వా=చంపి, తస్మై=ఆ బ్రహ్మ, శ్రుతిగణామ్=వేదగణములను, ఆనయత్=తెచ్చి ఇచ్చెను, సత్త్వమ్=కేవల సాత్త్వికమై, ఆ హయగ్రీవస్య రూపము, తవ=నీకు, ప్రియతమామ్=మిగుల ఇష్టమైన, తనుమ్=శరీరము అని, ఆమనంతి=పెద్దలు వచింతురు.

**తాత్పర్యము:-** నీవు హయగ్రీవరూపమొంది రజస్తమోరూపులైన, వేదద్వేషులైన, అతిబలులైన మధుకైటభులను అసురులను హతమార్చి బ్రహ్మకు ఆ వేదముల నిచ్చితివి. కేవల సాత్త్వికమగు ఆ హయగ్రీవమూర్తి నీకు మిక్కిలి ప్రియమైన దందురు.

**శ్లో॥ ఇత్థం నృతిర్యగృషిదేవఝషావతారైః**
**లోకాన్ విభావయసి హంసి జగత్ప్రతీపాన్।**
**ధర్మం మహాపురుష పాసి యుగానువృత్తం**
**ఛన్నః కలౌ యదభవస్త్రియుగోఽథ స త్వమ్॥ 38**

**ప్రతిపదార్థము:-** ఇత్థమ్=ఈ ప్రకారము, నృతిర్యక్ ఋషిదేవ ఝషావతారైః=నరుడు, జంతువు, ఋషి, దేవత, మీనము లోనగు అవతారములతో, లోకాన్=లోకములును, విభావయసి=

**యుక్తాస్సమక్షముభయత్ర విచక్షతే త్వామ్**
**యోగేన వహ్నిమివ దారుషు నాన్యతస్స్యాత్॥ 47**

**ప్రతిపదార్థము:–** బీజాంకురే ఇవ=విత్తుచెట్టులవలె, ప్రవాహము వలె, ఎడతెగకయున్నట్టి, ఇమే=ఈ, సత్+అసతీ=కార్యకారణములైన, తే=నీయొక్క రూపే=రూపములుగా కన్పట్టుచున్నవే! వేదసృష్టే=వేదములచే ప్రకాశింపబడినవి. అన్యత్=ఇతరమైనది, దేవదత్తుడు తెల్లనివాడనునట్టిది నీ యందు గూడినది. అరూపకస్య=ప్రాకృతరూపాది శూన్యుడైన నీకు, న చ=కలుగదు. అందువలన, యుక్తాః=సంయతులు, ఇంద్రియసంయమనము చేసినవారు, యోగేన=భక్తి యోగముచే, సమక్షమ్=ప్రత్యక్షమైన, త్వామ్=నిన్ను, ఉభయత్ర=కార్యమునందును కారణము నందును, అనుగతమైనవానినిగా, విచక్షతే=చూచెదరు. దారుషు=కొయ్యలందు, వహ్నిం ఇవ= మథించుటచేత అగ్నినివలె, న అన్యతః=ఇతర విధముగా జ్ఞానము గలుగదు. లేక జ్ఞాన ప్రకారముఁజెప్పుచున్నాడు. ఈ రెండును ప్రధాన పరమపుణ్యాదులవలన గాదు. సవిచక్షతే= అనుశ్రుతమును, అందువలన నీవే కారణమగుటవలన ఎల్లవానియందు అనుసరించియున్నావు.

**తాత్పర్యము:–** బీజాంకురములవలె ఎడతెగని ప్రవాహమట్లు కార్యమైన ఈ జగము కారణమైన మాయాధికము అను నీ రెండును నీ రూపమున కుపలక్షణములై ప్రతినిధులై కనుగొనుటకు సాధ్యములై యున్నవి. అని వేదముచే చెప్పబడినది. వీని కంటె నన్యమగు రూపము అరూపకుడవైన నీకు కలుగదు. దేవదత్తుడు తెల్లనివాడనునట్లు నీవు ప్రాకృతరూపాది శూన్యుడవు కనుక కలుగదు. ఇంద్రియమనస్సులను భక్తులు భక్తియోగమునంజేసి దారువులను మథించి అగ్నిని పొందుట నిన్ను కార్యకారణములగు రెంటియందుఁబ్రత్యక్షముగా గనుగొందురు. మరియొక విధముగా నిన్ను గూర్చిన జ్ఞానము గలుగదు.

**శ్లో॥ త్వం వాయురగ్నిరవనిర్వియదమ్బుమాత్రాః**
**ప్రాణేన్ద్రియాణి హృదయం చిదనుగ్రహశ్చ।**
**సర్వం త్వమేవ సగుణో విగుణశ్చ భూమన్**
**నాన్యత్ త్వదస్త్యపి మనో వచసా నిరుక్తమ్॥ 48**

**ప్రతిపదార్థము:–** భూమన్=ఓ నిత్య స్వరూపా! దొడ్డవాడా!, వాయుః=వాయువు, అగ్నిః=అగ్ని, అవనిః=భూమి, వియత్=ఆకాశము, అంబుమాత్రాః=జలము, పంచతన్మాత్రలు, ప్రాణ+ ఇంద్రియాణి=ప్రాణము, ఇంద్రియాలు, హృదయం=మనస్సు, చిత్+అనుగ్రహః చ=చిత్తము అహంకారము లేక ఇంద్రియాధి దేవతలు, సగుణః=స్థూలము, విగుణః చ=స్థూలము, సూక్ష్మ స్వరూపుడవగు, త్వం=నీవే, మనోవచసా=స్వరూపము మనసుచే నూహింపబడిన వాక్కుచే చెప్పబడినది. అన్యత్=ఇతరమన్నది, త్వత్=నీ కంటె, అన్యత్ అపి=ఇతరము, న అసి=లేదు.

**తాత్పర్యము:–** ఓ దొడ్డవేల్పా! ఈ కన్పట్టు పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచభూతములు– శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను పంచతన్మాత్రలు, పంచ ప్రాణములు, ఇంద్రియము, మనసు, చిత్తము, అహంకారము అనునవి అన్నియు స్థూలమగు తటస్థ రూపమును సూక్ష్మమగు స్వస్వరూపమును బొందియున్న నీవేయై యున్నావు. నీ కంటె నన్యమగు వస్తు వేదియు, మనసుచే నూహించుటకు గాని వాక్కుచే జెప్పుటకు గాని తగినదే లేదు.



బహ్వ్యః=పెక్కురైన, సపత్న్యః=పడతులు, గేహపతిం ఇవ=గృహస్థువలె, లునన్తి=బాధించు చున్నాయి.

**తాత్పర్యము:–** ఓ అచ్యుత! పెక్కురు భార్యలు గృహస్థునెట్లు బాధింతురో ఆ ప్రకారము నా జిహ్వ – తృప్తిగాంచని మధురాదిరసములకు, శిశ్నము – కామేచ్ఛకు, త్వక్కు – సుఖస్పర్శకు, ఉదరము – ఆహారమునకు, శ్రవణము – మధురశ్రవణము, ఘ్రాణము – గంధాధికమునకు, చపలమైన నేత్రములు – రూపాదికమునకు, కర్మేంద్రియములు వాని వాని సుఖములకును నన్నాకర్షించుచు వెతపెట్టుచున్నవి.

**శ్లో॥ ఏవం స్వకర్మపతితం భవవైతరణ్యా–**
**మన్యోన్యజన్మమరణాశనభీతభీతమ్।**
**పశ్యఞ్జనం స్వపరవిగ్రహవైరమైత్రం**
**హన్తేతి పారచర పిపృహి మూఢమద్య॥ 41**

**ప్రతిపదార్థము:–** భవవైతరణ్యామ్=సంసారమను యమద్వారమైన వైతరణియనునది యందు, స్వకర్మపతితమ్=తన కర్మచే పడినవాడును, ఏవమ్=ఇట్లు, అన్యోన్య....భీతమ్–అన్యోన్య= ఒండొరుల, జన్మ+మరణ+ఆశన=జన్మము, మరణము, రోగము అనువానివలన, భీతభీతమ్= మిగుల భీతిని పొందినదియు, స్వపరవిగ్రహవైరమిత్రమ్=తమ యొక్కయు, ఇతరుల యొక్కయు, శరీరములందు నెలకొన్న వైరము, మైత్రి గలిగినదియు, మూఢమ్=మూఢజనమును, పశ్యన్= చూచుచున్నవారు, పారచర=ఆ సంసారనదికి ఆవల నుండువాడా!, హంత+ఇతి=అక్కట, ఎంత కష్టము నీకని కనికరించి, పపృహి=వైతరణి నుండి దాటించి పాలించుము.

**తాత్పర్యము:–** ఇట్లు సంసారమను యమ ద్వారమునందలి వైతరణియను నదియందు తమ కర్మలచేబడినవై ఒండొంట నుండి వచ్చు జన్మము, మరణము, వ్యాధులకు మిగుల భయపడు చున్నది. తమ శరీరములందు పరుల శరీరములందు మైత్రి విరోధము కలిగినదైన యా మూఢజనమునుజూచుచు ఈ సంసారనదికి ఆవలి గట్టునందు దేవా! అయ్యో! వీరిట్టి కష్టమునకు లోనైనారె అని కనికరించి ఆ వైతరణి నుండి దాటించి పాలింపుము.

**శ్లో॥ కోఽ న్వత్ర తేఽ ఖిలగురో భగవన్ ప్రయాస**
**ఉత్తారణేఽ స్య భవ సమ్భవలోపహేతోః।**
**మూఢేషు వై మహదనుగ్రహ ఆర్తబన్ధో**
**కిం తేన తే ప్రియజనాననుసేవతాం నః॥ 42**

**ప్రతిపదార్థము:–** భగవన్!=ఓ భగవంతుడా!, అఖిలలోకగురో!=ఎల్లలోకములకు తండ్రి, అస్య= ఈ విశ్వమునకు, భవసంభవలోపహేతోః=జన్మస్థితిలయములకు కారణమైన, తే=నీకు, ఉత్తారణే= సర్వజనులను సంసారనదిని దాటించుట అను, అత్ర=ఈ పనియందు, కోఽ ను ప్రయాసః =ఏమి ప్రయాసగలదు? ఎంతమాత్రము శ్రమలేదనుట, ఆర్తబంధో=ఓ ఆపన్నులకు బంధువా!, మూఢేషువై=మూఢులందు మాత్రము, మహత్+అనుగ్రహః=దొడ్డ అనుగ్రహము గలవాడవు అగుము. తే=నీయొక్క, ప్రియజనాన్=భక్తజనులను, అనుసేవతామ్=సేవించు, నః=మాయొక్క, తేన=ఉత్తరించుటలో, కిమ్=ఏమి ప్రయోజనము.

**తాత్పర్యము:-** ఓ భగవానుడా! ఈ విశ్వమును సృజించి, పాలించి, లయింపజేయునంత దొడ్డ కార్యమునకు హేతువైన నీకు ఈ మూఢ జనమును సంసారనదిని దాటించుట అనునది ఒక గొప్ప ప్రయాస అగునా? కాదు. ఈ నిన్ను నీ వారిని తరింపజేయుదును. తక్కినవారి సంగతి నాకెందుకు అను పట్టుదల మాత్రము వహింపకుము. మూఢ భక్త జనులను సేవించు మమ్ములను తఱింపజేయుట ఒకలెక్కలోనిది కాదు. అది నీకు ప్రయాస కాదు. నీ భక్త జన సేవనముచేత సంసారవైతరణీనది నుత్తరించుట కలుగగలదని భావము.

**శ్లో॥ నైవోద్విజే భవదురత్యయవైతరణ్యా**
**స్త్వద్వీర్యగాయనమహామృతమగ్నచిత్తః।**
**శోచే తతో విముఖచేతస ఇన్ద్రియార్థ**
**మాయాసుఖాయ భరముద్వహతో విమూఢాన్॥ 43**

**ప్రతిపదార్థము:-** పరమ=ఓ సర్వోత్తమా!, త్వద్వీర్యగాయన మహా+అమృతమగ్నచిత్తః=నీ ప్రభావగాన మను, గొప్ప యమృతమునందు నిలచిన చిత్తముగలవాడనైన నేను భవదురత్యయ వైతరణ్యాః=సంసారమను దాటరాని వైతరణీ నది వలన, న+ఏవ+ఉద్విజే=నేను క్షోభ పొందను. తతః=ఆ మహామృతమునకు, విముఖచేతసః=వెనుమొగమైన చిత్తము గలవాడై, ఇంద్రియార్థ మాయాసుఖాయ=ఇంద్రియ విషయమైన మాయాసుఖము కొరకు, భరమ్=కుటుంబ భారమును, ఉద్వహతః=వహించు, విమూఢాన్=మూఢులను గురించి, శోచే=దుఃఖించెదను.

**తాత్పర్యము:-** ఓ సర్వోత్తముడా! నీ ప్రభావగానమను దొడ్డ యమృతమునందు మునింగిన చిత్తముగల నేను దాటరానిదైన సంసారమను వైతరణీ నదికి, ఏమాత్రము క్లేశపడను గాని నీ గానామృతమునకు చిత్తమును విముఖముఁజేసి ఇంద్రియ విషయములైన మాయా సుఖమునకై కుటుంబభారమును వహించు మూఢులను గూర్చి శోకింతును.

**శ్లో॥ ప్రాయేణ దేవమునయః స్వవిముక్తికామా**
**మౌనం చరన్తి విజనే న పరమార్థనిష్ఠాః।**
**నైతాన్ విహాయ కృపణాన్ విముముక్ష ఏకో**
**నాన్యం త్వదస్య శరణం భ్రమతోఽనుపశ్యే॥ 44**

**ప్రతిపదార్థము:-** దేవ!=ఓ దేవ, ప్రాయేణ=తఱచుగా, మునయః=మునులు, స్వవిముక్తికామాః =తమ ముక్తిని మాత్రమును కోరువారు, పరమార్థనిష్ఠాః=ఆత్మజ్ఞాన నిష్ఠగలవారై, విజనే=నిర్జన మైన వనమునందు, మౌనం చరంతి=మౌనమును ఆచరింతురు. కృపణాన్=దాసులైన, ఏతాన్ =వీరిని, విహాయ=వీడి, ఏకః=నేనొక్కడనే, న విముముక్ష=ముక్తినిచ్ఛగింపను. భ్రమతః =సంసారమున తిరుగుచు, అస్య=ఈ జన్మమునకు, త్వత్=నీ కంటె, అన్యం శరణమ్=ఇతరమైన రక్షకము, న అనుపశ్యే!=చూడకున్నాను.

**తాత్పర్యము:-** ఓ దేవా! సామాన్యముగా మునులు తాము ముక్తివడయుటకు మాత్రమే కోరిక గలవారై (ఇతరుల నుద్ధరించు ప్రయత్నములేని వారైయనుట) నిర్జనమైన వనమునందు మౌనము వహించి ఆత్మజ్ఞాన నిష్ఠగలవారై యుందురు. దిక్కులేని ఈ మూఢజనులనువీడి నేనొక్కడను





మాత్రము ముక్తిఁబడయగోరను. సంసారమునందు తిరుగుడుపడుచున్న ఈ జనులకు నీ కంటె దిక్కయిన వాడెవ్వడు లేడు. కావున నిన్నే శరణు పొందుచున్నాను.

**శ్లో॥ యన్మైథునాది గృహమేధిసుఖం హి తుచ్ఛమ్**
**కణ్డూయనేన కరయోరివ దుఃఖదుఃఖమ్।**
**తృప్యన్తి నేహ కృపణా బహుదుఃఖభాజః**
**కణ్డూతివన్మనసిజం విషహేత ధీరః॥ 45**

**ప్రతిపదార్థము:-** కరయోః=హస్తములయొక్క, కణ్డూయనేన ఇవ=సంఘర్షణముచేత వలె రాచుకొనుటచేతను, దుఃఖ దుఃఖమ్=దుఃఖము వెంట దుఃఖము కలిగించునదై, తుచ్ఛమ్= అల్పమైనది, యత్=ఏది, మైథునాది గృహమేధి సుఖమ్=స్త్రీ సంభోగములోనగు గృహస్థుల యొక్క సుఖమును, కాముకాః=కాముకులు, బహుదుఃఖభాజః=పెక్కు దుఃఖములకు బాత్రమైన వారైనను, న తృప్యన్తి=చాలునని తృప్తిపొందరు, మనసిజమ్=కాముని, విషహేత=సహించును, ఎల్లరు సహించలేరు.

**తాత్పర్యము:-** ఎంత రాపిడి చేతను వీడని చేతులదురదవోలె మఱి మఱి దుఃఖమును కలిగించునదైన స్త్రీ సంభోగాదికమగు గృహస్థుని సుఖమును కాముకులును పెక్కు దుఃఖములకు బాత్రమైన వారు మాత్రము ఎంత అనుభవించినను ఇది ఇక జాలునని మాత్రము తృప్తి చెంది విరక్తి నొందరు. నీ యనుగ్రహమునకు బాత్రమైన వీరుడు మాత్రమేని తోడవోలె కాముని సహింపగల్గును.

**శ్లో॥ మౌనవ్రతశ్రుతతపోఽధ్యయనస్వధర్మ-**
**వ్యాఖ్యారహోజపసమాధయ ఆపవర్గ్యాః।**
**ప్రాయః పరం పురుష తే త్వజితేన్ద్రియాణాం**
**వార్తా భవన్త్యుత న వాత్ర తు దామ్భికానామ్॥ 46**

**ప్రతిపదార్థము:-** పురుష!=ఓ అంతర్యామి!, మౌన......సమాధయః=మౌనము వ్రత నియమము, పాండిత్యము, తపస్సు, అధ్యయనము, స్వధర్మవ్యాఖ్యానము, ఏకాంతవాసము, జపము, సమాధి అను నీ పదియు, అపవర్గ్యాః=మోక్షహేతువులు, తే తు=అవి అయినచో, ప్రాయః=తఱచుగా, అజితేంద్రియాణామ్=ఇంద్రియములు జయించని వారికి, ఇంద్రియభోగములకు శబ్దాది సుఖములను విక్రయించువానికి, వార్తాః=జీవనోపాయములగును, అత్ర=ఇందు, దాంభికానామ్= దాంభికులకు, న వా=ఆ జీవనోపాయములు లేవు.

**తాత్పర్యము:-** మౌనము, వ్రతము, పాండిత్యము, తపస్సు, అధ్యయనము, స్వధర్మము, ఏకాంత వాసము, జపము, సమాధి అనునవి పదియు మోక్షహేతువులైనవి. ఇంద్రియములను జయించనివారలకు ఇంద్రియ భోగములకై పై వాటిని విక్రయించువారికి జీవనోపాయములగు చున్నవి. కేవలము దాంభికులైన వారికి ఆ జీవనోపాయములు దొరకవు.

**శ్లో॥ రూపే ఇమే సదసతీ తవ వేదసృష్టే**
**బీజాఙ్కురావివ న చాన్యదరూపకస్య।**

# శ్రీః
# అథ దశమోఽధ్యాయః

ఈ పదియవ అధ్యాయమునందు హరి భక్తుడైన ఈ ప్రహ్లాదుని అనుగ్రహించి అంతర్ధానము నొందుటయు, ప్రసంగవశమున హరి రుద్రుని అనుగ్రహించుటయుఁజెప్పబడును.

**నారద ఉవాచ**

**శ్లో॥ భక్తియోగస్య తత్సర్వమన్తరాయతయార్భకః।**
**మన్యమానో హృషీకేశం స్మయమాన ఉవాచ హ॥ 1**

**ప్రతిపదార్థము:–** అర్భకః=బాలుడైన ప్రహ్లాదుడు, తత్+సర్వమ్=ఈ భగవంతుడు ఇచ్చెదనన్న వరాదికమంతయు, భక్తియోగస్య=భక్తియోగమునకు, అంతరాయతయా=విఘ్నముగా, మన్యమానః=తలంచుచున్నవాడై, స్మయమానః=నవ్వుచు, హృషీకేశమ్=హరిని గూర్చి, ఉవాచ హ=వచించెను.

**తాత్పర్యము:–** నరసింహస్వామి ఇచ్చెదనన్న వరాదికము అంతయు భక్తియోగమునకు విఘ్నము గావించునదని తలంచుచు నవ్వుచు హరిని జూచి ఇట్లనియెను.

**ప్రహ్లాద ఉవాచ**

**శ్లో॥ మా మాం ప్రలోభయోత్పత్త్యాసక్తం కామేషు తైర్వరైః।**
**తత్సఙ్గభీతో నిర్విణ్ణో ముముక్షురుపాశ్రితః॥ 2**

**ప్రతిపదార్థము:–** ఉత్పత్త్యా=పుట్టుకచేతనే, కామేషు=సుఖాభిలాషలయందు, ఆసక్తమ్=ఆసక్తిగల, మామ్=నన్ను, తైః వరైః=ఆయా వరములచే, మాప్రలోభయ=ప్రలోభపెట్ట వలదు, తత్+సంగభీతః =ఆ కామముల సంగమునకు భీతుడనై, నిర్విణ్ణః=నిర్వేదమొందినను, ముముక్షుః=విశేషించి మోక్షముగోరినవాడనై, ఉపాశ్రితః=నిన్నాశ్రయించితిని.

**తాత్పర్యము:–** ఓ నరహరీ! నేను పుట్టుక చేతనే కామములందు ఆసక్తి గలవాడనై యున్నాను. అట్టి నన్ను ఇష్టములగు వరము లిత్తునని ఆశకు గురి చేయకుము. నేను కామసంగములకు భీతి చెంది వాని మీద విరక్తుడనై మోక్షముగోరి నిన్నాశ్రయించినాను.

ఓయీ! నేను నా భక్తుని ఎందులకు ప్రలోభ పెట్టుదును మఱి వరమును గ్రహింపుము అను నీ అభిప్రాయము వేఱనుచున్నాడు.

**శ్లో॥ భృత్యలక్షణజిజ్ఞాసుర్భృత్యం కామేషు చోదయత్।**
**భవాన్ సంసారబీజేషు హృదయగ్రన్థిషు ప్రభో॥ 3**

**ప్రతిపదార్థము:–** ప్రభో!=ఓ లోక ప్రభూ!, భృత్యలక్షణజిజ్ఞాసుః=నీ భక్తుని గుణలక్షణముల నెఱుంగగోరిన, భవాన్=నీవు, భృత్యమ్=నీ సేవకుని, సంసారబీజేషు=సంసార కారణములు, హృదయగ్రంథిషు=హృదయ గ్రంథివలె (ముడివలె) బంధకములైన, కామేషు=కామములందు, చోదయత్=పురికొల్పుచున్నావు.



**శ్లో॥ నైతే గుణా న గుణినో మహదాదయో యే**
**సర్వే మనః ప్రభృతయస్సహదేవమర్త్యాః।**
**ఆద్యన్తవన్త ఉరుగాయ విదన్తి హి త్వా -**
**మేవం విమృశ్య సుధియో విరమన్తి శబ్దాత్॥ 49**

**ప్రతిపదార్థము:–** ఉరుగాయ=మిక్కిలి స్తుతింపబడువాడు, యే=ఏవి, గుణ+అనుగుణినః=ప్రకృతి యొక్క సత్త్వాదిగుణములనుసరించినవైన ఆ గుణముల సంబంధించిన వాని ననుమానించి ఇంద్రియాదులను వదులుదురు. మహత్+ఆదయః=మహత్త్వము, అహంకారములోనగునవి, మనః ప్రభృతయః=మనసులోనగు, సహదేవమర్త్యాః=దేవతలలోను, మానవులతోను కూడినవి, ఏతే సర్వే=ఇవి యన్నియు, ఆద్యంతవంతః=ఆదిఅంతము గలవైయున్నవి, జగమగు శరీరాదులను ఉపాధిగా గలవి కాబట్టి ఆదిఅంతము గలవైయున్నవి, త్వామ్=ఆద్యంతరహితుడవైన నిన్ను, న విదంతి=ఎఱుంగలేరు, హి=ఏ కారణమున, సుధియః=విద్వాంసులు, మునులు, ఏవం విమృశ్య=ఇట్లు విమర్శించి, శబ్దాత్=అధ్యయనాది వ్యాపారము నుండి, విరమంతి=బాలించు కొనుచుందురు. నిన్నే సమాధిచే నుపాసింతురు.

అట్లే *కిమర్థా వయమధ్యేష్యామహే।*
*కిమర్థా వయం యక్ష్యామహే।*
*నానుధ్యాయాత్ బహూంశ్శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్॥*

స్మృతి – *యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతికరిష్యతి।*
*తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ॥*

**తాత్పర్యము:–**మిక్కిలి స్తుతింపబడువాడు, ఏవి ప్రకృతి యొక్క సత్త్వాదిగుణములననుసరించినవైన ఆ గుణముల సంబంధించిన వాని ననుమానించి ఇంద్రియాదులను వదులుదురు. మహత్త్వము, అహంకారములోనగునవి, మనసులోనగు దేవతలలోను మానవులతోను కూడినవి ఇవి యన్నియు, ఆదిఅంతము గలవైయున్నవి. జగమగు శరీరాదులను ఉపాధిగా గలవి కాబట్టి ఆదిఅంతము గలవైయున్నవి. ఆద్యంతరహితుడవైన నిన్ను ఎఱుంగలేరు. ఏ కారణమున విద్వాంసులు, మునులు ఇట్లు విమర్శించి అధ్యయనాది వ్యాపారము నుండి బాలించు కొనుచుందురు? నిన్నే సమాధిచే నుపాసింతురు.

**శ్లో॥ తత్తేఽర్హత్తమ నమః స్తుతికర్మ పూజా–**
**కర్మస్మృతిశ్చరణయోః శ్రవణం కథాయామ్।**
**సంసేవయా త్వయి వినేతి షడఙ్గయా కిం**
**భక్తిం జనః పరమహంసగతౌ లభేత॥ 50**

**ప్రతిపదార్థము:–** అర్హత్తమ=ఓ పూజ్యతముడా!, తే=నీయొక్క, నమః స్తుతి కర్మపూజా=సాష్టాంగ ప్రణామము, స్తోత్రము, కర్మార్పణము, కర్మ=పరిచర్య, చరణయోః=పాదములయొక్క, స్మృతిశ్చ =స్మరణము, కథాయామ్=కథలను, శ్రవణమ్=వినుట అను, షడంగయా=ఆఱు అంగములు

గలదై, సంసేవయా వినా=చక్కని సేవలేక, పరమహంసగతౌ=పరమహంసలకు ప్రాప్తమైన, త్వయి=నీయందు, జనః=జనుడు, భక్తిమ్=భక్తిని, కిం లభేత=ఎట్లు పొందును?

**తాత్పర్యము:–** ఓ పూజ్యతముడా! నీకు సాగిలి మ్రొక్కుట, నిన్ను స్తుతించుట, తాను జేయు కర్మలన్నియు నీయందు సమర్పించు కర్మార్పణ, నీకు పరిచర్య చేయుట నీ పాదస్మరణము, నీ కథాశ్రవణము, అను నాఱు అంగములతో కూడిన నీ చక్కని సేవను వీడి పరమహంసలకు ప్రాప్తమైన భక్తిని జనుడెట్లు నీయందు పొందగలడు? పైన పేర్కొన్న సేవయున్నప్పుడే జనుడు నీ భక్తుడగును.

**నారద ఉవాచ**

**శ్లో॥ ఏతావద్వర్ణితగుణో భక్త్యా భక్తేన నిర్గుణః।**
**ప్రహ్లాదం ప్రణతం ప్రీతో యతమన్యురభాషత॥ 51**

**ప్రతిపదార్థము:–** భక్తేన=భక్తునిచే, భక్త్యా=భక్తిచే, ఏతావత్+వర్ణితగుణః=ఇంతవరకు ఈ విధముగా వర్ణించిన గుణములుగలవాడై, నిర్గుణః=గుణరహితుడైన నరసింహమూర్తి, యత మన్యుః =కోపమునుపసంహరించినవాడై, ప్రీతః=సంతోషించినవాడై, ప్రణతమ్=నమస్కరించు, ప్రహ్లాదమ్=ప్రహ్లాదుని, గూర్చి, అభాషత=ఇట్లు భాషించెను.

**తాత్పర్యము:–** ఇట్లు భక్తుడైన ప్రహ్లాదుడు భక్తితో నింతవఱకు తన గుణములు వర్ణించగా నిర్గుణుడైన నరసింహమూర్తి సంతోషించి, కోపము నుపసంహరించి తనకు మ్రొక్కుచున్న ప్రహ్లాదుని గాంచి యిట్లనెను.

**శ్రీభగవానువాచ**

**శ్లో॥ ప్రహ్లాద భద్ర భద్రం తే ప్రీతోఽహం తేఽసురోత్తమ।**
**వరం వృణీష్వాభిమతం కామపూరోఽస్మ్యహం నృణామ్॥ 52**

**ప్రతిపదార్థము:–** ప్రహ్లాద!=ఓ ప్రహ్లాద!, భద్ర=శుభలక్షణుడా!, తే భద్రమ్=నీకు శుభమగుగాక, అసురోత్తమ=అసుర శ్రేష్ఠుడా!, తే=నీచే, అహమ్=నేను, ప్రీతః=సంతోషింపబడితిని, అహమ్=నేను, నృణామ్=నరులకు, కామపూరః=ఇష్టార్థములను నిండించువాడను, పురుషార్థప్రవాహుండను, అస్మి=అగుచున్నాను, అభిమతం వరమ్=నీకు ఇష్టమైన వరమును, వృణీష్వ=వరింపుము.

**తాత్పర్యము:–** ఓ ప్రహ్లాదా! మంగళశీలుడా! అసురశ్రేష్ఠుడా! నేను నీ స్తుతులకు నీయందు ప్రీతిగలవాడనైతిని. మానవుల యభీష్టములను ఇచ్చువాడను నేను. కావున వాంచితమగు వరమును గోరుము.

**శ్లో॥ మామప్రీణత ఆయుష్మన్ దర్శనం దుర్లభం హి మే।**
**దృష్ట్వా మాం న పునర్జన్తురాత్మానం తప్తుమర్హతి॥ 53**

**ప్రతిపదార్థము:–** ఆయుష్మన్=ఓ ఆయుష్మంతుడా!, మామ్=నన్ను, అప్రీణతః=సంతోషపెట్టని వానికి, మే దర్శనమ్=నా దర్శనము, దుర్లభమ్=లభింపదు, జంతుః=ప్రాణి, దేహధారి, మామ్= నన్ను, దృష్ట్వా=దర్శించి,పునః=మరల, ఆత్మానమ్=తన్ను, తప్తుమ్=అపూర్ణకాముడనని





తపించుటకు, న+అర్హతి=తగదు.

**తాత్పర్యము:–** ఓ ఆయుష్మంతుడా! నన్ను ధ్యానించి సంతోషపెట్టని వానికి నా దర్శనము దుర్లభము. నన్ను సందర్శించిన ప్రాణి మరల సంసారతాపమును పొందదు. తాను అపూర్ణుడనని వగవడు.

**శ్లో॥ ప్రీణన్తి హ్యథ మాం ధీరాస్సర్వభావేన సాధవః।**
**శ్రేయస్కామా మహాభాగాస్సర్వాసామాశిషాం పతిమ్॥ 54**

**ప్రతిపదార్థము:–** అథ=మఱియు, ధీరాః=విద్వాంసులు, సాధవః=సజ్జనులు, శ్రేయస్కామాః =మోక్షకామములు, మహాభాగాః=పూజ్యులునైనవారు, పతిమ్=ప్రభువైన, మామ్=నన్ను, సర్వభావేన=మనోవాక్కాయములచే, ప్రీణంతి=సంతోషపెట్టుదురు, సర్వాసామ్=ఎల్ల, ఆశిషామ్=వాంఛితములకు, మామ్=నన్ను, ప్రీణంతి=సంతోషపెట్టుదురు.

**తాత్పర్యము:–** మఱి పండితులు, సాధువులు, మోక్షగాములు, పూజ్యులునైనవారు సర్వవాంఛల నిచ్చువాడనగు నన్ను మనోవాక్కాయములచే తలంచి నుతించి, పూజించి సంతోషపెట్టుదురు.

**నారద ఉవాచ**

**శ్లో॥ ఏవం ప్రలోభ్యమానోఽపి వరైర్లోకప్రలోభనైః।**
**ఏకాన్తిత్వాద్భగవతి నైచ్ఛత్తానసురోత్తమః॥ 55**

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ ప్రకారము, లోకప్రలోభనైః=జనులకు అభిలషణీయములైన, వరైః =వరములచేత, ప్రలోభ్యమానః అపి=ప్రలోభింపజేయబడుచున్న వాడయినను, భగవతి= భగవంతునందు, ఏకాంతిత్వాత్=నిరుపాధిక భక్తుడగుటవలన, అసుర+ఉత్తమః=అసురశ్రేష్ఠుడు ప్రహ్లాదుడు, తాన్=ఆ వరములను, న+ఐచ్ఛత్=ఇచ్ఛగింపలేదు.

**తాత్పర్యము:–** ఇట్లు జనములకు అభిలషణీయములైన వరము లిత్తునని దేవుడు తన్నెంత ఆశకు గుఱి గావించినను భగవంతునందు అనన్య భక్తికలవాడగుటవలన అసురోత్తముడగు ప్రహ్లాదుడు ఆ వరములు వేనిని నొల్లడయెను.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**ప్రహ్లాదచరితే భగవత్స్తవో నామ నవమోఽధ్యాయః(9)**

పుణ్యాచరణముచే, పాపమ్=పాపమునువీడి, ముక్తబంధః=బంధములువీడి, కాలజవేన= కాల వేగముచే, ఆయుర్వ్యయముచేత, కళేవరమ్=శరీరమును, హిత్వా=వీడి, విశుద్ధామ్=నిర్మలమై, సురలోకగీతామ్=దేవతలచే కొనియాడదగిన, కీర్తిమ్=కీర్తిని, విస్తార్య=లోకములో వ్యాపింపజేసి, మామ్=నన్ను, ఏష్యసి=పొందగలవు.

**తాత్పర్యము:–** భోగానుభవముచే ప్రారబ్ధపుణ్యమును బాసి, పుణ్యకర్మానుచరణముచే పాపమును వీడి కాలవేగముచే ఈ శరీరమును విడిచి దేవతలు కొనియాడదగిన నిర్మలయశమందు విస్తరింప జేసి బంధములన్ని వీడి నన్ను పొందగలవు.

**విశేషము:–** కీర్తిని విస్తరింపజేసి నన్ను బొందగలవు.పుణ్యాచరణమున పాపమును వీడి అనుట మాత్రము, బిభీషక మాత్రము భయపెట్టుటయేయగును అట్లుగాదు. రాజ్యమునందు ప్రవర్తించని ఆ ప్రహ్లాదునికి ప్రాచీనమైన పాపము లేదు. **తదధిగమ ఉత్తర పూర్వాఘయోరశ్లేష వినాశాత్ తద్వ్యపదేశాత్.** బ్రహ్మవిదునికి, ఆ బ్రహ్మమును బొందినంతనే పూర్వజన్మకృతమగు పాపపుణ్యములు రెండును నశించుచున్నవి. ఆగాములగు పాపపుణ్యములు రెండును బ్రహ్మ విదులు అంటారు. శ్రుతి:– **తత్సుకృతదుష్కృతే విధూనుత ఇతి శ్రుతేశ్చ।** పుణ్యపాపములను వదిలించుకొనుము. ఇది ప్రారబ్ధమగు పాపమును గూర్చినది గాదు. ఆ పాపపుణ్యములనుభవము చేతనే క్షయమగును.

**కుశలే న హిత్వేతి వచనానుపపత్తేః –** పుణ్యాచరణమున పాపమును వీడి అనుమాట సరిపోవుటకు ఈ ప్రహ్లాదుడు అవిద్యాలనుడని, అజ్ఞాని అని చెప్పుటకు వలనపడదు. భగవంతుని చేతనే కృతార్థత్వము నట్లు తర్వాత చెప్పబోవుట వలన – **యోగేన కర్మ హిన్వన్ –** ఫలము నాయందు సమర్పించి కర్మచేయుము. అదియు లోకసంగ్రహార్థమైన కర్మయందు ప్రవర్తించు వానికి ఉద్వేగము మాత్రము లేకుండుటకై యిట్లు చెప్పుట. అందువలన సర్వము నిర్దోషము.

**శ్లో॥ య ఏతత్కీర్తయేన్మహ్యం త్వయా గీతమిదం నరః।**
**త్వాం చ మాం చ స్మరన్ కాలే కర్మబన్ధాద్విముచ్యతే॥ 15**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, నరః=నరుడు, త్వయా=నీచే, గీతమ్=నుతించబడిన, ఏతత్=ఈ స్తుతితో, ఇదమ్=నా చరణము, కీర్తయేత్=కీర్తించునో, త్వాం చ=నన్నును, మాం చ=నన్నును, స్మరన్=స్మరించుచున్నాడు, కాలే=వాడు తన జీవితకాలమందు, కర్మబంధాత్=కర్మ బంధము నుండి, విముచ్యతే=విముక్తుడగును.

**తాత్పర్యము:–** ఏ నరుడు నిన్ను నన్ను స్మరించు నీవు నన్ను స్తుతించిన ఈ స్తోత్రమును – ఈ నా చరిత్రమును కీర్తించుచున్నాడో వాడు తన జీవితకాలమందు లేక కాలక్రమమున కర్మబంధము నుండి విముక్తుడగుచున్నాడు.

ప్రహ్లాద ఉవాచ

**శ్లో॥ వరం వరయ ఏతత్తే వరదేశాన్మహేశ్వర।**
**యదనిన్దత్ పితా మే త్వామవిద్వాంస్తేజ ఐశ్వరమ్॥ 16**





**తాత్పర్యము:–** ఓ లోకప్రభూ! నీ భక్తుని గుణలక్షణములను తెలుసుకోగోరిన నువ్వు నీ సేవకుని హృదయగ్రంథివలె ముడిపడే బంధకములైన కామములందు పురిగొలుపుతున్నావు.

**శ్లో॥ నాన్యథా తేఽఖిలగురో ఘటేత కరుణాత్మనః।**
**నష్టదృష్టే స్తమస్యంధే త్వమేకః పారదర్శనః॥ 4**

**ప్రతిపదార్థము:–** అఖిలలోకగురో!=ఎల్లలోకములకు గురువైనవాడా!, అన్యథా=అట్లుకానిచో, నీవు పరీక్షచేయగోరి అట్లు అడిగినవాడవు కానిచో, కరుణాత్మనః=కరుణాస్వరూపుడవైన, తే=నీకు, న ఘటేత=ఇది ఘటిల్లదు, అంధే తమసి=కటిక చీకటియందు,సంసారాంధకారమున, అజ్ఞానాంధ కారమున, నష్టదృష్టే=నశించిన కంటిచూపు గలవానికి, త్వమ్=నీవు, ఏకః=ఒక్కడవే, పారదర్శనః =ఆవలిగట్టు చేర్చువాడవు.

**తాత్పర్యము:–** భక్తుని పరీక్షింపగోరి అట్లు అడిగినవాడవు గానిచో కరుణాస్వరూపుడవైన నీకెట్లది పొసగును. అజ్ఞానము అను కటిక చీకటి యందు కంటిచూపు సన్నగిలి అవస్థపడువానిఁ గట్టుచేర్చువాడవు నీ వొక్కడవే.

**శ్లో॥ యస్త ఆశిష ఆశాస్తే న స భృత్యః స వై వణిక్।**
**స వై స్వామీ స వై భూత్యో గుణలుబ్ధౌ న కాముకౌ॥ 5**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, తే=నీ వలన, ఆశిషః=వాంఛలను, ఆశాస్తే=వాంఛించుచున్నాడో, సః=వాడు, వణిక్=వర్తకుడు, గుణలుబ్ధౌ=సద్గుణములందు ఆశగలవారు ఎవరో, సవైస్వామీ=అతడే స్వామి, సవైభృత్యః=అతడే భృత్యుడుకాని, న కాముకౌ=కాముకులుగారు.

**తాత్పర్యము:–** ఎవడు నీ వలన తన యభీష్టములను బొందగోరునో వాడు నీ భృత్యుడుగాడు. వణిజుడు వ్యాపారి. సద్గుణలుబ్ధులైనవారు స్వామిగాని భృత్యులు గాని అగుదురు. కాముకులు మాత్రము స్వామిభృత్యులు గారు.

**శ్లో॥ ఆశాసానో న వై భృత్యః స్వామిన్యాశిష ఆత్మనః।**
**న స్వామీ భృత్యతః స్వామ్యమిచ్ఛన్ యో రాతి చాశిషః॥ 6**

**ప్రతిపదార్థము:–** స్వామిని=తన ప్రభువునందు, ఆత్మనః=తనకు, ఆశిషః=కోర్కెలను, ఆశాసానః =అపేక్షించుచుండువాడు, న వై భృతః=భృత్యుడు గాడు, భృత్యతః=భృత్యుని వలన, స్వామ్యమ్= ప్రభుత్వము, ఇచ్ఛన్=ఇచ్ఛగించుచు, యః=ఎవడు, ఆశిషః=వరములను, రాతి=ఇచ్చునో, న స్వామి=అతడు స్వామిగాడు.

**తాత్పర్యము:–** ప్రభువు వలన దన కోర్కెలు సిద్ధించవలెనని అపేక్షించువాడు భృత్యుడుగాడు. భృత్యునివలనఁ దాను ప్రభుత్వము వహించి భృత్యునికి గోర్కుల నొసగువాడు స్వామి కాడు.

**శ్లో॥ అహం త్వకామస్త్వద్భక్తస్త్వం స్వామీ హ్యనపాశ్రయః।**
**నాన్యథాహ్యావయోరర్థో రాజసేవకయోరివ॥ 7**

**ప్రతిపదార్థము:–** అహం తు=నేనన్నచో, అకామః=కోర్కెలు లేనివాడను, త్వత్+భక్తః=నీ భక్తుడను,

త్వమ్=నీవు,అనపాశ్రయః=ఫలాభి సంధికాశ్రయము లేనివాడవు, అన్యథా=మఱియొక విధముగా, అవయోః=మనకు,రాజసేవకయోః ఇవ=రాజునకు సేవకునకువలె, న+అర్థః=ప్రయోజనములేదు.

**తాత్పర్యము:–** నేను నిష్కాముడను, నీ భక్తుడను. నీవు ఐహికఫలమునకు ఆశ్రయుడవు కావు. నీకు నాకును ఇట్టిది సంబంధము రాజునకు, సేవకునకు వలె వేఱు ప్రయోజనము లేదు.

**శ్లో॥ యది దాసీశ మే కామాన్ వరాంస్త్వం వరదర్షభ।**
**కామానాం హృద్యసంరోహం భవతస్తు వృణే వరమ్॥ 8**

**ప్రతిపదార్థము:–** ఈశ!=ఓ పరమేశ్వరా!, వరద+ఋషభ=వరములు ఇచ్చువారలలో శ్రేష్ఠుడా!, ఓయీ అట్లయిన పరమోదారుడనైన నాకు సంతోషముకలుగుటకై ఏదైనా వరము గోరుమని చెప్పుచున్నాడు. మే=నాకు, కామాన్=ఇష్టములైన, వరాన్=వరములను, యది దాసి=ఇచ్చువాడ వగు నెడల, భవతః=నీ వలననైన, హృది=నా మనస్సునందు, కామానామ్=కామములయొక్క, అసంరోహమ్=మొలకెత్తకుండుట, వరమ్=వరమునుగా, వృణే=వరింతును.

**తాత్పర్యము:–** ఓ పరమేశ్వరా! నీవు నాకు అభీష్టములైన వరమునిత్తునంటివేని మఱి నా మనస్సునందిక కామములను మొలకలు మొలవకుండునట్లు వరముగా కోరుదును.

**శ్లో॥ ఇన్ద్రియాణి మనః ప్రాణాః ఆత్మా ధర్మో ధృతిర్మతిః।**
**హ్రీః శ్రీస్తేజః స్మృతిః సత్యం యస్య నశ్యన్తి జన్మనా॥ 9**

**ప్రతిపదార్థము:–** యస్య=ఏ కామముయొక్క, జన్మనా=పుట్టుకచేత, ఇంద్రియాణి=ఇంద్రియములు, మనః ప్రాణాః=మనస్సు, ప్రాణములు, ఆత్మ, దేహము, ధర్మః, ధృతిః, మతిః=ధర్మము, ధైర్యము, బుద్ధి, హ్రీః శ్రీః తేజః స్మృతిః సత్యం=సిగ్గు, సిరి, తేజము, స్మృతి, సత్యము, నశ్యంతి=నశించు చున్నవి.

**తాత్పర్యము:–** కామము జనించినంతనే ఇంద్రియములు, మనస్సు, ప్రాణము, దేహము, ధర్మము, ధైర్యము, బుద్ధి, సిగ్గు, సంపద, తేజము, స్మృతి, సత్యము ఇవి యన్నియు నశించును.

**శ్లో॥ విముఞ్చతి యదా కామాన్ మానవో మనసి స్థితాన్।**
**తర్హ్యేవ పుణ్డరీకాక్ష భగవత్త్వాయ కల్పతే॥ 10**

**ప్రతిపదార్థము:–** పుండరీకాక్ష!=తెల్లదామర వంటి కన్నులు గలవాడా!, మానవః=నరుడు, యదా=ఎప్పుడు, మనసి=మనస్సునందు, స్థితాన్=నెలకొన్న, కామాన్=వాంఛలను, విముంచతి=వీడుచున్నాడో, అంతర్హి+ఏవ=అప్పుడే, భగవత్త్వాయ=నీతో సమానమైన ఐశ్వర్యమును పొందుటకు, కల్పతే=అర్హుడగుచున్నాడు.

**తాత్పర్యము:–** ఓ పుండరీకాక్ష! మానవుడెప్పుడు తన మనస్సునందుండు కోర్కెలనన్నింటిని వీడుచున్నాడో అప్పుడే అతడు భగవంతుడు అగు నీతో సమానైశ్వర్యము పొందనర్హుడగుచున్నాడు.

అట్లే శ్రుతి:– **శ్లో॥ యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృదిస్థితాః।**
**అథ మర్త్యోమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే॥**



**శ్లో॥ ఓంనమో భగవతే తుభ్యం పురుషాయ మహాత్మనే।**
**హరయేఽద్భుతసింహాయ బ్రహ్మణే పరమాత్మనే॥ 11**

**ప్రతిపదార్థము:–**పురుషాయ=పురుషోత్తముడా!, మహాత్మనే=మహాత్ముడా!, భగవన్=భగవంతుడా!, అద్భుతసింహాయ=అద్భుత సింహ స్వరూపుడవైన, హరయే=హరికొఱకు, ఓం నమః=ఓంకార పూర్వకముగా, తుభ్యం నమః=నీకు నమస్కారము చేయుదును.

**తాత్పర్యము:–** పురుషోత్తముడా, మహాత్ముడు, భగవంతుడు, బ్రహ్మము, పరమాత్మ, అద్భుత సింహస్వరూపుడైన హరి కొరకు ఓంకారపూర్వకముగా నమస్కారముఁజేయుదును.

**శ్రీనృసింహ ఉవాచ**

**శ్లో॥ నైకాన్తినో మే మయి జాత్విహాశిషో హ్యాశాసతేఽముత్ర చ యే భవద్విధాః।**
**తథాపి మన్వన్తరమేతదత్ర దైత్యేశ్వరాణామనుభుంక్ష్వ భోగాన్॥ 12**

**ప్రతిపదార్థము:–** మే=నాయొక్క, ఏకాంతినః=ఏకాంత భక్తులు, భవత్+విధాః=నీవంటివారు, మయి=నాయందు,ఇహ=ఈ లోకమునందును, అముత్ర చ=పరలోకము, జాతు=ఒకానొకప్పుడు, ఆశిషః=వాంఛలను, న ఆశాసతే=కోరరు, తథాపి=అట్లయినను, అత్ర=ఈ భూలోకమునందు, దైత్య+ ఈశ్వరాణామ్=దైత్యప్రభువులయొక్క, భోగాన్=భోగములను, ఏతత్=ఈ, మన్వంతరమ్=మన్వంతర కాలము, భుంక్ష్వ=అనుభవింపుము.

**తాత్పర్యము:–** నా యేకాంత భక్తులు నీ వంటి వారు ఇహలోక వాంఛలను గాని పరలోక భోగములను గాని గోరి నన్ను వరములడుగువారు కారు. అట్లయినను నీవు ఈ మన్వంతర కాలము దైత్యులకుఁ బ్రభుడవై భోగములనుభవింపుము.

**శ్లో॥ కథా మదీయా జుషమాణః ప్రియాస్త్వమావేశ్య మామాత్మని సన్తమేకమ్।**
**సర్వేషు భూతేష్వధియజ్ఞమీశం–యజస్వ యోగేన చ కర్మ హిన్వన్॥ 13**

**ప్రతిపదార్థము:–** త్వమ్=నీవు, ప్రియాః=ఇష్టములైన, మదీయాః=నా సంబంధియైన, కథాః =కథలను, జుషమాణః=సేవించుచు, సర్వేషుభూతేషు=ఎల్లభూతములందు, ఏకమ్=ఒక్కడేయై, సంతమ్=ఉంటూ, అధియజ్ఞమ్=యజ్ఞాధిష్ఠితుడు, ఈశమ్=పరమేశుడునైన, మామ్=నన్ను, ఆత్మని=నీ హృదయమునందు, ఆవేశ్య=నిల్పి, యోగేన=నీయందు సమర్పించిన కర్మయోగము ద్వారా, కర్మ=యాగాది కర్మను, హిన్వన్=కర్తృత్వాదికమును వీడి, యజస్వ=నన్ను గూర్చి యజింపుము.

**తాత్పర్యము:–** నీవు నా ప్రియ కథలను వినుచు, సర్వభూతములందు నుండుచు నొక్కడయైన యజ్ఞప్రభువునైన పరమేశ్వరుడనైన నన్ను నీ హృదయమందు నిల్పి సర్వమును నాయందర్పించి కర్తృత్వాదికమును వీడి యాగాదులను యజింపుము. అది బంధకము కాదు.

**శ్లో॥ భోగేన పుణ్యం కుశలేన పాపం కళేబరం కాలజవేన హిత్వా।**
**కీర్తిం విశుద్ధాం సురలోకగీతాం విస్తార్య మామేష్యసి ముక్తబన్ధః॥ 14**

**ప్రతిపదార్థము:–** భోగేన=సుఖానుభవముచే, పుణ్యమ్=ప్రారబ్ధమగు పుణ్యమును, కుశలేన=

బ్రహ్మోవాచ

**శ్లో॥ దేవదేవాఖిలాధ్యక్ష భూతభావన పూర్వజ।**
**దిష్ట్యా తే నిహతః పాపో లోకసన్తాపనోఽసురః॥ 27**

**ప్రతిపదార్థము:-** దేవదేవ!=దేవతలకు దేవా!, అఖిలాధ్యక్ష!=ఎల్ల జగములకు ప్రభువా, భూత భావన=ప్రాణులను సృజించువాడ, పూర్వజ=అంతకు మున్నుండవాడా!, లోకసంతాపనః=జగమునకు బాధకలిగించిన, అసురః=అసురుడు హిరణ్యకశిపుడు, పాపః=పాపమున, దిష్ట్యా=అదృష్ట వశమున, తే=నీచే, నిహతః=చంపబడెను.

**తాత్పర్యము:-** ఓ దేవదేవ! జగదీశా! ప్రాణులను సృజించువాడ! ముందు నుండియూనున్న వాడా! జగమును బాధించిన అసురుడు, మా భాగ్యవశమున నీచే హతుడయ్యెను.

**శ్లో॥ యోఽసౌ లబ్ధవరో మత్తో న వధ్యో మమ సృష్టిభిః।**
**తపోయోగబలోన్మత్తస్సమస్తాన్నిగమానహన్॥ 28**

**ప్రతిపదార్థము:-** యః=ఏ, అసౌ=ఈ అసురుడు, మత్తః=నావలన, లబ్ధవరః=పొందిన వరము గలవాడై, మమ=నాచే, సృష్టిభిః=సృజించబడిన భూతములచే, న వధ్యః=వధింపదగనివాడై, తపస్+యోగబల+ఉన్మత్తః=తపము యొక్క యోగ అభ్యసనము యొక్క బలముచే, ఉన్మత్తుడై మదమెక్కినవాడై, సమస్తాన్=ఎల్ల, నిగమాన్=వేదధర్మములను, అహన్=నాశముచేసెను.

**తాత్పర్యము:-** ఈ అసురుడు హిరణ్యకశిపుడు నా వలన వరముఁబడసి నాచే సృజింపబడిన ప్రాణులచే వధింపఁరానివాడై తపయోగముల బలముచే మదించి వేద ధర్మముల నన్నింటిని నాశము చేసెను.

**శ్లో॥ దిష్ట్యాస్య తనయః సాధుర్మహాభాగవతోఽర్భకః।**
**త్వయా విమోచితో మృత్యోర్దిష్ట్యా తాతాద్భయంకరాత్॥ 29**

**ప్రతిపదార్థము:-**అస్య=ఈ అసురుని, తనయః=సుతుడు, దిష్ట్యా=దైవబలముచే, సాధుః=సాధువు, మహాభాగవతః=గొప్పభక్తుడు అయ్యెను, అర్భకః=బాలుడైన ఇతడు, భయంకరాత్=క్రూరుడైన, తాతాత్=తండ్రి నుండి, దిష్ట్యా=భాగ్యవశమున, మృత్యోః=మృత్యువునుండి, త్వయా=నీచే, విమోచితః=విడిపించబడెను.

**తాత్పర్యము:-** ఈ అసురుని పుత్రుడు అదృష్టవశమున సాధువు, భక్తశ్రేష్ఠుడయ్యెను. ఈ బాలుడు క్రూరుడైన తండ్రివలన నీచే మృత్యువు నుండి తప్పించబడెను.

**శ్లో॥ ఏతద్వపుస్తే భగవన్ ధ్యాయతః ప్రయతాత్మనః।**
**సర్వతో గోప్తృ సన్త్రాసాన్మృత్యోరపి జిఘాంసతః॥ 30**

**ప్రతిపదార్థము:-** భగవన్=ఓ భగవంతుడా!, తే=నీ యొక్క, ఏతత్+వపుః=ఈ మూర్తిని, ప్రయత+ఆత్మనః=నియత మనస్కుడై, ధ్యాయతః=ధ్యానించువానికి, జిఘాంసతః=చంప గోరునదై, సర్వతః సంత్రాసాత్=ఎల్లవానికి భయము గలిగించు, మృత్యోః అపి=మృత్యువు వలనను, గోప్తృ=రక్షక మగును.





**ప్రతిపదార్థము:-** వరద+ఈశన్, మహా+ఈశ్వర!=ఓ వరదుడా! ఈశుడా! మహేశ్వరుడా!, తే=నీ వలన, ఏతత్ వరమ్=ఈ వరమును, వరయ=కోరుచున్నానో, మే పితా=నా తండ్రి, అవిద్వాన్=అజ్ఞానియై, యత్=ఏ, త్వామ్=నిన్ను, తేజ=నీ తేజమును, ఐశ్వర్యమ్=నీ ప్రభుత్వమును, అనిందత్=నిందించినాడు.

**తాత్పర్యము:-** ఓ వరదా! ఈశా! మహేశా! నేను నిన్ను మఱియొక వరమును గోరుచున్నాను. అది యేమనగా మా తండ్రి అజ్ఞానియై నిన్ను, నీ తేజమును, నీ ప్రభావమును నిందించినాడు.

**శ్లో॥ బద్ధామర్షాశయస్సాక్షాత్సర్వలోకగురుం ప్రభుమ్।**
**భ్రాతృహేతి మృషాదృష్టిస్త్వద్భక్తే మయి చాఘవాన్॥ 17**

**ప్రతిపదార్థము:-** బద్ధ+ఆమర్ష+ఆశయః=నిండుకొన్న క్రోధముతో గూడిన భవముగలవాడై, సాక్షాత్=ప్రత్యక్షమగు, సర్వలోకమయమ్=ఎల్లలోకములకుఁదండ్రియై, ప్రభుమ్=ప్రభువైన నిన్ను, భ్రాతృహా+ఇతి=సోదరఘాతకుడని, మృషాదృష్టిః=మిథ్యాదృష్టిగలవాడై (అపనమ్మకము), త్వత్+భక్తే=నీ భక్తుడనైన, మయి చ=నా యందు, అఘవాన్=ద్రోహముగలవాడయ్యెను.

**తాత్పర్యము:-** క్రోధభావము గలిగి చలపట్టినవాడై, ఎల్లలోకములకు తండ్రియై ప్రభువైన నిన్ను సోదరుని జంపినవాడని మిథ్యాదృష్టి కలవాడై లేనిదానినున్నట్లు తలంచువాడు (అసత్య భావమును గలవాడు) నీ భక్తుని నన్ను సైతము బాధలు పెట్టి ద్రోహమాచరించినాడు.

**శ్లో॥ తస్మాత్పితా మే పూయేత దురన్తాద్దుస్తరాదఘాత్।**
**పూతస్తేశాన్తయా దృష్ట్యా దృష్టః కృపణవత్సల॥ 18**

**ప్రతిపదార్థము:-** కృపణవత్సల=దీనులందు ప్రేమగలవాడా!, మే=నాయొక్క, పితా=తండ్రి, దురంతాత్=తుదిలేనిదై, దుస్తరాత్=దాటరానిదైన, తస్మాత్=ఆ, అఘాత్=పాపము నుండి, పూయేత=పవిత్రుడగుగాక!, తే=నీయొక్క, శాంతయా=శాంతమైన, దృష్ట్యా=చూపుచే, దృష్టః= చూడబడినవాడై, పూతః=పవిత్రుడగు గాక! అని దైన్యముతో ప్రార్థించుచున్నాడు.

**తాత్పర్యము:-** దీనులయెడ ప్రేమగలవాడా! దురంతమై దుస్తరమైన ఆ పాపము నుండి నా తండ్రి పవిత్రుడగును గాక! నీ యొక్క శాంత దృష్టిచే చూడబడి పవిత్రుడగును గాక!

శ్రీ భగవానువాచ

**శ్లో॥ త్రిస్సప్తభిః పితా పూతః పితృభిస్సహ తేఽనఘ।**
**యత్సాధోఽస్య గృహే జాతో భవాన్వై కులపావనః॥ 19**

**ప్రతిపదార్థము:-** అనఘ=పాపరహితుడా!, సాధో=ఓ సాధువా!, అస్య=నీ తండ్రియొక్క గృహే=వంశమందు, కులపావనః=వంశపావనుడవైన, భవాన్=నీవు, జాతః=పుట్టినావు. అందు వలన, తే=నీ, పితా=తండ్రి, త్రిః సప్తభిః=ఇరువది తరములవారగు, పితృభిః సన్=మీ పెద్దలతో గూడ, పూతః=పవిత్రుడయ్యెను.

**తాత్పర్యము:-** ఓ పుణ్యాత్ముడా! సాధువా! నీ వంటి వంశపావనుడు, ఈతని వంశమందు జనించినందున మీ తండ్రి, ఇరువదియొక్క తరములవారగు మీ పితరులతో గూడ బవిత్రుడయ్యె.

హిరణ్యకశిపుని తండ్రి కశ్యపుడు, కశ్యపుని తండ్రి మరీచి, మరీచుని తండ్రి బ్రహ్మ అని మూల పురుషులేయుండ ఇరువదియొక్క తరమువారని చెప్పుట యెట్లనగా అది పూర్వకల్పము నందు ఏర్పడిన పెద్దలను గూర్చిన అభిప్రాయముతో జెప్పబడినదని తెలియవలెను.

**శ్లో॥ యత్ర యత్ర చ మద్భక్తాః ప్రశాన్తాస్సమదర్శినః।**
**సాధవస్సమ్మతాచారాస్తే పూయన్త్యేఽపి కీకటాః॥ 20**

**ప్రతిపదార్థము:–** యత్ర యత్ర=ఏచ్చోట, మత్+భక్తాః=నా భక్తులు, ప్రశాంతాః=శాంతచిత్తులు, జితేంద్రియాలు, సమదర్శినః=అన్నింటియందు పరమాత్మ నొక్కనినే చూచువారు, సాధవః =సాధువులు, సమ్మత+ఆచారాః=ఉత్తమమగు ఆచారము గలవారు గలరో, తే=వారు, కీకటాః అపి=మ్లేచ్ఛకిరాతాదులుండు దేశములకు వారితో బాటూ వారి వంశములను, పూయంతే= పవిత్రము చేయుదురు.

**తాత్పర్యము:–** ఎచ్చట నా భక్తులు సమవర్తనులు, సాధువులు, ఉత్తమాచార సంపన్నులుందురో వారు మ్లేచ్ఛాది కిరాతాదుల పాపపుదేశములను అట్టి వారుండు వంశములును పావనములు చేయుదురు.

**శ్లో॥ సర్వాత్మనా న హింసన్తి భూతగ్రామేషు కిఞ్చన।**
**ఉచ్చావచేషు దైత్యేన్ద్ర మద్భావేన గతస్పృహాః॥ 21**

**ప్రతిపదార్థము:–** దైత్యేంద్ర!=ఓ దైత్య ప్రభువా!, మత్+భావేన=నా యందలి భక్తిభావముచే, గతస్పృహాః=ఇతర వాంఛ లేవియును లేనివారై, నా భక్తులు, ఉచ్చావచేషు=ఏ విధమైన, భూత గ్రామేషు=ప్రాణుల సమూహములయందు, కించన=ఇంచుకయు, న హింసంతి= హింసచేయరు.

**తాత్పర్యము:–** పరిపూర్తిగా తమ భావమును నాయందుంచి, భక్తులైనవారు వాంఛలనెల్ల వీడినవారై సమస్త ప్రాణులకును ఏ మాత్రమైనదౌసగు ఆచరించి వానిని హింసింపరు.

**శ్లో॥ భవన్తి పురుషా లోకే మద్భక్తాస్త్వామనువ్రతాః।**
**భవాన్ మే ఖలు భక్తానాం సర్వేషాం ప్రతిరూపధృక్॥ 22**

**ప్రతిపదార్థము:–** లోకే=లోకమునందు, మత్+భక్తాః=నా భక్తులు, త్వాం అనువ్రతాః= నిన్ననుసరించియుండువారు, పురుషాః=పురుషులు, భవంతి=పెక్కురు గలరు, భవాన్=నీవు, మే=నాయొక్క, సర్వేషామ్=ఎల్ల, భక్తానామ్=భక్తులకు, ప్రతిరూపధృక్ ఖలు=ఉపమాన సదృశుడవు గదా! శ్రేష్ఠుడవు.

**తాత్పర్యము:–** నీ వంటివారు నా భక్తులు పురుషులు పెక్కండ్రు లోకమునందు గలరు కాని నీవు నా భక్తులందరికి సరిపోల్చదగినవాడివై శ్రేష్ఠుడవైయున్నావు.

**శ్లో॥ కురు తే ప్రేతకార్యాణి పితుః పూతస్య సర్వశః।**
**మదఙ్గస్పర్శనేనాఙ్గ లోకాన్ పశ్యన్తి సుప్రజాః॥ 23**

**ప్రతిపదార్థము:–** అంగ=ఓ ప్రహ్లాద!, మత్+అంగస్పర్శనేన=నా శరీర స్పర్శచేత, సర్వశః=అన్ని విధముల, పూతస్య=పవిత్రుడైన, తే పితుః=నీ తండ్రికి, ప్రేతకార్యాణి=పుత్రులు చేయదగు



కర్మ క్రియలను, కురు=చేయుము. సుప్రజాః=మంచి బిడ్డలు కలవారు, లోకాన్=ఉత్తమ లోకాలను, పశ్యంతి=కాంతురు.

**తాత్పర్యము:–** ఓయీ ప్రహ్లాదా! నా దేహ స్పర్శవలన పవిత్రుడైన నీ తండ్రికి పాపశంకయే లేదు. మంచి కొడుకులను గన్నవారు ఉత్తమ లోకములను గాంతురు.

**శ్లో॥ పిత్ర్యం చ స్థానమాతిష్ఠ యథోక్తం బ్రహ్మవాదిభిః।**
**మయ్యావేశ్య మనస్తాత కురు కర్మాణి మత్పరః॥ 24**

**ప్రతిపదార్థము:–** పిత్ర్యమ్=తండ్రికి సంబంధించిన, స్థానమ్=రాజ్యపీఠమును, ఆతిష్ఠ= అధిష్ఠించుము. బ్రహ్మవాదిభిః=వేదవాదులచే, యథోక్తమ్=చెప్పబడినవిధముగా, మయి=నా యందు, మనః=మనస్సును, ఆవేశ్య=ఉంచి, మత్పరః=నన్నే ప్రధానముగా గలిగిన, కర్మాణి= కర్మలు, కురు=చేయుము.

**తాత్పర్యము:–** ఓ వత్సా! మీ తండ్రి స్థానమాక్రమించి వేదవాదులు చెప్పిన భంగి నా యందు మనస్సుంచి నన్నే ప్రధానముగా గలవాడవై నా కంటె నితరము ప్రధానముగా లేనివాడవై కర్మలు చేయుము.

**నారద ఉవాచ**

**శ్లో॥ ప్రహ్లాదోఽపి తథా చక్రే పితుర్యత్సామ్పరాయికమ్।**
**యథాహ భగవాన్ రాజన్నభిషిక్తో ద్విజోత్తమైః।**
**మహాభాగవతస్సోఽథ చక్రే రాజన్వతీం భువమ్॥ 25**

**ప్రతిపదార్థము:–** రాజన్=ఓరాజా!, భగవాన్=భగవంతుడు, యథా+ఆహ=ఏ విధముగా చెప్పెనో, తథా=ఆ ప్రకారము, ప్రహ్లాదః అపి=ప్రహ్లాదుడును, పితుః=తండ్రియొక్క, యత్=ఏ, సాంపరాయి కమ్=పరలోకక్రియను, చక్రే=చేసెను, అథ=తర్వాత, ద్విజోత్తమైః=విప్రశ్రేష్ఠులచే, అభిషిక్తః= రాజ్యమునందు, అభిషేకింపబడినవాడై, సః=అ,మహాభాగవతః=గొప్ప భగవద్భక్తుడు, రాజన్వతీమ్ =మంచి రాజు గలవానినిగా, భువమ్=భూమిని, చక్రే=చేసెను.

**తాత్పర్యము:–** భగవంతుడానతిచ్చిన ప్రకారము ప్రహ్లాదుడు తండ్రికిఁ బరలోక క్రియలు చేసెను. అంత విప్రశ్రేష్ఠులచే రాజ్యము నందభిషిక్తుడై ఆ భగవద్భక్త శ్రేష్ఠుడు భూమిని మంచిరాజును గల దానినిగా చేసెను.

**శ్లో॥ ప్రసాదసుముఖం దృష్ట్వా బ్రహ్మా నరహరిం హరిమ్।**
**స్తుత్వా వాగ్భిః పవిత్రాభిః ప్రాహ దేవాదిభిర్వృతః॥ 26**

**ప్రతిపదార్థము:–** ప్రసాదసుముఖమ్=కోపము శాంతించి ప్రసన్నుడై, సుముఖుడై, నరహరిమ్= నరసింహుడైన, హరిమ్=విష్ణువును, దృష్ట్వా=చూచి, బ్రహ్మా=బ్రహ్మ, దేవాదిభిః వృతః=దేవతలు లోనగు వారితో గూడి, పవిత్రాభిః=పవిత్రములైన, వాగ్భిః=వాక్కులతో, స్తుత్వా=స్తుతించి, ప్రాహ= ఇట్లనెను.

**తాత్పర్యము:–** ప్రసన్నుడై సుముఖుడైన హరిని నరసింహమూర్తిని జూచి బ్రహ్మ దేవతలతో కూడుకొన్నవాడై పవిత్ర వాక్కులచే స్తుతిచేసి యిట్లు వచించెను.

పురుగునే ధ్యానించునట్లె, తత్+ఆత్మానః=ఆ కృష్ణ స్వరూపుపై, తే అపి=ఆ రాజులును, జహుః =తమ దేహములను వీడిరి.

**తాత్పర్యము:–** పూర్వజన్మ కృతము పాపమేది గలదో ఆ పాపముననే కృష్ణునకు వైరులై జనించి రాజులు, భ్రమరము గూటిలోనుంచిన పురుగును భ్రమరమునే ధ్యానించునట్లు శ్రీకృష్ణ స్వరూపులై దేహమును వీడిరి.

**శ్లో॥ యథా యథా భాగవతో భక్త్యా పరమయాభిదా।**
**నృపాశ్చైద్యాదయః సాత్మ్యం హరేస్తచ్చిన్తయా యయుః॥ 42**

**ప్రతిపదార్థము:–** భగవతః=భక్తులు, అభిదా=భేదదృష్టిచే, పరమయా భక్త్యా=ఏకాంత భక్తిచేత, యథా యథా=ఏయే ప్రకారములగుదురో అట్లే, చైద్యాదయః=శిశుపాలుడు లోనగు, నృపాః= రాజులు, తత్+అంతయా=శ్రీకృష్ణుని నిరంతరము చింతించుటచే, హరేః=శ్రీకృష్ణునియొక్క, సాత్మ్యమ్=సాయుజ్యమును, యయుః=పొందిరి.

**తాత్పర్యము:–** భేదదృష్టిలేక సర్వజగము భగవత్స్వరూపమను భావముగల ఏకాంత భక్తిచే భక్తులనవలెను. శిశుపాలుడు లోనగురాజులు వైరభావమున శ్రీకృష్ణుని చింతించుటచే కడపట శ్రీకృష్ణుని సాయుజ్యమును పొందిరి.

**శ్లో॥ ఆఖ్యాతం సర్వమేతత్తే యన్మాం త్వం పరిపృష్టవాన్।**
**దమఘోషసుతాదీనాం హరేః సామ్యమపి ద్విషామ్॥ 43**

**ప్రతిపదార్థము:–** యత్=దేని గూర్చి, త్వమ్=నీవు, మామ్=నన్ను, పృష్టవాన్ =ప్రశ్నించితివో, ఏతత్=ఈ సర్వం, సమస్తమును, ద్విషామ్=హరికి శత్రువులైన, దమఘోషసుతా దీనామ్= దమఘోషుని పుత్రుడైన శిశుపాలుడు లోనగువాని యొక్క, హరేః సామ్యం అపి=హరి సారూప్యమునుఁబొందుటను గూడ, అఖ్యాతమ్=చెప్పబడినది. (నృపా=ఓ ధర్మరాజా!)

**తాత్పర్యము:–** (ఓ ధర్మరాజా!) నీవు నన్నడిగిన ప్రకారము ప్రహ్లాదుని చరిత్రము అంతయును శత్రువులైన శిశుపాలాదులు శ్రీహరి సారూప్యమును బొందుటనుఁ గూడ నీకు జెప్పితిని.

**శ్లో॥ ఏషా బ్రహ్మణ్యదేవస్య కృష్ణస్య చ మహాత్మనః।**
**అవతారకథాః పుణ్యా వధో యత్రాదిదైత్యయోః॥ 44**

**ప్రతిపదార్థము:–** బ్రహ్మణ్యదేవస్య=వేదవేద్యుడైన, మహాత్మనః=మహాత్ముడైన, కృష్ణస్య చ=కృష్ణుని యొక్క, అవతారకథాః=ఈ నృసింహ అవతార కథలు, పుణ్యాః=పవిత్రములైనవి, యత్ర=ఏ కథలందు, ఆదిదైత్యయోః=తొల్లింటి దైత్యుల యొక్క, వధః=వధము చెప్పబడినది. ప్రహ్లాద చరిత్రమును నాలుగు శ్లోకములలో నుపసంహరించుచున్నాడు.

**తాత్పర్యము:–** తొల్లింటి దైత్యులగు హిరణ్యకశిపులోనగు దైత్యుల కథలు వేనియందు చెప్పబడి యున్నవో వేదవేద్యుడై మహాత్ముడైన ఆ కృష్ణభగవానుని నృసింహ అవతార కథలు మిగుల పుణ్యములైనవి.



**తాత్పర్యము:–** ఓ భగవానుడా! నీ ఈ నరసింహ స్వరూపమున నియతచిత్తుడై ధ్యానించువానికి ప్రాణులన్నింటిని జంపుచు నెల్ల విధముల భయము గలిగించు మృత్యువు వలనను నీ రూపము రక్షకమగుచున్నది.

**శ్లో॥ అహో! అయం సుహృద్ధన్యస్తేన లబ్ధోఽ మునాలయః**
**సర్వవేదమయే సాక్షాత్ సర్వ యజ్ఞతపోమయే।**
**నిత్య తీర్థమయోత్సంగే స్నాతోఽగ్నావివ కాఞ్చనమ్॥ 31**

**ప్రతిపదార్థము:–** అహో=ఔరా, అయమ్=ఈ అసురుడు, సుహృత్=మంచివాడు, ధన్యః=ధన్యుడు, సర్వవేదమయే=ఎల్లవేదముల స్వరూపమైనవాడవైన, సాక్షాత్=ప్రత్యముగా, సర్వయజ్ఞ తపస్+ మయే=ఎల్లయజ్ఞముల, యుతపములయు స్వరూపుడవైన, సర్వతీర్థమయ+ఉత్సంగే=ఎల్లపుణ్య తీర్థముల స్వరూపముగాల నీయొక్క ఒడియందు, అగ్నౌ=అగ్నియందు, కాఞ్చనమివ=స్వర్ణము వలె, అమునా=ఈ నీచే, లయః=చంపబడినాడు, స్నాతః=పవిత్రుడయ్యెను.

**తాత్పర్యము:–** ఈ అసురుడు హిరణ్యకశిపుడు ఎంత సజ్జనుడు, ఎంత ధన్యుడు. సర్వవేద స్వరూపుడు, సర్వయజ్ఞమూర్తియు, తపోమూర్తియు, సర్వపుణ్యతీర్థస్వరూపుడగు నీ ఒడియందు నీచే లయమొంది అగ్నియందు స్వర్ణమువలె పవిత్రుడయ్యెను.

**శ్రీ భగవానువాచ**

**శ్లో॥ మైవం సురాసురాణాం తే ప్రదేయః పద్మసమ్భవ।**
**వరః క్రూరనిసర్గాణామహీనామమృతం యథా॥ 32**

**ప్రతిపదార్థము:–** పద్మసంభవ!=ఓ కమలమునందు జనించినవాడా!, సుర+అసురాణామ్= దేవతలకును, అసురులకును, ఏవమ్=ఈ హిరణ్యకశిపునకు వలె, తే=నీచే, వరః=వరము, క్రూరనిసర్గాణామ్=క్రూరస్వభావముగల, అహీనామ్=సర్పములకు, అమృతం యథా= అమృతము వలె, వరః=వరము, మాప్రదేయః=ఈయదగినది కాదు.

**తాత్పర్యము:–** ఓ కమల సంభవా! ఈ హిరణ్యకశిపునకు వరములిచ్చినట్లు ఇక సురలకు, అసురులకును క్రూర స్వభావముగల సర్పములకు అమృతమువలె పరమీయదగదు సుమా!

**నారద ఉవాచ**

**శ్లో॥ ఇత్యుక్త్వా భగవాన్ రాజంస్తతశ్చాన్తర్దధే హరిః।**
**అదృశ్యస్సర్వభూతానాం పూజితః పరమేష్ఠినా॥ 33**

**ప్రతిపదార్థము:–** రాజన్=ఓ రాజా!, భగవాన్=భగవంతుడు, ఇతి+ఉక్త్వా=ఇట్లు చెప్పి, తతః =అంత, సర్వభూతానామ్=ఎల్లప్రాణులకు, అదృశ్యః=కనుపడనివాడు, హరిః=విష్ణువు, పరమేష్ఠినా =బ్రహ్మచేత, పూజితః=పూజింపబడినవాడై, అంతర్దధే=అంతర్ధానమయ్యెను.

**తాత్పర్యము:–** ఇట్లని భగవంతుడు ఎల్లభూతములకు కనుపడనివాడైన ఆ విష్ణువు బ్రహ్మచేత పూజింపబడినవాడై అంతర్ధానమయ్యెను.

శ్లో॥ తతస్సమ్పూజ్య శిరసా వవన్దే పరమేష్ఠినమ్।
భవం ప్రజాపతిం దేవాన్ ప్రహ్లాదో భగవత్కలాః॥ 34

**ప్రతిపదార్థము:–** తతః=అంత, ప్రహ్లాదః=ప్రహ్లాదుడు, గిరిశమ్=కైలాసపతియైన, భవమ్=పరమ శివుని, పరమేష్ఠినమ్=అన్నిలోకముల కంటె పైలోకమునందున్న, ప్రజాపతిమ్=బ్రహ్మను, భగవత్కలాః=భగవదంశములైన, దేవాన్=ఇంద్రాదిదేవతలను, సంపూజ్య=పూజించి, వందే= నమస్కరించెను.

**తాత్పర్యము:–** అంత ప్రహ్లాదుడు గిరీశుడైన శివుని, పరమేష్ఠియైన బ్రహ్మను, భగవత్కళలైన ఇంద్రాది దేవతలను పూజించి నమస్కరించెను.

శ్లో॥ తతః కావ్యాదిభిస్సార్థం మునిభిః కమలాసనః।
దైత్యానాం దానవానాం చ ప్రహ్లాదమకరోత్పతిమ్॥ 35

**ప్రతిపదార్థము:–** తతః=అంత, కమలాసనః=తామర పీఠముగా గల బ్రహ్మ, కావ్యాదిభిః=శుక్రుడు లోనగు, మునిభిఃసార్థమ్=మునులతో గూడి, దైత్యానాం దానవానామ్=దైత్యులకు, దానవులకు, ప్రహ్లాదమ్=ప్రహ్లాదుని, పతిమ్=ప్రభువును, అకరోత్=చేసెను.

**తాత్పర్యము:–** అంత కమలాసనుడు బ్రహ్మ శుక్రాచార్యులు లోనగు మునులతో కూడి దైత్యులకు, దానవులకు ప్రహ్లాదుని ప్రభువుగా జేసెను.

శ్లో॥ ప్రతినన్ద్య తతో దేవాః ప్రయుజ్య పరమాశిషః।
స్వధామాని యయూ రాజన్ బ్రహ్మాద్యాః ప్రతిపూజితాః॥ 36

**ప్రతిపదార్థము:–** రాజన్=ఓ రాజా!, తతః=తర్వాత, బ్రహ్మ+ఆద్యాః=బ్రహ్మలోనగు, దేవాః =దేవతలు, ప్రతినంద్య=ప్రహ్లాదు నభినందించి, పరమాశిషః=మేలైన వాంఛలను, ప్రయుజ్య= అతనికి చేకూర్చి, పరిపూజితాః=ప్రహ్లాదునిచే పూజింపబడినవారై, స్వధామాని=తమ స్థానము లను గూర్చి, యయుః=వెళ్ళిరి.

**తాత్పర్యము:–** అంత బ్రహ్మాదిదేవతలు ప్రహ్లాదునికి ఉత్తమములైన వాంఛలనొసగి ప్రహ్లాదునిచేఁ బూజింపబడినవారై తమతమ స్థానములకేగిరి.

శ్లో॥ ఏవం తౌ పార్షదౌ విష్ణోః పుత్రత్వం ప్రాపితౌ దితేః।
హృది స్థితేన హరిణా వైరభావేన తౌ హతౌ॥ 37

**ప్రతిపదార్థము:–** ఏవమ్=ఈ ప్రకారము, విష్ణోః=విష్ణువుయొక్క పార్షదౌ=పరిషత్తు సభ్యులైన, తౌ=ఆజయవిజయులు ఇద్దరు, దితేః=దితిదేవికి, పుత్రత్వమ్=పుత్రభావమును, ప్రాపితే=పొందిన వారై, హృది=తమ హృదయమందు, స్థితేన=ఉన్నట్టి, హరిణా=విష్ణువుచే, వైరభావేన=పగగల భావముచే, తౌ=ఆ హిరణ్యాక్ష హిరణ్యకశిపు రిరువురు, హతౌ=చంపబడిరి.

**తాత్పర్యము:–** శిశుపాలదంతవక్త్రులు ద్వేషించువారికి శ్రీకృష్ణసాయుజ్యమెట్లు కలిగినది. అని వారికి పూర్వజన్మ వృత్తము వచించుట ద్వారా దాని నుపదేశించును. ఇట్లు విష్ణువుయొక్క పార్షదులగు జయవిజయులను నిరువురు సనకాదుల శాపమున దితికిఁబుత్రులై జన్మించి హరిని విద్వేషించి తమ హృదయమందున్న హరిచేతనే వధింపబడిరి.



శ్లో॥ పునస్తౌ విప్రశాపేన రాక్షసౌ ద్వౌ బభూవతుః।
కుమ్భకర్ణదశగ్రీవౌ హతౌ తౌ రామవిక్రమైః॥ 38

**ప్రతిపదార్థము:–** పునః తౌ=మరల ఆ యిరువురు, విప్రశాపేన=విప్రులను సనకాదుల శాపము చేతనే, కుంభకర్ణదశగ్రీవౌ=కుంభకర్ణుడు, దశకంఠుడు అను, ద్వౌ=ఇద్దరు, రాక్షసౌ=రాక్షసులుగా, బభూవతుః=అయిరి, తౌ=ఆ యిద్దరు, రామవిక్రమైః=దశరథరాముని పరాక్రమములచే, హతౌ= చంపబడిరి.

**తాత్పర్యము:–** వారు మరల ఆ విప్రశాపముచేతనే రావణ కుంభకర్ణులను రాక్షసులుగా జనించి శూరుడైన శ్రీరామునిచేఁ జంపఁబడిరి.

శ్లో॥ శయానౌ యుధి నిర్భిన్నహృదయౌ రామసాయకైః।
తచ్చిత్తౌ జహతుర్దేహం యథా ప్రాక్తనజన్మని॥ 39

**ప్రతిపదార్థము:–** రామసాయకైః=శ్రీరాముని బాణములచే, నిర్భిన్నహృదయౌ=పగిలిన గుండెలు గలవారై, యుధి=యుద్ధరంగమున, శయానౌ=పరుండినవారై, తత్+చిత్తౌ=ఆ రామునందు మనస్సుగలవారై, ప్రాక్తన జన్మని=పూర్వజన్మ సంస్కారమును, దేహమ్=దేహమును, జహతుః =పొందిరి.

**తాత్పర్యము:–** ఆ రావణ కుంభకర్ణులు శ్రీరామబాణములచే గుండెలు పగిలినవారై యుద్ధ రంగమునందు పరుండిన వారై చిత్తమందు పూర్వజన్మమునందు వలె తమ దేహమును పొందిరి.

శ్లో॥ తావిహాపి పునర్జాతౌ శిశుపాలకరూషజౌ।
హరౌ వైరానుబన్ధేన పశ్యతస్తే సమీయతుః॥ 40

**ప్రతిపదార్థము:–** తౌ=ఆ రావణ కుంభకర్ణులు, ఇహ+అపి=ఈ భూలోకములో, పునః=మరల, శిశుపాలకరూషజౌ=శిశుపాలుడు, కరుషాదేశపురాజు కొడుకు దంతవక్త్రుడు అనుపేర్లు కలిగి, జాతౌ=పుట్టిరి, వైరానుబంధేన=పగసాధించుట ద్వారా, తే పశ్యతః=నీవు చూచుచుండ, హరౌ= శ్రీకృష్ణునందు, సమీయతుః=సాయుజ్యమును పొందిరి.

**తాత్పర్యము:–** ఆ రావణ కుంభకర్ణులే మూడవ జన్మమునందు ఈ భూలోకమున శిశుపాల దంతవక్త్రులై జనించి విష్ణుద్వేషమున శ్రీకృష్ణునందు నీవు చూచుచుండ లీనమైపోయిరి.

శ్లో॥ ఏనః పూర్వకృతం యత్తద్రాజానః కృష్ణవైరిణః।
జహుస్తేఽపి తదాత్మానః కీటః పేశస్కృతో యథా॥ 41

**ప్రతిపదార్థము:–** పూర్వకృతమ్=పూర్వజన్మమునందు జేయబడిన, యత్=ఏ, ఏనః=పాపము గలదో, తత్+ఆత్మానః=అట్ట ధ్యానముచేతనే, రాజానః=రాజులు, కృష్ణవైరిణః=శ్రీకృష్ణునికి విరోధులైన, తేఽపి=వారును, పేశః కృతః=తుమ్మెద గూటిలోనుంచబడిన, కీటః యథా=ఆ

**ప్రతిపదార్థము:–** యేన=ఏ శ్రీకృష్ణునిచే, ఉపబృంహితైః=వర్ధిల్లజేయబడిన, దేవైః=దేవతలచేత, యుద్ధే=యుద్ధమున, అసురాః=అసురులు, నిర్జితాః=జయింపరోవారు, మాయినామ్=మాయావంతులకు, పరమాచార్యమ్=మూలగురుడైన, మయమ్=మయుని, శరణమాయయుః=శరణుపొందిరి.

**తాత్పర్యము:–** పూర్వము విష్ణువుచే సంవర్ధితులైన దేవతలచే అసురులోడి పోయి మాయావులకు ఆచార్యుడైన మయుని శరణుపొందిరి.

**శ్లో॥ స నిర్మాయ పురస్తిస్రో హైమరౌప్యాయసీః ప్రభుః।**
**దుర్లక్ష్యాపాయసంయోగా దుర్లక్ష్యైరుపరిచ్ఛదాః॥ 56**

**ప్రతిపదార్థము:–** సః=ఆ మయుడు, ప్రభుః=సమర్థుడు, దుర్లక్ష్య+అపాయసంయోగాః=గుర్తింప సాధ్యము గాని గమనాగమనముల గలవియు, దుర్లక్ష్య+ఉరుపరిచ్ఛదాః=లక్షింపసాధ్యము గాని గొప్పపరికరములు గలవియు, హేమరౌప్య+అయసీః=స్వర్ణము, రజతము, ఉక్కు అను లోహములచే నిర్మితమయిన, తిస్రః పురః=మూడు పురములు, నిర్మాయ=నిర్మించెను, నిర్మించి ఆ దైత్యులకొసగెను.

**తాత్పర్యము:–** శిల్పులలో సమర్థుడైన ఆ మయుడు శత్రువులు లక్షించి గమనాగమనముల గలవియు, సాధ్యముగానివియు, లక్షించుటకు సాధ్యముగాని పరికరములు గలవియు, బంగారము, వెండి, ఉక్కులను లోహమయములైన పురములను మూడు నిర్మించి దైత్యుల కొసంగెను.

**శ్లో॥ తాభిస్తేఽ సురసేనాన్యో లోకాంస్త్రీన్ సేశ్వరాన్నృప।**
**స్మరన్తో నాశయాఞ్చక్రుః పూర్వవైరమలక్షితాః॥ 57**

**ప్రతిపదార్థము:–** నృప!=ఓ రాజా!, తే=ఆ, అసురసేనాన్యః=అసురసేనాపతులు, తాభిః=ఆ మూడు పురములచే, ఈశ్వరాః=ప్రభులై, అలక్షితాః=దేవతలకు గుర్తింపరానివారై, పూర్వవైరమ్=సురలతోడి తొంటిపగను, స్మరంతః=స్మరించుచు, త్రీన్‌లోకాన్=మూడు లోకములను, నాశయాం చక్రుః=నాశనము చేసిరి.

**తాత్పర్యము:–** ఆ పురముల మూడు గ్రహించి ఆ యసుర సేనాపతులు ప్రభువులై దేవతలకు లక్షింప సాధ్యముగాని వారై దేవతలతోడి పూర్వవైరమును స్మరించుచు ముల్లోకముల కుపద్రవమును గావించిరి.

**శ్లో॥ తతస్తే సేశ్వరా లోకా ఉపాసాద్యోచిరే విభుమ్।**
**త్రాహి నస్తావకాన్ దేవ వినష్టాంస్త్రిపురాలయైః॥ 58**

**ప్రతిపదార్థము:–** తతః=అంత, స+ఈశ్వరాః=లోకపాలురతో గూడిన, తే=ఆ, లోకాః= లోకములు, సురలు, విభుమ్=శివుని, ఉపాసాద్య=సమీపించి, ఊచిరే=ఇట్లు వచించిరి, దేవ!=ఓ దేవా!, త్రిపురాలయైః=మూడు పురములు నివాసముగా గల అసురులచే, వినష్టాః=బాధకు లోనైన, తావకాన్ చ=నీవారైన, నః=మమ్ములను, త్రాహి=రక్షింపుము.



**శ్లో॥ ప్రహ్లాదస్యానుచరితం మహాభాగవతస్య చ।**
**భక్తిర్జ్ఞానం విరక్తిశ్చ యాథాత్మ్యం చాస్య వై హరేః॥ 45**

**ప్రతిపదార్థము:–** మహాభాగవతస్య=దొడ్డభగవద్భక్తుడైన, ప్రహ్లాదస్య=ప్రహ్లాదునియొక్క, అనుచరితమ్=ఆ చరిత్రము, భక్తిః జ్ఞానం విరక్తిః=ఆతని భక్తి, జ్ఞానము, వైరాగ్యమును, అస్య=ఈ, హరేః= విష్ణువుయొక్క, యాథాత్మ్యమ్=సత్యస్వరూపమును చెప్పును.

**తాత్పర్యము:–** దొడ్డ భగవద్భక్తుడైన ప్రహ్లాదుని చరిత్రము అతని భక్తి, జ్ఞానము, విరక్తి ఈ శ్రీహరి యొక్క సత్యస్వరూపమును గూర్చి చెప్పుము.

**శ్లో॥ సర్గస్థిత్యప్యయేశస్య గుణకర్మానువర్ణనమ్।**
**పరావరేషాం స్థానానాం కాలేన వ్యత్యయో మహాన్॥ 46**

**ప్రతిపదార్థము:–** సర్గస్థితి+అప్యయ+ఈశస్య=సృష్టి స్థితిలయములకు ప్రభువైన హరియొక్క గుణకర్మ+అనువర్ణనమ్=గుణములయు కృత్యములయు వర్ణనమును, పర+అపరేషామ్= ఉత్తములు, అధములైన, దేవతలయు, దైత్యుల సంబంధివై, స్థానానామ్=స్థానములయొక్క మహాన్=గొప్పదైన, వ్యత్యయః=భేదమును సంపూర్ణముగా చెప్పెను.

**తాత్పర్యము:–** జగము సృష్టి స్థితి లయములకు ఈశుడై హరియొక్క గుణకర్మల వర్ణనము దేవదైత్యుల స్థానముల భేదమును సంపూర్ణముగా జెప్పెను.

**శ్లో॥ ధర్మో భాగవతానాం చ భగవాన్ యేన గమ్యతే।**
**ఆఖ్యానేఽస్మిన్ సమాఖ్యాతమాధ్యాత్మికమశేషతః॥ 47**

**ప్రతిపదార్థము:–**యేన=దేనిచే,భగవాన్=భగవంతుడు,గమ్యతే=తెలియబడునో, భాగవతానామ్=అట్టి భగవద్భక్తులయొక్క, ధర్మః చ=ధర్మమును, ఆధ్యాత్మికమ్=ఆత్మానాత్మ వివేకాదికమును, అస్మిన్=ఈ, ఆఖ్యానే=ప్రహ్లాదచరిత్రమందు, అశేషతః=సంపూర్ణముగా, సమాఖ్యాతమ్=చక్కగాఁ జెప్పబడినది.

**తాత్పర్యము:–** దేనిచే భగవంతుడుఁదెలియబడునో ఆ భాగవతుల ధర్మమును ఆత్మానాత్మ వివేకాదికమంతయు పూర్తిగా ఈ ప్రహ్లాద చరిత్రమందు చెప్పబడినది.

**శ్లో॥ య ఏతత్పుణ్యమాఖ్యానం విష్ణోర్వీర్యోపబృంహితమ్।**
**కీర్తయేచ్ఛ్రద్ధయా శ్రుత్వా కర్మపాశైర్విముచ్యతే॥ 48**

**ప్రతిపదార్థము:–** యః=ఎవడు, విష్ణోః=విష్ణువు యొక్క, వీర్య+ఉపబృంహితమ్=ప్రభావమును విస్తరింపజేయబడిన, పుణ్యమ్=పవిత్రమైన, ఆఖ్యానమ్=చరిత్రము, శ్రుత్వా=విని, శ్రద్ధయా= శ్రద్ధతో, కీర్తయేత్=కీర్తించునోవాడు, కర్మపాశైః=కర్మపాశముచే, విముచ్యతే=విడువబడును.

**తాత్పర్యము:–** మహావిష్ణువు ప్రభావమును విస్తరించినదై ఈ ప్రహ్లాదుని చరిత్రమును ఎవడు శ్రద్ధతో విని కీర్తించుచున్నాడో వాడు కర్మబంధముల నుండి విముక్తుడగును.

**శ్లో॥ ఏతద్య ఆదిపురుషస్య మృగేన్ద్రలీలాం**
**దైత్యేన్ద్రయూథపవధం ప్రయతః పఠేత।**

**దైత్యాత్మజస్య చ సతాం ప్రవరస్య పుణ్యం**
**శ్రుత్వానుభావమకుతోభయమేతి లోకమ్॥ 49**

**ప్రతిపదార్థము:-** యః=ఎవడు, ఆదిపురుషస్య=ఆదిపురుషుడైన హరియొక్క, మృగేంద్రలీలామ్=నరసింహాకృతిని గావించిన చేష్టను, దైత్య+ఇంద్రయూథపవధమ్=దైత్యప్రభుడను (హిరణ్యకశిపుడు) గజనాథుని వధమును, సతాం ప్రవరస్య=సజ్జనులలో శ్రేష్ఠుడైన, దైత్య+ఆత్మజస్య=దైత్య కుమారుడైన ప్రహ్లాదుని యొక్క, పుణ్యమ్=పవిత్రమైన, అనుభావమ్=ప్రభావము లేక మతి నిశ్చయము, ప్రయతః=నియతుడై, శుచియై, పఠేత=పఠించుచున్నాడో అతడు, అకుతోభయమ్=దేనివలనను భయము లేని, లోకమ్=వైకుంఠలోకమును, ఏతి=పొందుచున్నాడు.

**తాత్పర్యము:-** పురాణ పురుషుడైన మహావిష్ణువు నృసింహరూపమున గావించి చేష్టను దైత్య ప్రభుడగు హిరణ్యకశిపుడను గజనాథుని వధమును సాధువులందు శ్రేష్ఠుడై ప్రహ్లాదకుమారుని పవిత్రమైన ప్రభావమును ఎవడు శుచియై నియతుడై పఠించుచున్నాడో అతడెట్టి యుపద్రవములు, దేనివలనను లేనట్టి వైకుంఠలోకమును బొందుచున్నాడు.

**శ్లో॥ యూయం నృలోకే బత భూరిభాగా లోకం పునానామ్మునయోఽభియాన్తి।**
**యేషాం గృహానావసతీతి సాక్షాత్ గూఢం పరం బ్రహ్మ మనుష్యలిఙ్గమ్॥ 50**

**ప్రతిపదార్థము:-** యూయమ్=మీరు (పాండవులు), నృలోకే=నరలోకమందు, బత=అహో!, భూరిభాగాః=ఎంత మహానుభావులు, సాక్షాత్=ప్రత్యక్షముగా ఎవరి గృహములందు, మనుష్య లింగమ్=నరాకారమైన, గూఢమ్=తెలియరానిదై, పరం బ్రహ్మ=శ్రీ కృష్ణాఖ్యమను పర బ్రహ్మము, ఆవసతి=ఏమీ యిండ్లయందున్నదని, లోకమ్=జగమును, పునానామ్= పవిత్రము చేయుచున్న వారై, మునయః=మునులు, యేషామ్=ఏ మీ యొక్క, గృహాన్=గృహములను గూర్చి, అభియాంతి =వచ్చుచుందురు.

**తాత్పర్యము:-** ఓ ధర్మరాజా! మీరెంత మహానుభావులు సుమా! మీ గృహములందు మనుష్యాకార మైన నిగూఢమైన శ్రీకృష్ణాఖ్యమను పరబ్రహ్మమున్నదని లోకమును పావనము జేయు మునులెల్లరు మీ గృహములకు వచ్చుచున్నారు.

**శ్లో॥ స వా అయం బ్రహ్మ మహద్విమృగ్యం కైవల్యనిర్వాణసుఖానుభూతిః।**
**ప్రియః సుహృద్వః ఖలు మాతులేయ ఆత్మాహరిర్యో విధికృద్గురుశ్చ॥ 51**

**ప్రతిపదార్థము:-** యః=ఎవడు, ఆత్మా=ఆత్మయై, హరిః=విష్ణువు గలడో, సః అయం హి=ఆ యీ శ్రీకృష్ణుడే, మహత్+విమృగ్యమ్=దొడ్డవారిచే వెదుకదగిన, బ్రహ్మ=బ్రహ్మమైయు, కైవల్య నిర్వాణసుఖ+అనుభూతిః=నిరుపాధికమైన పరమానందము యొక్క అనుభవరూపుడై, వః=మీకు, ప్రియః=ఇష్టుడు, సుహృత్=మేలుగోరువాడు, మాతులేయః=మేనమామ కొడుకు, విధికృత్=మీ ఆజ్ఞానువర్తియై, గురుశ్చ=ఉపదేశకుడైయున్నాడు.

**తాత్పర్యము:-** పరమాత్మయగు ఏ విష్ణువు గలడో ఆయీ శ్రీ కృష్ణుడే మహాత్ములు వెదుకం దగిన బ్రహ్మము అతడే. నిరుపాధికమైన పరమానందానుభవరూపుడునై మీకుం బ్రియుడై, సుహృత్తై, మేనమామ కొడుకై మీ ఆజ్ఞానువర్తియై మీకు ఉపదేశగురువైయున్నాడు.



**శ్లో॥ న యస్య సాక్షాద్భవపద్మజాదిభీ రూపం ధియా వస్తుతయోపవర్ణితమ్।**
**మౌనేన భక్త్యోపశమేన పూజితః ప్రసీదతామేష స సాత్త్వతాం పతిః॥ 52**

**ప్రతిపదార్థము:-** యస్య=ఎవనియొక్క, రూపమ్=సత్స్వరూపము, భవపద్మజ+ఆదిభిః=శివుడు, బ్రహ్మలోనగువారిచే, ధియా=బుద్ధిచే, వస్తుతయా=ఇది ఇట్టిదని, సాక్షాత్=ప్రత్యక్షము, న+ఉప వర్ణితామ్=వర్ణింపబడలేదో, సః=అతడు, సాత్త్వతాం పతిః=విష్ణుభక్తుల ప్రభువు, మౌనేన=మౌనము చేతను, భక్త్యా=భక్తిచేతను, ఉపగమేన=శాంతిచే, పూజితః=పూజింపబడినవాడై, ఏషః=ఇతడు, ప్రసీదతామ్=మాకు ప్రసన్నుడగుగాక!

**తాత్పర్యము:-** ఎవని రూపమును బ్రహ్మ, శివుడులోనగువారు తమబుద్ధితో ఇది ఇట్టిదని వాస్తవముగా వర్ణింపలేకపోయారో ఆ భగవంతుడు మీకు తానై ప్రసన్నుడైయున్నాడో, మా కన్ననో మౌనముచే, భక్తిచే, శాంతిచే పూజింపబడి ప్రార్థింపదగినవాడగుచు ఈ విష్ణుభక్తుల ప్రభువు మాకు ప్రసన్నుడగు గాక! ఆ సాత్త్వతుల ప్రభువు ప్రహ్లాదుని గృహమందు పరబ్రహ్మము వసింపలేదు. ఆ పరబ్రహ్మ దర్శనార్థమై ఆ ప్రహ్లాదు నింటికి వచ్చుటలేదు. ఆతడు ప్రహ్లాదునికి మేనమామ కొడుకై వర్తింపలేదు. ఆ బ్రహ్మము స్వయముగా నెవ్వరికినీ ప్రసన్నముగాలేదు. అందువలన మీరే ఆ ప్రహ్లాదుని కంటెను మా కంటెను మహాభాగులైయున్నారని భావము.

నారద ఉవాచ

**శ్లో॥ స ఏష భగవాన్ రాజన్ వ్యతనోద్విహతం యశః।**
**పురా భవస్య దేవస్య మయేనానన్తమాయినా॥ 53**

**ప్రతిపదార్థము:-** రాజన్=ఓ రాజా!, సః ఏషః=ఆయీ, భగవాన్=విష్ణుభగవానుడయి, పురా=పూర్వము, అమితమాయినా=దొడ్డమాయావియై, మయేన=మయుడను దానవుచేనైన, దేవస్య=దేవుడైన, భవస్య=శివుని మాయచే నితడు, విస్తరించిన, యశః=కీర్తిని, వ్యతనోత్=వ్యాపింపజేసెను.

**తాత్పర్యము:-** ఈ విష్ణుభగవానుడే పూర్వము మయుడు అను దానవుడు దేవుడైన శివునిచే గావించిన మాయను హతమార్చి ఆ దేవునికి విస్తృతమైన యశమును వ్యాపింపజేసెను.

రాజోవాచ

**శ్లో॥ కస్మిన్ కర్మణి దేవస్య మయోఽహన్ జగదీశితుః।**
**యథా చోపచితా కీర్తిః కృష్ణేన మమ కథ్యతామ్॥ 54**

**ప్రతిపదార్థము:-** జగత్+ఈశితుః=జగత్ప్రభువైన, దేవస్య=శివునియొక్క, కస్మిన్ కర్మణి=ఏ కర్మమందు, మయః=మయుడు, అహన్=చంపబడి, కృష్ణేన=ఈ విష్ణువుచే, కీర్తిః=యశము, యథా+ఉపచితా=ఏప్రకారము పెంపొందింపబడెనో, మమ=నాకు, కథ్యతామ్=చెప్పబడుగాక!

**తాత్పర్యము:-** జగమునకు ప్రభువైన శివదేవునియొక్క ఏ కర్మమందు కృష్ణునిచే మయుడు చంపబడి ఆ శివుని కీర్తి యెట్లు పెంపొందింపబడెనో నాకు చెప్పుము.

నారద ఉవాచ

**శ్లో॥ నిర్జితా అసురా దేవైర్యుద్ధే యేనోపబృంహితైః।**
**మాయినాం పరమాచార్యం మయం శరణమాయయుః॥ 55**

**శ్లో॥ ఏవం దగ్ధ్వా పురస్తిస్రో భగవాన్ పురహా నృప।**
**బ్రహ్మాదిభిః స్తూయమానః స్వధామ ప్రత్యపద్యత॥ 70**

**ప్రతిపదార్థము:–** నృప=ఓ రాజా!, తిస్రః పురః=మూడుపురములు, ఏవమ్=ఇట్లు, దగ్ధ్వా=దహించి, భగవాన్=భగవంతుడు, పురహా=పురశాసనుడు, శివుడు, బ్రహ్మాదిభిః=బ్రహ్మలోనగువారిచే, స్తూయమానః=పొగడబడుచు, స్వధామ=తన స్థానమును, ప్రత్యపద్యత=పొందెను.

**తాత్పర్యము:–** ఇట్లు పురత్రయమును దగ్ధముగావించి పురశాసనుడు శివుడు, బ్రహ్మాది దేవతలు తన్ను స్తుతించుచుండ తన స్థానమును చేరెను.

**శ్లో॥ ఏవం విధాన్యస్య హరేః స్వమాయయా విడమ్బమానస్య నృలోకమాత్మనః।**
**వీర్యాణి గీతాన్యృషిభిర్జగద్గురోర్లోకాన్ పునానాన్యపరం వదామి కిమ్॥ 71**

**ప్రతిపదార్థము:–** స్వమాయయా=తనమాయచే, నృలోకమ్=నరలోకమును, ఆత్మనః=తన యొక్క, విడంబమానస్య=అనుకరించుచున్న, హరేః=విష్ణువుయొక్క, వీర్యాణి=ప్రభావములు, ఏవమ్ విధాని=ఇటువంటి, జగద్గురోః=లోకగురువైయు, ఋషిభిః=ఋషులచే, గీతాని=పేర్కొనబడినవి, లోకాన్=జగములను, పునానామ్=పవిత్రముచేయుచున్నవి, అపరమ్=ఇతరమును, కిం వదామి= ఏమి చెప్పుదును.

**తాత్పర్యము:–** తన మాయచే మానవాకారమును పొంది మానవుని వలె నటించుచున్న జగద్గురుడైన హరియొక్క ప్రభావములట్టివి. ఋషులెల్లరు వీనినే కీర్తించుచుందురు. ఇవి యే లోకములను పావనము చేయుచున్నవి. ఇకనేమి చెప్పుదును అనుచున్నాడు.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**యుధిష్ఠిరనారదసంవాదే త్రిపురవిజయో నామ దశమోఽధ్యాయః(10)**



**తాత్పర్యము:–** అంతలోకపాలురతో గూడి దేవతలు శివుని కడకేగి దేవా! త్రిపురముల నధిష్ఠించిన అసురులచే మిగుల బాధనొందుచున్న నీ వారిని మమ్ములను రక్షింపుమని వచించిరి.

**శ్లో॥ అథానుగృహ్య భగవాన్ మా భైష్టేతి సురాన్ విభుః।**
**శరం ధనుషి సన్ధాయ పురేష్వస్త్రం వ్యముఞ్చత॥ 59**

**ప్రతిపదార్థము:–** అథ=అంత, భగవాన్=భగవంతుడు శివుడు, విభుః=ప్రభులు, మాభైష్ట ఇతి= భయపడకుడు అని, సురాన్=సురలను, అనుగృహ్య=అనుగ్రహించి, ధనుషి=వింటియందు, శరమ్=తూపును, సంధాయ=కూర్చి, పురేషు=ఆ మూడుపురములపై, అస్త్రమ్=దివ్యాస్త్రమునుగా, వ్యముంచత=ప్రయోగించెను.

**తాత్పర్యము:–** అంత భగవానుడు భయపడకుడని సురలననుగ్రహించి ధనుస్సు నందు శరమును సంధించి దాని దివ్యాస్త్రమునుగాఁజేసి ఆ మూడు పురములపై ప్రయోగించెను.

**శ్లో॥ తతోఽగ్నివర్ణా ఇషవ ఉత్పేతుః సూర్యమణ్డలాత్।**
**యథా మయూఖసన్దోహా నాదృశ్యన్త పురో యతః॥ 60**

**ప్రతిపదార్థము:–** తతః=ఆ శరమువలన, అగ్నివర్ణాః=అగ్నివర్ణములై, ఇషవః=బాణములు, సూర్యమండలాత్=సూర్యమండలము నుండి, యథా మయూఖసందోహాః=కిరణ సమూహము వలె, ఉత్పేతుః=పైకి చెలరేగుచు చుట్టినవి, యతః=ఏ శరముల వలన, పురః=మూడు పురములు, నాదృశ్యంత=కనుపడనివై యైనవో.

**తాత్పర్యము:–** శివుడు ప్రయోగించిన ఆ శరమువలన అగ్నివర్ణములైన బాణములు పెక్కులు సూర్యమండలము నుండి కిరణ సమూహమువలె పుట్టి పైకి చెలరేగెను. వానివలన ఆ పురములు మూడు కనుపడకపోయెను.

**శ్లో॥ తైః స్పృష్టా వ్యసవః సర్వే నిపేతుస్త్రిపురౌకసః।**
**తానానీయ మహాయోగీ మయః కూపరసేఽక్షిపత్॥ 61**

**ప్రతిపదార్థము:–** తైః=ఆ బాణములచే, స్పృష్టా=తాకబడినవారై, సర్వే=ఎల్ల, త్రిపుర+ఓకసః =త్రిపురవాసులు, అసురులు, వ్యసవః=అసువులు గోల్పోయిరి. మహాయోగీ=గొప్పమహిమగల మాయావియగు, మయః=మయుడు, తాన్=ఆ యసురులను, ఆనీయ=కొనివచ్చి, కూపరసే= అమృతరసముగలబావియందు, అక్షిపత్=ముంచెను.

**తాత్పర్యము:–** ఆదిత్య బాణములు దాకి త్రిపురవాసులెల్లరు ప్రాణములు గోల్పోయిరి. గొప్పమహిమగల మాయావి యగు మయుడు వారలనెల్లగొనివచ్చి అమృత రసముండు బావి యందు ముంచెను.

**శ్లో॥ సిద్ధామృతరసే క్షిప్తా వజ్రసారా మహౌజసః।**
**ఉత్తస్థుర్మేఘదళనా వైద్యుతా ఇవ వహ్నయః॥ 62**

**ప్రతిపదార్థము:–** సిద్ధ+అమృతరసే=ప్రభావముగల అమృతరసమునందు, క్షిప్తాః=ఉంచబడినవారై అసురులు, వజ్రసారాః=వజ్రమువలె, దృఢమైన శరీరముగలవారు, మహా+ఓజసః=దొడ్డబలము

గలవారు, మేఘదళనాః=మేఘములలో తేలునట్టి, వైద్యుతాః=మెరుపురూపుగల, వహ్నయః ఇవ=అగ్నులవలె, ఉత్తస్థుః=జీవించిలేచిరి.

**తాత్పర్యము:–** ఆ సిద్ధామృత రసము నందు ముంచబడిన ఆ యసురులు వజ్రమువలె దృఢాంగములు గలవారై మహాబలాఢ్యులైన మేఘములను ఛేదించు విద్యుద్రూపములైన అగ్నులవలె వెలుంగుచు జీవించిలేచిరి.

**శ్లో॥ విలోక్య భగ్నసఙ్కల్పం విమనస్కం వృషధ్వజమ్।**
**తదాయం భగవాన్ విష్ణుస్తత్రోపాయమకల్పయత్॥ 63**

**ప్రతిపదార్థము:–** భగ్నసంకల్పమ్=విఫలమైన మనస్సంకల్పము గలవాడు, విమనస్కమ్= ఏమియు తోచని, వృషధ్వజమ్=ఎద్దుటెక్కెముగా గల శివుని, విలోక్య=చూచి, తదా=అప్పుడు, అయమ్=ఈ, భగవాన్=భగవంతుడు, విష్ణుః=విష్ణువు, తత్ర=ఆకార్యమునందు, ఉపాయమ్= ఒక వెఱవును, అకల్పయత్=కల్పించెను.

**తాత్పర్యము:–** తన సంకల్పము అంతయు వృథా కాగా ఏమియుదోచకయున్న రుద్రుని చూచి అప్పుడు విష్ణుభగవానుడందుల కొక యుపాయము పన్నెను.

**శ్లో॥ వత్స ఆసీత్తదా బ్రహ్మా స్వయం విష్ణురయం హి గౌః।**
**ప్రవిశ్య త్రిపురం కాలే రసకూపామృతం పపౌ। 64**

**ప్రతిపదార్థము:–**తదా!=అప్పుడు, బ్రహ్మా=బ్రహ్మ, వత్స=దూడ, ఆసీత్=అయ్యెను, అయమ్= ఈ, విష్ణుః=విష్ణువు, స్వయం హి=తానుగా, గౌః=గోవు అయ్యెను, కాలే=మధ్యాహ్న కాలము నందు, త్రిపురమ్=మూడు పురములను, ప్రవిశ్య=ప్రవేశించి, రసకూప+అమృతమ్=ఆ బావిలోని అమృతమును, పపౌ=త్రాగెను.

**తాత్పర్యము:–** అప్పుడు బ్రహ్మదూడగను, విష్ణువు తాను స్వయముగా గోవునై ఆ త్రిపురములను ప్రవేశించి అచ్చటి కూపములోని అమృతమునంతను త్రాగివేసెను.

**శ్లో॥ తేఽసురా హ్యపి పశ్యన్తో న న్యషేధన్ విమోహితాః।**
**తద్విజ్ఞాయ మయో యోగీ రసపాలానిదం జగౌ॥ 65**

**ప్రతిపదార్థము:–** అసురాః=అసురులు, పశ్యంతః అపి=చూచుచున్నవారయ్యు, విమోహితాః =మోహమునుపొంది, న న్యషేధన్ హి=ఆ గోవును త్రాగకుండ నిషేధించరైరి, తమ్=దానిని, విజ్ఞాయ=తెలిసి, యోగీ=మహిమగల, మయః=మయుడు, రసపాలాన్=అమృతరసమును రక్షించు వారిని గూర్చి, ఇదమ్=ఈ మాటను, జగౌ=ఇట్లనెను.

**తాత్పర్యము:–** అసురులు చూచుచుండియు మోహమును చెంది, అమృతమును గ్రోలు ఆ గోవును వారింపరైరి. అప్పుడు మహిమగల మయుడు అమృతరక్షకులను జూచి ఇట్లనెను.

**శ్లో॥ స్మయన్ విశోకః శోకార్తాన్ స్మరన్ దేవగతిం చ తామ్।**
**దేవోఽసురో నరోఽన్యో వా నేశ్వరోఽస్తీహ కశ్చన॥ 66**

**ప్రతిపదార్థము:–** స్మయన్=చిరునవ్వు నవ్వుచు, శోకార్తాన్=శోకమున కుందు అసురుల గూర్చి, విశోకః=శోకింపనివాడై తామ్=ఆ, దేవగతిమ్=దైవచేష్టను, స్మరన్=స్మరించుచు, దేవః=దేవత, అసురః=అసురుడు, నరః=నరుడు, అన్యః వా=ఇతరుడెవ్వడైన, కశ్చన్=ఒకానొకడు, ఇహ=ఈ విషయమై, ఈశ్వరః=సమర్థుడు, నాస్తి=లేడు.

**తాత్పర్యము:–** మయుడు నవ్వుచు శోకమునఁగుందు నసురులను గూర్చి శోకింపక, సంభవించిన ఆ దైవ చేష్టను గూర్చి స్మరించుచు దేవుడుగాని, అసురుడు నరుడు ఇతరుడెవ్వడుగాని ఇట్టి దైవగతిని తప్పించ సమర్థుడు గాదు.

**శ్లో॥ ఆత్మనోఽన్యస్య వా దిష్టం దైవేనాపోహితుం ద్వయోః।**
**అథాసౌ శక్తిభిః స్వాభిః శమ్భోః ప్రాధానికం వ్యధాత్॥ 67**

**ప్రతిపదార్థము:–** ఆత్మనః=తనకు, అన్యస్య=ఇతరునకు గాని, ద్వయోః=ఇరువురికి గాని, దైవేన= దైవముచే, దిష్టమ్=కల్పింబడినదానిని, అపోహితుమ్=పోగొట్టుటకు ఎవడును సమర్థుడుకాదు, అథ=మరి, అసౌ=ఈ శ్రీకృష్ణుడు, స్వాభిః శక్తిభిః=తన శక్తులలో, శంభోః=దేవునికి, ప్రాధానికమ్= యుద్ధసాధనమును, వ్యధాత్=చేసెను.

**తాత్పర్యము:–** తనకు గాని ఇతరునకు గాని ఇరువురకును దైవమేది కల్పించునో దానిని బోగొట్టుటకు ఎవ్వడును సమర్థుడు కాడు.

**శ్లో॥ ధర్మజ్ఞానవిరక్త్యర్థితపోవిద్యాక్రియాదిభిః।**
**రథం సుతం ధనుర్వాహాన్ ధ్వజం వర్మ శరాది యత్॥ 68**

**ప్రతిపదార్థము:–** ధర్మజ్ఞాన విరక్తి+అర్థి=ధర్మము జ్ఞానము విరక్తి అనువాని గోరువాడు భగవంతుడు, తపోవిద్యా క్రియాదిభిః=తపస్సు, విద్య అనువానిచే, యత్=ఏ, రథమ్=రథము, సూతమ్=సూతుని, ధనుః=ధనుస్సును, వాహాన్=వాహనమును, ధ్వజమ్=ధ్వజమును, వర్మ= కవచమును, శర+ఆది=బాణములోనగు వానిని కల్పించెను.

**తాత్పర్యము:–** ధర్మజ్ఞాన విరక్తుల నర్థించువాడైన శ్రీకృష్ణుడు తన తపస్సు, విద్య, క్రియ అను తన శక్తులచే శివుని రథము, సూతుడు, ధనుసు, వాహనము, ధ్వజము, కవచము, బాణము లోనగు వానిని కల్పించెను.

**శ్లో॥ సన్నద్ధో రథమాస్థాయ శరం ధనురుపాదదే।**
**శరం ధనుషి సన్ధాయ ముహూర్తేఽభిజితీశ్వరః॥ 69**

**ప్రతిపదార్థము:–** ఈశ్వరః=శివుడు, సన్నద్ధః=యుద్ధమునకు సంసిద్ధుడై, రథమ్=రథమును, ఆస్థాయ=ఎక్కి, శరం ధనుషి=బాణమును వింటి యందు, ఉపాదదే=గ్రహించెను, అభిజితి ముహూర్తే=అభిజిత్తుముహూర్తమునందు, మిట్టమధ్యాహ్నము నందు, శరమ్=బాణమునందు, ధనుషి=వింటి యందు, సంధాయ=సమకూర్చి.

**తాత్పర్యము:–** శివుడు యుద్ధసన్నద్ధుడై రథ మధిష్ఠించి, విల్లు నమ్ములు కైకొని మిట్టమధ్యాహ్నము అభిజిత్తు ముహూర్తమునందు ధనుస్సునందు బాణమును సంధించెను.

**శ్లో॥ అన్నాద్యాదేస్సంవిభాగో భూతేభ్యశ్చ యథార్హతః।**
**తేష్వాత్మదేవతాబుద్ధిస్సుతరాం నృషు పాణ్డవ॥ 10**

**ప్రతిపదార్థము:–** భూతేభ్యః=ప్రాణులకు, యథార్హతః=వాని వానికి తగినభంగి, అన్న+ఆద్య+ఆదేః=అన్నములోనగు భుజించు పదార్థముల,సంవిభాగః=పంచిపెట్టుట, తేషు=ఆ ప్రాణు లందు, సుతరామ్=ముఖ్యముగ, నృషు=నరులందు, ఆత్మదేవతాబుద్ధిః=ఆత్మయని దేవతయను బుద్ధి కలిగియుండవలెను.

**తాత్పర్యము:–** ఎల్లప్రాణులకు వాని వానికి తగిన భంగి అన్నాదికమును పంచిపెట్టుట, ఆ భూతము లందును ముఖ్యముగా నరులందు ఆత్మయను దేవతయను బుద్ధి కలిగియుండ వలెను.

**శ్లో॥ శ్రవణం కీర్తనం చాస్య స్మరణం మహతాం గతేః।**
**సేవే జ్యావనతిర్దాస్యం స్సఖ్యంమాత్మసమర్పణమ్॥ 11**

**ప్రతిపదార్థము:–** మహతాం గతేః=పెద్దలకు ఆశ్రయమైన, అస్య=ఈ హరియొక్క, శ్రవణమ్=కథాశ్రవణము, కీర్తనమ్=ఆ చరిత్రలను కీర్తించు, స్మరణమ్=నామస్మరణం, సేవా=సేవ, ఇజ్యా=యజ్ఞము, అవనతిః=నమస్కారము, దాస్యమ్=కైంకర్యము, ఆత్మసమర్పణమ్=తన్ను సమర్పించుట......

**తాత్పర్యము:–** దొడ్డవారికాశ్రయమైన ఈ హరి యొక్క కథలను వినుట, వాని సంకీర్తనము భగవన్నామస్మరణము, సేవ, యజ్ఞము, నమస్కారము, దాస్యము, ఆత్మ సమర్పణము.....

**శ్లో॥ నృణామయం పరో ధర్మస్సర్వేషాం సముదాహృతః।**
**త్రింశల్లక్షణవాన్ సాధుస్సర్వాత్మా యేన తుష్యతి॥ 12**

**ప్రతిపదార్థము:–** సర్వేషామ్=ఎల్ల, నృణామ్=నరులను, అయమ్=ఇది, పరః=ఉత్కృష్టమైన, ధర్మః=ధర్మము, త్రిశంత్ లక్షణవాన్=ముప్పది విధములు గలది, సాధుః=చక్కనిది, సముదాహృతః=చెప్పబడినవి, యేన=ఏ ధర్మముచే, సర్వ+ఆత్మా=ఎల్ల ప్రాణులకు ఆత్మయైన విష్ణువు, తుష్యతి=సంతోషించును.

**తాత్పర్యము:–** ఏ ధర్మముచే సర్వాత్ముడగుహరి సంతోషించును మానవులకెల్లను ఉత్కృష్టమైన ఆ ధర్మములు ముప్పది విధములు గలది నీకు చెప్పబడినది.

**శ్లో॥ సంస్కారా యత్రావిచ్ఛిన్నాస్స ద్విజోఽజో జగాద యమ్॥ 13**

**ప్రతిపదార్థము:–** యమ్=ఎవనిని, యత్ర=ఏ పని యందు, సంస్కారాః=గర్భాదానములోనగు సంస్కారములు, అవిచ్ఛినాః=తప్పక ప్రవర్తించుచున్నాడో, సః=అతడు, ద్విజః=ద్విజుడని, అజః=బ్రహ్మ, జగాద=వచించెను.

**తాత్పర్యము:–** గర్భాదానాది సంస్కారములన్నియు ఎవనియందు విచ్ఛిత్తిఁబొరయక ప్రవర్తించు చున్నవో వాడు ద్విజుడని బ్రహ్మ వచించెను.



## శ్రీః
## అథ ఏకాదశోఽధ్యాయః

ఈ పది యధ్యాయములందు జ్ఞానయోగము, భక్తియోగము చెప్పబడినవి. ఇఁక చెప్పబోవు అయిదు అధ్యాయములందు కర్మయోగము వర్ణింపబడినది. ఈ ఏకాదశాధ్యాయ మందు మానవ ధర్మములు సారూప్యముగా వర్ణింపబడినవి. విశేషించి వర్ణములయు, స్త్రీలయు ముఖ్యములు అముఖ్యములును వర్ణింపబడినవి.

**శ్రీశుక ఉవాచ**

**శ్లో॥ శ్రుత్వేహితం సాధుసభాసభాజితం మహత్తమాగ్రణ్య ఉరుక్రమాత్మనః।**
**యుధిష్ఠిరో దైత్యపతేర్ముదాయుతః పప్రచ్ఛ భూయస్తనయం స్వయమ్భువః॥ 1**

**ప్రతిపదార్థము:–** యుధిష్ఠిరః=ధర్మజుడు, మహత్తమ+అగ్రణ్యా=దొడ్డవారిలో మిక్కిలి దొడ్డవాడు, ఉరుక్రమ+ఆత్మనః=విష్ణువు మనస్సులో గలవాడును, దైత్యపతేః=దైత్య ప్రభువగు ప్రహ్లాదుని యొక్కసాధుసభాసభాజితమ్=సాధువులసభలయందు సత్కరింపబడిన, ఈహితమ్=చరితము, శ్రుత్వా=విని, ముదాయుతః=సంతోషముతో కూడినవాడై, భూయః=మరల, స్వయంభువః=బ్రహ్మయొక్క, తనయమ్=పుత్రుడైన నారదుని, ప్రపచ్ఛ=ప్రశ్నించెను.

**తాత్పర్యము:–** ధర్మరాజు మహనీయుల యందు ప్రథముడై విష్ణుమనస్కుడైన దైత్యప్రభుడైన ప్రహ్లాదుని చరిత్రమును సంతసించి మరల బ్రహ్మపుత్రుడైన నారదునితో నిట్లనియె.

**యుధిష్ఠిర ఉవాచ**

**శ్లో॥ భగవన్ శ్రోతుమిచ్ఛామి నృణాం ధర్మం సనాతనమ్।**
**వర్ణాశ్రమాచారయుతం యత్పుమాన్ విన్దతే పరమ్॥ 2**

**ప్రతిపదార్థము:–** భగవన్=ఓ నారద భగవాన్, యత్=ఏ కర్మమును అనుష్ఠించుటచే, పుమాన్=పురుషుడు, పరమ్=జ్ఞానము, భక్తిని, విందతే=పొందును, నృణామ్=మానవులయొక్క, వర్ణ+ఆశ్రమ+ఆచారయుతమ్=కులము, ఆశ్రమము అనువాని ఆచారముల గురించి, సనాతనమ్=ప్రాచీనమైన, ధర్మమ్=ధర్మమును, శ్రోతుం ఇచ్ఛామి=వినగోరుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ నారద భగవానుడా! పురుషుడే ధర్మానుష్ఠానమున జ్ఞానమును భక్తినిబొందునో అట్టి వర్ణాశ్రమముల ఆచారములతో గూడిన సనాతనమగు ధర్మమును వినగోరెదను.

**శ్లో॥ భవాన్ ప్రజాపతేస్సాక్షాదాత్మజః పరమేష్ఠినః।**
**సుతానాం సమ్మతో బ్రహ్మంస్తపోయోగసమాధిభిః॥ 3**

**ప్రతిపదార్థము:–** బ్రహ్మన్=ఓ బ్రాహ్మణోత్తమా!, భవాన్=నీవు, సాక్షాత్=సాక్షాత్తుగా, ప్రజాపతేః=సృష్టికర్తయైన, పరమేష్ఠినః=బ్రహ్మయొక్క, సుతానామ్=సుతులలో, తపోయోగజ్ఞానసమాధిభిః=తపస్సు, జ్ఞానము, యోగము సమాధులనువానిచే, సమ్మతః=పూజ్యుడైన, ఆత్మజః=పుత్రుడవై యున్నావు.

**తాత్పర్యము:–**ఓ విప్రోత్తమా! నీవు సృష్టికర్తయైన బ్రహ్మపుత్రులలో తపము, జ్ఞానము, సమాధులను వానిచేఁబూజ్యుడైన పుత్రుడుగా నున్నావు.

**శ్లో॥ నారాయణపరా విప్రా ధర్మం గుహ్యం యథా విదుః।**
**కరుణాస్సాధవశ్శాన్తాస్త్వద్విధా న తథాపరే॥ 4**

**ప్రతిపదార్థము:–** నారాయణపరాః=నారాయణునందు భక్తులైన, విప్రాః=బ్రాహ్మణులు, కరుణాః సాధవః శాంతాః=కరుణాళురు,సాధువులు,శాంతులు, తద్విధాః=అట్టివారు, గుహ్యమ్=సూక్ష్మమైన, ధర్మమ్=ధర్మమును యథా విదుః=ఎట్లు ఎఱుఁగుచున్నారో,తథా=అట్లు, అపరే =ఇతరులు, న విదుః=ఎఱుఁగరు.

**తాత్పర్యము:–** విష్ణుభక్తులైన దయాభూతులు, సాధువులు, శాంతులునగు విప్రులు సూక్ష్మమైన లేక గూఢమైన ధర్మమెఱింగినట్లు ఇతరు లెఱుంగరు.

**నారద ఉవాచ**

**శ్లో॥ నత్వా భగవతేఽజాయ లోకానాం ధర్మసేతవే।**
**వక్ష్యే సనాతనం ధర్మం నారాయణముఖాచ్ఛ్రుతమ్॥ 5**

**ప్రతిపదార్థము:–**అజాయ=పుట్టుకలేనివాడై, లోకానామ్=జగములయొక్క, ధర్మసేతవే=ధర్మమునకు కొట్టమై, భగవతే=శ్రీనారాయణ భగవానునకు, నత్వా=నమస్కరించి, నారాయణముఖాత్ =నారాయణ నోటినుంచి, శ్రుతమ్=వినిన, సనాతనం ధర్మమ్=సనాతనమైన ధర్మమును ప్రాచీనమైన ధర్మమును, వక్ష్యే=చెప్పెదను.

**తాత్పర్యము:–** పుట్టుకలేనివాడై జగములయొక్క ధర్మమునకు కొట్టమైన, శ్రీనారాయణ భగవానునకు నమస్కరించి, శ్రీమన్నారాయణుని నోటినుంచి వినిన సనాతనమైన ధర్మమును ప్రాచీనమైన ధర్మమును చెప్పెదను.

**శ్లో॥ యోఽవతీర్యాత్మనోఽంశేన దాక్షాయణ్యాం తు ధర్మతః।**
**లోకానాం స్వస్తయేఽధ్యాస్తే తపో బదరికాశ్రమే॥ 6**

**ప్రతిపదార్థము:–**యః=ఏ విష్ణువు, ఆత్మనః=తనయంశముతో, దాక్షాయణ్యామ్=దక్షుని పుత్రికయగు అదితిదేవియందు, ధర్మతః=ధర్మపద్ధతిని, అవతీర్య=అవతరించి / పుట్టి, లోకానామ్= జగములయొక్క, స్వస్తయే=మంగళముకొఱకు,బదరికాశ్రమే=బదరికాశ్రమమందు, తపః= తపమును, అధ్యాస్తే=అనుష్ఠించుచున్నాడు.

**తాత్పర్యము:–** ఏ విష్ణువైతే అదితిదేవియందు తనయంశములో జనించి జగముల కళ్యాణము కొఱకు బదరికాశ్రమమందు తపమనుష్ఠించుచున్నాడు.

**శ్లో॥ ధర్మమూలం హి భగవాన్ సర్వవేదమయో హరిః।**
**స్మృతం చ తద్విదాం రాజన్ యేన చాత్మా ప్రసీదతి॥ 7**

**ప్రతిపదార్థము:–** రాజన్=ఓ రాజా!, సర్వవేదమయః=ఎల్లవేదముల స్వరూపుడగు, హరిః=విష్ణువు భగవాన్=భగవంతుడు, ధర్మమూలం హి=ధర్మమునకు ప్రమాణమైయున్నాడు. తద్ విదామ్=ఆ ధర్మమును దెలిసిన ఋషుల, స్మృతమ్=ధర్మశాస్త్రము ప్రమాణము. యేన=ఏ ధర్మముచే, ఆత్మా= మనస్సు, ప్రసీదతి=నిర్మలమగును.

**తాత్పర్యము:–** సర్వవేదస్వరూపుడైన హరి భగవానుడు ధర్మమునకుఁబ్రమాణము. ఆ ధర్మమును దెలిసిన ఋషుల ధర్మశాస్త్రమునుఁబ్రమాణము. ఆ ధర్మముచేతనే మనస్సు నిర్మలమగుచున్నది. అట్లే యజ్ఞ్యవల్కుడు –

***శ్రుతిః స్మృతిః సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః।***
***సమ్యక్ సంకల్పితః కామో ధర్మమూలమిదం స్మృతమ్॥***

మనువు – ***వేదోఽఖిలో ధర్మమూలం స్మృతిశీలే చ తద్విదామ్।***
***ఆచారశ్చైవ సాధూనామాత్మన స్తుష్టిరేవ చ॥***

వేదము స్మృతి శిష్టాచారము తనకుఁబ్రియయైనవనియు, చక్కగా వివరించబడినది ధర్మమునకు ప్రమాణమని చెప్పబడినది. వేదము ఎల్లధర్మములకు ప్రమాణము ఆ వేదమెఱింగిన ఋషుల స్మృతులు, శీలము, ప్రమాణము, సాధువుల ఆచారము ఆత్మతుష్టి ధర్మమేయగును.

**శ్లో॥ సత్యం దయా తపశ్శౌచం తితిక్షేక్షా శమో దమః।**
**అహింసా బ్రహ్మచర్యం చ త్యాగః స్వాధ్యాయ ఆర్జవమ్॥ 8**

**ప్రతిపదార్థము:–** సత్యమ్=సత్యము, దయా=దయ, తపః=(ఏకాదశి ఉపవాసాది) తపస్సు, తితిక్షా+ఈక్షా=యుక్తాయుక్తాది వివేకం, శమః=మనస్సంయము, దమః=దమము, అహింసా, బ్రహ్మచర్యమ్, చ, త్యాగః, స్వాధ్యాయః =తనశక్తికి తగినట్లు జపము, ఆర్జవమ్=మనోవాక్కాయాలలో ఏకరూపత్వం....

**తాత్పర్యము:–** సత్యము, దయ, తపస్సు, తితిక్షా, యుక్తాయుక్త వివేకం, శమము, దమము బాహ్యేంద్రియముల సంయమనము, అహింస, బ్రహ్మచర్యము, త్యాగము, స్వాధ్యాయము ఆర్జవము.....

**శ్లో॥ సన్తోషస్సమదృక్సేవా గ్రామ్యేహోపరమశ్శనైః।**
**నృణాం విపర్యయేహేక్షా మౌనమాత్మవిమర్శనమ్॥ 9**

**ప్రతిపదార్థము:–** సంతోషః=దైవవశమున లభించినదానితో చాలునను బుద్ధి, సమదృక్+సేవ =అన్నింటియందు సమదర్శనులైన గొప్పవారిసేవ, శనైః=మెల్లిగా, గ్రామ్య+ఈహోపరమః=ప్రవృత్త కర్మల నుండి నివృత్తి, నృణామ్=నరులయొక్క, విపర్యయ+ఈహ+ఈక్షా=నిష్ఫలము లైన వాంఛల వీక్షించుట, మౌనమ్=వ్యర్థముగా మాటలాడకుండుట, ఆత్మవిమర్శనమ్= దేహాదులకు వ్యతిరిక్తమై యున్న ఆత్మానుసంధానము ....

**తాత్పర్యము:–** దైవవశమునఁ దనకు లభించిన దానితో సంతోషించుట, భూతములందు సమదృష్టి గల గొప్పవారిసేవ, కామ్యకర్మల నుండి విరమణము, మానవుల యొక్క నిష్ఫలము లైన క్రియలను గాంచి తెలిసికొనుట, వ్యర్థముగా మాటలాడక మౌనము వహించుట, దేహాదుల కంటె భిన్నమైన ఆత్మను ధ్యానించుట....

క్షమా=ఓర్పు, బ్రహ్మణ్యతా=బ్రాహ్మణ భక్తి, ప్రసాదశ్చ=అనుగ్రహము, రక్షా చ=దీన రక్షణము, ప్రజాపాలనము, క్షత్రలక్షణమ్=క్షత్రియుని లక్షణమైన గుణము.

**తాత్పర్యము:–** శౌర్యము, ప్రభావము, ధైర్యము, తేజస్సు, త్యాగము, మనస్సంయమము, క్షమ, బ్రాహ్మణభక్తి అనుగ్రహము ప్రజలను, దీనులను రక్షించుట అనునవి క్షత్రియుని లక్షణములు.

**శ్లో॥ దేవగుర్వచ్యుతే భక్తిస్త్రివర్గపరిపోషణమ్।**
**ఆస్తిక్యముద్యమో నిత్యం నైపుణ్యం వైశ్యలక్షణమ్॥ 23**

**ప్రతిపదార్థము:–** దేవగురు+అచ్యుతే=దేవతలు, గురువులు, అచ్యుతుడు అనువాని యందు భక్తిః=భక్తియు, త్రివర్గపరితోషనమ్=బ్రహ్మ క్షత్రియ వైశ్యులు అను మూడు జాతులను సంతోష పెట్టుట, ఆస్తిక్యమ్=దేవుడున్నాడని విశ్వసించుట, నిత్యమ్=ఎల్లప్పుడు, ఉద్యమః=కార్యములందు ప్రయత్నము, నైపుణ్యమ్=నేర్పు, వైశ్యలక్షణమ్=వైశ్యుల లక్షణము.

**తాత్పర్యము:–** దేవతలందు, గురువులందు, అచ్యుతునియందు భక్తియు, బ్రాహ్మణాది మూడు వర్ణముల వారిని సంతోషపెట్టుట, ఆస్తిక బుద్ధి, నిత్యము తన కార్యములను ప్రయత్నించుట, నిపుణత్వము, అనునవి వైశ్యుని లక్షణము.

**శ్లో॥ శూద్రస్య సన్నతిశ్శౌచం సేవా స్వామిన్యమాయయా।**
**అమన్త్రయజ్ఞో హ్యస్తేయం గోవిప్రాణాం చ రక్షణమ్॥ 24**

**ప్రతిపదార్థము:–** సన్నతిః=వినయము, శౌచమ్=శౌచము, స్వామిని=తన యజమానియందు, అమాయయా=నిష్కపటము(కపటములేక సేవించుట),సేవా=సేవ, ఆమంత్రయజ్ఞః=మంత్రము లేక నమస్కారముచే పంచయజ్ఞముల నుష్ఠించుట, అస్తేయమ్=చౌర్యము లేకుండుట, గో విప్రాణామ్=గోవులను, విప్రులను, రక్షణమ్ చ=రక్షణమును, శూద్రస్య హి=శూద్రుని లక్షణము.

**తాత్పర్యము:–** వినయము ఆచారము యజమానుని కపటములేక సేవించుట మంత్రము లేక నమస్కారపూర్వకముగా దేవ పితృ అతిథి హోమభూత బలులను పంచమహాయజ్ఞము లను కావించుట, దొంగతనము లేకుండుట గోవులను, విప్రులను రక్షించుట శూద్రుని లక్షణము. అట్లే యజ్ఞవల్క్యుడు – "నమస్కారేణ మంత్రేణ పంచయజ్ఞాన్ సమాపయేత్". అయిదు శ్లోకముల చేత స్త్రీధర్మములను చెప్పుచున్నాడు.

**శ్లో॥ స్త్రీణాం చ పతిదేవానాం తచ్ఛుశ్రూషానుకూలతా।**
**తద్బన్ధుష్వనువృత్తిశ్చ నిత్యం తద్వ్రతధారణమ్॥ 25**

**ప్రతిపదార్థము:–** పతిదేవానామ్=భర్తయే దైవముగా గల, స్త్రీణాం=స్త్రీలకు, తత్+శుశ్రూషామ్+ అనుకూలతా=ఆ భర్తయొక్కసేవ, పతికి అనుకూల్యముతో నుండుట, తత్+బంధుషు=ఆతని బంధువులందు, అనువృత్తిః=అనుసరించి వర్తించుట, నిత్యమ్=ఎల్లప్పుడు, తత్వ్రతధారణమ్= పతియే సర్వమను వ్రతమును వహించుట, పతివ్రత అయియుండుట, పాతివ్రత్యమును–ఇవి పతివ్రతల లక్షణములు, ధర్మములు.

**తాత్పర్యము:–** పతియేదైవముగా గల స్త్రీలకు భర్తసేవ, భర్తకనుకూలముగా నుండుట పతియొక్క



**శ్లో॥ ఇజ్యాధ్యయనదానాని విహితాని ద్విజన్మనామ్।**
**జన్మకర్మావదాతానాం క్రియాశ్చాశ్రమచోదితాః॥ 14**

**ప్రతిపదార్థము:–** జన్మకర్మ+అవదాతానామ్=విశుద్ధమైన వంశముచేతను, కర్మచేతను, ఆచారము చేతను, శుద్ధులైన (దుష్కర్ములకు దురాచారులకు ఇవి విహితములుగావు), ద్విజానామ్=బ్రాహ్మణు లకు, ఇజ్యా+అధ్యయన+దానాని=యజ్ఞము, వేదాధ్యయనము, దానములు, విహితాని= యోగ్యములు, ఆశ్రమచోదితాః=బ్రహ్మచర్యాదులగు ఆశ్రమములకు చెప్పబడిన క్రియా శ్రయ కర్మలును తగినవి.

**తాత్పర్యము:–** పరిశుద్ధవంశమునందు జన్మించి సత్కర్మాచరణము సదాచారముగల ద్విజులకు యజ్ఞము, అధ్యయనము, దానము, బ్రహ్మచర్యాశ్రమములకు చెప్పబడిన కర్మలు అర్హములు.

**శ్లో॥ విప్రస్యాధ్యాపనాదీని తతోఽన్యస్యాప్రతిగ్రహః।**
**రాజ్ఞో వృత్తిః ప్రజాగోప్తురవిప్రాద్వా కరాదిభిః।**
**వైశ్యస్తు వార్తావృత్తిస్స్యాన్నిత్యం బ్రహ్మకులానుగః॥ 15**

**ప్రతిపదార్థము:–** విప్రస్య=విప్రుని, అధ్యాపనాదీని=అధ్యాపనము, యాజనము ప్రతిగ్రహము విహితములైనవి. యజనము=యజ్ఞనము చేయించుట, అధ్యాపనము=వేదములు శిష్యులకు చెప్పుట, యోగ్యుడగువాని వలన దానము బ్రతిగ్రహించుట జీవికకు జీవయాత్రకు విహితము లైనవి. అన్యస్య=ఇతరుడైన, ప్రజాగోప్తుః=ప్రజారక్షకుడైన, రాజ్ఞః=రాజునకు, అప్రతిగ్రహః =ప్రతిగ్రహములే వినా యాజనాధ్యాపనాదులును, అవిప్రాత్=విప్రుడు కాని వాని నుండి, కర+ ఆదిభిః=పన్నులోనగు దండశుల్కములచే, వృత్తిః= జీవిక తగును. వైశ్యః తు=వైశ్యులు, వార్తావృత్తిః =కృషివాణిజ్యాదికము జీవనము కలవాడగును. బ్రహ్మకుల+అనుగః=బ్రాహ్మణజాతి ననుసరించి.

**తాత్పర్యము:–** విప్రునికి యజనము, అధ్యయనము, దానము అనునవిగాక యాజనము, అధ్యాపనము, ప్రతిగ్రహము అనునవి మూడును జీవనమునకై యేర్పడినవి. రాజునకు ప్రతిగ్రహము తప్ప తక్కిన యాజనము, అధ్యాపనము అపద్ధర్మములుగా గ్రహింపనగును. తర్వాత నిట్లె చెప్పెను. ఋతే రాజన్యము శ్రుతివచించును. అజాతశత్రువు, భీష్ముడులోనగు క్షత్రియులకు ఉపదేష్టత్వము ఏర్పడినది. ప్రజాపాలకుడగు రాజునకు విప్రుడు కాని వాని నుండి పన్నుగోరుట, దండగ గొనుట సుంకము గొనుటలోనగునవి జీవనమగును. వైశ్యుడు బ్రహ్మకుల మనునెమో కృషివాణిజ్యము మొదలైనవానిచే జీవించుట తగును.

**శ్లో॥ శూద్రస్య ద్విజశుశ్రూషా వృత్తిశ్చ స్వామినో భవేత్।**
**వార్తా విచిత్రా శాలీనయాయావరశిలోఞ్ఛనమ్।**
**విప్రవృత్తిశ్చతుర్ధేయం శ్రేయసీ చోత్తరోత్తరా॥ 16**

**ప్రతిపదార్థము:–** శూద్రస్య=శూద్రునికి, ద్విజ శుశ్రూషా=ద్విజులకు సేవసేయుట, స్వామినః= తనకు యజమాని ద్విజునకు, వృత్తిః=సేవసేయుట జీవనమగును. విచిత్రా=కృష్యాదిరూపమైన, వార్తా=జీవికము, శాలీనయా=దార్ఢ్యము, అధికారములేక వినయముతో యాచన చేయుటచే

లభించిన ధనమును గ్రహించుట, యాయావరః+శిలోంఛనమ్=ప్రతిదినము ధాన్యాదికము యాచించుట, శిల=వరిపొలమునందు యజమాని వదలిపెట్టిన గింజలు ఏఱుకొనుట, ఉంఛనం =అంగడి వీధియందు రాలిపోయిన ధాన్యపు గింజలను ఏఱుకొనుట, చతుర్ధా=నాలుగవదియైన, విప్రవృత్తి=విప్రుని జీవన వృత్తియగు, ఇయమ్=ఇది, శ్రేయసే= ఉత్తమవృత్తి, ఉత్తర+ఉత్తరో=పైన పేర్కొన్నవి మొదటదాని కంటె రెండవది, దాని కంటె మూడవది, దాని కంటె నాలుగవది పోను పోను శ్రేష్ఠములైనవి.

**తాత్పర్యము:–** శూద్రుని ద్విజసేవ, మఱి యజమానియగు ద్విజుని సేవించి బ్రతుకుట వృత్తి యగును. కృషిచేసి జీవించుట అయాచితముగా లభించిన ధనాదికమును గ్రహించుట చేత, ఇంటింట ధాన్యము యాచించుట, పొలమునందు రాలిన ధాన్యపు గింజలను ఏఱు కొనుట, అంగడి వీధియందు రాలిన గింజలనేరుకొనుట అను నాలుగును విప్రునికి ముఖ్య వృత్తులు అగును. వీనిలో ఉత్తరోత్తరము ఉత్తమము. పరిగలేరుకొనుట ఉత్తమ వృత్తి అగును.

**శ్లో॥ జఘన్యో నోత్తమాం వృత్తిమనాపది భజేన్నరః।**
**ఋతే రాజన్యమాపత్సు సర్వేషామపి సర్వశః॥ 17**

**ప్రతిపదార్థము:–** జఘన్యః=నీచుడైన, నరః=నరుడు, ఉత్తమాం వృత్తిమ్=వేదము చదివించుట లోనగు వృత్తిని, అనాపది=ఆపదకాని సమయమందు, న భజేత్=గ్రహింపగూడదు, ఆపత్సు= ఆపత్సమయములందు, ఋతే రాజన్యమ్=రాజును, ప్రతిగ్రహము లేదు, వినా, సర్వేషామ్ = అన్నిట, సర్వశః=అన్నివృత్తులు గ్రహించనగును.

**తాత్పర్యము:–** నీచుడైన నరుడు ఆపదకానప్పుడు తమ వృత్తిని వేదములు చదివించుట లోనగు వానిని గ్రహించుట తగదు. రాజు ప్రతిగ్రహము తప్ప తక్కిన అధ్యాపనాది వృత్తులను ఆపద యందు గ్రహింపదగును.

**శ్లో॥ ఋతామృతాభ్యాం జీవేత మృతేన ప్రమృతేన వా।**
**సత్యానృతేన జీవేత న శ్వవృత్త్యా కథంచన। 18**

**ప్రతిపదార్థము:–** ఋత+అమృతాభ్యామ్=ఋతముచేతను, అమృతముచేతను మృతేన ప్రమృతేన =మృతముచేతను, ప్రమృతముచేతను, జీవేత=జీవించవలె, సత్యానృతేన=వాణిజ్యము నవా జీవేత =జీవించనేకూడదు, కథంచన=ఎంత కష్టము వచ్చినను, శ్వవృత్త్వా=సేవక వృత్తిచే, జీవేతన =జీవించకూడదు. పూర్వోక్తమైన వృత్తి కొఱకు రెంటిచే ననుచున్నాడు.

**తాత్పర్యము:–** నరుడు ఋతముచేతను అమృతముచేతను జీవించవలె. లేక మృతము చేతను ప్రమృతము చేతనైన జీవనము సేయవలె. వ్యాపారముచే జీవింపనేకూడదు. ఎంత కష్టము వచ్చినను సేవక వృత్తి కూడదు.

**శ్లో॥ ఋతముఞ్ఛశిలం ప్రోక్తమమృతం యదయాచితమ్।**
**మృతం తు నిత్యయాచ్ఞా స్యాత్ప్రమృతం కర్షణం స్మృతమ్॥ 19**

**ప్రతిపదార్థము:–** ఉంఛశిలమ్=పరిగలేఱికొనుట, అంగడివాని గింజలేరి కొనుట, ఋతం





ప్రోక్తమ్=ఋతమని చెప్పబడినది. యత్=ఏది, ఆయాచితమ్=యాచించని వర్తనము, అది, అమృతమ్=అమృతమని చెప్పబడును. నిత్యయాచ్ఞా=నిత్యము ఇంటింట యాచించుట, మృతమ్= మృత మగును. కర్షణమ్=దున్నుకొని బ్రతుకుట, ప్రమృతం=ప్రమృతమని, స్మృతమ్ చెప్పబడినది.

**తాత్పర్యము:–** ఉంఛశిలములు రెండును పరిగలేరుకొనుట అంగడి వీధి గింజ లేరికొనుట ఋతమను వృత్తియగును. అయాచితముగా లభించిన దానితో జీవించుట అమృతమగును. నిత్యము యాచించి బిచ్చమెత్తుకొని జీవించుట మృతమనబడును. పొలమును దున్నుకొని బ్రతుకుట ప్రమృతమగును.

**శ్లో॥ సత్యానృతం తు వాణిజ్యం శ్వవృత్తిర్నీచసేవనమ్।**
**వర్జయేత్తాం సదా విప్రో రాజన్యశ్చ జుగుప్సితామ్॥ 20**

**ప్రతిపదార్థము:–** సత్య+అనృతమ్=సత్యాసత్యములతో గూడిన, వాణిజ్యమ్=వ్యాపారము, నీచ సేవనమ్=నీచుని సేవించునదై, శ్వవృత్తి=కుక్క వంటి సేవ. కావున విప్రః=బ్రాహ్మణుడు, జుగుప్సితామ్=నిందితమైన, జుగుప్స కలిగించే, తామ్=ఆ వృత్తిని, సదా=ఎల్లప్పుడు, వర్జయేత్ =వర్జించవలెను. రాజన్యశ్చ=రాజు కూడా వర్జించవలెను.

**తాత్పర్యము:–** వాణిజ్యము సత్యాసత్యములతో గూడినది. నీచుని సేవించునది శ్వవృత్తి, కుక్క వంటి వృత్తి నీచసేవనము. కావున విప్రడీ నింద్యమైన వాణిజ్యమును సేవన ఎప్పుడును వర్జించ వలెను. రాజును వర్జించవలెను.

**శ్లో॥ సర్వవేదమయో విప్రస్సర్వదేవమయో నృపః।**
**శమో దమస్తపః శౌచం సన్తోషః క్షాన్తిరార్జవమ్।**
**జ్ఞానం దయాచ్యుతాత్మత్వం సత్యం చ బ్రహ్మలక్షణమ్॥ 21**

**ప్రతిపదార్థము:–**విప్రః=విప్రుడు, సర్వవేదమయః=సర్వవేదమయుడు, నృపః=రాజు, సర్వదేవయమ =ఎల్లదేవతల స్వరూపుడు, మః+దమః+తపః+శౌచం సంతోషః=శమము, దమము, తపము, శౌచము, సంతోషము, క్షాంతిరార్జవమ్=సహనము, ఋజువర్తనము, జ్ఞానమ్=జ్ఞానము, దయా=దయ, అచ్యుత+ఆత్మత్వమ్=విష్ణుపరత్వం, సత్యమ్=సత్యము, బ్రహ్మలక్షణమ్=బ్రాహ్మణ లక్షణములు.

**తాత్పర్యము:–** సర్వవేదముల రూపమైనవాడు విప్రుడు. సర్వదేవతల రూపమైనవాడు నృపుడు. కావున వీరిరువురును నీచ సేవను పరిత్యజించవలెను. శమము, దమము, తపము, శౌచము, సంతోషము, క్షాంతి=సహనము, ఋజువర్తనము, జ్ఞానము, దయ, విష్ణుపారమ్యము (విష్ణువే దేవుడు నాకు దిక్కతడు) సత్యము అను నివి బ్రాహ్మణ లక్షణములైన గుణములు.

**శ్లో॥ శౌర్యం వీర్యం ధృతిస్తేజస్త్యాగ ఆత్మజయః క్షమా।**
**బ్రహ్మణ్యతా ప్రసాదశ్చ రక్షా చ క్షత్రలక్షణమ్॥ 22**

**ప్రతిపదార్థము:–** శౌర్యమ్=యుద్ధమునందుత్సాహము, వీర్యమ్=ప్రభావము, ధృతి=ధైర్యము, తేజః=ప్రోగల్భ్యము ఇతరులు దరిజేరరాని తేజస్సు, త్యాగః=త్యాగము, ఆత్మజయః=మనో జయము,

నందు, దృశ్యేత=కనబడినచో, తత్=ఆ వర్ణాంతరము, తేన+ఏవ=ఆ లక్షణముల చేతనే, వినిర్దిశేత్=నిర్ణయించవలెను.

**తాత్పర్యము:–** ఏ పురుషున కేది వర్ణమునుసూచించు లక్షణమని చెప్పబడినదో, ఆ లక్షణము ఇతర వర్ణములలోని ఒక పురుషుని యందు కన్పట్టుచో, వాని నా లక్షణముచే ఆ వర్ణము వానినిగానే నిర్ణయించవలెను.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**యుధిష్ఠిరనారదసంవాదే, సదాచార నిర్ణయే నామైకాదశోఽధ్యాయః(11)**



బంధువులననుసరించియుండుట, పతియే తనకు సర్వమని వ్రతము పూనుట, ఇవి పతివ్రతల లక్షణములు ధర్మములు అయియున్నవి.

**శ్లో॥ సమ్మార్జనోపలేపాభ్యాం గృహమణ్డలవర్తనైః।**
**స్వయం చ మణ్డితా నిత్యం పరిమృష్టపరిచ్ఛదా॥ 26**

**ప్రతిపదార్థము:–** సమ్మార్జన+ఉపలేపాభ్యామ్=ఇల్లు జిమ్ముట, అలుకుటలచేత, గృహమండల వర్తనైః=గృహము నలంకరించు పనులచేతను గూడిన, పరిమృష్టపరిచ్ఛదా=తోమిన గృహోప కరణములు అగు పాత్రాదులు గలదియు, స్వయమ్=తాను, నిత్యమ్=ఎల్లప్పుడు, మండితా చ=అలంకరించుకొన్నదైయుండుట.

**తాత్పర్యము:–** ఆ పతివ్రతయగు తన ఇల్లు చిమ్మి అలికి, ముగ్గులోనగు వానిచే నింటిని అలంకరించుచు, గృహములోని పనిముట్లు పాత్రములులోనగు వానిని దోమి పరిశుభ్రము చేసి, తాను కూడ చక్కగ నలంకరించుకొని యుండవలెను.

**శ్లో॥ కామైరుచ్చావచైస్సాధ్వీ ప్రశ్రయేణ దమేన చ।**
**వాక్యైః సత్యైః ప్రియైః ప్రేమ్ణా కాలే కాలే భజేత్పతిమ్॥ 27**

**ప్రతిపదార్థము:–** సాధ్వీ=పతివ్రత, ఉచ్చావచైః=పెక్కువిధములైన, కామైః=కోర్కెలచే, ప్రశ్రయేణ= వినయముచే, దమేన=ఇంద్రియ నిగ్రహముతో, సత్యైః=సత్యములైన, ప్రియైః=ఇష్టములైన, వాక్యైః =మాటలతో, ప్రేమ్ణా=ప్రేమచేత, పతిమ్=పతికి, కాలేకాలే=ప్రత్యహము లేక యోగ్యకాలములలో, భజేత్=సేవించవలెను.

**తాత్పర్యము:–** పతివ్రతయగు స్త్రీ పతికిష్టములైన పెక్కు కోర్కెలను సిద్ధింపజేయుచు, వినయము, ఇంద్రియ నిగ్రహముగలదై, సత్యములైన ప్రియవాక్యములచేతను, ప్రేమచేతను పతిని సంతోష పరచుచు తగిన సమయములందు నిరంతరము సేవించుచుండవలెను.

**శ్లో॥ సన్తుష్టాలోలుపా దక్షా ధర్మజ్ఞా ప్రియసత్యవాక్।**
**అప్రమత్తా శుచిస్స్నిగ్ధా పతిం త్వపతితం భజేత్॥ 28**

**ప్రతిపదార్థము:–** సంతుష్టా=లభించినదానితో తృప్తిపడునదై, అలోలుపా=ఇంద్రియలౌల్యము లేనిదై, దక్షా=సమర్థము, ధర్మజ్ఞా=ధర్మమును తెలిసిన, ప్రియసత్యవాక్=ప్రియమైన, సత్యమైన మాటచెప్పుచు, అప్రమత్తా=ఏపనియందును అజాగ్రత్తలేనిదియై, శుచిః=పరిశుద్ధయు, స్నిగ్ధా= స్నేహముగలదై, అపతితమ్=పాతకములచే పతితుడు కాకుండునట్లు, పతిమ్=పతిని, భజేత్= సేవించవలెను.

**తాత్పర్యము:–** లభించిన దానితో తృప్తిపడుచు ఇంద్రియసౌఖ్యములకు లోనుగాక గృహకృత్యము లందు సమర్థురాలై ఎల్ల ధర్మముల నెఱింగి ప్రియమైన సత్యమైన మాటలు చెప్పుచు జాగరూకత కలదై పరిశుద్ధయై స్నేహముగలదై పాపములకు లొంగి చెడకుండ పతిని జూచుకొనుచు సేవింపవలెను.

**శ్లో॥ యా పతిం హరిభావేన భజేత్ శ్రీరివ తత్పరా।**
**హర్యాత్మనా హరేర్లోకే పత్యా శ్రీరివ మోదతే॥ 29**

**ప్రతిపదార్థము:-** యా=ఏ స్త్రీ, పతిమ్=పతిని, హరిభావేన=విష్ణువను భావనచే, శ్రీః ఇవ=తాను లక్ష్మివలె భావనచే, తత్పరా=ఆసక్తిగలదై, భజేత్=సేవించునో ఆమె, హరేః లోకే=విష్ణు లోకమందు హరి+ఆత్మనా=విష్ణుస్వరూపుడైన, పత్యా=పతితో, శ్రీః ఇవ=లక్ష్మివలె, మోదతే=సంతోషించుచున్నది.

**తాత్పర్యము:-** ఏ స్త్రీ తన పతిని విష్ణువుగాను తన్ను లక్ష్మిగాను భావించి సేవించుచున్నదో ఆమె వైకుంఠమందు విష్ణుస్వరూపముగల భర్తతో తాను లక్ష్మివలె గూడి సంతోషించుచున్నది.

**శ్లో॥ వృత్తిస్సఙ్కరజాతీనాం తత్తత్కులకృతా భవేత్।**
**అచోరాణామపాపానామన్త్యజాతావసాయినామ్॥ 30**

**ప్రతిపదార్థము:-** అచోరాణామ్=దొంగలు కానివారు, అపాపానామ్=పాపముజేయనివారు, అంత్య జాత+అవసాయినామ్=అంత్యజాతియే తుదిగాగల, సంకరజాతీనామ్=బ్రాహ్మణాది కులముల సాంకర్యమున జనించిన వారియొక్క, వృత్తిః=జీవనము, తత్+తత్+కులకృతా =ఆయా కులముల పరంపరగానది, భవేత్=అగును.

**తాత్పర్యము:-** అంత్యజులు, రజకులు, చర్మకారులు, నటుఁడు బురడుడు, కైవర్తమేద భిల్లులను వాడేద్వురు అంత్యజులు. చండాల పుల్క సమాంతగాదులు అంతావసాదులు. వీరికి వస్త్రము లుతుకుటలోనగు వృత్తి, దొంగతనము, హింసలోనగునవి వారికి కులపరంపరగా వచ్చినది జీవనమగును.

**శ్లో॥ ప్రాయః స్వభావవిహితో నృణాం ధర్మో యుగే యుగే।**
**వేదదృగ్భిః స్మృతో రాజన్ ప్రేత్య చేహ చ శర్మకృత్॥ 31**

**ప్రతిపదార్థము:-** రాజన్=ఓ రాజా!, ప్రాయః=తఱచు, నృణామ్=మానవులయొక్క, స్వభావ విహితః=సత్త్వాదిగుణములచే, ధర్మః=ధర్మము, యుగేయుగే=ప్రతియుగమునందు, వేదదృగ్భిః =వేదవిదులచే, స్మృతః=చెప్పబడినది, ఇహ చ=ఇహమందు,ప్రేత్య చ=పరమందును, శర్మకృత్ =సుఖమును కలిగించునది.

**తాత్పర్యము:-** వేదవేత్తలగువారు ప్రతియుగమునందు మానవులకు, స్వభావానుగుణమైన ధర్మమేదియని దేని నేర్పఱచినారో ఆ ధర్మానుష్ఠానమువలన మానవులకు ఇహమునను, పరమునను సుఖమును కలిగించును. అట్లే భగవంతుడు **"శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్".**

**శ్లో॥ వృత్త్యా స్వభావకృతయా వర్తమానస్స్వకర్మకృత్।**
**హిత్వా స్వభావజం కర్మ శనైర్నిర్గుణతామియాత్॥ 32**

**ప్రతిపదార్థము:-** స్వభావకృతయా=స్వభావముచేత కృపగల, వృత్త్యా=వృత్తిచేతను, వర్తమానః =వర్తించుచుండు, స్వకర్మకృత్=తన ధర్మమైన కర్మను గావించువారు, స్వభావజమ్=తన





సహజమైన కర్మను, హిత్వా=విడిచి, శనైః=మెల్లగా, నిర్గుణతామ్=నిర్గుణతత్త్వమును, ఇయాత్=పొందును.

**తాత్పర్యము:-**సహజముగా దయగలవృత్తినవలంబించి వర్తించుచు తనకు ధర్మమని యేర్పరచ బడిన కర్మను జేయువాడు ఆ సహజ కర్మను మెల్లగా వీడి నిర్గుణతత్త్వమును పొందును.

**శ్లో॥ ఉప్యమానం ముహుః క్షేత్రం స్వయం నిర్వీర్యతామియాత్।**
**న కల్పతే పునః సూత్యా ఉప్తం బీజం చ నశ్యతి॥ 33**

**ప్రతిపదార్థము:-** ముహుః=మాటిమాటికి, ఉప్యమానమ్=విత్తనము విత్తబడుచున్న, క్షేత్రమ్=పొలము, స్వయమ్=తనకుతానే, నిర్వీర్యతామ్=నిస్సారతను, ఇయాత్=పొందును, పునః= మఱి, సూత్యా=విత్తనమొలకెత్తించుటకు, న కల్పతే=సమర్థముగాదు, ఉప్తమ్=ఆ పొలమునందు విత్తిన, బీజం చ=విత్తనమును, నశ్యతి=నశించుచున్నది.

**తాత్పర్యము:-** ఒక పంటపొలము నందు ఎరువు వేయక నిరంతరము విత్తనము చల్లుచూ నుండిన యెడల కొంతకాలమునకు ఆ పొలము బొత్తుగా సత్తువలేనిదగును. అంత ఆ పొలమున విత్తనము విత్తినను దానిని మొలకెత్తించు శక్తి ఆ పొలమునకు గలుగదు. పైగా ఆ విత్తనమును నశించుచున్నది.

**శ్లో॥ ఏవం కామాశయం చిత్తం కామానామతిసేవయా।**
**విరజ్యేత యథా రాజన్నాగ్నివద్ఘృతబిన్దుభిః॥ 34**

**ప్రతిపదార్థము:-** రాజన్=ఓ రాజా!, ఏవమ్=ఈప్రకారముగా, కామ+ఆశయమ్=కామ వాసనలు గల, చిత్తమ్=మనసు, కామానామ్=కామసుఖములను, అతిసేవయా=మిక్కిలి అనుభవించుటచేత, ఘృతబిందుభిః=నేతిబొట్లచే, యథా=ఏ ప్రకారము, అగ్నివత్=అగ్నివలె, విరజ్యేత=విరక్తిని పొందునో.

**తాత్పర్యము:-** ఇట్లు కామవాసనలు గల చిత్తము కామసుఖములను మిక్కిలిగా సేవించుటచే ఎక్కువ నేతిబొట్టచే అగ్ని శమించినట్లు తనకు తానే విరక్తి చెందును. వాసనా విశిష్టమైన చిత్తమునకు శీఘ్రముగా కామత్యాగము అసంభవమగుట, వేదోక్త నియమముచే పెక్కు కామములను అనుభవించువానికి నిత్యనైమిత్తికర్మలచే విశుద్ధమైన చిత్తము గలవానికి ఆ కామ సుఖములందు దోషదర్శనముచే, యయాత్యాది ప్రముఖులకువలె మెల్లగా విరాగము కలుగు చున్నది. ఎట్లనగా మంచి సత్తువ గల వరిపొలము కృషిచే నానాటికి నిస్సారమై పోవుచున్నదో మఱియట్లు మండుచున్న అగ్ని ఎక్కువ ఘృతబిందువులచే నేతిధారలచే శమించుచున్నది.

**శ్లో॥ యస్య యల్లక్షణం ప్రోక్తం పుంసో వర్ణాభిసూచకమ్।**
**యదన్యత్రాపి దృశ్యేత తత్ తేనైవ వినిర్దిశేత్॥ 35**

**ప్రతిపదార్థము:-** యస్య=ఏ, పుంసః=పురుషునికి, యత్ లక్షణమ్=ఏ లక్షణము, వర్ణాభి సూచకమ్ =జాతిని సూచించునదిగా, ప్రోక్తమ్=చెప్పబడెనో, యత్=ఏలక్షణము, అన్యత్ర+అపి=వర్ణాంతరము

**ప్రతిపదార్థము:–** యావత్=ఎంతపర్యంతము, ఆత్మనా=స్వరూప సాక్షాత్కారముచే, ఇదమ్=ఈ దేహేంద్రియాదికము, ఆభాసమ్=కేవల సత్యమట్లు తోచుచున్నదై, కల్పయిత్వా=నిశ్చయించిన, ఈశ్వరః=జీవుడు స్వతంత్రుడు కాదో, తావత్=అంతపర్యంతము, ద్వైతమ్=నేను పురుషుడనను, ఈమె స్త్రీయను భేదభావమున, విరమేత్=లేకపోదు. తతః హి=ఆ ద్వైతభావము వలననే, అస్య=ఈ పురుషునికి, విపర్యయః=భోగ్యతా బుద్ధి కావున స్త్రీ సామీప్యము వీడవలయును.

**తాత్పర్యము:–** ఈ దృశ్య ప్రపంచమంతయు మిథ్యయనియు ఈ దేహేంద్రియాదికమంతయు కేవలము తోచుచున్నదై అభాస మాత్రము గాని నిక్కము గాదనియు, ఆత్మసాక్షాత్కారము నిశ్చయించుకొని జీవుడు దానికి లొంగక స్వతంత్రుడై యెప్పటివరకు గాడో అంతవరకు నేనుఁ బురుషుడను ఈమె స్త్రీ అను ద్వైతభావము భేదదృష్టిపోదు. కావున పురుషుడు స్త్రీ సాన్నిధ్యము వర్జింపవలెనని భావము.

**శ్లో॥ ఏతత్సర్వం వ్రతస్థస్య సమామ్నాతం యతేరపి।**
**గురువృత్తిర్వికల్పేన గృహస్థస్యర్తుగామినః॥ 11**

**ప్రతిపదార్థము:–** ఏతత్సర్వమ్=సుశీలయను శ్లోకము మొదలు చెప్పబడిన బ్రహ్మచారి నియమము లన్ని సమామ్నాతం వరకూ చెప్పెను. వ్రతస్థస్య=నియమవ్రతముగల, యతేః అపి=సన్యాసినికిని, ఋతుగామినః=ఋతుకాలాభిగమనము, వికల్పేన=వికల్పముగా, ఉండుచు నుండకయు, సమామ్నాతమ్=చెప్పబడెను.

**తాత్పర్యము:–** ఈ చెప్పబడిన బ్రహ్మచారి ధర్మములన్నియు వ్రతస్థుడైన సన్యాసికిని దగును. ఋతుకాల సంగమముగల గృహస్థునికి ఋతుకాల సాంగత్యము వికల్పముగా ఒకప్పుడుండి ఒకప్పుడుండక పోవచ్చునని చెప్పబడినది.

**శ్లో॥ అఞ్జనాభ్యఞ్జనోన్మర్దస్త్ర్యవలేఖామిషం మధు।**
**స్రగ్గన్ధలేపాలఙ్కారాంస్త్యజేయుర్యే ధృతావ్రతాః॥ 12**

**ప్రతిపదార్థము:–** అంజన=కాటుక, అభ్యంజన=తలయంటుకొను, ఉన్మర్ద=నలుగు, స్త్రీ=స్త్రీ, అవలేఖ్య=స్త్రీలు చిత్రలేఖనము,అమిషమ్=మాంసము, మధు=తేనె, స్రక్+గంధలేపాలంకారాన్ =పుష్పమాలలు, గంధముపూతలు ఆభరణములు, యే=ఏ, ధృతవ్రతాః=వ్రతదీక్షగలవారు, త్యజేయుః=త్యజించవలెను. ఇందు అభ్యంగనాదులు పనికిరావని నిషేధించెను.

**తాత్పర్యము:–** కన్నుల కాటుక పెట్టుకొనుట, తలయంటుకొనుట, నలుగుపెట్టుకొనుట స్త్రీతో చిత్రలేఖనముగావించుట, మాంసము తినుట, తేనె త్రాగుట, పూలదండలు ధరించుట గంధము పూసుకొనుట, నగలు పెట్టుకొనుట అనునవి వ్రత దీక్షగలవారు త్యజించవలెను.

**శ్లో॥ ఉషిత్వైవం గురుకులే ద్విజోఽధీత్యావబుధ్య చ।**
**త్రయీం సాఙ్గోపనిషదం యావదర్థం యథాబలమ్॥ 13**

**ప్రతిపదార్థము:–** ద్విజః=బ్రహ్మచారి, ఏవమ్=ఇట్లు, గురుకులే=గురుకులమునందు, ఉషిత్వా= నిలిచి, స+అంగ+ఉపనిషదమ్=శిక్షాదులగు నంగములతో నుపనిషత్తులతోను కూడిన,



# శ్రీః
# అథ ద్వాదశోఽధ్యాయః

ఈ ద్వాదశాధ్యాయమునందు బ్రహ్మచారి వానప్రస్థుల ధర్మములు వర్ణింపబడెను. నాలుగాశ్రమముల సాధారణ ధర్మములు చెప్పబడెను. ఈ ద్వాదశాధ్యాయమునందు బ్రహ్మచర్య వానప్రస్థము యొక్క సాధారణ ధర్మములు చెప్పబడెను. చాతుర్వర్ణ్యముల యొక్క సాధారణ ధర్మములు, త్రయోదశాధ్యాయమున యతిధర్మము, చతుర్దశాధ్యాయమున గృహస్థధర్మము, పంచదశాధ్యాయమున సర్వధర్మసంగ్రహమును చెప్పబడెను.

**నారద ఉవాచ**

**శ్లో॥ బ్రహ్మచారీ గురుకులే వసన్ దాన్తో గురోర్హితమ్।**
**ఆచరన్ దాసవన్నీచో గురౌ సుదృఢసౌహృదః॥ 1**

**ప్రతిపదార్థము:–** బ్రహ్మచారీ!=బ్రహ్మచారి, గురుకులే=గురుకులమునందు, వసన్=నివసించు, దాంతః=ఇంద్రియముల నిగ్రహించినవాడై, గురౌ=గురువునందు, సుదృఢసౌహృదః=మిక్కిలి గాఢమైన స్నేహము గలవాడు, గురోః=గురువునకు, హితమ్=ఇష్టమైన దానిని, దాసవత్= సేవకుడు వలె, నీచః=అల్పుడై, ఆచరన్=ఆచరించుచు సేవించవలెను.

**తాత్పర్యము:–** బ్రహ్మచారి గురుకులమునందు నివసించుచు, ఇంద్రియముల నిగ్రహించి గురువు నందు మిక్కిలి దృఢమైన స్నేహముగలవాడై, దాసుడవలె, అల్పుడై గురువునకు హితమాచరించుచు సేవించవలెను.

**శ్లో॥ సాయం ప్రాతరుపాసీత గుర్వగ్న్యర్కసురోత్తమాన్।**
**సన్ధ్యే ఉభే చ యతవాగ్జపన్ బ్రహ్మ సమాహితః॥ 2**

**ప్రతిపదార్థము:–** సాయమ్=సాయంకాలమున, ప్రాతః=ఉదయకాలమునను, జపన్= జపించుచు, గురు+అగ్ని+అర్క సురోత్తమాన్=గురువును, అగ్నిని, సూర్యుని దేవతాశ్రేష్ఠులను, ఉపాసీత= ఉపాసించవలెను. ఉభే సంధ్యే=రెండుసంధ్యలలోను యతవాన్=మౌనమవలంబించి, సమాహితః =చిత్త సమాధానము గలవాడై, బ్రహ్మ=గాయత్రిని, జపన్=జపించుచు....

**తాత్పర్యము:–** సాయంకాలమున, ఉదయకాలమునను, జపించుచు గురువును, అగ్నిని, సూర్యుని దేవతాశ్రేష్ఠులను ఉపాసించవలెను. రెండుసంధ్యలలోను మౌనమవలంబించి, చిత్త సమాధానము గలవాడై గాయత్రిని జపించుచు....

**శ్లో॥ ఛన్దాంస్యధీయీత గురోరాహూతశ్చేత్ సుయన్త్రితః।**
**ఉపక్రమేఽవసానే చ చరణౌ శిరసా నమేత్॥ 3**

**ప్రతిపదార్థము:–**గురోః=గురువువలన, ఆహూతఃచేత్=పిలువబడినవాడయ్యేనేని, సుయంత్రితః =నియమముగలవాడై వినయముతో, ఛందాంసి=వేదములను, అధీయీత=అధ్యయనము

చేయుటకు, ఉపక్రమే=ప్రారంభమందు, అవసానే=పరిసమాప్తియందును, చరణౌ=గురుని పాదములను గూర్చి, శిరసా=శిరముతో, నమేత్=మ్రొక్కవలెను.

**తాత్పర్యము:-** గురునిచేఁబిలువబడిన వాడగుచు నియమము వినయముగలవాడు వేద అధ్యయన ప్రారంభమందును పరిసమాప్తియందును గురుని చరణములకు మ్రొక్కుచు వేదములను అధ్యయనము చేయవలెను.

**శ్లో॥ మేఖలాజినవాసాంసి జటాదణ్డకమణ్డలూన్।**
**బిభృయాదుపవీతం చ దర్భపాణిర్యథోదితమ్॥ 4**

**ప్రతిపదార్థము:-** యథా+ఉదితమ్=ధర్మశాస్త్రమునందు జెప్పబడిన ప్రకారము, మేఖలా+అజిన వాసాంసి=మౌంజి, జింక చర్మమును వస్త్రము, జటాదండకమండలూన్=జడలను, దండమును, కమండలమును, ఉపవీతం చ=యజ్ఞోపవీతమును, దర్భపాణిః=దర్భలను హస్తమునందు గలవాడై, బిభృయాత్=ధరింపవలెను.

**తాత్పర్యము:-** జటాధారణము, కేశప్రసాధనము లేకుండుట (తలగొరుగుట) బ్రహ్మచారి దర్భలనుహస్తమునంబూని, ధర్మశాస్త్రమునఁజెప్పబడిన ప్రకారము మొలత్రాడు, కృష్ణాజినమును వస్త్రములను, జడలను, కమండులువును ధరించవలెను.

**శ్లో॥ సాయమ్ప్రాతశ్చరేద్భైక్షం గురవే తన్నివేదయేత్।**
**భుఞ్జీత యద్యనుజ్ఞాతో నో చేదుపవసేత్ క్వచిత్॥ 5**

**ప్రతిపదార్థము:-** సాయంప్రాతః=సాయంకాలమందు, ప్రాతఃకాలమందు, భైక్షమ్ తత్=సంపాదించిన ఆ భిక్షను, గురవే=గురువు కొఱకు, నివేదయేత్=సమర్పింపవలెను, అనుజ్ఞాత=గురువు నాజ్ఞననుసరించి, భుంజీత=భుజింపవలెను, యది=పక్షాంతరము, నోచేత్=లేనిచో, క్వచిత్=ఒకప్పుడు, ఉపవసేత్=ఉపవసింపవలె.

**తాత్పర్యము:-** సాయంకాలమందు, ప్రాతఃకాలమందు సంపాదించిన ఆ భిక్షను గురువునకు సమర్పింపవలెను. గురువు ఆజ్ఞననుసరించి భుజింపవలయును. పక్షాంతరము ఒకప్పుడు ఉపవసింపవలెను.

**శ్లో॥ సుశీలో మితభుగ్దక్షః శ్రద్దధానో జితేన్ద్రియః।**
**యావదర్థం వ్యవహరేత్ స్త్రీషు స్త్రీనిర్జితేషు చ॥ 6**

**ప్రతిపదార్థము:-** సుశీలః=మంచి స్వభావము గలిగినవాడై, మితభుక్=మితాహారియు, దక్షః=కార్యదక్షుడు, శ్రద్దధానః=శ్రద్ధాళువు, జితేంద్రియః=ఇంద్రియములను జయించినవాడునై, స్త్రీషు=స్త్రీలయందు, స్త్రీనిర్జితేషు=స్త్రీలకు వశులైన పురుషులందును, యావత్+అర్థమ్=ఎంత మాత్రం ప్రయోజనమో, వ్యవహరేత్=అంత మాత్రము వ్యవహరించవలెను.

**తాత్పర్యము:-** బ్రహ్మచారి మంచి స్వభావముగలవాడై మితాహారియు కార్యసమర్థుడు, శ్రద్ధగలవాడు, జితేంద్రియుడునై స్త్రీలతోను, స్త్రీలకు లోనైన పురుషులతో తనకెంత మాత్ర మావశ్యకమో అంతియ మాట్లాడవలెను. అధికప్రసంగము కూడదనును.





**శ్లో॥ వర్జయేత్ప్రమదాగాథామగృహస్థో బృహద్వ్రతః।**
**ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్త్యపి యతేర్మనః॥ 7**

**ప్రతిపదార్థము:-** బృహత్+వ్రతః=బ్రహ్మచర్య వ్రతముగలవాడు, అగృహస్థః=గృహస్థుడు కానివాడు బ్రహ్మచారి, ప్రమదాగాథామ్=స్త్రీ విషయకమైన వార్తను గూడ, వర్జయేత్=వర్జించవలెను, ప్రమాథీని=బలవంతములైన, ఇంద్రియాణి=ఇంద్రియములను, యతేః=సన్యాసియొక్క, మనః అపి=మనస్సుసైతము, హరంతి=హరించుచున్నవి.

**తాత్పర్యము:-** బ్రహ్మచర్యవ్రతము గలిగి గృహస్థునికి వ్యతిరిక్తుడైన బ్రహ్మచారి స్త్రీవిషయకమైన వృత్తాంతమును గూడ విసర్జించవలెను. ఏలయన బలవంతములగు ఇంద్రియము యతియొక్క మనస్సును సైతము హరించుచున్నది.

**శ్లో॥ కేశప్రసాధనోన్మర్దస్నపనాభ్యఞ్జనాదికమ్।**
**గురుస్త్రీభిర్యువతిభిః కారయేన్నాత్మనో యువా॥ 8**

**ప్రతిపదార్థము:-** యువా=యువకుడైన బ్రహ్మచారి, ఆత్మనః=తనకు, కేశప్రసాధనో...దికమ్-కేశ ప్రసాధన=తలవెంద్రుకలను దువ్వుకొనుట, ఉన్మర్ద=నలుగుపిండి పూసుకొనుట, స్నపన=స్నానము, అభ్యంజన+ఆదికమ్=కాటుక పెట్టుకొనుటలోనగునవి, యువతిభిః=యౌవనమున నున్న, గురుస్త్రీభిః=గురువుయొక్క స్త్రీలచే, న కారయేత్=చేయించుకొనగూడదు.

**తాత్పర్యము:-** యువకుడైన బ్రహ్మచారి తలదువ్వుకొనుట, నలుగుపెట్టుకొనుట, తలయంటి స్నానము, కాటుక పెట్టుకొనుటలోనగువానిని ప్రాయమున నున్న గురుస్త్రీలచే (భార్య, సోదరి, పుత్రిక) తనకు జేయించుకొనకూడదు.

**శ్లో॥ నన్వగ్నిః ప్రమదానామ ఘృతకుమ్భసమః పుమా।**
**సుతామపి రహో జహ్యాదన్యథా యావదర్థకృత్॥ 9**

**ప్రతిపదార్థము:-** నను=ఓయీ!, ప్రమదానామ=స్త్రీయనగా, అగ్నిః=అగ్నివంటిది, పుమాన్=పురుషుడు, ఘృతకుంభసమః=నేతికుండ వంటివాడు, అతః=అందువలన, రహః=ఏకాంత మందు, సుతాం+అపి=కూతునైనను, జహ్యత్=విడవడమో, అన్యథా=అటుగాక, కేశప్రసాధ నాదులకు వ్యతిరిక్తమైన సమయమున, పెక్కుఱు స్త్రీలు స్నపనమునకు, యావదర్థకృత్=యెంత యుపయోగమూ అంత మాత్రమే వ్యవహరించవలెను.

**తాత్పర్యము:-** ఏలయన స్త్రీ అగ్నివంటిది. పురుషుడు నేతికుండ వంటివాడు. ఈ రెండు నొకచోట చేరినచో నేయి కరిగిపోవును. అట్లే పురుషుడు స్త్రీ సమీపమున చాంచల్యము నొందును. కావున ఈ ఏకాంతమునందు పురుషుడు తన కూతును సైతము దగ్గర చేర్చరాదు. తలదువ్వు కొనుటలోనగు పనులవేళకానప్పుడు పదిమంది స్త్రీలున్నప్పుడు ఎంతమాత్రము తనకు వారితో ఎంతమాత్రము పనియో అంతమాత్రము వారితో వ్యవహరించవలెనని భావము.

**శ్లో॥ కల్పయిత్వాత్మనా యావదాభాసమిదమీశ్వరః।**
**ద్వైతం తావన్న విరమేత్ తతో హ్యస్య విపర్యయః॥ 10**

**తాత్పర్యము:–** ముని యెప్పుడు వ్యాధులచే బాధపడుచు, ముసలితనమున శ్రమపడుచు కర్మనుష్ఠానమునందు, జ్ఞానాభ్యసనమగు బ్రహ్మవిద్యయందు అసమర్థుడైనచో ఉపవాసాదికము చేయవలెను.

**శ్లో॥ ఆత్మన్యగ్నీన్ సమారోప్య సన్న్యస్యాహం మమాత్మతామ్।**
**కారణేషు న్యసేత్సమ్యక్ సఙ్ఘాతం తు యథార్హతః॥ 24**

**ప్రతిపదార్థము:–** ఆత్మని=ఆత్మయందు, అగ్నీన్=అగ్నిని, సమారోప్య=ఆరోపించి, అహం+ మమాత్మకతామ్=అహంకారమును, మమకారమును, సన్న్యస్య=విడిచి, సంఘాతమ్= దేహమును, కారణేషు=దేహకారణములైన, ఆకాశాదిపంచ మహాభూతములందు, యథార్హతః =యోగ్యమగు విధమున, సమ్యక్=చక్కగా, న్యసేత్=ప్రవిలాపనమును లయము చేయవలెను.

**తాత్పర్యము:–** ఆత్మయందు అగ్నులను సమారోపణము చేసి అహంకార మమకారములను వదలి దేహమును దేహకారణములైన ఆకాశాది పంచమహాభూతములందు యోగ్యమగు విధమున చక్కగా ప్రవిలాపనము చేయవలెను.

**శ్లో॥ ఖే ఖాని వాయౌ నిశ్వాసాంస్తేజస్యూష్మాణమాత్మవాన్।**
**అప్స్వసృక్ శ్లేష్మపూయాని క్షితౌ శేషం యథోద్భవమ్॥ 25**

**ప్రతిపదార్థము:–** ఆత్మవాన్=బుద్ధిమంతుడు, ఖే=ఆకాశమందు, ఖాని=దేహగతములైన నవ రంధ్రములను, వాయౌ=వాయువునందు, నిశ్వాసాన్=నిట్టూర్పులను, తేజసి=అగ్నియందు, ఉష్మాణామ్=వేడిమిని, అప్సు=జలములందు, అసృక్+శ్లేష్మపూయాని=రక్తమును కళ్ళె (శ్లేష్మము)ను మలమును, క్షితౌ=భూమియందు, శేషమ్=శేషించి, అస్థులు, మాంసములోనగు కఠినాంగము లను, యథా+ఉద్భవమ్=ఏది యేది ఎట్లు ఉద్భవించినవో అట్లు ప్రవిలాపనము చేయవలెను.

**తాత్పర్యము:–** ముని ధీమంతుడు ఆకాశమందు దేహగతములైన నవరంధ్రములను, వాయువు నందు నిట్టూర్పులను, అగ్నియందు వేడిమిని, జలములందు రక్తము శ్లేష్మము, మలములను భూమియందు శేషించిన అస్థిమాంసాదికమగు కఠినాంశమును ప్రవిలాపనము చేయవలెను.

**శ్లో॥ వాచమగ్నౌ సవక్తవ్యామిన్ద్రే శిల్పం కరావపి।**
**పదాని గత్యా వయసి రత్యోపస్థం ప్రజాపతౌ॥ 26**

**ప్రతిపదార్థము:–** సః=ఆ ముని, వక్తవ్యామ్=వచింపదగిన, వాచమ్=వాక్కును, అగ్నౌ=అగ్ని యందు, న్యసేత్=ఉంచవలెను. ఇంద్రే=ఇంద్రునందు, శిల్పమ్=పనిచేయుటయందునేర్పును, కరౌ+అపి=హస్తములను, గత్యా=గమనములో, పదాని=పాదములను, వయసి=విష్ణువునందు, రత్యా=కామాభిలాషతో సంగమములతో, ఉపస్థమ్=గుహ్యేంద్రియమును, ప్రజాపతౌ=ప్రజా పతియం దుంచవలెను.

**తాత్పర్యము:–** ముని వచింపదగువాక్కును అగ్నియందును, పనిచేయు నేర్పుగల హస్తములను ఇంద్రునందు, నడవగలపాదములను విష్ణువునందు, సంభోగముతో కూడిన గుహ్యేంద్రియ మును ప్రజాపతియందును లయింపజేయవలెను.





త్రయీమ్=శ్రుతిని, యావదర్థమ్=తనయధికారమునకనుసరించి, యథాబలమ్=తన శక్తి ననుసరించి, అధీత్య=అధ్యయనము చేసి, అవబుధ్య చ=దాని యర్థమును విచారము చేసి...

**తాత్పర్యము:–** బ్రహ్మచారి గురుకులమునందిట్లు వసించుచు తన యధికారము బలము అనుసరించి శిక్షాదిషడంగములతో నుపనిషత్తులతో వేదము నధ్యయనము చేసి వాని యర్థమును విచారము చేయవలెను.

**శ్లో॥ దత్త్వా వరమనుజ్ఞాతో గురోః కామం యదీశ్వరః।**
**గృహం వనం వా ప్రవిశేత్ ప్రవ్రజేత్ తత్ర వావసేత్॥ 14**

**ప్రతిపదార్థము:–** యదీశ్వరః=తానుశక్తుడగునేని, గురోః=గురునకు, కామమ్=ఇష్టమైన, వరం =గురుదక్షిణను, దత్త్వా=ఇచ్చి, అనుజ్ఞాతః=గురువు అనుజ్ఞపొంది, తన అధికారమునను గురించి, వనమ్=పరిశుద్ధమైన, వానప్రస్థమ్=వానప్రస్థమును గాని, గృహమ్=గృహస్థా శ్రమమును గాని, ప్రవిశేత్=గ్రహించవలెను, ప్రవ్రజేత్=సన్యాసమును గ్రహించవలెను. లేక, తత్ర వా=ఆ గురుకులము నందే, అవసేత్=నైష్ఠికబ్రహ్మచారియై నివసించవలెను.

**తాత్పర్యము:–** తాను శక్తిగలవాడగునేని గురువు కోరిన గురుదక్షిణ నొసంగి గురుని యనుమతిని పొంది శుభమైన గృహస్థాశ్రమమును గాని, సన్యాసాశ్రమమును గాని, వానప్రస్థమును గాని స్వీకరించవలెను. లేక ఆ గురుకులమునందే నైష్ఠిక బ్రహ్మచారియై వసించవచ్చు. ఇచట వనశబ్దమునకు వానప్రస్థాశ్రమము అర్థము గాదు. శుచియైన గృహశబ్దమున కుపలక్షకము. శ్రుతి : కుటుంబేశుచేదేశే అని. బ్రహ్మచర్యము నుండియే వానప్రస్థము గ్రహించుట సంభవము గాదు. ***"బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్ గృహాద్వనీభూత్వా ప్రవ్రజేత్ యది వేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్ గృహాద్వనాద్వనాత్"*** అని జాబాలి శ్రుతి. బ్రహ్మచర్యమును పూర్తిచేసి గృహస్థుడు కావలెను. గృహస్థాశ్రమము వీడి వాన ప్రస్థాశ్రము గ్రహించవలె. అట్లుండి ఆవల సన్న్యాసమును గ్రహించవలెను. అట్లుగానిచో బ్రహ్మచర్యము నుండియే సన్న్యాసము గ్రహింపదగును. లేక గృహస్థుడై కాని వానప్రస్థుడై గాని సన్న్యాసము గ్రహింపవలెను.

**శ్లో॥ అగ్నౌ గురావాత్మని చ సర్వభూతేష్వధోక్షజమ్।**
**భూతైస్స్వధామభిః పశ్యేద ప్రవిష్టం ప్రవిష్టవత్॥ 15**

**ప్రతిపదార్థము:–** అగ్నౌ=అగ్నియందును, గురౌ=గురువునందును, ఆత్మని=తనయందు, సర్వ భూతేషు=ఎల్ల ప్రాణులందు, స్వధామభిః=తన్ను ఆశ్రయముగాగల, భూతైః=జీవులలో నియంతమై, అప్రవిష్టమ్=ప్రవేశించని, అధోక్షజమ్=విష్ణువును, ప్రవిష్టవత్=ప్రవేశించిన వానిని వలె, పశ్యేత్ =చూడవలెను.

**తాత్పర్యము:–** అగ్నియందు, గురువునందును, తనయందును ఎల్లభూతములందు తన్నా శ్రయముగా గల జీవులతోగూడి నియంతమై యుండుచు నెందును ప్రవేశించని విష్ణువును వారియందు ప్రవేశించియున్నాడని తెలిసికొనవలెను.

**శ్లో॥ ఏవం విధో బ్రహ్మచారీ వానప్రస్థో యతిర్గృహీ।**
**చరన్ విదితవిజ్ఞానః పరం బ్రహ్మాధిగచ్ఛతి॥ 16**

**ప్రతిపదార్థము:-** బ్రహ్మచారీ=బ్రహ్మచారి, ఏవం విధః=ఇట్టి భంగిగలవాడై, వానప్రస్థః=వానప్రస్థుడై, యతిః=యతియై, గృహీ=గృహస్థుడై, చరన్=ప్రవర్తించుచు, విదితవిజ్ఞానః=తెలియబడిన విజ్ఞేయము బ్రహ్మముగలవాడై, పరం బ్రహ్మ=పరబ్రహ్మమును, అధిగచ్ఛతి=పొందుచున్నాడు.

**తాత్పర్యము:-** బ్రహ్మచారి ఇట్టి లక్షణములు గలిగి గృహస్థుడై, వానప్రస్థుడై సన్యాసియై పరమాత్మ తత్త్వమెఱింగి కడపట పరబ్రహ్మమును పొందుచున్నాడు.

**శ్లో॥ వనస్థస్యతు వక్ష్యామి నియమాన్ మునిసమ్మతాన్।**
**యానాతిష్ఠన్ మునిర్గచ్ఛేదృషిలోకమిహాఞ్జసా॥ 17**

**ప్రతిపదార్థము:-** మునిః=వానప్రస్థుడైన ముని, ఇహ=ఈ జగమున, యాన్=ఏ ధర్మములను, ఆతిష్ఠన్=అనుష్ఠించుచు, అంజసా=శీఘ్రము, ఋషిలోకమ్=మహర్లోకము, గచ్ఛేత్=పొందునో, ఆ, వనస్థస్య=వనమునందుండు వానప్రస్థునికి, మునిసమ్మతాన్=మునులు సమ్మతించిన, నియమాన్=నియమములను, వక్ష్యామి=చెప్పుచున్నాను.

**తాత్పర్యము:-** ఇంకను మునులు సమ్మతించిన వానప్రస్థుని ధర్మమును జెప్పెదను వీనిని అనుష్ఠించిన శీఘ్రముగా మహర్లోకమును చేరును.

**శ్లో॥ న కృష్టపచ్యమశ్నీయాదకృష్టం వాప్యకాలతః।**
**అగ్నిపక్వమథామం వా హ్యర్కపక్వముతాహరేత్॥ 18**

**ప్రతిపదార్థము:-** కృష్టపచ్యమ్=దున్ని చల్లి పండిన శాలిధాన్యమును, న అశ్నీయాత్=భుజింప కూడదు. అకాలతః=కాలము గానప్పుడు పండుకాలమువలె ఎండిన, అకృష్టపచ్యమ్=వ్యవసాయము లేక పండు మామిడికాయలు లోనగువాని తినగూడదు. అగ్నిపక్వమ్=అగ్ని పక్వమైన వంటచేయబడి ఉన్నదానిని, అథ ఆమమ్=పచ్చదానిని, అర్కపక్వమ్=సూర్యుని వేడిమికి పండిన పండ్లులోనగు వానిని భుజించకూడదు.

**తాత్పర్యము:-** వానప్రస్థుడగు ముని దున్ని చల్లి పండిన వరిధాన్యమునుగాని, అట్లుగాక అకాలమున పండిన మామిడికాయలులోనగు వానిని గాని, అగ్నియందు వంటచేసిన దానిని గాని, పచ్చివస్తువులను గాని సూర్యుని వేడిమికి మాగిన పండ్లు లోనగు వానిని గాని భుజింప గూడదు.

**శ్లో॥ వన్యైశ్చరుపురోడాశాన్ నిర్వపేన్నిత్యచోదితాన్।**
**లబ్ధే నవే నవేఽన్నాద్యే పురాణం తు పరిత్యజేత్॥ 19**

**ప్రతిపదార్థము:-** వన్యైః=వనము నందు పండిన నివ్వరి ధాన్యములోనగు వానిచే నైన, పురోడాశాన్=పిండిలోనగు హవిర్ద్రవ్యములచే, నిత్యచోదితాన్/కాలచోదితాన్=విధిగా నిత్యము చేయవలసిన అగ్నిహోత్రాది కర్మలను, నిర్వపేత్=హోమముచేతను, నవేనవే=క్రొత్తకొత్తవై, అన్నాద్యే =అన్నాదులు,లబ్ధే=దొఱకినప్పుడు,పురాణమ్=మున్ను దాచియుంచిన ధాన్యాదికమును, పరిత్యజేత్ =విడువవలెను.

**తాత్పర్యము:-** అడవి యందు తమకు తామై పండిన నెమలి వడ్ల బియ్యపు పిండితో నేర్పరచి





పురోడాశమమను హవిర్ద్రవ్యముచే నిత్యము విధిగా చేయవలసిన అగ్నిహోత్రాదులందు హోమము చేయవలెను. క్రొత్త క్రొత్త అన్నాది పదార్థము లభించినచో పాత వానిని త్యజించ వలెను.

**శ్లో॥ అగ్న్యర్థమేవ శరణముటజం వాద్రికన్దరామ్।**
**శ్రయేత హిమవాయ్వగ్నివర్షార్కాతపషాట్స్వయమ్॥ 20**

**ప్రతిపదార్థము:-** హిమ=మంచు, వాయ+అగ్ని=వాయువు, అగ్ని, వర్షా=వాన, అర్క+ఆతపసాత్=సూర్యుని ఎండతోని సహించువాడైన ముని, స్వయమ్=తాను, అగ్న్యర్థం ఏవ =అగ్నుల రక్షణము కొఱకే, ఉటజమ్=పర్ణశాలను, గిరికందరామ్=కొండగుహను, శరణమ్ =గృహమును, శ్రయేత్=ఆశ్రయింపవలెను.

**తాత్పర్యము:-** ముని మంచుగాని నిప్పు, వాన, యెండ అనువానిని సహించువాడగు అగ్నుల రక్షణ కొఱకు మాత్రము పర్ణశాలను గాని కొండగుహను, గృహమును గాని ఆశ్రయించవలెను.

**శ్లో॥ కేశరోమనఖశ్మశ్రుమలాని జటిలో దధత్।**
**కమణ్డల్వజినే దణ్డవల్కలాగ్నిపరిచ్ఛదాన్॥ 21**

**ప్రతిపదార్థము:-** కేశరోమనఖశ్మశ్రుమలాని=తలవెండ్రుకలు, శరీరమునందలి రోమములు, గోళ్ళు, గడ్డము, మీసము, దేహము యొక్క మాలిన్యము అనువానితో, జటిలమ్=జటిలమైన, కమండలు+అజినే=కమండలముతోను, జింకచర్మము, దండవల్కల+అగ్నిపరిచ్ఛదాన్= దండము, నారచీరలోనగు పరికరములు, దధత్=ధరించుచుండును.

**తాత్పర్యము:-** శిరోజములను, మేనియందు రోమములు, గోళ్ళను, గడ్డము, మీసము, రుద్దుకోనందున జనించిన దేహమాలిన్యము, కమండలము, జింక చర్మము, దండము, నారచీర లోనగు పరికరములను ధరించుచు జడలు ధరించినవాడుగావలెను.

**శ్లో॥ చరేద్వనే ద్వాదశాబ్దానష్టౌ వా చతురో మునిః।**
**ద్వావేకం వా యథా బుద్ధిర్న విపద్యేత కృచ్ఛ్రతః॥ 22**

**ప్రతిపదార్థము:-** మునిః=ముని, వనే=అడవియందు, ద్వాదశాబ్దాన్=పన్నెండువత్సరములు, అష్టావా=ఎనిమిదియేండ్లుగాని, చతురః=నాలుగైన, ద్వౌ=రెండు, ఏకం=ఒకటి, యథా=ఏ ప్రకారము, బుద్ధిః కృచ్ఛ్రతః=కష్ట స్థితి నుండి, న విపద్యేత=చెడదో, చరేత్=అట్లు చరించవలెను.

**తాత్పర్యము:-** వానప్రస్థుడు పండ్రెండు గాని, ఎనిమిది గాని, నాలుగు గాని, రెండు గాని, ఒక్కటి గాని యేండ్లు తన బుద్ధి కష్ట స్థలి నుండి యెట్లును చెడని భంగి చరించవలెను.

**శ్లో॥ యదాకల్పః స్వక్రియాయాం చ వ్యాధిభిర్జరయాథవా।**
**ఆన్వీక్షిక్యాం వా విద్యాయాం కుర్యాదనశనాదికమ్॥ 23**

**ప్రతిపదార్థము:-** యదా=ఎప్పుడు, వ్యాధిభిః=రోగములచే, అథవా=లేక, జరయా=వార్ధక్యము చేత, స్వక్రియాయామ్=కర్మానుష్ఠానమునందు, ఆన్వీక్షిక్యామ్=జ్ఞానాభ్యసనరూపమగు, విద్యాయామ్=విద్యయందు,అకల్పః=అసమర్థుడైనచో, అనశనాదికమ్=ఉపవాసాదులను, కుర్యాత్=చేయవలెను.

**శ్లో॥ సర్వభూతసుహృచ్ఛాన్తో నారాయణపరాయణః।
పశ్యేదాత్మన్యదో విశ్వం పరే సదసతోఽ వ్యయే।
ఆత్మానం చ పరం బ్రహ్మ సర్వత్ర సదసన్మయే॥ 4**

**ప్రతిపదార్థము:–** సర్వభూతసుహృత్=ఎల్లప్రాణులకు మిత్రుడై, శాంతః=శాంతుడై, నారాయణ పరాయణః=నారాయణునందు ఆసక్తుడై, సత్+అసతః=కార్యకారణములగు (మాయ–జగత్తు) కంటె, పరే=ఇతరుడైన, అవ్యయే=నాశరహితుడు అయిన, ఆత్మని=పరమాత్మయందు, అదః విశ్వమ్=ఈ జగమును, పశ్యేత్=చూడవలెను, సత్+అసత్+మయే=సత్తగు కారణము మాయ, అసత్తగు కార్యము జగము అనువాని స్వరూపమగు, సర్వత్ర=ఎల్ల విశ్వమందు, పరమ్=బ్రహ్మ, పరుడైన బ్రహ్మమును, ఆత్మానమ్=తన్నును, పశ్యేత్=దర్శింపలెను.

**తాత్పర్యము:–** ఎల్లప్రాణుల హితము కోరువాడును, శాంతచిత్తుడు, నారాయణ ధ్యానపరుడైన యతి సత్ కారణమగు మాయకును, అసత్ కార్యమగు జగమునకును పరుడై నాశరహితుడు అయిన పరమాత్మ యందు ఈ జగమును జూడవలెను. మఱి ఈ కార్యకారణరూపమగు జగము నందంతట అపరబ్రహ్మమును ఆ పరమాత్మయగు తన్నును దర్శింపవలెను.

**శ్లో॥ సుప్తప్రబోధయోస్సన్ధావాత్మనో గతిమాత్మదృక్।
పశ్యన్ బన్ధఞ్చ మోక్షఞ్చ మాయామాత్రం న వస్తుతః॥ 5**

**ప్రతిపదార్థము:–** సుప్తప్రబోధయోః=సుషుప్తి, జాగ్రత్త అనువానియొక్క, సంధౌ=సంధియందు, సుషుప్తియందు తమస్సుచే (అజ్ఞానముచే) ఆవృతమైన ఆత్మతత్త్వము జాగత్స్వప్నములందు విక్షిప్తమై భ్రామిగలదై ప్రకాశించుచున్నది. సంధియందు తమస్సు లేదు, విక్షేపము లేదు. అతః =అందువలన, ఆత్మదృక్=ఆత్మద్రష్ట, ఆత్మను లక్షీకరించియున్నవాడు, ఆత్మనః=ఆత్మ యొక్క, గతిమ్=తత్త్వమును, పశ్యన్=చూచుచు, బంధం చ=బంధముగాని, మోక్షం చ=మోక్షమును, మాయామాత్రమ్=కేవల మాయచే నగు భ్రాంతిగాను, న వస్తుతః=వాస్తవము గాదని చూడవలెను. తనను పరబ్రహ్మముగా అంతట చూడవలెనని అన్వయము. అట్లే యోగగ్రంథమునందు –

*నిద్రాదౌ జాగరస్యాం తు యో భావ ఉపజాయతే।*
*తం భావం భావయన్నిత్యం ముచ్యతే నేతరో యతిః॥* నిద్రాస్వప్నములందును జాగ్రద్దశయందును ఏ భావము జనించునో ఆ భావమును నిత్యము భావించు యతిముక్తుడగును ఇతరుడు గాడు.

**తాత్పర్యము:–** సుషుప్తియందు తమస్సుతో (అజ్ఞానముతో) నావరించబడిన ఆత్మతత్త్వము జాగ్రత్స్వప్తములందు విక్షిప్తమై భ్రాంతికలదై ప్రకాశించును. సంధియందు మాత్రము తమస్సును బొందదు, విక్షిప్తమునూ గాదు. కావున అప్పుడు ఆత్మద్రష్టయగువాడు ఆ యాత్మను లక్షించుకొని ఆత్మతత్త్వమును చూచుచు బంధముగాని, మోక్షముగాని మాత్రమగును. వాస్తవముగాదని తెలుసుకొనవలెను.

**శ్లో॥ నాభినన్దేద్ధ్రువం మృత్యుమధ్రువం వాస్య జీవితమ్।
కాలం పరం ప్రతీక్షేత భూతానాం ప్రభవాప్యయమ్॥ 6**



**శ్లో॥ మృత్యౌ పాయుం చ సోత్సర్గం యథా స్థానం వినిర్దిశేత్।
దిక్షు శ్రోత్రం సనాదేన స్పర్శమధ్యాత్మని త్వచమ్॥ 27**

**ప్రతిపదార్థము:–** మృత్యౌ=మృత్యువునందు, స+ఉత్సర్గమ్=విసర్జనముతో గూడిన, పాయుం= పాయువింద్రియమును, యథా స్థానమ్=తగిన స్థానమున, వినిర్దిశేత్=లయింపజేయవలెను. దిక్షు=దిక్కులందు, సనాదేన=శబ్దముతో, శ్రోత్రమ్=శ్రోత్రేంద్రియమును, అధ్యాత్మని=వాయువు నందు, స్పర్శేన=స్పర్శముతో, త్వచమ్=త్వగింద్రియమును లయింపజేయవలెను.

**తాత్పర్యము:–** మృత్యువునందు మలమును విసర్జనంబు గుణంబుగల పాయువున నింద్రి యంబు, దిక్కులందు శబ్దగుణముగల శ్రోత్రేంద్రియమును, వాయువునందు స్పర్శ గుణముతో గూడిన త్వగింద్రియమును ఆయా స్థానమునఁదగినట్లు లయము చేయవలెను.

**శ్లో॥ రూపాణి చక్షుషా రాజఞ్జ్యోతిష్యభినివేశయేత్।
అప్సు ప్రచేతసా జిహ్వాం ఘ్రేయైర్ఘ్రాణం క్షితౌ న్యసేత్॥ 28**

**ప్రతిపదార్థము:–** రూపాణి=రూపగుణమును, చక్షుషా=చక్షురింద్రియమును, జ్యోతిషి=ఆదిత్యు నందు, ప్రచేతసా=అభినివేశగుణమునుగల రసనేంద్రియాది పది వరుణునిలోను, జిహ్వామ్=రస నేంద్రియము, అప్సు=రసరూపములైన జలములలోను, ఘ్రేయైః=గంధగుణముగల ఘ్రాణేంద్రి యాధిపతులగు అశ్వినులతోగూడ, ఘ్రాణమ్=ఘ్రాణేంద్రియము, క్షితౌ=భూమియందు, నివేశయేత్ =న్యాసము చేయవలెను.

**తాత్పర్యము:–** రూపముతో గూడిన చక్షురింద్రియమును ఆదిత్యునందు న్యాసము చేయవలెను. అట్లు ఇంద్రియాది పదివరుణునితో, రసనేంద్రియమును, రసరూపములైన జలము లందు, ఇంద్రియాధిపతులగు అశ్వినులలో ఘ్రాణేంద్రియము, గంధగుణముగల భూమి యందు న్యాసము చేయవలెను.

**శ్లో॥ మనో మనోరథైశ్చన్ద్రే బుద్ధిర్ బోధ్యైః కలౌ పరే।
కర్మాణ్యధ్యాత్మనా రుద్రే యదహం మమతా క్రియా॥ 29**

**ప్రతిపదార్థము:–** మనః=మనస్సును, మనోరథైః=వాంఛలతో గూడ, చంద్రే=చంద్రునందును, బుద్ధిః(ం)=బుద్ధిని, బోధ్యైః=జ్ఞానగుణములతో, పరే=పరుడై, కవౌ=బ్రహ్మమునందు, యత్= ఎవనివలన, అహం మమతా=అహంకార మమకారములు, క్రియా=క్రియ కలుగును, రుద్రే= ఆరుద్రునందు, కర్మాణి=కర్మలను అధ్యాత్మనా=అహంకారమును లయము చేయవలెను.

**తాత్పర్యము:–** వాంఛలతో గూడ మనస్సును చంద్రునందు, జ్ఞానగుణములతో గూడ బుద్ధిని పరబ్రహ్మమునందు, కర్మములను అహంకారమును ఎవనివలన అహంకారమమకార రూప మైన క్రియగలుగు ఆ రుద్రునందు లయింపజేయవలెను.

**శ్లో॥ సత్త్వేన చిత్తం క్షేత్రజ్ఞే గుణైర్వైకారికం పరే॥ 30**

**ప్రతిపదార్థము:–** సత్త్వేన=చేతనతో గూడ, చిత్తమ్=చిత్తమును, క్షేత్రజ్ఞే=క్షేత్రజ్ఞునందు, గుణైః =మున్ను పేర్కొన్న శబ్దాది గుణములతో, వైకారికమ్=భోక్తనను వికారముగల, క్షేత్రజ్ఞేపరే= నిర్వికారమగు బ్రహ్మమునందును లయింపజేయవలెను.

**తాత్పర్యము:–** చేతనతో గూడిన చిత్తమును క్షేత్రజ్ఞునందును శబ్దాది గుణ కారణములైన ఇంద్రియములతో గూడిన భోక్తమను వికారమును పొందిన ఆ క్షేత్రజ్ఞుని పరబ్రహ్మమునందు లయింపజేయవలెను.

**శ్లో॥ అప్సు క్షితిమపో జ్యోతిష్యదో వాయౌ నభస్యముమ్।**
**కూటస్థే తచ్చ మహతి తదవ్యక్తేఽక్షరే చ తత్॥ 31**

**ప్రతిపదార్థము:–** క్షితిమ్=పృథివిని, అప్సు=జలములందు, అపః=జలములు, జ్యోతిషి=అగ్ని యందు, అదః=ఈ అగ్నిని, వాయౌ=వాయువునందు, అముమ్=ఈ వాయువులను, నభసి= ఆకాశమందు,తత్ చ=ఆకాశము,కూటస్థే=అహంకారతత్త్వములోను, తత్=ఆ మహాత్తత్త్వము, అవ్యక్తే=ప్రధానమునందు,తత్ చ=ఆ ప్రధానమును, అక్షరే=పరమాత్మయందు లయింపవలెను.

**తాత్పర్యము:–**పృథివిని జలములందు, ఆ జలములను అగ్నియందు, ఆ అగ్నిని వాయువు నందు, వాయువును ఆకాశమునందు, ఆకాశమును అహంతత్త్వమునందు, అహంతత్త్వమును మహత్తత్త్వమునందు, ఆ మహత్తత్త్వము ప్రధానమునందు, ప్రధానము పరమాత్మయందు లయింపజేయవలెను.

**శ్లో॥ ఇత్యక్షరతయాత్మానం చిన్మాత్రమవశేషితమ్।**
**జ్ఞాత్వాఽద్వయోఽథ విరమేద్దగ్ధయోనిర్వివానలః॥ 32**

**ప్రతిపదార్థము:–** ఇతి=ఇట్లు, ఆత్మానమ్=తన్ను, అక్షరతయా=పరమాత్మరూపమును కేవల జ్ఞానస్వరూపుడని, అవశేషితమ్=శేషించినవానిగా, జ్ఞాత్వా=ఎఱిగి, అద్వయః=అద్వితీయుడై, అథ=అంత, దగ్ధయోనిః=కాష్ఠములన్నింటిని దహించిన, అనలః ఇవ=అగ్నివలె, విరమేత్= అనశనాది వ్రతమును జేయవలెను.

**తాత్పర్యము:–** ఇట్లు తన్ను కేవల జ్ఞానస్వరూపుడై శేషించి పరమాత్మనుగా నెఱింగి అద్వితీయుడై యంత కట్టెలను దహించిన అగ్నివలెను సర్వం ప్రయత్నమును విరమించి అనశనాదికమును చేయవలెను.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**యుధిష్ఠిర నారదసంవాదే సదాచారనిర్ణయే నామ ద్వాదశోఽధ్యాయః(12)**



## శ్రీః
## అథ త్రయోదశోఽధ్యాయః

ఈ అధ్యాయమందు సాధకుడైన యతియొక్క దొడ్డ ధర్మము చెప్పబడును. మఱియు అవధూతయొక్క ఇతిహాసముచే సిద్ధావస్థ కూడా చెప్పబడును. వర్ణింపబడును.

**నారద ఉవాచ**

**శ్లో॥ కల్పస్త్వేవం పరివ్రజ్య దేహమాత్రావశేషితః॥ 1**

**ప్రతిపదార్థము:–** కల్పః=సమర్థుడగు ముని, ఏవమ్=ఈ ప్రకారము, పరివ్రజ్య=లయింపజేసి, ఇంద్రియాదికమునకు వలె వాని వాని కారణములందు లయింపజేసి, దేహమాత్ర+అవశేషితః =దేహమును మాత్రము శేషించినవాడు కావలెను.

**తాత్పర్యము:–** ఇట్లు సమర్థుడైన ముని ఇంద్రియాదికమునంతను వాని వాని కారణములందు లయింపజేసి దేహమును మాత్రము శేషించినవాడు కావలెను.

**శ్లో॥ గ్రామైకరాత్రవిధినా నిరపేక్షశ్చరేన్మహీమ్।**
**బిభృయాద్యద్యసౌ వాసః కౌపీనాచ్ఛాదనం పరమ్॥ 2**

**ప్రతిపదార్థము:–** గ్రామ+ఏకరాత్రవిధినా=గ్రామమునందొక్క రాత్రి మాత్రమే యుండు నియమముతో, నిరపేక్షః=ఏ కోరికలేనివాడై, మహీమ్=భూమిని, చరేత్=సంచరించవలెను, యత్=ఏ కారణము, అసౌ=ఈయతి, కౌపీన+ఆచ్ఛాదనమ్=గోచీని మాత్రము కప్పునదైన, పరమ్=కేవలము, వాసః=వస్త్రములు, బిభృయాత్=ధరించవలెను.

**తాత్పర్యము:–** ఒక్క గ్రామమునందొక్క రాత్రి మాత్రమే యుండు నియమములో ఈయః ఏ అపేక్షలేనివాడై భూమిని సంచారము చేయవలెను. గోచిని కప్పునంత వస్త్రమును మాత్రము ధరించవలెను.

**శ్లో॥ త్యక్తం న లిఙ్గదణ్డాదేరన్యత్ కిఞ్చిదనాపది।**
**ఏక ఏవ చరేద్భిక్షురాత్మారామోఽనపాశ్రయః॥ 3**

**ప్రతిపదార్థము:–** త్యక్తమ్=(ప్రేషోచ్చారణపూర్వమ్), సన్న్యస్తంమయా=నాచే సన్న్యసింపబడినది అనుట, లింగదండాదేః=సన్న్యాసి చిహ్నములైన దండములోనగువానికంటె, అన్యత్=ఇతరము, న=ధరించరాదు, కించిత్=ఏ కొంచెము వస్తువును, అనాపది=సంకటస్థితిలేనపుడు, న=ధరింప రాదు, భిక్షుః=సన్యాసి, ఆత్మారామః=ఆత్మయందు ధరించువాడు, అనపాశ్రయః=నియతమైన నివాసములేనివాడునై, ఏకః ఏవ=ఒక్కడే, చరేత్=దేశ సంచారము చేయవలెను.

**తాత్పర్యము:–** నేను సన్న్యసించితిని అను ప్రేషోచ్చారణమునకు పూర్వమన్నింటిని త్యజించిన వాడు కావున సన్న్యాసి. దండకమండలములులోనగు సన్న్యాసి చిహ్నములు తప్ప దక్కిన వేమియును ధరింపరాదు.

భోగినామ్=భోగవంతులకు, అయం దేహః=ఈ దేహము, పీవా భవతి= బలిసినదగును, న+అన్యథా ఖలు=ఇతరము గాదు.

**తాత్పర్యము:–** అయ్యా! చక్కని ప్రయత్నపరుడైన భోగవంతుడువలె నీవు బలిసిన దేహమును ధరించియున్నావు. లోకమునందు ప్రయత్నపరులకే విత్తము లభించును. విత్తవంతులకే భోగములు కలుగును గదా! భోగము గలవారికే శరీరము బలిసినదగును గాని ఇతరములకు గాదు.

**శ్లో॥ న తే శయానస్య నిరుద్యమస్య బ్రహ్మన్ను హార్థో యత ఏవ భోగాః।**
**అభోగినోఽయం తవ విప్ర దేహః పీవా యతస్తద్వద నః క్షమం చేత్॥ 18**

**ప్రతిపదార్థము:–** బ్రహ్మన్=ఓ బ్రాహ్మణోత్తమా!, విప్రోత్తమా, యతః ఏవ=దేనివలననే, భోగాః =భోగములు గలుగునో, శయానస్య=పరుండి, నిరుద్యమస్య=ఏ ప్రయత్నములేని, తే=నీకు, అర్థః=ధనము, న నుహ=ఎట్లును లేదు, విప్ర=ఓ ప్రవరా!, అభోగినః=భోగములేని, తవ= నీ యొక్క, అయమ్=ఈ, దేహః=దేహము, యతః=ఏ కారణమున, పీవా=బలిసియున్న, తత్=ఆ కారణమును, నః=మాకు, క్షమమ్ చేత్=భాగ్యమగుచో, వద=చెప్పుము.

**తాత్పర్యము:–** ఓ బ్రాహ్మణోత్తమా! దేనివలన భోగములులభించునో, అట్టి అర్థము ఏ ప్రయత్నమూ చెయ్యని నీకెట్లునూ లభించదు గదా! ఓ విప్రవరా! ఈ నీ యొక్క శరీరము దేనివలన బలిసియున్నదో ఆ కారణము చెప్పదగినదగుచో మాకు చెప్పుము.

**శ్లో॥ కవిః కల్పో నిపుణదృక్ చిత్రప్రియకథస్సమః।**
**లోకస్య కుర్వతః కర్మ శేషే తద్వీక్షితాపి వా॥ 19**

**ప్రతిపదార్థము:–** కవిః=విద్వాంసుడు, కల్పః=దక్షుడు, నిపుణదృక్=చతురుడు, చిత్రప్రియకథః =లోకరంజనములైన ఇష్టములైన కథలు చెప్పగలడు, లోకస్య=లోకము, కర్మ కుర్వతః= కర్మచేయు చుండగా, తత్=దాని, వీక్షితాపి వా=అదిచూచుచున్నవాడవు, సమః=ఉదాసీనుడవై యున్నావు.

**తాత్పర్యము:–** విద్వాంసుడు, సమర్థుడు, చతురుడు, లోకరంజనములగు కథలు చెప్పగలవాడు అయియుండి లోకమంతయు కర్మచేయుచుండగా నంతయుఁజూచుచుండి ఉదాసీనుండవై యున్నావేమి? దానికి కారణము ?

నారద ఉవాచ

**శ్లో॥ స ఇత్థం దైత్యపతినా పరిపృష్టో మహామునిః।**
**స్మయమానస్తమభ్యాహ తద్వాగమృతయన్త్రితః॥ 20**

**ప్రతిపదార్థము:–** సః=ఆ, మహామునిః=దొడ్డముని, ఇత్థమ్=ఈ ప్రకారము, దైత్యపతినా=దైత్య ప్రభువగు ప్రహ్లాదునిచే, పరిపృష్టః=ప్రశ్నించబడినవాడై, స్మయమానః=నవ్వుచు, తత్+వాక్+ అమృతయంత్రితః=ఆ దైత్య ప్రభుని వాక్కులనే అమృతముచే వశుడై, తమ్=ఆ ప్రహ్లాదుని గురించి, అభ్యాహ=ఇట్లు వచించెను.

**తాత్పర్యము:–** ఇట్లు ప్రహ్లాదుడు ప్రశ్నించినంతనే ఆ మహాముని నవ్వుచు ఆ ప్రహ్లాదుని వాక్కు అను అమృతమునకు వశుడై ప్రహ్లాదుని గురించి ఇట్లు జెప్పెను.



**ప్రతిపదార్థము:–** ధ్రువమ్=నిశ్చయమైన, మృత్యుమ్=మృత్యువును, అస్య=ఈ దేహముయొక్క జీవితమ్=జీవితమును, న అభినందేత్=మెచ్చుకొని సంతోషింపకూడదు, భూతానామ్=ప్రాణుల యొక్క, ప్రభవ+అప్యయమ్=జన్మమరణములను కలిగించునది, పరమ్=ఉత్కృష్టమైన, కాలమ్= కాలమును, ప్రతీక్షేత=వేచియుండవలెను.

**తాత్పర్యము:–** ధ్రువమైన మృత్యువును గాని అనిత్యమైన ఈ దేహముయొక్క జీవితముగాని తలంచుకొని సంతోషింపగూడదు. ప్రాణుల జన్మమరణ కారణమైన కాలమును మాత్రమే వేచియుండవలెను.

**శ్లో॥ నాసచ్ఛాస్త్రేషు సజ్జేత నోపజీవేత జీవికామ్।**
**వాదవాదాంస్త్యజేత్తర్కాన్ పక్షం కంచిన్న సంశ్రయేత్॥ 7**

**ప్రతిపదార్థము:–** అసత్+శాస్త్రేషు=ఆత్మపరములుగాని శాస్త్రములందు, న సజ్జేత=ఆసక్తుడు కాకూడదు, జీవికాం అపి=జ్యోతిశ్శాస్త్రములోనగు వానివలన జీవితము, న ఉపజీవేత=జీవించ కూడదు. తర్కాన్వాదవాదామ్=తర్కశాస్త్రసంబంధమై జరుపు వితండవాదములను, త్యజేత్= వీడవలెను. కించిత్ పక్షమ్=ఏ పక్షమునుగాని, న సంశ్రయేత్=ఆశ్రయించవలదు.

**తాత్పర్యము:–** ఆత్మబోధముగావింపని శాస్త్రములందు మక్కువపడకూడదు. జ్యోతిషము జీవనముగా జీవించ కూడదు. తర్కశాస్త్ర సంబంధములై జరుపు వితండ వాదమును వీడ వలెను. ఏ పక్షమును గాని ఆశ్రయించవలదు.

**శ్లో॥ న శిష్యాననుబధ్నీత గ్రన్థాన్ నైవాభ్యసేద్బహూన్।**
**న వ్యాఖ్యాముపయుఞ్జీత నారమ్భానారభేత్ క్వచిత్॥ 8**

**ప్రతిపదార్థము:–** శిష్యాన్=శిష్యులను, న+అనుబధ్నీత=ఏదో ఆశపెట్టి బలవంతముగా జేర్చు కొనరాదు. బహూన్ గ్రంథాన్=పెక్కు గ్రంథములను, న+ఏవ+అభ్యసేత్=అభ్యాసము చేయనే కూడదు. వ్యాఖ్యామ్=ఆ గ్రంథములకులేని వ్యాఖ్యలు, ఉపయుంజీత=సమకూర్చవలదు. ఆరంభాత్ =మఠము నిర్మించుటలోనగు ప్రయత్నములు, క్వచిత్=ఎప్పుడు, న+ఆరభేత్=ఆరంభింపకూడదు.

**తాత్పర్యము:–** శిష్యులను ప్రలోభపెట్టి బలవంతముగా నాకర్షించరాదు. బహుగ్రంథములను అభ్యాసముచేయవలదు. ఆ గ్రంథములకు లేనిపోని వ్యాఖ్యలు సమకూర్చకూడదు. మఠనిర్మాణాదు లను ప్రారంభింపవలదు.

**శ్లో॥ న యతేరాశ్రమః ప్రాయో ధర్మహేతుర్మహాత్మనః।**
**శాన్తస్య సమచిత్తస్య బిభృయాదుత వా త్యజేత్॥ 9**

**ప్రతిపదార్థము:–** ప్రాయః=తఱచుగ, మాహాత్మనః=మహాత్ములై, శాంతస్య=శాంతులైన, సమచిత్తస్య =సమచిత్తుడైన, యతేః=పరమహంసయొక్క, ఆశ్రమః=ఆశ్రమము, న ధర్మహేతుః=ధర్మము కొఱకు గాదు, కేవల జ్ఞాని నిమిత్తము. అందువలన జ్ఞానమును నిమిత్తము, బిభృయాత్=దండ కమండలాదికము ధరించవచ్చును. అత=లేక, త్యజేత్ వా=వదలవచ్చును.

**తాత్పర్యము:–** యతి ఆశ్రమము తఱచుగా కేవలము ధర్మము కొఱకు గాదు. కేవల జ్ఞాన

నిమిత్తము మహాత్ముడు, శాంతుడు, సమదర్శనుడు అగు యతి జ్ఞానోత్పత్తి పర్యంతము దండము కమండలములోనగు సన్న్యాసి లక్షణముల నా(శయించియుండును.సత్త్వశుద్ధి కొఱకు యమ నియమాదులను ఆచరించుచునే యుండవలెను. జ్ఞానోత్పత్తియైన తర్వాత నియమము లతో పని లేదు. యమాదులు స్వయముగానే కలిగియుండును. అందువలన చిహ్నములతో ప్రయోజనము లేనందువలన లోకసంగ్రహార్థము వానిని ధరింపవచ్చును లేదా వదలివేయ వచ్చును.

**శ్లో॥ అవ్యక్తలిఙ్గో వ్యక్తార్థో మనీష్యున్మత్తబాలవత్।**
**కవిర్మూకవదాత్మానం స దృష్ట్యా దర్శయేన్నృణామ్॥ 10**

**ప్రతిపదార్థము:–** అవ్యక్తలింగః=బహిర్వ్యాపకముగాని లక్షణము గలవాడు, వ్యక్త+అర్థః=తెలియ బడిన ప్రయోజనము అగు ఆత్మానుసంధానము గలవాడు, మనీషి=పండితుడైన, ఉన్మత్త బాలవత్=పిచ్చివానివలెనగు బాలునివలె, కవిః=జ్ఞానియైన, మూకవత్=మూగవానివలెను, ఆత్మానమ్=తన్ను, నృణామ్=నరులకు, సః=అతడు, దృష్ట్యా=తత్త్వదృష్టితో, దర్శయేత్= కనుపించవలెను.

**తాత్పర్యము:–** వారిట్లు ఉన్మత్తుల రూపములుగా తన్నుఁదలంచుచు అట్లు వర్తించవలెను. స్వదృష్ట్యా అను పాఠము బాహ్య సంధానుభావముతో సన్న్యాసి లక్షణము లేవియుఁబైకి కనిపింపని వాడై ఆత్మను సంధానము మాత్రముగ తాను పండితుడయ్యు ఉన్మత్తునివలె బాలుడువలె కనుపింపవలెను.

## – ప్రహ్లాదాజగరసంవాదమ్ –

**శ్లో॥ అత్రాప్యుదాహరన్తీమమితిహాసం పురాతనమ్।**
**ప్రహ్లాదస్య చ సంవాదం మునేరాజగరస్య చ॥ 11**

**ప్రతిపదార్థము:–** అత్ర=ఈ పరమహంస ధర్మమును, ఉదాహరంతీ=ఉదాహరించునదై, ప్రహ్లాదస్య=ప్రహ్లాదునికిని, ఆజగరస్య=అజగరవ్రతము పూనిన, మునేః=మునికిని, సంవాదమ్ =జరిగిన, ఇతి=ఈ, ఇతిహాసమ్=ఇతిహాసము, పురాతనమ్=ప్రాచీనమును జెప్పెద వినుము.

**తాత్పర్యము:–** ఇందుకుదాహరణమైనది ప్రహ్లాదునికిని అజగరవ్రతముఁబూనిన మునికి జరిగిన సంవాదమై పురాతనమైన ఇతిహాసముగలదు. దానిని చెప్పెదను వినుము అనుట.

**శ్లో॥ తం శయానం ధరోపస్థే కావేర్యాం సహ్యసానుని।**
**రజస్వలైస్తనూదేశైర్నిగూఢామలతేజసమ్॥ 12**

**శ్లో॥ దదర్శ లోకాన్ విచరంల్లోకతత్త్వవివిత్సయా।**
**వృతోఽమాత్యైః కతిపయైః ప్రహ్లాదో భగవత్ప్రియః॥ 13**

**ప్రతిపదార్థము:–** భగవత్ప్రియః=భగవంతునికిష్టుడైన, ప్రహ్లాదః=ప్రహ్లాదుడు, కతిపయైః= కొంతమంది, అమాత్యైః=మంత్రులతో, వృతః=కూడినవాడై, లోకతత్త్వవివిత్సయా=లోకుల స్థితిగతులనుఁదెలియు కోరికతో, లోకాన్=జగములు, విచరన్=సంచరించుచు, సహ్యసానుని= సహ్యాద్రియొక్క చరియమందు, కావేర్యామ్=కావేరీతీర మందు, ధరా+ఉపస్థే=నేలమీద, శయానమ్ =పరుండినవాడు, రజస్వలైః=ధూళితోకూడిన, తనూదేశైః=దేహావయవములు గలవాడు, నిగూఢ+ అమలతేజసమ్=దాగిన స్వచ్ఛమైన బ్రహ్మతేజముగల, తమ్=ఆ యజగర మునిని, దదర్శ= చూచెను.

**తాత్పర్యము:–** ఒకప్పుడు భగవద్భక్తుడైన ప్రహ్లాదుడు కొంతమంది మంత్రులతో కూడి లోకముల స్థితిగతుల నెఱుంగగోరి లోకములను సంచరించుచు సహ్యాద్రిసానువునందు కావేరీ తీరమున నేలపైఁబరుండి ధూళిచే శరీరమంతయు కప్పబడినందున తెలియరాని నిర్మలమైన తేజముతో నున్న ఆయజగరమునిని జూచెను.

**శ్లో॥ కర్మణాకృతిభిర్వాచా లిఙ్గైర్వర్ణాశ్రమాదిభిః।**
**న విదన్తి జనా యం వై సోఽసావితి న వేత్తి చ॥ 14**

**ప్రతిపదార్థము:–** కర్మణా=కర్మచేత, ఆకృతిభిః=రూపములచేత, వాచామ్=మాటచే, వర్ణ+ ఆశ్రమాదిభిః=కులము, ఆశ్రమములోనగు, లింగైః=లక్షణములచే, యం వై=ఎవనిని, జనాః =జనులు, సః=అతడు, అసౌ+ఇతి=ఇట్టివాడు, న వా+ఇతి చ=ఇట్టివాడు కాడు అని, న విదంతి=ఎఱుంగరో.

**తాత్పర్యము:–** కర్మచేతను, రూపముచేతను, వాక్కుచేతను, వర్ణముచేతను ఆశ్రమము లోనగు లక్షణములచేతను ఎవనిని జనులు ఇతడిట్టివాడగును, ఇట్టివాడుకాదని ఎఱుంగరో అట్లుండు వానినిఁ జూచెను.

**శ్లో॥ తం నత్వాభ్యర్చ్య విధివత్ పాదయోశ్శిరసా స్పృశన్।**
**వివిత్సురిదమప్రాక్షీన్మహాభాగవతోఽసురః॥ 15**

**ప్రతిపదార్థము:–** మహాభాగవతః+అసురః=గొప్ప భగవద్భక్తుడగు అసురుడగు ప్రహ్లాదుడు, తమ్=ఆ మునిని గూర్చి, నత్వామ్=నమస్కరించి, విధివత్=శాస్త్రప్రకారము, అభ్యర్చ్య= పూజించి, పాదయోః=పాదములను, శిరసా=శిరస్సుతో, స్పృశన్=స్పృశించుచు, వివిత్సు= ఆయన తత్త్వమెఱుంగకోరి, ఇదమ్=ఈ మాటను, అప్రాక్షీత్=ప్రశ్నించెను.

**తాత్పర్యము:–** భగవద్భక్తులలో శ్రేష్ఠుడగు ప్రహ్లాదుడామునికి నమస్కరించి, శాస్త్రవిధిననుసరించి పూజించి, పాదములను తన శిరముతో స్పృశించి తత్త్వమెఱుంగగోరి ఇట్లు ప్రశ్నించెను.

ప్రహ్లాద ఉవాచ

**శ్లో॥ బిభర్షి కాయం పీవానం సోద్యమో భోగవాన్యథా।**
**విత్తం చైవోద్యమవతాం భోగో విత్తవతామిహ॥ 16**

**శ్లో॥ భోగినాం ఖలు దేహోఽయం పీవా భవతి నాన్యథా॥ 17**

**ప్రతిపదార్థము:–** స+ఉద్యమః=ప్రయత్నముగల, భోగవాన్ యథా=భోగములు కలవాడువలె, పీవానమ్=బలిసిన, కాయమ్=శరీరమును, బిభర్షి=భరించుచు, ఇహ=ఈజగములో, ఉద్యమ వతామ్=ప్రయత్నపరులకు, విత్తం చ=విత్తమును, విత్తవతామ్=ధనవంతులకు, భోగః=భోగములు,

**శ్లో॥ ఆధ్యాత్మికాదిభిర్దుఃఖైరవిముక్తస్య కర్హిచిత్।**
**మర్త్యస్య కృచ్ఛ్రోపనతైరర్థైః కామైః క్రియేత కిమ్॥ 31**

**ప్రతిపదార్థము:–** ఆధ్యాత్మికాదిభిః=ఆధ్యాత్మిక+ఆదిభౌతిక+ఆదిదైవికములను, దుఃఖైః=త్రివిధ దుఃఖములచే, కర్హిచిత్=ఒకప్పుడును, విముక్తస్య+అపి=విముక్తుడు కాని, మర్త్యస్య=మరణించు నరునకు, కృచ్ఛ+ఉపనీతైః=మిక్కిలి కష్టముచే సంప్రాప్తమైన, అర్థైః=ధనాదులచేత, కామైః= భోగములచేత, కిం క్రియేత=ఎంతమాత్రము సుఖము లభించును.

**తాత్పర్యము:–** శారీరక వ్యాధులు, మానసిక వ్యధలను, ఆధ్యాత్మిక దుఃఖము సర్పవృశ్చికాదుల వలన గలుగు ఆధిభౌతికదుఃఖములు; అతివృష్టి, అనావృష్టి వలన గలుగు ఆదిదైవిక దుః ఖమును ఒకప్పుడు వీడక అనుభవించుచు మరణింపబోవు పురుషునకు మిక్కిలి శ్రమచే లభించిన అర్థములుగాని, భోగములుగాని ఏ మాత్రము సుఖము కలిగించును.

**శ్లో॥ పశ్యామి ధనినాం క్లేశం లుబ్ధానామజితాత్మనామ్।**
**భయాదలబ్ధనిద్రాణాం సర్వతోఽభివిశఙ్కినామ్॥ 32**

**ప్రతిపదార్థము:–** లుబ్ధానామ్=లుబ్ధులై పేరాసగలవారు, అజితాత్మనామ్=ఇంద్రియ జయము పొందనివారి యొక్క, భయాత్=భయమువలన, అలబ్ధనిద్రాణామ్=పొందని నిద్రగలవారై, సర్వతః =ఎల్లవారినుండి, అభివిశంకినామ్=మిక్కిలి సందేహము గలవారై, ధనినామ్=ధనికులకు, క్లేశమ్= దుఃఖములను, పశ్యామి=చూచుచున్నాను.

**తాత్పర్యము:–** లుబ్ధులు, ఇంద్రియ జయములేనివారు దొంగలు దొంగిలించుకొని పోవుదురని తెల్లవార్లు నిద్రపోనివారు ఎవ్వరిని నమ్మక అందరిని అనుమానించువారునైన ధనికుల దుః ఖమును చూచుచున్నాను.

**శ్లో॥ రాజతశ్చౌరతః శత్రోః స్వజనాత్పశుపక్షితః।**
**అర్థిభ్యః కాలతః స్వస్మాన్నిత్యం ప్రాణార్థవద్భయమ్॥ 33**

**ప్రతిపదార్థము:–**రాజతః=రాజువలన, చోరతః=చోరునివలన, శత్రోః=శత్రువువలన, స్వజనాత్ =బంధుజనులవలన, పశుపక్షితః=పశుపక్ష్యాదులవలన, అర్థిభ్యః=యాచకుల వలన, కాలతః =కాలమువలన, స్వస్మాత్=తనవలన, త్యాగభోగమోహవిస్మరణాదులవలన, ప్రాణ+అర్థవత్+ భయమ్=ప్రాణవంతులకు, అర్థవంతులకును భయము, నిత్యమ్=ఎప్పుడూ కలుగును.

**తాత్పర్యము:–** రాజువలనను, చోరునివలనను, శత్రువువలనను, బంధుజనము వలనను, పశుపక్ష్యాదులవలనను (సస్యాదుల నాశనము చేయుటవలన) తనవలనను, త్యాగభోగాదుల వలనను ప్రాణవంతులకును, అర్థవంతులకును ధననాశమగు భయము సదా కలుగును.

**శ్లో॥ శోకమోహభయక్రోధరాగక్లైబ్యశ్రమాదయః।**
**యన్మూలాః స్యుర్నృణాం జహ్యాత్ స్పృహాం ప్రాణార్థయోర్బుధః॥ 34**

**ప్రతిపదార్థము:–** శోక=శోకము, మోహ=మోహము, భయక్రోధ=భయము, క్రోధము, రాగ= రాగము,క్లైబ్యశ్రమాదయః=చేతగానితనము శ్రమలోనగు, నృణామ్=నరులకు, యత్+మూలాః





బ్రాహ్మణ ఉవాచ

**శ్లో॥ వేదేదమసురశ్రేష్ఠ భవాన్నన్వార్యసమ్మతః।**
**ఈహోపరమయోర్నౄణాం పదాన్యధ్యాత్మచక్షుషా॥ 21**

**ప్రతిపదార్థము:–** అసురశ్రేష్ఠ=అసురోత్తమా!, భవాన్=నీవు, అధ్యాత్మచక్షుషా=జ్ఞానదృష్టిచే, నృణామ్=నరులకు, ఈహా+ఉపరమయోః=ప్రవృత్త నివృత్తులకు, ఇదమ్=ఈ, పదమ్= స్థానమును, వేద=ఎఱుంగుము,ఆర్యసమ్మతః నను=నీవు జ్ఞానులకు సమ్మతమైనవాడవు కదా!

**తాత్పర్యము:–** అసురోత్తమా! జ్ఞానదృష్టిచే నరులకు ప్రవృత్తి నివృత్తుల వలన కర్మజ్ఞానమువలన లభించు వరమును నీవెఱుంగుదువు గదా! నీవు జ్ఞానులకు సమ్మతమైన వాడవు కదా!

**శ్లో॥ యస్య నారాయణో దేవో భగవాన్ హృద్గతస్సదా।**
**భక్త్యా కేవలయాతుష్టో ధునోతి ధ్వాన్తమర్కవత్॥ 22**

**ప్రతిపదార్థము:–** దేవః=దేవుడు, భగవాన్=భగవంతుడునగు, నారాయణః=నారాయణుడు, సదా=ఎల్లప్పుడు, యస్య=ఎవనియొక్క, హృత్+గతః=హృదయమును బొందెనో, కేవలయా= కేవలము అనన్యమైన, భక్త్యా=భక్తిచేత, తుష్టః=తుష్టి/తృప్తిగాంచునో, అర్కవత్=వెలుపలి చీకటిని సూర్యుడువలె, ధ్వాంతమ్=అజ్ఞానమును, ధునోతి=పోగొట్టుచున్నాడు.

**తాత్పర్యము:–** ఎవని హృదయమందు నారాయణుడు, దేవుడు, భగవంతుడు సదా నివసించుచు కేవల భక్తిచే సంతుష్టుడగునో వాని అజ్ఞానమును సూర్యుడంధకారమువలె పోగొట్టును.

**శ్లో॥ అథాపి బ్రూమహే ప్రశ్నాంస్తవ రాజన్ యథాశ్రుతమ్।**
**సమ్భాషణీయో హి భవానాత్మనశ్శుద్ధిమిచ్ఛతామ్॥ 23**

**ప్రతిపదార్థము:–** రాజన్=ఓ రాజా!, అథ+అపి=నేను ఇన్ని దెలిసియున్ననూ, తవ=నీయొక్క ప్రశ్నాన్=ప్రశ్నలను గురించి, యథాశ్రుతమ్=నేను పెద్దల వలన విన్నదానిని, బ్రూమహే= చెప్పెదను. ఆత్మనః=తనకు,శుద్ధిమ్=నిష్కల్మషత్వమును,ఇచ్ఛతామ్=కోరుటవలన, భవాన్=నీవు, సంభాషిణీయః హి=సంభాషింపఁదగినవాడవు గదా!

**తాత్పర్యము:–** అట్లడిగిన నీవు నన్నడిగిన ప్రశ్నలకు నేను పెద్దల వలన విన్నట్టి ప్రత్యుత్తరమును చెప్పెదను. తాను పరిశుద్ధుడుగావలెనను కోరికగల పురుషుడు తప్పక సంభాషించదగినవాడు. నేను పెద్దల వలన విన్నదానిని అని తన అహంకార పరిహారమునట్లు చెప్పెను.

**శ్లో॥ తృష్ణయా భవవాహిన్యా యోగ్యైఃకామైరపూరయా।**
**కర్మాణి కార్యమాణోఽహం నానాయోనిషు యోజితః॥ 24**

**ప్రతిపదార్థము:–** భవవాహిన్యా=సంసారనదిని ప్రవహింపజేయునదియ, యోగ్యైః కామైః=తగిన విషయములు,కోరికలునిండని, తృష్ణయా=పేరాసచే, అహమ్=నేను, కర్మాణి=కర్మలను, కార్యమాణః=చేయుచున్నవాడనై, నానాయోనిషు=పెక్కు స్త్రీ గర్భములందు, యోజితః= ప్రవేశించితిని.

**తాత్పర్యము:–** సంసారమనునదిని ప్రవహింపజేయునదియు సామాన్యమైన విషయ ముఖము

లతో నిండినదియు తృప్తికాంచనిదియునైన తృష్ణచే (లేదా) పెక్కు కర్మలను జేయుచు నేను పెక్కు తల్లుల గర్భములందు ప్రవేశపెట్టబడి పెక్కు జన్మములెత్తితిని.

**శ్లో॥ యదృచ్ఛయా లోకమిమం ప్రాపితః కర్మభిర్భ్రమన్।**
**స్వర్గాపవర్గయోర్ద్వారం తిరశ్చాం పునరస్య చ॥ 25**

**ప్రతిపదార్థము:–** యదృచ్ఛయా=ఆ తృష్ణయొక్క స్వేచ్ఛావశమున, కర్మభిః=కర్మలచే, భ్రమన్= జన్మములెత్తుచు, స్వర్గ+అపవర్గయోః=ధర్మముచే స్వర్గమునకు సాధనమైన అన్నింటి నుండి నివృత్తిచే మోక్షమునకు దూరమైన, తిరశ్చామ్=అధర్మముచే శ్వసూకరాది జన్మములకు ద్వార మైనదియు, అస్య=ఆ ధర్మాధర్మముల మిశ్రమముచే ఈ మనుష్యజన్మమునకు ద్వారమైన, ఇమం లోకమ్=ఈ భూలోకమును, ప్రాపితః=పొందింపబడితిని.

**తాత్పర్యము:–** ఆ తృష్ణచేతనే కర్మలు చేయుచు జన్మములెత్తుచు ధర్మముచే స్వర్గసాధనమును అధర్మముచే శ్వానము, సూకరములోనగు తిర్యగ్జంతువుల జన్మమునకు ద్వారముచే ధర్మా ధర్మముల మిశ్రమముచే ఈ మనుష్యజన్మకు సాధనమైన ఈ లోకమును పొందితిని.

**శ్లో॥ అత్రాపి దమ్పతీనాం చ సుఖాయాన్యాపనుత్తయే।**
**కర్మాణి కుర్వతాం దృష్ట్వా నివృత్తోఽస్మి విపర్యయమ్॥ 26**

**ప్రతిపదార్థము:–** అత్ర+అపి=ఈ మనుష్యజన్మమందును, సుఖాయ=సుఖము కొఱకు, అన్య+ అపనుత్తయే=సుఖమునకితరమైన దుఃఖము యొక్క నివృత్తి కొఱకు, కర్మణి=కర్మలను, కుర్వతామ్=చేయుచున్నాడను, దంపతీనామ్=భార్యాభర్తలయొక్క, విపర్యయమ్=వ్యతిరేకము, సుఖము లేకపోవుట, దుఃఖము కలుగుటను, దృష్ట్వా=చూచి, నివృత్తః అస్మి=కర్మల నుండి మరల జ్ఞాన మార్గమవలంబించితిని.

**తాత్పర్యము:–** ఈ మనుష్య జన్మమునందును సుఖలాభమునకు దుఃఖనివృత్తికి దంపతులు పెక్కు కర్మలు చేయుచున్నను అందువలన వారికి సుఖము కలుగలేదు దుఃఖము ప్రాప్తించు చున్నది. దానిని చూచి కర్మల వలన ప్రయోజనము లేదని విరక్తి చెంది జ్ఞాన మార్గ మవలంబించితిని.

**శ్లో॥ సుఖమస్యాత్మనో రూపం సర్వేహోపరతిస్తనుః।**
**మనః సంస్పర్శజాన్ దృష్ట్వా భోగాన్ స్వప్స్యామి సంవిశన్॥ 27**

**ప్రతిపదార్థము:–** సుఖమ్=సుఖమనగా, అస్య=ఈ, ఆత్మనః=జీవునియొక్క, రూపమ్= స్వరూపమే యగును. అదియేల ప్రకాశించదు అనగా, సర్వ+ఈహ+ఉపరతిః=ఎల్ల క్రియల నుండి నివృత్తి గలదై, తనుః=స్వయముగనే ప్రకాశించును, మనః సంస్పర్శజాన్=కేవలము మనోరథమున జనించునదైన, భోగాన్=భోగములను, దృష్ట్వా=చూచి, సంవిశన్=ప్రాప్తమైన భోగములను అనుభవించుచు, స్వప్స్యామి=అన్ని ప్రయత్నములు మాని పరుండియున్నాను.

**తాత్పర్యము:–** సుఖమేది యనగా జీవుని యొక్క స్వస్వరూపమును దెలియుటయే, అది సర్వ కర్మల నుండి నివృత్తి చెందినపుడే స్వయముగా ప్రకాశించును. ఈ భోగములన్నియు, మనస్సంకల్పమున జనించుచు నశించుచు అశాశ్వతములై యున్నవి.కావున ఈ భోగములందు



మనస్సు పోలేక ప్రారబ్ధము ననుభవించుచు అన్నిక్రియలను వీడి యే ప్రయత్నము లేక పరుండియున్నాను.

**శ్లో॥ ఇత్యేతదాత్మనః స్వార్థం సంతం విస్మృత్య వై పుమాన్।**
**విచిత్రామసతి ద్వైతే ఘోరామాప్నోతి సంసృతిమ్॥ 28**

**ప్రతిపదార్థము:–** ఇతి=ఇట్లని, ఏతత్=ఈ, ఆత్మనః=జీవుని యొక్క సుఖాత్మకరూపము, స్వ+అర్థమ్=తనయందే పురుషార్థమై, సంతమ్=ఉండుచున్న దానిని, విస్మృత్య=మఱచి, పుమాన్= పురుషుడు, అసతి=శాశ్వతముగాక మాయచెందు, ద్వైతే=తాను, ఇతరుడును అను భేదముగల ద్వైత ప్రపంచమునందు, విచిత్రామ్=వివిధములైన రూపముగలదై, ఘోరామ్= భయంకరము, సంసృతిమ్=సంసారమును, ఆప్నోతి=పొందుచున్నాడు.

**తాత్పర్యము:–** ఇట్లు సుఖస్వరూపమై తనయందే పురుషార్థమైయున్న ఆత్మను మఱచి పురుషుడు వివిధములయిన స్థితిగతులు కల్గించునదై భయంకరమైన సంసారమును అసత్యమైన ఈ ద్వైతప్రపంచమునందు పొందుచున్నాడు.

**శ్లో॥ జలం తదుద్భవైశ్ఛన్నం హిత్వాజ్ఞో జలకామ్యయా।**
**మృగతృష్ణాముపాధావేత్తథాన్యత్రార్థదృక్ స్వతః॥ 29**

**ప్రతిపదార్థము:–** తత్+ఉద్భవైః=దాని నుండి జనించిన గడ్డి పాచిలోనగువానితో, ఛన్నమ్ =కప్పఁబడిన, జలమ్=జలమునందు, హిత్వా=వీడి, అజ్ఞః=అజ్ఞాని, జలకామ్యయా=జలము నందు ఇచ్చచే, మృగతృష్ణామ్=ఎండమావులను గూడ, స్వతః=స్వయముగా, ఉపాధావేత్= పరుగెత్తును, తథా=అట్లు, ఆ ప్రకారము, అన్యత్ర=ఆత్మస్వరూపము కంటె నితరమైన సంసారమునందు, అర్థదృక్=సుఖరూపమైన పురుషార్థమును జూచుచు పరుగెత్తును.

**తాత్పర్యము:–** నీటియందే జనించిన గడ్డిపాటి తీగలు కప్పియుండు జలమును వదిలిపెట్టి నీరు కావలెనను కోర్కెతో పురుషుడు స్వయముగానే ఎండమావులను జూచి జలమను భ్రాంతితో పరుగులాడును. అట్లే పురుషుడు ఆత్మ స్వరూపము కంటె నితరమైన సంసారము నందు సుఖమగు పురుషార్థముగలదని పరుగులాడుచున్నాడు.

**శ్లో॥ దేహాదిభిర్దైవతంత్రైరాత్మనస్సుఖమీహతః।**
**దుఃఖాత్యయం చానీశస్య క్రియా మోఘాః కృతాకృతాః॥ 30**

**ప్రతిపదార్థము:–** దైవతంత్రైః=కర్మకధీనములైన, దేహాదిభిః=దేహేంద్రియాదులచే, ఆత్మనః=తనకు, సుఖమ్=సుఖమును, ఈహతః=కోరువాడై, అనీశస్య=స్వతంత్రుడుగాక, కర్మవశ్యుడైన వాని యొక్క, కృతాకృతాః=మాటిమాటికి చేయబడిన, క్రియాః=కర్మలు, మోఘాః=నిష్ఫలము లగుచున్నవి.

**తాత్పర్యము:–** కర్మాధీనములై సృజింపబడిన దేహేంద్రియాదుల ద్వారా తనకు సుఖము గలుగు నని కోరి, కర్మవశ్యుడైన పురుషుడు కర్మలను మఱి మఱి చేయుచున్నను అవియన్నియు నిష్ఫలములే యై పోవుచున్నవి.

**ప్రతిపదార్థము:-**తాం మాయామ్=ఆ మాయను,జుహుయాత్ ఆత్మానుభూతౌ=ఆత్మానుభవము నందు లీనము చేయవలెను, సత్యదృక్‌మునిః=సత్యదర్శియైన ముని, తతః=అనంతరము, నిరీహః =కోరికలులేనివాడయి, స్వానుభూత్యాఽఽత్మని=స్వానుభవముచే, ఆత్మని=పరమాత్మ యందు, స్థితః=ఉండును. విరమేత్=ప్రారబ్ధావసానమున కళేబరమునుండి, విరమేత్= విరమించును.

**తాత్పర్యము:-** ఆ మాయను ఆత్మానుభూతియందు లయము చేయవలెను. సత్యదర్శియైన మునియై ఆత్మానుభవమునందుండును. ప్రారబ్ధావసానమున శరీరమును త్యజించును.

**శ్లో॥ స్వాత్మవృత్తం మయేత్థం తే సుగుప్తమపి వర్ణితమ్।**
**వ్యపేతం లోకశాస్త్రాభ్యాం భవాన్ హి భగవత్ప్రియః॥ 46**

**ప్రతిపదార్థము:-**మాయా=నాచే, తే=నీకు, స్వాత్మవృత్తమ్=నా స్వవృత్తమును, లోకశాస్త్రాభ్యామ్ =లోకశాస్త్రములచే మందదృష్టిగల, వ్యపేతమ్=విడివడినది, సుగుప్తం అపి వర్ణితమ్=పరమ రహస్యమైనను వర్ణింపబడినది, భవాన్ హి భగవత్పరః=నీవు భగవద్భక్తి గలవాడవు గదా!

**తాత్పర్యము:-** ఆర్యా! మంద దృష్టిగల లోకులకు శాస్త్రమునకు చెడ్డదైతోచు నా ప్రవర్తనమును రహస్యమైనదైనను నేను నీకు వివరించి చెప్పితిని. (బుద్ధిమంతులకు ఇది నింద్యచరితము) నీవు భగవద్భక్తుడవు కనుకనే నీకు చెప్పితిని.

నారద ఉవాచ

**శ్లో॥ ధర్మం పారమహంస్యం వై మునేః శ్రుత్వాసురేశ్వరః।**
**పూజయిత్వా తతః ప్రీత ఆమన్త్ర్య ప్రయయౌ గృహమ్॥ 47**

**ప్రతిపదార్థము:-** అసురేశ్వరః=అసురప్రభువు ప్రహ్లాదుడు, మునేః=ఆ మునివలన, పారమ హంస్యం ధర్మం శ్రుత్వా=పరమహంస ధర్మమును విని, తతః=తర్వాత, పూజయిత్వా=ఆ మునిని పూజించి, ప్రీతః=ప్రీతిపొంది, ఆమన్త్ర్య=వీడ్కొని, స్వగృహమ్=తన గృహమునకు, ప్రయయౌ= వెళ్ళెను.

**తాత్పర్యము:-** అసుర ప్రభువగు ప్రహ్లాదుడు ఆ అజగర మహాముని వలన పరమహంసలకు సంబంధించిన ఆత్మజ్ఞాన స్వరూపధర్మమును విని మిక్కిలి సంతోషించి ఆ మునిని పూజించి వీడ్కొని స్వగృహమునకు పోయెను.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**యుధిష్ఠిర సంవాదే ప్రహ్లాదాయ దత్తాత్రేయ పారమహంస ధర్మవర్ణనం నామ**
**త్రయోదశోఽధ్యాయః(13)**



=ఏవి కారణముగా గలవగునో, బుధః=పండితులు, ప్రాణ+అర్థయోః=ఆ ప్రాణము నందు, అర్థము నందు, స్పృహామ్=వాంఛను, జహ్యాత్=వీడవలెను.

**తాత్పర్యము:-** శోకము, మోహము, భయము, క్రోధము, రాగము, క్లైబ్యము, శ్రమలోనగు ఏ వికారణముగా నరులకు సంభవించునో పండితుడు అట్టి ప్రాణమునందును అర్థము నందును కాంక్షను వీడవలెను.

**శ్లో॥ మధుకారమహాసర్పౌ లోకేఽస్మిన్ ద్వౌ గురూత్తమౌ।**
**వైరాగ్యం పరితోషం చ ప్రాప్తా యచ్ఛిక్షయా వయమ్॥ 35**

**ప్రతిపదార్థము:-** అస్మిన్ లోకే=ఈ లోకమునందు, మధుకారమహాసర్పౌ=తేనెటీగలు కొండ చిలువయు, ద్వౌ=ఈ రెండును, గురు+ఉత్తమౌ=ఉత్తమమైన గురువులు, యత్ శిక్షయా=వేని యొక్క వృత్తిని పర్యాలోకించుటచే, వయమ్=మేము, వైరాగ్యమ్=వైరాగ్యమును, పరితోషమ్= సంతోషమును, తృప్తిని, ప్రాప్తాః=పొందితిమో!

**తాత్పర్యము:-** ఈ లోకమునందు నాకు తేనెటీగ, కొండచిలువయు ఇద్దరూ గురూత్తములైనవి. వాని జీవనవృత్తిని చక్కగా నాలోచించుటచే నేను వైరాగ్యమును పరితోషమును పొందితిని.

**శ్లో॥ విరాగస్సర్వకామేభ్యః శిక్షితో మే మధువ్రతాత్।**
**కృచ్ఛ్రాప్తం మధువద్విత్తం హత్వాప్యన్యో హరేత్పతిమ్॥ 36**

**ప్రతిపదార్థము:-** సర్వకామేభ్యః=ఎల్ల కామముల నుండి, విరాగః=విరక్తి, మే=నాచే, మధువ్రతాత్ =తేనెటీగవలన, శిక్షితః=నేర్పబడినది. నాకు వైరాగ్యము ఉదయించినదని అర్థము, మధువత్=తేనె వలె, కృచ్ఛ్ర+ఆప్తమ్=కష్టపడి సంపాదించబడిన ధనమును, అన్యః=ఇతరుడు, పతిమ్=ధనపతిని, హత్వా=చంపి, హరేత్=హరించును.

**తాత్పర్యము:-** నాకు తేనెటీగ వలన వైరాగ్యము జనించినది. ఏ ప్రకారము మధురకములు శ్రమించి అటు ఇటు ఎల్లవందల సంబంధించి అటనటనున్న పుష్పముల నుంచి గైకొని ఒక్కచో నుంచిన మధువును, మధువును కూడపెట్టిన మధుకరములను జంపి అన్యుడు హరించు చున్నాడు. అట్లే కడుశ్రమతో నార్జించిన ధనమును అన్యుడు హరించుచున్నాడు.

**శ్లో॥ అనీహః పరితుష్టాత్మా యదృచ్ఛోపనతాదహమ్।**
**నో చేచ్ఛయే బహ్వహాని మహాహిరివ సత్త్వవాన్॥ 37**

**ప్రతిపదార్థము:-** మహా+అహిః ఇవ=గొప్పసర్పమువలె, అహమ్=నేను, అనీహః=కోరికలేని వాడనై, యదృచ్ఛ+ఉపనతాత్=దైవవశలబ్ధమైన అన్నాదుల వలన, పరితుష్టాత్మా=సంతుష్ట చిత్తుడు అయి, నోచేచ్ఛయే=దైవవశమున లభించినది లేదేని, బహు+అహని=పెక్కు దివసములు, సత్త్వవాన్=ధైర్యవంతుడనై, గతేపి=పడియుందును.

**తాత్పర్యము:-** గొప్ప సర్పము కొండచిలువవలెను, నేను ఏ కోరిక లేనివాడనై దైవవశమున తనకుఁ లభ్యమైన అన్నాదికము వలన సంతుష్టచిత్తుడనైయుందును. అట్లు దైవవశముచే నేదియు లభించకపోయినచో పెక్కుదినములట్లే పడియుందును.

**శ్లో॥ క్వచిదల్పం క్వచిద్భూరి భుఞ్జేఽన్నం సాధ్వస్వాదు వా।**
**క్వచిద్భూరిగుణోపేతం గుణహీనముత క్వచిత్॥ 38**

**ప్రతిపదార్థము:-** క్వచిత్+అల్పమ్=ఒకప్పుడు కొంచెము, క్వచిత్+భూరి=ఒకప్పుడు అధికము, క్వచిత్ స్వాదు=ఒకప్పుడు మంచిది, క్వచిత్+అసాధు=ఒకప్పుడు చెడ్డది అగు అన్నమును, భుంజే=భుజించుచు ఉన్నాను. క్వచిత్+భూరిగుణ+ఉపేతః=ఒకప్పుడు గుణవంత, రసవంత మైన అన్నమును, క్వచిత్+గుణహీనం+ఉత=నిర్గుణములైన రుచిమంతము కాని దానిని భుజించుచు ఉన్నాను.

**తాత్పర్యము:-** ఒకప్పుడు దైవవశమున నాకు లభించిన అన్నాదికము కొంచెమైనను భుజించెదను. అధికమైనను భుజింతును. ఒకప్పుడు గుణవంతమైన రసవంతమైన అన్నము లభించిన భుజించెదను. లేదా రుచిమంతము కానిదైనను అన్నము లభించిన భుజించెదను.

**శ్లో॥ శ్రద్ధయోపహృతం క్వాపి కదాచిన్మానవర్జితమ్।**
**భుఞ్జే భుక్త్వాథ కస్మింశ్చిద్దివా నక్తం యదృచ్ఛయా॥ 39**

**ప్రతిపదార్థము:-** క్వ+అపి=ఒకప్పుడు, శ్రద్ధయా+ఉపాహృతమ్=శ్రద్ధతో కొనిరాబడినదియు, కదాచిత్=ఒకప్పుడు, మానవర్జితమ్=నిందాపూర్వకముగా కొనిరాబడినదియు, భుంజే=భోజనము, కస్మింశ్చిత్=ఒకప్పుడు, దివా నక్తమ్=పగలు రాత్రి, యదృచ్ఛయా=దైవవశమున పొంది, భుక్త్వా=భుజించి.

**తాత్పర్యము:-** ఒకప్పుడు ఎవరైన శ్రద్ధతో పెట్టిన అన్నమునుగాని నిందించుచు పెట్టిన అన్నమును గాని భుజింతును. ఒకప్పుడు పగలు రాత్రి గాని దైవవశమున లభించిన అన్నమును భుజింతును.

**శ్లో॥ క్షౌమం దుకూలమజినం చీరం వల్కలమేవ వా।**
**వసేఽన్యదపి సమ్ప్రాప్తం దిష్టభుక్తుష్టధీరహమ్॥ 40**

**ప్రతిపదార్థము:-** అహమ్=నేను, క్షామమ్=పట్టువస్త్రము, దుకూలమ్=సన్నని వలువ, అజినం =చర్మము, చీరమ్=చినిగిపోయిన, వల్కలమ్=నారచీర, అన్యదపి=అన్యవస్త్రమును, వసే=కట్టు కోగా, దిష్ట=దైవవశమున, సంప్రాప్తమ్=ప్రాప్తమైన దానిని, భుక్=అనుభవించుచు, తుష్టధీః =సంతుష్టి పొందినవాడనైయుందును.

**తాత్పర్యము:-** పట్టువలువ, సన్నని వలువ, చర్మము, చినిగిన వస్త్రము, నారచీర ఏది దైవ వశమున లభించినను దానిని ధరించుచు సంతుష్టి పొందినవాడనైయుందును.

**శ్లో॥ క్వచిచ్ఛయే ధరోపస్థే తృణపర్ణాశ్మభస్మసు।**
**క్వచిత్ప్రాసాదపర్యఙ్కే కశిపౌ వా పరేచ్ఛయా॥ 41**

**ప్రతిపదార్థము:-** క్వచిత్=ఒకప్పుడు, ధర+ఉపస్థే=నేలమీదను, తృణపర్ణ+అశ్మభస్మసు=కసవు ఆకులు, ఱాళ్ళుగల ప్రదేశములందును, క్వచిత్ ప్రాసాదపర్యంకే=రాచనగరు నందు పట్టి మంచముపైన,కశిపౌ=పానుపునందు, పరే+ఇచ్ఛయా=ఇతరుల ఇష్టముచే, శయే=పరుందుదును.



**తాత్పర్యము:-** ఒకప్పుడు నేలమీద, ఆకులు రాళ్ళు గల ప్రదేశములందు, ఒకప్పుడు రాచనగరులో పట్టిమంచము మీద పానుపునందు శయనించుదును.

**శ్లో॥ క్వచిత్స్నాతోఽనులిప్తాఙ్గస్సువాసాః స్రగలంకృతః।**
**రథేభాశ్వైశ్చరే క్వాపి దిగ్వాసా గ్రహవద్విభో॥ 42**

**ప్రతిపదార్థము:-** విభో!=ఓ రాజా!, క్వచిత్=ఒక్కచో, స్నాతః=స్నానముచేసి, అనులిప్తాంగః= మైపూత పూసి కొన్నవాడను, స్రగ్+అలంకృతః=పూలదండలతో నలంకరింపబడినవాడనై, రథ+ఇభ+అశ్వైః=రథములు, గజములు, అశ్వములుఁను వానితో, చరే=చరింతును. క్వ+అపి=ఒకప్పుడు, దిగ్వాసా=దిగంబరుడనై, గ్రహవత్=పిశాచమువలె, చరే=చరింతును.

**తాత్పర్యము:-** నేనొకప్పుడు అభ్యంగస్నానముచే గంధాదులను, మంచి పుష్పమాలికలను ధరించి రథముల మీద గజముల మీద, అశ్వముల మీద సంచరింతును. ఒకప్పుడు దిగంబరుడనై గ్రహపీడితునివలె పిచ్చివానిగా చరింతును.

**శ్లో॥ నాహం నిన్దే న చ స్తౌమి స్వభావవిషమం జనమ్।**
**ఏతేషాం శ్రేయ ఆశాసే ఉతైకాత్మ్యం మహాత్మని॥ 43**

**ప్రతిపదార్థము:-** స్వభావ విషయం జనమ్=స్వభావముచే వ్యత్యస్తముగానున్న జనమును, అహమ్=నేను,న నిందే=చెడ్డవానిని నిందింపను, న చ స్తౌమి=మంచి వానిని స్తుతించను, ఉత =మఱి, ఏతేషామ్=వీరలకు, మహాత్మని=భగవంతునందు, ఐకాత్మ్యమ్=ఏకచిత్తత్వంబును, శ్రేయస్సును, ఆశాసే=ఆశించెదను.

**తాత్పర్యము:-** స్వభావముచే నెగుడు దిగుడుగా వర్తించు జనమును నేను నిందింపను. స్తుతింపక వీరికీ మహావిష్ణువు ఏకచిత్తత్వమును శ్రేయమును కలుగుగాక యని ఆశింతును.

**శ్లో॥ వికల్పం జుహుయాచ్చిత్తౌ తాం మనస్యర్థవిభ్రమే।**
**మనో వైకారికే హుత్వా తన్మాయాయాం జుహోత్యను॥ 44**

**ప్రతిపదార్థము:-** వికల్పమ్=జాతిరూపాది వికల్పము అయినచో, చిత్తౌ=భేద గ్రాహకమనోవృత్తి యందు, జుహోత్యను=హోమము చేయాలి, తామ్=ఆ చిత్తమును, అర్థవిభ్రమే మనసి=దేహాత్మ భ్రమగల చిత్తమునందు మనస్సునందు హోమము చేయాలి. మనః=అట్టి మనస్సు, వైకారికే= అహంకారమునందు హోమము చేసి,అను=తర్వాత, తత్=ఆయహంకారమును మహత్తత్త్వము ద్వారా, మాయామ్=మూల ప్రకృతియందు హోమము చేయాలి.

**తాత్పర్యము:-** జాతిరూపాది వికల్పరూపమైన మనోవ్యాపారమునందు భేదగ్రాహకమనోవృత్తి యందు లీనము చేయవలెను. అట్టి చిత్తమును దేహాత్మ భ్రమగల మనసునందు లీనము చేయవలె. ఆ మనసునను అహంకారమునందు ఆ అహంకారమును మహత్తత్త్వమునందు ఆ మహత్తత్త్వమును మూలప్రకృతియందు లీనముచేయాలి.

**శ్లో॥ ఆత్మానుభూతౌ తాం మాయాం జుహుయాత్సత్యదృఙ్మునిః।**
**తతో నిరీహో విరమేత్ స్వానుభూత్యాత్మని స్థితః॥ 45**

పుత్రులవలెను చూడవలెను. వాటికి కీడు చేయకూడదు. పుత్రులకును వానికిని భేదమేమి గలదని తలంచవలెను.

**శ్లో॥ త్రివర్గం నాతికృచ్ఛ్రేణ భజేత గృహమేధ్యపి।**
**యథాదేశం యథాకాలం యావద్దైవోపపాదితమ్॥ 11**

**ప్రతిపదార్థము:–** గృహమేధ్యపి=గృహస్థుడైనను, త్రివర్గమ్=ధర్మార్థకామములను, అతికృచ్ఛ్రేణ= ఎక్కువ శ్రమతో సంపాదించి, న భజేత=సేవింపకూడదు. యథాదేశమ్=దేశమునుబట్టి, యథాకాలమ్=కాలమును బట్టి, యావత్=ఎంతమాత్రమో, దైవ+ఉపపాదితమ్=దైవముచే పొందింపబడినదో, దానినే అనుభవించవలెను.

**తాత్పర్యము:–** తాను గృహస్థుడైనను ధర్మార్థకామములను చాల కష్టపడి సంపాదించి అనుభవించ కూడదు. దేశకాలములను తనకు దైవవశమున నేదియెంత మాత్రము ప్రాప్తమగునో దానితో తృప్తిపడవలెను.

**శ్లో॥ అశ్వాఘాన్తేఽవసాయిభ్యః కామాన్ సంవిభజేద్యథా।**
**అప్యేకామాత్మనో దారాంన్నృణాం స్వత్వగ్రహో యతః॥ 12**

**ప్రతిపదార్థము:–** అశ్వా+ఘ+అంతే+అవసాయిభ్యః=కుక్కలు, పతితులు, అనాసితులు లోనగు వారలకు, యథా=తగినట్లు, కామాన్=వాంఛితము కోరినవి, సంవిభజేత్=స్వభోగ్యములు విభజించి ఈయవలెను. ఆత్మనః=తనయొక్క, ఏకాం దారామ్=ఒక్కతే భార్యయైన, సంవిభజేత్= అతిథిశుశ్రూషాదులను విభజించి, నృణామ్=నరులకు, స్వత్వగ్రహః=ఈమె నాదియనుచు.

**తాత్పర్యము:–** కుక్కలు, పతితులు, నాసితులు ఇతర కులస్థులు వారికి తగినట్లు తన భోగ్య పదార్థములను, విభజించి ఈయవలెను. తన కొక్కతె భార్యయైనను ఆమెను అతిథి శుశ్రూషకు నియోగించిన, తన శుశ్రూష తగ్గునని, ఈమె నాదియని పట్టుదలలేక ఆమెను కూడ తగిన భంగి అతిథి శుశ్రూషకు నియోగించవలెను. ఇతర విధముగా తలంపదగదు. ఆమెను శుశ్రూషయందు విభజించి నియోగించవలెను.

**శ్లో॥ జహ్యాద్యదర్థే స్వాన్ప్రాణాన్ హన్యాద్వా పితరం గురుమ్।**
**తస్యాం స్వత్వం స్త్రియాం జహ్యాద్యస్తేన హ్యజితో జితః॥ 13**

**ప్రతిపదార్థము:–** యదర్థే=భార్య కొఱకు, స్వాన్ ప్రాణాన్=తన ప్రాణములను, జిహ్యాత్= త్యజించునో యదర్థే=ఏ భావవ్యక్తీకరణకు, పితరమ్=తండ్రిని, గురుమ్=గురువును, హన్యాత్= చంపునో, తస్యాం ప్రియామ్=ఆ స్త్రీ, స్వత్వమ్=నాది అనుభావము, యః=ఎవడు, జహ్యాత్= త్యజించునో, అతడు, అజితః=అజితుడు.

**తాత్పర్యము:–**ఏ భార్య కొఱకు తనప్రాణములను వీడునో, ఏ భార్య కొఱకు తండ్రిని గురువును చంపునో అతడు తన భార్యయందు మమకారము వీడినవాడు, ఈశ్వరుని తెలుసు కొనును.

**శ్లో॥ కృమివిడ్భస్మనిష్ఠాన్తం క్వేదం తుచ్ఛం కళేబరమ్।**
**క్వ తదీయరతిర్భార్యా క్వాయమాత్మా నభశ్ఛదః॥ 14**



**శ్రీః**

## అథ చతుర్దశోఽధ్యాయః

ఈ పదునాలుగవ అధ్యాయమునందు ఉత్తమమైన గృహస్థ ధర్మము చెప్పుచున్నాడు. దేశకాలాదిభేదము పురుషునికి విశేషకరమైన శ్రేయస్సును చెప్పుచున్నాడు.

**యుధిష్ఠిర ఉవాచ**

**శ్లో॥ గృహస్థ ఏతాం పదవీం విధినా యేన చాఞ్జసా।**
**యాతి దేవఋషే బ్రూహి మాదృశో గృహమూఢధీః॥ 1**

**ప్రతిపదార్థము:–** దేవమునే!=ఓ నారదమునీ!, గృహమూఢధీః=గృహస్థ ధర్మమునందు నెలకొన్న బుద్ధిగల, మాదృశః=మావంటివారు, గృహస్థః=గృహస్థులు, ఏతాం పదవీమ్=ఈ ముక్తి పదవిని, యేన విధినా=ఏ విధిననుష్టించుటచే, యాతి=పొందుతామో దానిని, అఞ్జసా=శీఘ్రము, బ్రూహి =చెప్పుము.

**తాత్పర్యము:–** ఓ దేవర్షీ! గృహదార పుత్రాదులందు నిండిన చిత్తముగల నావంటి గృహస్థులు ఈ మోక్షపదవిని ఏవిధముగ ననుష్ఠించుటచే పొందునో దానిని శీఘ్రముగ చెప్పుము.

**శ్లో॥ సాధుపృష్టం మహారాజ లోకానామనుగృహ్ణతా।**
**తత్త్వేన తదాహం వక్ష్యేనైష్కర్మ్యం యేన కర్మణామ్॥ 2**

**ప్రతిపదార్థము:–** మహారాజ!=ఓ మహారాజా!, లోకానామ్=లోకములను, అనుగృహ్ణతా= అనుగ్రహించువాడవైన నీచే, సాధుపృష్టమ్=చక్కగా ప్రశ్నించబడినది. యేన=ఏ విధానము, కర్మణామ్=కర్మలకు, నైష్కర్మ్యమ్=నిష్కర్మత్వమున మోక్షము కలుగునో, తత్=ఆ మార్గమును, తత్త్వేన=వాస్తవమైన రీతిలో, అహం వక్ష్యే=నేను చెప్పెదను.

**తాత్పర్యము:–** ఓ మహారాజా! నీవు నిన్నే కాదు లోకుల ననుగ్రహింపగోరి నన్ను చక్కగా ప్రశ్నించితివి. గృహస్థుడు కర్మలుచేయుచు నేవిధమున మోక్షమును పొందురో ఆ మార్గమును నిశ్చయమైన దానిని నీకు చెప్పెదను.

**శ్లో॥ గృహేష్వవస్థితో రాజన్ క్రియాః కుర్వన్ గృహోచితాః।**
**వాసుదేవార్పణం సాక్షాదుపాసీత మహామునీన్॥ 3**

**ప్రతిపదార్థము:–** రాజన్=ఓ రాజా!, గృహేషు=గృహస్థ ధర్మములందు గృహములందు, అవస్థితః =ఉండు, గృహ+ఉచితాః=గృహస్థులకు తగిన, క్రియాః=కర్మలను, వాసుదేవార్పణమ్ =వాసుదేవునందు, సాక్షాదుకుర్వన్=సాక్షాత్తుగా ఆ క్రియలను సమర్పించుచుచేస్తూ, మహా మునీన్=దొడ్డమునులను, ఉపాసీత=సేవించు.

**తాత్పర్యము:–** గృహస్థుడై దారపుత్రులందు గృహమందుండు గృహస్థుడు గృహస్థునకు కర్తవ్యమైన

కర్మలనన్నింటిని సాక్షాత్తుగా వాసుదేవునందు ఫలముతో సహా సమర్పించి కర్మలు చేయుచు మహామునులను గొప్పబుషులను సేవించవలెను.

**శ్లో॥ శృణ్వన్ భగవతోఽభీక్ష్ణమవతారకథామృతమ్।**
**శ్రద్దధానో యథా కాలముపశాన్తజనావృతః॥ 4**

**ప్రతిపదార్థము:-** భగవంతమ్ అవతారకథామృతమ్=భగవంతునవతారకథలను అమృతమును, అభీక్ష్ణమ్=మరల మరల, శృణ్వన్=వినుచు, శ్రద్దధానః=మిగుల శ్రద్ధ గలిగి, యథా కాలమ్=తగు కాలమందు, ఉపశాంతజనావృతః=సాధుజనులతో కూడి ఉండవలెను.

**తాత్పర్యము:-** గృహస్థుడు శ్రద్ధగలవాడు. శాంతచిత్తులగు సజ్జనులతోడి తగుకాలమందు భగవంతుని అవతారకథలను అమృతమును నీవు మాటిమాటికీ వినుచుండవలెను.

**శ్లో॥ సత్సఙ్గాచ్ఛనకైః సఙ్గమాత్మజాయాత్మజాదిషు।**
**విముఞ్చేన్ముచ్యమానేషు స్వయం స్వప్నవదుత్థితః॥ 5**

**ప్రతిపదార్థము:-** సత్సంగాత్=సత్పురుషుల సంగమము వలన, స్వయమ్=స్వయముగానే, ముచ్యమానేషు=వియోగమును విడిచి పోవుచునట్టి, ఆత్మజాయాత్మజాదిషు=తన భార్యాపుత్రులందు, సంగమ్=ఆసక్తిని ప్రేమను, ఉత్థితః=నిద్రలేచిన పురుషుడు, స్వప్నవత్=స్వపమునందు చూడబడిన పుత్రాదులందలి సంగము ఎట్లు వీడుచున్నాడో అట్లే, శనకైః=మెల్లగా, సంగమ్=సంగమును, విముంచేత్=విడువవలెను. సంగమును విడువవలెను.

**తాత్పర్యము:-** సత్పురుష సాంగత్యము వలన పురుషుడు ఎప్పుడైన స్వయముగా తన్ను వదలిపెట్టి పోవువారైన తన భార్యాపుత్రులందలి సంగమమును నిద్రలేచినవాడు స్వపమునందుగాంచిన పుత్రాదుల సంగమునెట్లు వీడునో అట్లా సంగమును విడువవలెను.

**శ్లో॥ యావదర్థముపాసీనో దేహే గేహే చ పణ్డితః।**
**విరక్తో రక్తవత్తత్ర నృలోకే నరతాం న్యసేత్॥ 6**

**ప్రతిపదార్థము:-** పండితః=వివేకముగల పండితుడు, దేహేగేహే చ=దేహమునందు, గృహమునందు, యావదర్థమ్=ఎంతమాత్రము ప్రయోజనమో అంతమాత్రము, ఉపాసీనః=సేవించుచు, నృలోకే=నరలోకమునందు, తత్ర=సంసారమునందు, విరక్తః=విరక్తుడై, రక్తవత్= అనురక్తుడు వలె గన్పట్టు, నరతామ్=మానుష్యమును, త్యజేత్=త్యజించవలెను. పురుషాకారము నావిష్కరించవలెను.

**తాత్పర్యము:-** వివేకవంతుడైన పండితుడు దేహమునందు గృహమునందు ఎంతమాత్రము ప్రయోజనమో అంతమాత్రము క్రియలందు ప్రవర్తించుచు నరలోకమునందు, నరుల మధ్య, సంసారమునందు విరక్తుడయ్యును. ఆసక్తుడట్లు వర్తించు మనుష్య భావమును త్యజించవలెను. నేనే పరమపురుషుడను అని ఆ దైవ స్వరూపమును పొందవలెను.

**శ్లో॥ జ్ఞాతయః పితరౌ పుత్రా భ్రాతరః సుహృదోఽపరే।**
**యద్వదన్తి యదిచ్ఛన్తి చానుమోదేత నిర్మమః॥ 7**





**ప్రతిపదార్థము:-** జ్ఞాతయ=బంధువులు, పితరౌ=తల్లిదండ్రులు, పుత్రాః=పుత్రులు, భ్రాతరః=సోదరులు,సుహృదః=మిత్రులు,అపరే=ఇతరులు,యద్వదంతి=ఏమి చెప్పుదురో, యదిచ్ఛంతి=ఏది కోరుదురో, నిర్మమః=తాను మమకారములేనివాడై, అనుమోదేత=సరే అని అమోదించవలెను. ఎప్పుడునూ కోపము చేయకూడదు.

**తాత్పర్యము:-** బంధువులు, తల్లిదండ్రులు, పుత్రులు, సోదరులు, మిత్రులు మఱి ఇతరులు వారేది చెప్పుదురో, ఏది ఇచ్ఛగింతురో వాని ననుసరించి యామోదించవలెను. తాను మమకారము లేనివాడైయుండవలెను.

**శ్లో॥ దివ్యం భౌమం చాన్తరిక్షం విత్తమచ్యుతనిర్మితమ్।**
**తత్సర్వముపభుఞ్జాన ఏతత్కుర్యాత్ స్వతో బుధః॥ 8**

**ప్రతిపదార్థము:-** దివ్యమ్=వృష్టిలోనగు వానిచే జనించిన సస్యాదికము, భౌమమ్=భూమి నుండి జనించిన సువర్ణాదికము, అంతరిక్షమ్=అకస్మాత్తుగా ప్రాప్తమైన, విత్తమ్=ధనము, ఉపభుంజానః=ఉపయోగించుచు, అచ్యుతనిర్మితః=స్వయముగనే హరిచే నిర్మించినవి, ఏతత్=ఈ కార్యాదికము, బుధః=పండితులు, కుర్యాత్=చేయవలెను.

**తాత్పర్యము:-** వర్షాదికముచే ఫలించు ధాన్యాదులను, భూమి నుండి లభించు సువర్ణాదికము, అకస్మాత్తుగా సంప్రాప్తమైన ధనమును ఇది యంతయు శ్రీహరి కృపచే లభించినదని ఉపయోగించుచు పండితులు కర్మలను చేయవలెను.

**శ్లో॥ యావద్భ్రియేత జఠరం తావత్స్వత్వం హి దేహినామ్।**
**అధికం యోఽభిమన్యేత స స్తేనో దణ్డమర్హతి॥ 9**

**ప్రతిపదార్థము:-** యావత్=ఎంతమాత్రము, జఠరమ్=కడుపు, భ్రియేత=నిండునో, తావత్=అంత మాత్రము, దేహినామ్=జీవులకు, స్వత్త్వమ్=బలకరము, యః=ఎవడు, అధికమ్=ఎక్కువగా, అభిమన్యేత=కావలెనని తలంచునో, సః=వాడు, సేనః=చోరుడు, దండమ్+అర్హతి =దండనకు తగినవాడు.

**తాత్పర్యము:-** ఎంతమాత్రము తన కడుపునిండునో అంతమాత్రము అన్నాదికము గోరవలెను. నరుల కందరికీ తగును. అంతకంటె నెవడు ధనాదికమును కోరునో వాడు చోరుడగును. అట్టివాడు దండింపతగును.

**శ్లో॥ మృగోష్ట్రఖరమర్కాఖుసరీసృప్ఖగమక్షికాః।**
**ఆత్మనః పుత్రవత్పశ్యేత్ తైరేషామన్తరం కియత్॥ 10**

**ప్రతిపదార్థము:-** మృగోష్ట్ర .... మక్షికాః - మృగ=జింకలు, ఉష్ట్ర=ఒంటెలు, ఖర=గాడిదలు, మర్క=కోతులు, ఆఖు=ఎలుకలు, సరీసృప్=తొండలు, ఖగ=పక్షులు, మక్షికాః=ఈగలు అను వానిని, ఆత్మవత్=తనవలె, పుత్రవత్=పుత్రులవలెను, పశ్యేత్=చూడవలెను, తైః=ఆ పుత్రాదులలో, ఏషామ్=వానికి, కియత్ అంతరమ్=ఏమి భేదము గలదు.

**తాత్పర్యము:-** వివేకముగల నరుడు జింకలు, ఒంటెలు, గాడిదలు, కోతులు, ఎలుకలు, తొండలు, ఈగలు లోనగునవి తన గృహమునందు ప్రవేశించి ఏమైన తినినచో వానిని తనవలెను, తన

**ప్రతిపదార్థము:–** జాయాయా=భార్యకు, సంస్కారకాలః=పుంసవనాదికము, అపత్యస్య=సంతానమునకు, జాతకకర్మాదికము, ఆత్మనః=తనకు, యజ్ఞాది దీక్షయు, ప్రేతసంస్థా=దహన సంస్కారము, మృతాహశ్చ=సాంవత్సరికము, తథా=ఆప్రకారము, అభ్యుదయే కర్మణి=తన శ్రేయస్సు కొఱకు చేయు ఇతర కర్మలకు సంస్కార కాలము శ్రేయస్సు కలిగించును.

**తాత్పర్యము:–** ఓ రాజా! సంస్కారకాలము అనగా భార్యకు సీమంతముచేయుట, పుత్రునికి జాతకకర్మమాచరించుట, తాను యజ్ఞదీక్షపొందుట, ప్రేతకు దహనసంస్కారము, సాంవత్సరిక శ్రాద్ధము చేయుట సంస్కారకాలమగును. ఇతరమైన అభివృద్ధి కలిగించు కర్మలకు సంస్కార కాలము శ్రేయస్సు కలిగించును.

**శ్లో॥ అథ దేశాన్ ప్రవక్ష్యామి ధర్మాదిశ్రేయ ఆవహాన్।**
**స వై పుణ్యతమో దేశస్సత్పాత్రం యత్ర లభ్యతే।**
**బిమ్బం భగవతో యత్ర సర్వమేతచ్చరాచరమ్॥ 28**

**ప్రతిపదార్థము:–** అథ=అనంతరము, ధర్మాదిశ్రేయః=ధర్మాదికము అగు శ్రేయస్సు, ఆవహాన్=కలిగించు,దేశాన్=పుణ్యదేశములను, ప్రవక్ష్యామి=చెప్పెదను, భగవతః బింబమ్=భగవంతుని మారురూపమై, సత్పాత్రమ్=సత్పాత్రమైనవాడు, యత్ర లభ్యతే=ఎక్కడ లభించునో, సవైపుణ్యతమో దేశః=అది అత్యంత పుణ్యదేశము, యత్ర=ఎవనియందు, ఏతత్ చరాచరమ్= ఈ చరాచరం, సర్వం అస్తి=సర్వప్రపంచము గలదు.

**తాత్పర్యము:–** తర్వాత మిగుల శ్రేయస్సును కలిగించు పుణ్యప్రదేశములను వచింతును. ఎవని యందు ఈ సకల చరాచరప్రపంచము నిల్చియున్నదో ఆ భగవంతుని ప్రతిరూపమగు సత్పాత్రమగు భగవద్భక్తుడైన పురుషుడెచ్చట లభించుచున్నాడో అదియే పుణ్యతమ ప్రదేశము.

**శ్లో॥ యత్ర హ బ్రాహ్మణకులం తపో విద్యాదయాన్వితమ్।**
**యత్ర యత్ర హరేరర్చా స దేశః శ్రేయసాం పదమ్॥ 29**

**ప్రతిపదార్థము:–** యత్ర=ఎచ్చోట, బ్రాహ్మణకులమ్=బ్రాహ్మణజాతి, తపస్+విద్యాదయ+అన్వితమ్=తపస్సు విద్య, దయ అనువానితోకూడి, యత్ర యత్ర=ఎచ్చటెచ్చట, హరేః అర్చా=హరి పూజ జరుగునో, స దేశః=ఆ దేశము, శ్రేయసాం పదమ్=శ్రేయస్సులకు స్థానమైనది.

**తాత్పర్యము:–** ఎచ్చట బ్రాహ్మణుల వంశములు తపస్సు విద్య దయ అనువానితో కూడి యుండునో ఎచ్చటెచ్చట శ్రీహరి పూజ జరుగుచుండునో ఆదేశము శ్రేయస్సులకు స్థానమైనది.

**శ్లో॥ యత్ర గఙ్గాదయో నద్యః పురాణేషు చ విశ్రుతాః।**
**సరాంసి పుష్కరాదీని క్షేత్రాణ్యర్హాశ్రితాన్యుత॥ 30**

**ప్రతిపదార్థము:–** యత్ర=ఎచట, పురాణేషు=పురాణములందు, విశ్రుతాః=ప్రసిద్ధములై పేర్కొను, గంగాదయః నద్యః=గంగాలోనగు నదులు ప్రవహించునో, సరాంసి=సరస్సులు, పుష్కరాదీని=పుష్కరాదులు, అర్హతాశ్రిత=ఉత్తములాశ్రయించిన, సక్షేత్రాణి=పుణ్యక్షేత్రము లుండునో అవి పుణ్య ప్రదేశములు.





**ప్రతిపదార్థము:–** క్రిమి, విట్, భస్మనిష్ఠాంతమ్=పురుగులు, మలము, భస్మము అనునవి పర్యవసానము కడపటగల, స్వకళేబరమ్=ఈ తన శరీరము, క్వను=ఎచ్చటను, తదీయరతిః =ఆ దేహార్థమును మిగుల, భార్యా క్వ=భార్యయోర్తు అని, నభశ్ఛదః=ఆకాశమును సైతము ఆచ్ఛాదించునట్టి, ఆత్మా=పరమాత్మ, జీవుడు, క్వ=ఎక్కడ.

**తాత్పర్యము:–** పురుగులు, మలము, భస్మము అనురూపమును నశించిపోవు ఈ తన శరీరము ఎక్కడ? ఇట్టి మలభూయిష్ఠ శరీరము కొఱకు ఆసక్తిగల భార్య ఎక్కడ? ఆకసమును సైతము కప్పునట్టి ఆత్మ పరమాత్మ యెక్కడ? దేహాత్మలకు కలయిక లేదు.

**శ్లో॥ సిద్ధైర్యజ్ఞావశిష్టార్థైః కల్పయేద్వృత్తిమాత్మనః।**
**శేషే స్వత్వం త్యజన్ ప్రాజ్ఞః పదవీం మహతామియాత్॥ 15**

**ప్రతిపదార్థము:–** సిద్ధైః=దైవవశమున / దైవము వలన సంప్రాప్తములై, యజ్ఞావశిష్టార్థైః=పంచ మహాయజ్ఞముల వలన శేషించిన అన్నాదులను, ఆత్మనః వృత్తిమ్=తనకు జీవనములు, కల్పయేత్ =కల్పించవలెను, శేషే=శేషించిన దానిని, స్వత్వమ్=నాదను భావమును, త్యజన్= త్యజించి, ప్రాజ్ఞః=పండితుడు, మహతాం పదవీమ్=దొడ్డపదవిని మోక్షమును, ఇయాత్= పొందును.

**తాత్పర్యము:–** దైవవశమున తనకు సంప్రాప్తములైన పంచమహాయజ్ఞశేషము అన్నాదులచే తాను జీవించవలెను. శేషించిన అన్నాదికము నాది అను భావమును త్యజించి భిక్షకులు లోనగువారికి పెట్టవలెను. ఇట్లు వర్తించు పండితుడు పరమపదమును పొందును.

**శ్లో॥ దేవానృషీన్ నృభూతాని పితౄణాత్మానమన్వహమ్।**
**స్వవృత్త్యాగతవిత్తేన యజేత పురుషం పృథక్॥ 16**

**ప్రతిపదార్థము:–** పృథక్ పురుషమ్=అంతర్యామిని, యజేత=యజించవలెను, స్వవృత్త్యా=తన వృత్తిచే, ఆగతవిత్తేన=లభించిన ధనధాన్యముచే, దేవాన్=దేవతలను, ఋషీన్=ఋషులను, నృభూతాని=మానవులను, పితౄన్=పిత్రదేవతలను, ఆత్మానమ్=ఆత్మను, అన్వహమ్=ప్రతి దినము, యజేత=అర్చించవలెను.

**తాత్పర్యము:–** గృహస్థుడు తన గృహస్థ ధర్మముచే ఆర్జించిన అన్నాదికముచే, పంచభూతాలను, దేవతలను, ఋషులను, నరులను, ప్రాణులను, పితరులను తన్ను, అంతర్యామిని లోనగువారిని పూజించవలెను. యాజించవలెను. అగ్నియందు వారికి ప్రీతిగా హోమము చేయించవలెను.

**శ్లో॥ యర్హ్యాత్మనోఽధికారాద్యాః సర్వాః స్యుర్యజ్ఞసమ్పదః।**
**వైతానికేన విధినా అగ్నిహోత్రాదినా యజేత్॥ 17**

**ప్రతిపదార్థము:–** యర్హి=ఎప్పుడు, ఆత్మనః=తనకు, అధికారాద్యాః=అధికారములోనగు, సర్వాః యజ్ఞసంపదః=ఎల్ల యజ్ఞ సంపదలు, వైతానికేన=యజ్ఞ సంబంధమైన, విధినా=విధియై, అగ్నిహోత్రాదినా=అగ్నిహోత్రాదికముచే, యజేత్=యజించవలెను.

**తాత్పర్యము:–** ఎప్పుడు తనకు అధికారాది యజ్ఞసంపదలన్నీ చేకూరునో అప్పుడు యజ్ఞవిధిచే అగ్నిహోత్రాదికముచే దేవతాదులను గురించి యజించవలెను.

**శ్లో॥ న హ్యగ్నిముఖతోఽయం వై భగవాన్ సర్వయజ్ఞభుక్।**
**ఇజ్యేత హవిషా రాజన్ యథా విప్రముఖే హుతైః॥ 18**

**ప్రతిపదార్థము:-** సర్వయజ్ఞభుక్=ఎల్లయజ్ఞముల హవిర్భోక్తయగు, అయం భగవాన్=ఈ భగవంతుడు, న అగ్నిముఖతః వై=కేవలము అగ్నిముఖముననే కాదు, యథా=ఏ ప్రకారము, విప్రముఖే=విప్ర ముఖము నుండి, హుతైః=అన్నాదులచే, ఇజ్యేత=పూజించునో, తథా=ఆ ప్రకారము అగ్ని ముఖమున హవిస్సుచే యజించును.

**తాత్పర్యము:-** అన్నాదులచే విప్రులను తృప్తిపరచినచో ఇంకను అగ్నిముఖమున హవిస్సు సమర్పణచేయకున్నను దోషము లేదు. కేవలము భగవంతుడు అగ్నిముఖముననే సర్వయజ్ఞభోక్త అనరాదు. అన్నివిధముల భోక్తయు. అందువలన బ్రాహ్మణముఖమున సమర్పితమైనది భోక్త యగును అని భావము.

**శ్లో॥ తస్మాద్బ్రాహ్మణదేవేషు మర్త్యాదిషు యథార్హతః।**
**తైస్తైః కామైర్యజస్వైనం క్షేత్రజ్ఞం బ్రాహ్మణానను॥ 19**

**ప్రతిపదార్థము:-** తస్మాత్=అందువలన, బ్రాహ్మణదేవేషు=బ్రాహ్మణులందు, దేవతలందు, మర్త్యాదిషు=నరులందు, యథార్హతః=వారివారి అర్హతననుసరించి, తైః తైః కామైః=వారు కోరిన పదార్థములచే, ఏనం క్షేత్రజ్ఞమ్=ఈ క్షేత్రజ్ఞుని, బ్రాహ్మణానను=బ్రాహ్మణులను పూజించిన తర్వాత, యజస్వ=యజించవలెను.

**తాత్పర్యము:-** బ్రాహ్మణులను, దేవతలను అన్నాదికము హవ్యముగా చేసి అదియు ఉత్తమ విప్రులను పూజించినను, సామాన్యులను వారి వారి అర్హత ననుసరించి వారు కోరిన అన్నాదికమును సమర్పించి ఈ క్షేత్రజ్ఞుని పూజించవలెను.

**శ్లో॥ కుర్యాదపరపక్షీయం మాసి ప్రౌష్ఠపదే ద్విజః।**
**శ్రాద్ధం పిత్రోర్యథా విత్తం తద్బన్ధూనాం చ విత్తవాన్॥ 20**

**ప్రతిపదార్థము:-** విత్తవాన్=ధనవంతుడు, ప్రౌష్ఠపదేమాసి=భాద్రపద మాసమందు, అపర పక్షీయమ్=కృష్ణపక్షమందు, శ్రాద్ధం పిత్రోః=శ్రాద్ధమును తల్లిదండ్రులకు పితరులకు ఎట్లు, కుర్యాత్=చేయునో, తత్ బంధూనామ్=వానిబంధువులకు,విత్తమ్=ధనాదికమును ఈయవలెను.

**తాత్పర్యము:-** గృహస్థుడు భాద్రపదమాసము కృష్ణపక్షమందు తన పితరులకెట్లు శ్రాద్ధము చేయునో అట్లే విత్తవంతుడు తన బంధువులకును ధనము నీయవలెను.

**శ్లో॥ అయనే విషువే కుర్యాద్వ్యతీపాతే దినక్షయే।**
**చన్ద్రాదిత్యోపరాగే చ ద్వాదశ్యాం శ్రవణేఽపి చ॥ 21**

**తాత్పర్యము:-** ఉత్తరాయన దక్షిణాయనములందు విషువునందు(పగలురాత్రి సమకాలమున) వ్యతీపాతమందు,చంద్రసూర్యుల గ్రహణమునందు శ్రవణా నక్షత్రమున పితృశాద్ధము చేయవలెను.

**శ్లో॥ తృతీయాయాం శుక్లపక్షే నవమ్యామథ కార్తికే।**
**చతసృష్వప్యష్టకాసు హేమన్తే శిశిరే తథా॥ 22**





**తాత్పర్యము:-** శుక్లపక్షమునందు అక్షతృతీయయందు నవమియందు కార్తికమాసమందు మార్గశిరములోనగు నాలుగుమాసములందు అష్టకలందు హేమంతమునందు శిశిర ఋతువు నందు అట్లే

**శ్లో॥ మాఘే చ సితసప్తమ్యాం మఖారాకాసమాగమే।**
**రాకయా చానుమత్యా వా మాసర్క్షాణి యుతాన్యపి॥ 23**

**తాత్పర్యము:-** మాఘ శుద్ధ సప్తమి యందు, మాఘమునందు మఖానక్షత్రయుక్త సంపూర్ణ చంద్రుడు గల పూర్ణిమయందు ఒకకళ కొఱవడిన చంద్రుడు గల పూర్ణిమయందు, రాకయా= పూర్ణచంద్రుడుగల పౌర్ణమి, అనుమతి=కళతక్కువ చంద్రుడు గల ఆయా మాస నక్షత్రములతో కూడిన పూర్ణిమల యందును.

**శ్లో॥ ద్వాదశ్యామనురాధా స్యాచ్ఛ్రవణస్తిస్ర ఉత్తరాః।**
**తిసృష్వేకాదశీ వాసు జన్మర్క్ష శ్రోణయోగయుక్॥ 24**

**ప్రతిపదార్థము:-** ద్వాదశ్యామ్ = .....

**తాత్పర్యము:-** ద్వాదశియందు మూడు ఉత్తరలందు ఏకాదశివచ్చినను, జన్మనక్షత్రమునకు శ్రవణయోగము కూడినను శ్రాద్ధము చేయవలెను.

**శ్లో॥ త ఏతే శ్రేయసః కాలా నృణాం శ్రేయోవివర్ధనాః।**
**కుర్యాత్సర్వాత్మనైతేషు శ్రేయోఽమోఘం తదాయుషః॥ 25**

**ప్రతిపదార్థము:-** తే=ఆ, ఏతే=కాలములు, శ్రేయసః కాలాః=శ్రేయస్సునకు మంచి కాలములు, నృణామ్=నరులకు, శ్రేయన్ వివర్ధనాః=శ్రేయస్సును వర్థిల్లజేయును. ఏతేషు=ఈ దినములు, సర్వాత్మనా=అన్నివిధముల,కుర్యాత్=శ్రాద్ధధర్మములు చేయవలెను. తత్=అందువలన, అమోఘం ఆయుషః=అమోఘమైన ఆయుష్కాలము.

**తాత్పర్యము:-** ఇవియన్నియు శ్రేయః కాలములు నరులకు శ్రేయస్సును వర్ధిల్లజేయును. ధర్మములు చేయవలెను. ఇందువలన ఆయువు వృద్ధియగును. ఆయుష్కాలము.

**శ్లో॥ ఏషు స్నానం జపో హోమో స్తపో దేవద్విజార్చనమ్।**
**పితృదేవనృభూతేభ్యో యద్దత్తం తద్ధ్యనశ్వరమ్॥ 26**

**ప్రతిపదార్థము:-** పితృదేవనృభూతేభ్యః=పితరులు, దేవతలు, నరులు, ఇతర ప్రాణులు లోనగు వాని కొఱను, యత్ దత్తం=ఏది ఈయబడినదో, తత్+అనశ్వరమ్=అదినశించదు. సఫలము.

**తాత్పర్యము:-** ఈ పుణ్యకాలములందు స్నానము, జపము, హోమము, తపస్సు, దేవతలకు, విప్రులకు పూజచేయవలెను. ఈ పుణ్యదినములందు దేవతలను, పితృదేవతలను నరులకు ఏది ఈయబడునో అది సఫలము.

**శ్లో॥ సంస్కారకాలో జాయాయా అపత్యస్యాత్మనస్తథా।**
**ప్రేతసంస్థా మృతాహశ్చ కర్మణ్యభ్యుదయే నృప॥ 27**

**తాత్పర్యము:–** ఓ రాజేంద్ర! అట్లు సామాన్య పురుషులందు ఎవడు తపముచే విద్యచే తుష్టిచే హరి శరీరమును వేదమును ధరించుచున్నాడో అట్టి బ్రాహ్మణుని మంచిపాత్రముగా, దాన పాత్రునిగా తెలుసుకొనుము.

**శ్లో॥ నన్వస్య బ్రాహ్మణా రాజన్ కృష్ణస్య జగదాత్మనః।**
**పునంతః పాదరజసా త్రిలోకీం దైవతం మహత్॥ 43**

**ప్రతిపదార్థము:–** జగత్+ఆత్మనః=జగత్స్వరూపుడగు, కృష్ణస్య=కృష్ణుని భక్తుడైన, బ్రాహ్మణా= బ్రాహ్మణుని, పాదరజసా=పాదధూళిచే, త్రిలోకీమ్=మూడులోకములను, పునంతః=పవిత్రము చేయుచున్నవాడై, దైవతం మహత్ నను=దొడ్డ దైవముగా నున్నాడు కదా!

**తాత్పర్యము:–** జగత్స్వరూపుడైన కృష్ణుని భక్తుడైన బ్రాహ్మణుని యొక్క పాదధూళిచే ముల్లోకము లను పవిత్రముచేయుచున్నవాడై దొడ్డదైవముగా నున్నాడు కదా!

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**సదాచారనిర్ణయే ప్రతిమాద్యర్చనాది ధర్మనిరూపణం నామ**
**చతుర్దశోఽధ్యాయః(14)**





**తాత్పర్యము:–** పురాణములందు ప్రసిద్ధముగా వర్ణింపబడిన గంగాది మహానదులు ఎచ్చట ప్రవహించుచు పుష్కరాదులు లోనగు సరస్సులు ఎచ్చట నుండునో ఉత్తములాశ్రయించిన పుణ్యక్షేత్రము లెచ్చటనున్నవో అవి పుణ్యప్రదేశములు.

**శ్లో॥ కురుక్షేత్రం హయశిరః ప్రయోగః పులహాశ్రమః।**
**నైమిశం ఫాల్గునం సేతుః ప్రభాసోఽథ కుశస్థలీ॥ 31**

**ప్రతిపదార్థము:–** కురుక్షేత్రమ్ = ....

**తాత్పర్యము:–** కురుక్షేత్రము, హయశిరస్సు ప్రయాగ, పులహాశ్రమము, నైమిశారణ్యము, ఫల్గునము, సేతువు, ప్రభాసతీరము కుశస్థలీపురము అనగా ద్వారకానగరము ఇవి పుణ్య ప్రదేశములు.

**శ్లో॥ వారాణసీ మధుపురీ పమ్పా బిన్దుసరస్తథా।**
**నారాయణాశ్రమో నన్దా సీతారామాశ్రమాదయః॥ 32**

**ప్రతిపదార్థము:–** వారాణసీ = ....

**తాత్పర్యము:–** వారాణసి (కాశీ) మధుర, పంపాసరస్సు, బిందుసరస్సు, నారాయణాశ్రమము, గంగానది, సీతాశ్రమము, రామాశ్రమము అని ఇవి పుణ్య ప్రదేశములు.

**శ్లో॥ సర్వే కులాచలా రాజన్ మహేన్ద్రమలయాదయః।**
**ఏతే పుణ్యతమా దేశా హరేరర్చాశ్రితాశ్చ యే॥ 33**

**ప్రతిపదార్థము:–** యే=ఏవి, మహేంద్రమలయాదయః సర్వే కులాచలాః=ఎల్ల సర్వకుల పర్వతములు, హరేః అర్చాశ్రతాః=హరియొక్క పూజకు ఆశ్రయములు, ఏతే పుణ్యతమా దేశాః =ఇవి పుణ్యతమ దేశాలు.

**తాత్పర్యము:–** మహేంద్రము మలయము లోనగు సర్వకుల పర్వతములు, ఆ హరి పూజకు ఆశ్రితములగు దేశములు. ఇవి పుణ్యతమములగు దేశములు. హరిస్థిత ప్రతిముద్రితములు పూర్వము సాలగ్రామార్చన దేశమూను.

**శ్లో॥ ఏతాన్ దేశాన్ నిషేవేత శ్రేయస్కామో హ్యభీక్ష్ణశః।**
**ధర్మో హ్యత్రేహితః పుంసాం సహస్రాధిఫలోదయః॥ 34**

**ప్రతిపదార్థము:–** శ్రేయః కామః ఏతాన్ దేశాన్=శ్రేయస్సు కోరు ఈ దేశము, అభీక్ష్ణశః=మఱల మఱల, నిషేవతే= సేవించుచు, అత్ర=వానియందు, ఈహితః=చేయబడిన, ధర్మమ్=ధర్మము, సహస్రాధిఫలోదయః=వేయిరెట్లు అధిక ఫలమును కలిగించును.

**తాత్పర్యము:–** శ్రేయస్సు కోరు తాను మఱి మఱి ఈ చెప్పబడిన పుణ్యప్రదేశములను దర్శించ వలెను. ఈ పుణ్యదేశములందు చేయబడిన ధర్మము వేయిరెట్లు ఫలమధికముగా నిచ్చునదగును.

**శ్లో॥ పాత్రం తత్ర నిరుక్తం వై కవిభిః పాత్రవిత్తమైః।**
**హరిరేవైక ఉర్వీశ యన్మయం వై చరాచరమ్। 35**

**ప్రతిపదార్థము:–** పాత్రవిత్తమైః=పాత్రమైన ఎటింగిన మిక్కిలి శ్రేష్ఠులైన, కవిభిః=పండితులచే, అత్ర=అచ్చట, పాత్రం నిరుక్తమ్=పాత్రము నిర్వచించవలెను, ఉర్వీశ=రాజా!, హరిః ఏవ ఏకః =ఈ శ్రీహరియే, స చరాచరమ్=చరాచరముతో కూడినదైన యత్+మయమ్=ఎవని స్వరూపము.

**తాత్పర్యము:–** పాత్రముల తారతమ్యమును గుర్తెఱింగిన వారిలో మిక్కిలి శ్రేష్ఠులై అందు, పాత్రమును నిర్వచించియు, సకల చరాచర ప్రపంచముతో కూడిన స్వరూపము. ఈ శ్రీహరియే అన్నింటిలో ఉత్తముడైన పాత్రము.

**శ్లో॥ దేవర్ష్యర్హత్సు సత్స్వత్ర బ్రహ్మ బ్రహ్మాత్మజాదిషు।**
**రాజన్ యదగ్రపూజాయాం మతః పాత్రతయాచ్యుతః॥ 36**

**ప్రతిపదార్థము:–** రాజన్=ఓ రాజా!, దేవ+ఋషి+అర్హత్సు=దేవతలందు, ఋషులందు, తపో యోగాదిసిద్ధులై అర్హులైన, బ్రహ్మ+ఆత్మజాదిషు=బ్రహ్మవిదులై బ్రహ్మమానసపుత్రులైన సనకాదులు, సత్సు=ఉన్నను, తత్ర=అచట, అగ్రపూజాయామ్=రాజసూయయాగమందు అగ్ర పూజకు, పాత్రతయా అచ్యుతః=శ్రీకృష్ణుడే పాత్రుడు, సమ్మతుడయ్యెను.

**తాత్పర్యము:–** దేవతలు ఋషులు తపోయోగాది సిద్ధులు బ్రహ్మవిదులైన సనకసనందాదులు అర్హులైన వారున్నను ఓ రాజా! నీరాజసూయయాగమునందు శ్రీకృష్ణుడే అగ్రపూజకు అర్హుడుగా సమ్మతుడయ్యెను.

**శ్లో॥ జీవరాశిభిరాకీర్ణ అణ్డకోశాఙ్ఘ్రిపో మహాన్।**
**తన్మూలత్వాదచ్యుతేజ్యా సర్వజీవాత్మతర్పణమ్॥ 37**

**ప్రతిపదార్థము:–** జీవరాశిభిః=జీవరాశులచే, ఆకీర్ణః=వ్యాప్తమైన, మహాన్=గొప్పదైన, అండకోశ+అంఘ్రిపః=బ్రహ్మాండకోశమను వృక్షము, తత్+మూలత్వాత్=అచ్యుతుడు మూలముగా గల దగుటవలన, అచ్యుత+ఇజ్యా=అచ్యుతునికి చేయు యజ్ఞము, సర్వజీవాత్మ తర్పణమ్=సర్వ జీవులకు ఆత్మకును తృప్తినిచ్చును.

**తాత్పర్యము:–** సర్వజీవకోటితో కూడిన ఈ బ్రహ్మాండకోశమను మహావృక్షమునకు మూలము (వేఱు) కారణము అచ్యుతుడగును. ఆ అచ్యుతునికి ప్రీతిగజేయు యజ్ఞము, పూజాదికము. సర్వజీవులకు, పరమాత్మకు తృప్తి గలిగించును.

**శ్లో॥ పురాణ్యనేన సృష్టాని నృతిర్యగృషిదేవతాః।**
**శేతే జీవేన రూపేణ పురేషు పురుషో హ్యసౌ॥ 38**

**ప్రతిపదార్థము:–** అనేన=ఈ హరిచే, నృతిర్యక్+ఋషి దేవతాః=నరులు తిర్యగ్జంతువులు, ఋషులు, దేవతలు అనువారలందరిరూపములు, పురాణి=శరీరములు, సృష్టాని=సృజించ బడినవి. పురేషు=పురములలో, పురుషః+అసౌ=ఈ పురుషులు, ఏ ప్రకారము, జీవేన రూపేణ= జీవస్వరూపముతో, శేతే=పురములందు శయనించును.

**తాత్పర్యము:–** ఈ శ్రీహరియే నరులు, తిర్యగ్జంతువులు, ఋషులు, దేవతలు అనురూపములు గల శరీరములను సృజించెను. అతడే జీవరూపమున పురములందు శయనించియుండుట పురము నందు శయనించినవాడుగా వున్న పురుషుడని చెప్పబడుదురు.





**శ్లో॥ తేష్వేషు భగవాన్ రాజంస్తారతమ్యేన వర్తతే।**
**తస్మాత్పాత్రం హి పురుషో యావానాత్మా యథేయతే। 39**

**ప్రతిపదార్థము:–** రాజన్=ఓ రాజా!, తేషు=ఆ శరీరములందు, భగవాన్=అంతర్యామియైన భగవంతుని జీవరూపము, తారతమ్యేన=తిర్యగ్జంతువుల కంటె ఆధిక్యముతో, వర్తతే=వర్తించును, తస్మాత్=అందువలన, పురుషః పాత్రమ్=పురుషులు అట్టి, యావాన్=ఎంతమంది, ఆత్మా= జ్ఞానాంశము, యథా=ఏ ప్రకారము తపస్సులోనగువాని యోగాలు, ఈయతే=పొందుచున్నాడో ఆ ప్రకారము ఇతడు పొందుచున్నాడు. అట్లే శ్రుతి **– పురుషత్వేన విస్తరామాత్మ.**

**తాత్పర్యము:–** ఓ రాజా! ఆ శరీరములందు అంతర్యామిరూపము జీవస్వరూపము తిర్యక్కుల కంటె అధికము పురుషునందు వర్తించుచున్నాడు. అందువలన పురుషుడు – అందువలన ఎంతమంది తపస్సు లోనగువాని జ్ఞానాదులుండిననూ అవి ఇతడు పొందుచున్నాడు.

**శ్లో॥ దృష్ట్వా తేషాం మిథో నృణామవజ్ఞానాత్మతాం నృప।**
**త్రేతాదిషు హరేరర్చా క్రియాయై కవిభిః కృతా॥ 40**

**ప్రతిపదార్థము:–**మిథః=పరస్పరము, అవజ్ఞానాత్మతామ్=అవమానమునందు బుద్ధిగల, తేషాం నృణాం=ఆ నరులను భావము, దృష్ట్వా=చూచి, త్రేతాదిషు=త్రేతాయుగము మొదలు ఇతర యుగములందు, కవిభిః=పండితులచే, హరేః=హరియొక్క ప్రతిమాదులకు, అర్చా=పూజ, క్రియాయై=పూజాదికమునకు, కృతా=చేయబడినది.

**తాత్పర్యము:–** పరస్పరము అవమానించుకొను బుద్ధిగల నరుల భావమును గుర్తించి పండితులచే హరిని, ప్రతిమాదులను పూజ కొఱకు ఏర్పరచబడినది.

**శ్లో॥ తతోఽర్చాయాం హరిం కేచిత్ శ్రద్ధాయా చ సపర్యయా।**
**ఉపాసత ఉపాస్తాపి నార్థదా పురుషద్విషామ్॥ 41**

**ప్రతిపదార్థము:–**తతః=అందువలన, అర్చాయామ్=ప్రతిమయందు, కేచిత్=కొందఱు, హరిమ్ =హరిని,శ్రద్ధయా సపర్యయా=శ్రద్ధతోసేవచేసి, ఉపాసతే=ఉపాసించుచున్నారు, ఉపాస్తా+అపి= అట్లు ఉపాసించబడినను ఆ ప్రతిమ, పురుషద్విషామ్=తనతోడి మానవులను ద్వేషించువారికి, న అర్థదా=కోరిన వరము నీయదు.

**తాత్పర్యము:–** అందువలన కొందఱు హరిప్రతిమకు శ్రద్ధతో సేవచేసి ఉపాసించుచున్నారు. అట్లు ఉపాసించినను హరిప్రతిమ పురుషులను ద్వేషించు వారికి అర్థకారికాదు. అందువలన పురుషులందు ద్వేషమునువీడి అర్చించబడినదగుచో పురుషార్థప్రదాయిని యగుచున్నది.

**శ్లో॥ పురుషేష్వపి రాజేన్ద్ర సుపాత్రం బ్రాహ్మణం విదుః।**
**తపసా విద్యయా తుష్ట్యా ధత్తే వేదం హరేస్తనుమ్। 42**

**ప్రతిపదార్థము:–** రాజేంద్ర=ఓ రాజశ్రేష్ఠా!, పురుషేషు+అపి=పురుషులందు, యః=ఎవడు, తపసా=విద్యచే, తుష్ట్యా=సంతుష్టిచే, హరేః=శ్రీహరియొక్క, తనుమ్=శరీరము, వేదం ధత్తే= వేదమును ధరించుచున్నదో, బ్రాహ్మణమ్=అట్టి బ్రాహ్మణుని, సుపాత్రమ్=చక్కని పాత్రము అని, విదుః=ఎఱుంగుము.

**శ్లో॥ తస్మాద్దైవోపపన్నేన మున్యన్నేనాపి ధర్మవిత్।**
**సన్తుష్టోఽహరహః కుర్యాన్నిత్యనైమిత్తికీః క్రియాః॥ 11**

**ప్రతిపదార్థము:–** తస్మాత్=అందువలన, ధర్మవిత్=ధర్మజ్ఞుడు, దైవ+ఉపపన్నేన=దైవవశమున సంప్రాప్తమైన, మున్యన్నేనాపి=మున్యన్నముచేత, సంతుష్టః=సంతుష్టుడగుచు, అహరహః =ప్రతిదినము, నిత్యనైమిత్తికీః క్రియాః=నిత్యనైమిత్తికములైన క్రియలను, కుర్యాత్=చేయవలెను.

**తాత్పర్యము:–** భూతములు భయపడుటవలన దైవవశమున సంప్రాప్తమైన మున్యన్నముచే సంతుష్టుడగుచు నిత్యనైమిత్తిక క్రియలు చేయవలెను.

**శ్లో॥ విధర్మః పరధర్మశ్చాభాస ఉపమా ఛలః।**
**అధర్మశాఖాః పఞ్చేమా ధర్మజ్ఞోఽధర్మవత్ త్యజేత్॥ 12**

**ప్రతిపదార్థము:–** విధర్మః=నిషిద్ధధర్మము, పరధర్మశ్చ అపి అభాస ఉపమా ఛలః=పరధర్మము, ధర్మాభాసము, ధర్మోపమము, ధర్మఛలము, ఇమాః పంచ=ఈ ఐదు, అధర్మశాఖాః=అధర్మ శాఖలు, ధర్మజ్ఞః, అధర్మవత్ త్యజేత్=అధర్మమువలె త్యజించవలెను.

**తాత్పర్యము:–** ధర్మము లేనిదియు, పరధర్మము, ధర్మాభాసము, ధర్మోపమము, ధర్మాచ్ఛాలము అను ఐదు అధర్మశాఖలగును. కావున ధర్మవిదుడు వానిని అధర్మమువలె త్యజించవలెను.

**శ్లో॥ ధర్మబాధో విధర్మః స్యాత్ పరధర్మోఽన్యచోదితః।**
**ఉపధర్మస్తు పాఖణ్డో దమ్భో వా శబ్దభిచ్ఛలః।**
**యస్త్విచ్ఛయా కృతః పుమ్భిరాభాసో హ్యాశ్రమమాత్ పృథక్॥ 13**

**ప్రతిపదార్థము:–** ధర్మబాధః=ఏది ధర్మబుద్ధితో చేయబడినదై స్వధర్మమునకు బాధయగునో, విధర్మః=విధర్మము, అన్యచోదితః=అన్యునికి విధింపబడిన ధర్మము, ఉపధర్మస్తుపాఖండః=వేద విరుద్ధమైన ధర్మమువలె భాసించును. దమ్భః వా=దంభమగు ధర్మలక్షణరహితమైన ధర్మమువలె ఆభాస మగును. శబ్దభిత్=శబ్దముచే ఛేదించినది. యస్తు=ఏది, ఇచ్ఛయా=ఇచ్ఛతో, పుంభికృతః =పురుషులచే చేయించుట, ఆభాసః ఆశ్రమాత్ పృథక్=ఆశ్రమము వేఱు.

**తాత్పర్యము:–** ఏది ధర్మమని బుద్ధితో చేయబడినది తుదకు స్వధర్మమునకు భంగపాటు కలుగునో అది విధర్మము. అన్యపాలిట ధర్మమైనది పరధర్మము వేదవిరుద్ధమైనది పాఖండము. ధర్మమువలె ఆభాసమగునది దంభమగు ధర్మము. ధర్మలక్షణరహితమై ధర్మమువలె ఆభాస మగునది దంభము. లోకమును ప్రలోభపెట్టి ధనాపహరణము కొరకు చేయకూడదు. దంభము శబ్దభిత్తి శబ్దం చేత మారునది భీతిధర్మము. ఈ భీతిధర్మము ద్వివిధము. అర్థచ్ఛలము, శబ్దచ్ఛలము. అర్థచ్ఛలమేమో గోవును దానము చేయవలెనని చెప్పి, చనిపోవుచున్న గోవు నిచ్చుట అని,శబ్దచ్ఛలము దశాపరాన్ భోజయే పదుగురన్యులను బూజింపజేయడమే అని.

**శ్లో॥ స్వభావవిహితో ధర్మః కస్య నేష్టః ప్రశాన్తయే।**
**ధర్మార్థమపి నేహేత యాత్రార్థం వాఽధనో ధనమ్॥ 14**

**ప్రతిపదార్థము:–** స్వభావవిహితః=తనకు సహజముగా నేర్పడిన, ధర్మః=ధర్మము, కస్య= ఎవనికి,



## శ్రీః

# అథ పఞ్చదశోఽధ్యాయః

ఈ పదునైదవ అధ్యాయమందు సర్వవర్ణాశ్రమముల ధర్మముల సారమును గ్రహించి సంగ్రహముగా వర్ణింపబడును. మోక్ష లక్ష్యమును వర్ణింపబడును.

నారద ఉవాచ

**శ్లో॥ కర్మనిష్ఠా ద్విజాః కేచిత్తపోనిష్ఠా నృపాపరే।**
**స్వాధ్యాయనే ప్రవచనే హ్యన్యే చ జ్ఞానయోగయోః॥ 1**

**ప్రతిపదార్థము:–** నృప=ఓ రాజా!, కేచిత్ ద్విజాః=కొందఱు ద్విజులు, కర్మనిష్ఠాః=కర్మనిష్ఠులు, అపరే=ఇతరులు, తపోనిష్ఠాః=తపోనిష్ఠులు, స్వాధ్యాయనే=వేదాధ్యయనమునందు శిష్యులకు చెప్పుచు, అన్యే=ఇతరులు, జ్ఞానయోగయోః=జ్ఞానయోగ భక్తియోగములలో, నిష్ఠాః=నిష్ఠగలవారు.

**తాత్పర్యము:–** ఓ రాజా! విప్రులు కొందరు కర్మానుష్ఠానతత్పరులు, కొందరు తపోనిష్ఠ గలవారు, కొందరు వేదాధ్యయన ప్రవచనములందు నిష్ఠగలవారు, కొందరు జ్ఞానయోగమున భక్తియోగమున నిష్ఠగలవారు.

**శ్లో॥ జ్ఞాననిష్ఠాయ దేయాని కవ్యాన్యానన్త్యమిచ్ఛతా।**
**దైవే చ తదభావే స్యాదితరేభ్యో యథార్హతః॥ 2**

**ప్రతిపదార్థము:–** ఆనంత్యం ఇచ్ఛతా=మోక్షము నిచ్ఛగించు పురుషునిచే, కవ్యాని=ఇతరుల నుద్దేశించిచేయు అన్నాదికము, దైవే చ=దైవ కర్మలందుచేయు కార్యములందు, జ్ఞాననిష్ఠాయ= జ్ఞాననిష్ఠగలవానికి, దేయాని=ఈయవలెను. తదభావే=అట్టివారులేనిచో, ఇతరేభ్యః=తదితరులకు, యథార్హతః=అర్హతకు తగినట్లు, దేయాని=ఇవ్వవలెను.

**తాత్పర్యము:–** మోక్షమునుగోరు పురుషునిచే తాను కావించు పితృశ్రాద్ధములందు కవ్యము లగు అన్నాదులను దైవకర్మలందు సమర్పించు హవ్యాదులను జ్ఞాననిష్ఠగలవానికి సమర్పించ వలెను. అట్టివాడు లభింపని యెడల ఇతరులకు అర్హతను బట్టి వానికి ఇచ్చునది. అంతట జ్ఞానాది తారతమ్యమును బట్టి దానధర్మములు చేయవలెను.

**శ్లో॥ ద్వౌ దైవే పితృకార్యే త్రీనేకైకముభయత్ర వా।**
**భోజయేత్సుసమృద్ధోఽపి శ్రాద్ధే కుర్యాన్న విస్తరమ్॥ 3**

**ప్రతిపదార్థము:–** దైవే=దైవకార్యమందు, ద్వౌ=ఇరువురు, పితృకార్యే=పితృశ్రాద్ధమందు, త్రీన్= ముగ్గురు,ఉభయత్ర=రెండింటియందు,ఏకైకం వా=ఒక్కొక్కరినైను, భోజయేత్=భుజింప జేయుము, సుసమృద్ధః+అపి=ఎక్కువ సంపదగలవాడైనను, శ్రాద్ధే=శ్రాద్ధమునందు, విస్తరమ్= విస్తరముగా, న కుర్యాత్=చేయకూడదు.

**తాత్పర్యము:–** దైవకార్యమునందు ఇరువురు బ్రాహ్మణులను, పితృకార్యమునందు ముప్వురు విప్రులను, రెంటియందు ఒక్కొక్కరినైన నియంత్రించి భోజనము పెట్టవలెను. సంపదగల వారైనను శ్రాద్ధము విస్తరము పనికిరాదు. ఎక్కువ చేయకూడదు.

**శ్లో॥ దేశకాలోచితశ్రద్ధాద్రవ్యపాత్రార్హణాని చ।**
**సమ్యగ్భవన్తి నైతాని విస్తరాత్స్వజనార్పణాత్॥ 4**

**ప్రతిపదార్థము:–** దేశకాల....ణాని – దేశకాల=దేశకాలములకు, ఉచిత=తగినదై, శ్రద్ధాద్రవ్య పాత్ర+అర్హణాని=పూజాద్రవ్యములు, ఏతాని=ఇవి, విస్తరాత్=విస్తరించి, స్వజన+అర్పణాత్= తన బంధువులకు సమర్పించుము. న సమ్యక్ భవంతి=అంతచక్కమైన సఫలములు గావు.

**తాత్పర్యము:–** దేశము కాలము తగినట్లు ద్రవ్యములు పాత్రమునకు తగు పూజాద్రవ్యములు, స్వబంధుజనమునకు సమర్పించుట, చక్కని సత్ఫలము. జామాతను నిమంత్రించుట తత్పిత్రాదుల పట్ల వర్జించుట అవి అంత ఫలప్రదము కాదు.

**శ్లో॥ దేశకాలే చ సమ్ప్రాప్తే మున్యన్నం హరిదైవతమ్।**
**శ్రద్ధయా విధివత్ పాత్రే న్యస్తం కామధుగక్షయమ్॥ 5**

**ప్రతిపదార్థము:–** దేశకాలే చ=కాశ్యాదిదేశము, మకరసంక్రమణాది కాలము, సంప్రాప్తే= వచ్చిననూ, హరిదైవితమ్=హరికి నివేదించబడినదైన, ముని+అన్నమ్=ముని అన్నము బ్రీహ్యా దికమగు నన్నము, శ్రద్ధయా=శ్రద్ధతో, విధివత్=విధివంతముగా,పాత్రే న్యస్తమ్=పాత్రమైనవాని యందు సమ్మతము, అక్షయమ్=నాశరహితమై, కామధుక్=కోరికలకు కామధేనువు.

**తాత్పర్యము:–** కాశ్యాది పుణ్యదేశము సంక్రమణాది పుణ్యకాలము ప్రాప్తించిన అన్నాదికము హరికి సమర్పించిన నివేదించిన మునుల అన్నము బ్రీహ్యాదిధాన్యాదికము వలన నేర్పరిచిన అన్నము పాత్రము అగువానికి విధివంతముగా సమర్పించినచో అట్టి దానము అక్షయమై వాంఛలను తీర్చు కామధేనువగును.

**శ్లో॥ దేవర్షిపితృభూతేభ్య ఆత్మనే స్వజనాయ చ।**
**అన్నం సంవిభజన్ పశ్యేత్ సర్వం తత్పురుషాత్మకమ్॥ 6**

**ప్రతిపదార్థము:–** దేవర్షి పితృభూతేభ్యః+ఆత్మనే=తనకు, దేవతలకు, ఋషులకు, పితృ దేవతలకు, ఇతర భూతములకు, స్వజనాయ=తన బంధువులకు, అన్నమ్=అన్నము, సంవిభజన్=పంచుము, సర్వమ్=సర్వమును,తత్పురుషాత్మకమ్=ఆ పరమేశ్వర స్వరూపముగా, పశ్యేత్=చూడుము.

**తాత్పర్యము:–** దేవతలకు, ఋషులకు, పితరులకు, ఇతర ప్రాణులకు, తనకు, బంధువులకు అన్నమును పంచిపెట్టి ఈ జగత్తంతయు ఆ విష్ణుస్వరూపమే కదా! అని చూడవలెను.

**శ్లో॥ న దద్యాదామిషం శ్రాద్ధే న చాద్యాద్ధర్మతత్త్వవిత్।**
**మున్యన్నైః స్యాత్పరాప్రీతిర్యథా న పశుహింసయా॥ 7**

**ప్రతిపదార్థము:–** ధర్మతత్త్వవిత్=ధర్మతత్త్వజ్ఞులు, శ్రాద్ధే=పితృశ్రాద్ధమున, ఆమిషం న చాద్యాత్= మాంసమును పెట్టకూడదు, భుజింపకూడదు, మున్యన్నైః=మునుల అన్నమున, బ్రీహిధాన్యాదిక మందు, పరాప్రీతిః=ఎక్కువ ప్రీతి, స్యాత్=కలుగును, న పశుహింసయా=పశు హింసచేతకాదు.

**తాత్పర్యము:–** ధర్మతత్త్వము తెలిసినవాడు పితృశ్రాద్ధమున మాంసమును పెట్టకూడదు. తాను భుజింపకూడదు. మున్యన్నము బ్రీహిధాన్యాదికముపై ప్రీతినుంచవలెను. **పశుహింస చేయకూడదు.**

**శ్లో॥ నైతాదృశః పరో ధర్మో నృణాం సద్ధర్మమిచ్ఛతామ్।**
**న్యాసో దణ్డస్య భూతేషు మనోవాక్కాయజస్య యః॥ 8**

**ప్రతిపదార్థము:–** సత్+ధర్మమ్=ఉత్తమ ధర్మమును, ఇచ్ఛతామ్=కోరుచున్న, నృణామ్= నరులకు, ఏతాదృశః=ఇట్టి, పరః ధర్మః=పరమధర్మము మరొకటి, న=లేదు, భూతేషు= భూతములందు, మనోవాక్కాయజస్య=మనోవాక్కాయముల వలన జనించినదై, న్యాసః దండస్య =హింసాత్యాగము, సత్‌ధర్మమ్=పరమధర్మము.

**తాత్పర్యము:–** ఏది మనోవాక్కాయముల వలన జనించినదై ప్రాణులందు దయతో ఏ హింసాత్యాగరూపమైన ఇటువంటి పరమ ధర్మము, ఉత్తమ ధర్మమును గోరు నరులకు ఇట్టి ఉత్తమ ధర్మము మరేదియు లేదు. **హింసాత్యాగము అన్నింటా మంచి ధర్మము.**

**శ్లో॥ ఏకే కర్మమయాన్ యజ్ఞాన్ జ్ఞానినో జ్ఞానవిత్తమాః।**
**ఆత్మసంయమనేఽనీహా జుహ్వతి జ్ఞానదీపితే॥ 9**

**ప్రతిపదార్థము:–** ఏకే=కొందఱు, జ్ఞానవిత్తమాః=జ్ఞానవిదులలో ఉత్తములు, కర్మమయాన్ యజ్ఞాన్=కర్మమయములైన యజ్ఞములను, అనీహాః=వాంఛలులేనివారై, జ్ఞానదీపితే= జ్ఞానముతో ప్రకాశించు, ఆత్మసంయమనః=మనస్సంయ మనము గలవారు, జుహ్వతి= త్యజించుదురు.

**తాత్పర్యము:–** కొందరు జ్ఞానవిదులలో ఉత్తములు కోరికలు లేనివారై కర్మమయములైన యజ్ఞములను జ్ఞానప్రకాశమై ఆత్మసంయమనమున మనస్సంయమనమునందు వ్రేల్చుచున్నారు. కర్మలను త్యజించుచున్నారు.

**శ్లో॥ ద్రవ్యయజ్ఞైర్యక్ష్యమాణం దృష్ట్వా భూతాని బిభ్యతి।**
**ఏష మాకరుణో హన్యాదతజ్ఞో హ్యసుతృప్ ధ్రువమ్॥ 10**

**ప్రతిపదార్థము:–** ద్రవ్యయజ్ఞైః=పశ్వాదిద్రవ్యముల యజ్ఞములచే, యక్ష్యమాణమ్=యజించు వారలను, దృష్ట్వా=చూచి, భూతాని బిభ్యతి=ఎల్లప్రాణులు భయపడును. ఏషః=వీరు, అకరుణః =నిర్దయులు, అతజ్ఞః=ఆత్మజ్ఞానము తెలియనివారు, అసుతృప్=ఇంద్రియముల తృప్తిపడనివారు, మా=నన్ను, హన్యాత్=చంపును, ధ్రువమ్=నిశ్చయము.

**తాత్పర్యము:–** పశుహింసగావించు యజ్ఞముల చేయు యజ్ఞకర్మను జూచి భయపడి ఎల్లభూతములు ఇతడు దయలేనివాడు, అత్మజ్ఞానవిహీనుడు, ఇంద్రియసుఖములాశించువాడు నన్ను తప్పక చంపును అని భయపడును.

సత్త్వగుణమును జయించవలెను. ఈ అన్నింటిని గురువు నందలి భక్తిచే పురుషుడు శీఘ్రముగా జయించవలెను.

**శ్లో॥ యస్య సాక్షాద్భగవతి జ్ఞానదీపప్రదే గురౌ।**
**మర్త్యాసద్ధీః శ్రుతం తస్య సర్వం కుఞ్జరశౌచవత్॥ 26**

**ప్రతిపదార్థము:-** యస్య=ఎవనికి, సాక్షాత్ భగవతి=ప్రత్యక్షమైన భగవంతుడై, జ్ఞానదీపప్రదే= జ్ఞానదీపమునిచ్చువాడైన, గురౌ=గురునందు, మర్త్యాసద్ధీః=ఇతడును మనుజుడె కదా అను దుర్బుద్ధి కలిగిన, తస్య=వానికి, శ్రుతమ్=శ్రవణము, కుంజరశౌచవత్=గజస్నానమువలె వ్యర్థము.

**తాత్పర్యము:-** ప్రత్యక్ష భగవానుడై జ్ఞానదీపమును ప్రసాదించువాడైన గురువునందెవనికి ఇతడును మనుజుడె కదా అను దుర్బుద్ధి కలిగినచో వాని శ్రవణమంతయు గజస్నాముపలె (ఏనుగు స్నాముచేసి పైన మట్టి జల్లుకొనును) నిష్ఫలమగును.

**శ్లో॥ ఏష వై భగవాన్ సాక్షాత్ ప్రధానపురుషేశ్వరః।**
**యోగేశ్వరైర్విమృగ్యాఙ్ఘ్రిర్లోకో ఽయం మన్యతే నరమ్॥ 27**

**ప్రతిపదార్థము:-** ఏషః=ఇతడు, యోగేశ్వరైః=యోగీశ్వరులచే, విమృగ్య+అంఘ్రిః=వెదుకదగిన పాదములు గలవాడు. అయం లోకః=ఈ లోకము, నరం మన్యతే=నరునిగా తలచుచున్నది.

**తాత్పర్యము:-** ఇతడు ప్రత్యక్షమైన భగవానుడు. ప్రధాన పురుషులకు ఈశ్వరుడు. యోగేశ్వరులచే, నన్వేషింపదగిన పాదములు గలవాడు, లోకము ఈయనను నరునిగా దలంచుచున్నది. అతడు పుత్రాదులకు నరుడుగాదోచుచున్నాడు. ఏ ప్రకారము శ్రీ కృష్ణుడే గురువు భగవానుడూ యగును.

**శ్లో॥ షడ్వర్గసంయమైకాన్తాః సర్వా నియమచోదనాః।**
**తదన్తా యది నో యోగానావహేయుః శ్రమావహాః॥ 28**

**ప్రతిపదార్థము:-** సర్వాః నియమచోదనాః అపి=ఎల్లవేదచోదితమైన ఇష్టాపూర్తాది విధులు, షడ్వర్గ సంయమైకాంతాః=చక్షురాది జ్ఞానేంద్రియములైదు, మనస్సు ఆతీంద్రియముల సంయమనము ముఖముగాగలిగియు,తదంతా యది=అట్లు కర్మలు ఇంద్రియ సంయమనము గలవి అయినది అంతమాత్రముతో ప్రయోజనము లేదు. యోగాన్=ధారణధ్యాన సమాధులను, నో సాధ అవహేయుః=సాధింపనివైనచో, శ్రమావహాః ఏవ=ఈ ఇంద్రియములయందును కేవలము శ్రమను గలిగించునవే అగును.

**తాత్పర్యము:-** వేదచోదితములైన ఇష్టాపూర్తాదికర్మలన్నియు ఇంద్రియ సంయమన పూర్వకములై చరితములైన ఆ యింద్రియ సంయమనము ద్వారా యోగమును, ధారణధ్యాన సమాధులను అభ్యసింపకపోయినచో ఆ ఇంద్రియములయందును కేవలము శ్రమకరములే యగును.

**శ్లో॥ యథా వార్తాదయో హ్యర్థా యోగస్యార్థం న బిభ్రతి।**
**అనర్థాయ భవేయుశ్చ పూర్తమిష్టం తథాసతః॥ 29**

**ప్రతిపదార్థము:-** యథా=ఏ ప్రకారము, వార్తాదయః=కృష్యాదులు, అర్థాః=వాని ఫలములు, న బిభ్రతి=సాధింపరో, తథా=ఆ ప్రకారము, ఇష్టాపూర్తాదికర్మలు, ఇంద్రియ సంయమము,





నేష్టః ప్రశాన్తయే=దుఃఖమును పోగొట్టకుండును. ధర్మార్థమపి=ధర్మముకొఱకు, యాత్రార్థం వా=యాత్ర కొరకు గాని, అధనః=దరిద్రుడు, ధనం లేని, న+ఈహేత=కోరరు.

**తాత్పర్యము:-** స్వభావమైన ధర్మము స్వధర్మము మనశ్శాంతి కలిగించును. పరధర్మము కొఱకు దరిద్రుడయ్యును. ధర్మము కొరకుగాని యాత్ర కొరకుగాని ధనమును యాచించరు.

**శ్లో॥ అనీహానీహమానస్య మహాహేరివ వృత్తిదా॥ 15**

**ప్రతిపదార్థము:-** అనీహాని=కోరతగని వానిని, ఈహమానస్య=కోరుచున్న, మహాహేరివ=గొప్ప సర్పము యొక్క, వృత్తిదా=జీవనమువలె.

**తాత్పర్యము:-** కోరతగని వానిని కోరుచున్న గొప్పసర్పము యొక్క జీవనము వలెనగు.

**శ్లో॥ సన్తుష్టస్య నిరీహస్య స్వాత్మారామస్య యత్సుఖమ్।**
**కుతస్తత్ కామలోభేన ధావతోఽర్థేహయా దిశః॥ 16**

**ప్రతిపదార్థము:-** సన్తుష్టస్య=సంతుష్టుడు, నిరీహస్య=ప్రయత్న శూన్యుడు, అగు, స్వాత్మారామస్య =ఆత్మారామునకు, యత్‌సుఖమ్=ఏ సుఖము, కామలోభేన=కోరికలందు ఆశచే, అర్థేహయా= ధనమునందు కోరికచే, దిశః ధావతః=దిక్కులకు పరుగు పెట్టుట, కుతః=ఎందులకు?

**తాత్పర్యము:-** సంతుష్టచిత్తుడై కోరికలు లేనివాడై ఆత్మారాముడై (ఆత్మయందు రమించువాని) ఏ సుఖము కొరకు ఆత్మ కామలోభములచే అర్థ వాంఛగల దిశలకు పరుగుపెట్టుట ఎందులకు?

**శ్లో॥ సదా సన్తుష్టమనసస్సర్వాశ్శివమయా దిశః।**
**శర్కరాకణ్టకాదిభ్యో యథోపానత్పదశ్శివమ్॥ 17**

**ప్రతిపదార్థము:-** సదా=ఎల్లప్పుడు, సంతుష్టమనసః=సంతుష్టచిత్తునకు, సర్వాదిశః=ఎల్లదిశలు, శివమయాః=మంగళకరములు, యథా=ఏ ప్రకారము, ఉపానత్పదః=పాదరక్షలు ధరించు పాదములు, శర్కరాకంటకాదిభ్యః=గులక రాళ్ళు, ముళ్ళు నుండియు, శివమ్=శుభమును పొందును.

**తాత్పర్యము:-** చెప్పులు తొడుగుకొని ప్రయాణము చేయువాడు గులకరాళ్ళు, ముండ్ల నుండి బాధపొందక ఎట్లు సుఖమునొందునో అట్లే సంతుష్ట చిత్తుడు ఎల్లదిక్కులూ, మంగళ కరములుగా చూచుచున్నవాడై శుభమును పొందును.

**శ్లో॥ సన్తుష్టః కేన వా రాజన్ న వర్తేతాపి వారిణా।**
**ఔపస్థ్యజైహ్వ్యకార్పణ్యాద్గృహపాలాయతే జనః॥ 18**

**ప్రతిపదార్థము:-** రాజన్=ఓ రాజా!, కేన వా=దేనిచేతనూ, న సంతుష్టః=సంతుష్టుడు కాడో, వారిణాపి న వర్తేత=ఉదకము చేతను వర్తింపదో, ఔపస్థ్యజైహ్వ్యకార్పణ్యాత్=ఉపస్థయందు, జిహ్వయందు, ఆశనవలన, జనః=జనుడు, గృహపాలాయతే=గృహమును పాలించు శ్వాన మగుచున్నాడు.

**తాత్పర్యము:-** ఏ జనుడు, దేనిచేతను సంతుష్టుడుగాడో ఉదకము చేతను గూడ తృప్తిపడని

వాడో అట్టివాడు జిహ్వా ఉపస్థలందు, రుచిగల పదార్థములందు, స్త్రీ సంగమమందు మిగుల అభిలాషగలవాడు ఇంటిని కావలిగాయు కుక్కవలె అగుచున్నాడు.

**శ్లో॥ అసన్తుష్టస్య విప్రస్య తేజో విద్యా తపో యశః।**
**స్రవన్తీన్ద్రియలౌల్యేన జ్ఞానం చైవావకీర్యతే॥ 19**

**ప్రతిపదార్థము:–** అసంతుష్టస్య విప్రస్య=సంతుష్టికాని విప్రునికి, తేజోవిద్యాతపోయశః=తేజస్సు, విద్య, తపస్సు, యశము, స్రవంతి=జాఱిపోవుచు, ఇంద్రియలౌల్యేన=ఇంద్రియలోలత్వము చేత, జ్ఞానంచైవ=జ్ఞానము కూడా, అవకీర్యతే=కృశించి తగ్గిపోవును.

**తాత్పర్యము:–** అసంతుష్ట చిత్తుడైన విప్రునికి తేజస్సు, విద్య, తపస్సు యశము జాఱిపోవుచు ఇంద్రియలౌల్యముచే జ్ఞానమును కృశించి తగ్గిపోవుచున్నది.

**శ్లో॥ కామస్యాన్తం హి క్షుత్తృడ్భ్యాం క్రోధస్యాన్తం ఫలోదయాత్।**
**జనో యాతి న లోభస్య జిత్వా భుక్త్వా దిశో భువః॥ 20**

**ప్రతిపదార్థము:–** క్షుత్తృడ్భ్యామ్=ఆకలిదప్పులవలన, కామస్య+అంతమ్=కామము యొక్క అంతమును, అన్నాదికములకు అతిరిక్తమైన ఇతర కామము లేక పొందుతున్న, క్రోధస్య అంతమ్=క్రోధముయొక్క అంతమును, ఫలోదయాత్=హింసరూపఫల ఉదయమును, యాతి =పొందును, జనః=జనుడు, భువః దిశః=భూమిని, దిక్కులను, జిత్వా=జయించి, భుక్త్వా= అనుభవించి, లోభస్య+అంత=లోభముయొక్క అంతమును, న యాతి=పొందదు.

**తాత్పర్యము:–**ఆకలి దప్పులవలన అనగా తన కిష్టమైన అన్నాదులు లభించుటవలన కామము యొక్క అంతమును పొందుచున్నాడు. అట్లే హింసారూపఫలముదయించుటవలన క్రోధము యొక్క అంతమును పొందుచున్నాడు. గాని భూమియొక్క నలుగడలను జయించిన రాజై, రాజ్యభోగము లను అనుభవించి లోభముయొక్క అంతమును పొందడు.

**శ్లో॥ పణ్డితా బహవో రాజన్ బహుజ్ఞాః సంశయచ్ఛిదః।**
**సదసస్పతయోఽప్యేకే హ్యసన్తోషాత్ పతన్త్యధః॥ 21**

**ప్రతిపదార్థము:–**రాజన్=ఓ రాజా!, బహుజ్ఞా=అనేక విషయములు తెలిసిననూ, సంశయచ్ఛిదః =సందేహములను పోగొట్టు, సదసస్పతయః=సభాసదులు, ఏకే=కొందరు, అసంతోషాత్=తృప్తి లేనందున, లోభమువలన, అధః పతంతి=అధః పతితులు అగుచున్నారు.

**తాత్పర్యము:–** ఓ రాజా! సర్వము నెఱింగినవారు సంశయమును పోగొట్టువారు సభాసదులై పండితులు పెక్కురున్నారు. కాని వారు సంతృప్తిలేనందున లోభకారణమున అధః పతితులగు చున్నారు.

**శ్లో॥ అసఙ్కల్పాజ్జయేత్కామం క్రోధం కామవివర్జనాత్।**
**అర్థానర్థేక్షయా లోభం భయం తత్త్వావమర్శనాత్॥ 22**

**ప్రతిపదార్థము:–** అసంకల్పాత్=సంకల్పముచేయకుండుటవలన, కామం జయేత్=కామమును జయించవలెను, కామవివర్జనాత్=కామమును వర్జించుటవలన, క్రోధం జయేత్=క్రోధము





జయించవలెను. అర్థే=ధనమునందు, అనర్థేక్షయా=అనర్థదర్శనము, లోభంజయేత్=లోభమును జయించవలెను. తత్త్వావమర్శనాత్=అద్వైతానుసంధానముచేత, భయం జయేత్=భయమును త్యజించవలెను.

**తాత్పర్యము:–** సంకల్పమును విరమించుట వలన కామమును జయించవలెను. కామమును వర్జించుటవలన క్రోధమను, అర్థమువలన అనర్థముగాంచుట చేత లోభమును, అద్వైతాను సంధానముచేత ఆత్మజ్ఞానము వలన భయమును జయించవలెను.

**శ్లో॥ ఆన్వీక్షిక్యా శోకమోహౌ దమ్భం మహదుపాసయా।**
**యోగాన్తరాయాన్ మౌనేన హింసాం కాయాద్యనీహయా॥ 23**

**ప్రతిపదార్థము:–** ఆన్వీక్షిక్యా=ఆత్మానాత్మ వివేకముచే, శోకమోహౌ=శోకమోహములు, మహదు పాశ్రయాత్=గొప్పవారి నాశ్రయించుటవలన, దంభమ్=దాంభికత్వము, మౌనేన=మౌనముచే, యోగాంతరాయాన్=యోగవిఘ్నములైన, లోకవార్తాదులను, కాయాద్యనీహయా=శరీరాదు లందు ఇచ్ఛలేమిచే, హింసామ్=హింసను, త్యజేత్=విడువలెను.

**తాత్పర్యము:–** ఆత్మానాత్మ వివేకముచే శోకమోహములను, సాత్త్వికుల ఆశ్రయము వలన దంభము (కపటము), మౌనముచే యోగమునకు విఘ్నమునలైన లోకవార్తాదులను, శరీరాదు లందు ఇచ్ఛలేమిచే హింసను త్యజించవలెను.

**శ్లో॥ కృపయా భూతజం దుఃఖం దైవం జహ్యాత్సమాధినా।**
**ఆత్మజం యోగవీర్యేణ నిద్రాం సత్త్వనిషేవయా॥ 24**

**ప్రతిపదార్థము:–**భూతజం దుఃఖమ్=ఇతర ప్రాణుల వలన కలుగు భయము, కృపయా=వానికి మేలు చేయుటచే, జహ్యాత్=త్యజించవలెను, దైవం దుఃఖమ్=దైవవశమున కలిగిన ఉత్పాత నిమిత్తమగు దుఃఖమును, సమాధినా=సమాధిచే, ఆత్మజః దుఃఖమ్=దేహజమైన దుఃఖమును, రోగాదికమును,యోగవీర్యేణ=ప్రాణాయామములచే, నిద్రామ్ దుఃఖమ్=నిద్రను, దుఃఖమును, సత్త్వనిషేవయా=సాత్త్వికాహారముచే, జహ్యాత్=త్యజించవలెను.

**తాత్పర్యము:–** ఇతర ప్రాణులవలన కలుగు దుఃఖమును భయమును వానికి మేలు చేయుట ద్వారా త్యజించవలెను. దైవవశమున వచ్చిన ఉత్పాతితమువలన దుఃఖమును, మనః పీడాదికమును సమాధిచేతను, శరీరమున జనించిన వ్యాధిలోనగు వానిని ప్రాణాయామము చేతను, నిద్రవలని దుఃఖమును సాత్త్వికాహార సేవనము వలనను త్యజించవలెను.

**శ్లో॥ రజస్తమశ్చ సత్త్వేన సత్త్వం చోపశమేన చ।**
**ఏతత్సర్వం గురౌ భక్త్యా పురుషో హ్యఞ్జసా జయేత్॥ 25**

**ప్రతిపదార్థము:–** సత్త్వేన=సత్త్వగుణముచే, రజస్తమశ్చ=రజస్తమోగుణములు, ఉపశమేన= శాంతిచే, సత్త్వమ్=సత్వమును, ఏతత్+సర్వమ్=ఈ అన్నింటిని, గురౌ భక్త్యా=గురువునందు భక్తిచే, పురుషః=పురుషుడు, అంజసా=శీఘ్రముగా, జయేత్=జయించవలెను.

**తాత్పర్యము:–** సత్త్వగుణమును, రజోగుణముచే, తమోగుణమును జయించవలెను. మనశ్శాంతిచే

దేనిని గోరుచు, కస్య వా హేతోః=ఏ హేతువు వలన, లంపటమ్=ఆసక్తుడై, దేహమ్= దేహమును, పుష్ణాతి= పోషించును.

**తాత్పర్యము:–** జ్ఞానముచే వాసనలన్నింటిని పోగొట్టుకొన్నవాడై తాను పరబ్రహ్మమే అని యెఱింగినవాడై మతి ఇక ఎద్దాని గోరుచు ఏ కారణమున ఆసక్తుడై దేహమును పోషించును.

**శ్లో॥ ఆహుః శరీరం రథమిన్ద్రియాణి హయానభీషూన్ మన ఇన్ద్రియేశమ్।**
**వర్త్మాని మాత్రా ధిషణాం చ సూతం సత్త్వం బృహద్బన్ధురమీశసృష్టమ్॥ 41**

**ప్రతిపదార్థము:–** శరీరరథమ్=శరీరమును రథముగాను, ఇంద్రియాణి హయాన్= ఇంద్రియములను అశ్వములుగాను, మనః అభీషూన్=మనస్సును పగ్గములుగాను, మాత్రః=శబ్దాది విషయాలను, ఇంద్రియేశమ్=ఇంద్రియార్థములను, వర్త్మాని=గంతవ్యదేశములుగా, ఆహుః=చెప్పుచున్నారు. ధిషణామ్=బుద్ధిని, సూతమ్=సారథిగా, సత్త్వమ్=చిత్తమును, ఈశసృష్టమ్=ఈశ్వరునిచే పూజింపబడి, బృహత్ బంధురమ్=శరీరమునకు గొప్పబంధముగా చేసి, చిత్తము లేక శరీరము బంధనము, బంధన కర్త ఈశ్వరుడే అని.

**తాత్పర్యము:–** తత్త్వదర్శులు శరీరమును రథముగను, ఇంద్రియములను అశ్వములుగను, మనస్సును పగ్గములుగను, శబ్దస్పర్శరూపరసగంధములను, ఇంద్రియార్థములను గంతవ్య మార్గములుగను, బుద్ధిని సారథిగను చిత్తమును ఈశ్వరునిచే సృజింపబడిన శరీరబంధముగను చెప్పుచున్నాడు.

**శ్లో॥ అక్షం దశ ప్రాణమధర్మధర్మౌ చక్రేఽభిమానం రథినం చ జీవమ్।**
**ధనుర్హి తస్య ప్రణవం పఠన్తి శరం తు జీవం పరమేవ లక్ష్యమ్॥ 42**

**ప్రతిపదార్థము:–** దశప్రాణమ్=పదివిధములైన ప్రాణములు, అక్షమ్=ఇరుసు, అధర్మధర్మౌచక్రే= ధర్మాధర్మములు రెండు చక్రములుగా, అభిమానమ్=శరీరమును అభిమానించు, జీవం రథినమ్ =జీవుని రథకునిగాను, తస్య=అతని, ధనుః హి ప్రణవమ్=ధనుస్సు, ఓంకారం, జీవం శరమ్= శుద్ధజీవుడు (సమాధిచే పరిశుద్ధుడు) బాణము, పరం ఏవ=పరబ్రహ్మమే లక్ష్యము.

**తాత్పర్యము:–**శరీరమనురథమునకు దశవిధప్రాణములు ప్రాణోపానవ్యానోదానసమానము లను ఐదు, నాగకూర్మకృకలదేవదత్తధనంజయములను ఐదు ఉపప్రాణములు జేరి పది యగును. ఇవి ఇరుసుగను ధర్మాధర్మములు రెండును చక్రములుగను శరీరాభిమాని జీవుడు రథికుడుగను, ఓంకారము ధనుస్సుగను, శుద్ధజీవుడు శరముగను, పరబ్రహ్మము లక్ష్యముగను భావించవలెను. ధనుస్సుచే శరమును లక్ష్యమునందెట్లు పడవేయబడునో అట్లే ప్రణవముచే జీవుడు బ్రహ్మమునందుపడి అతనిని చేర్చబడును.

**శ్లో॥ రాగో ద్వేషశ్చ లోభశ్చ శోకమోహౌ భయం మదః।**
**మానోఽవమానోఽసూయా చ మాయా హింసా చ మత్సరః॥ 43**

**తాత్పర్యము:–** రాగము, ద్వేషము, లోభము, శోకము, మోహము, భయము, మదము, మానము, అవమానము, అసూయ, మాయ, హింస, మత్సరములను జయించవలయును.



యోగస్య+అర్థమ్+న బిభ్రతి=మోక్షము యొక్క ప్రయోజనమును ప్రతిపాదించదు, తథాసతః =బహిర్ముఖముయొక్క పూర్తమ్=ఇష్టమును, ఇష్టాపూర్తాది, అనర్థాయ=సంసారమునకే, భవేయుః =కలుగుచున్నవి.

**తాత్పర్యము:–** ఏ ప్రకారము కృష్యాదులు వాని ఫలములగు ధాన్యాదుల నొసంగునో ఆ ప్రకారము ఇష్టాపూర్తాది కర్మలు ఇంద్రియ సంయమములు, మోక్షము అను ప్రయోజనము సాధింపనివగుచో అప్పుడు బహిర్ముఖుడగు నరుని ఇష్టాపూర్తాది కర్మలు వాని యోగాభ్యాసాదు లను కుటుంబాది సంగముచే చిత్తవిక్షేపముచే సంసారమునకే తగుచున్నవి.

**శ్లో॥ యశ్చిత్తవిజయే యత్తః స్యాన్నిస్సఙ్గోఽపరిగ్రహః।**
**ఏకో వివిక్తశరణో భిక్షుర్భిక్షా మితాశనః॥ 30**

**ప్రతిపదార్థము:–** యః=ఎవరు, చిత్తవిజయే=చిత్తవిజయమున, యత్తః=ఉద్యుక్తుడో, సః =అతడు, నిస్సంగః=నిస్సంగుడు, అపరిగ్రహః=అపరిగ్రహుడు, ఏకః=ఒక్కడై, వివిక్తశరణః=ఏకాంతదేశమున ఉంటూ, భిక్షుః=భిక్షుడై, భిక్షామితాశనః=భిక్షచే లభించిన అన్నాదికమును మితంగా భుజించును.

*శ్లో॥ ద్వంద్వా హతస్య గార్హస్థ్యం ధ్యానభంగాదికారణమ్।*
*లక్షయిత్వా గృహీ సృష్టం సన్న్యసేద విచారయన్॥*

సుఖదుఃఖాది ద్వంద్వములచే గొట్టబడిన వాని గృహస్థధర్మము ధ్యానభంగాదులకు కారణము అని చూచి గృహస్థుడు విచారించుకొని సన్యసించవలెను.

**తాత్పర్యము:–** ఎవడు చిత్తవిజయమునందుద్యుక్తుడైయుండునో అతడు నిస్సంగుడు, అపరిగ్రహుడు, ఒక్కడై ఏకాంతప్రదేశమున నుండుచు సన్యసించి భైక్షముచే లభించిన అన్నాదికమును మితముగా భుజించును.

**శ్లో॥ దేశే శుచౌ సమే రాజన్సంస్థాప్యాసనమాత్మనః।**
**స్థిరం సుఖం సమం తస్మిన్నాసీతర్జ్వఙ్గ ఓమితి॥ 31**

**ప్రతిపదార్థము:–** రాజన్=ఓ రాజా!, సమేదేశే=సమప్రదేశమందు, ఆత్మనః=తన, ఆసనమ్= ఆసనమును, ఆస్థాప్య=స్థాపించిపెట్టి, స్థిరం, సుఖం, సమం తస్మిన్ ఋజు+అంగ=చక్కగనిల్పిన దేహము గలిగి, ఓమ్ ఇతి=ఓం అని, ఆసీత్=కూర్చుండును.

**తాత్పర్యము:–** ఆ భిక్షుకుడు సమతలమగు ప్రదేశమందు తన ఆసనము వీడి స్థిరమై సుఖమైన మరొక ఆసనమందు నడుము చక్కగా నుంచి ఓం అని ఉచ్చరించుచు కూర్చుండును.

**శ్లో॥ ప్రాణాపానౌ సన్నిరున్ధ్యాత్ పూరకుమ్భకరేచకైః।**
**యావన్మనస్త్యజేత్కామాన్ స్వనాసాగ్రనిరీక్షణః॥ 32**

**ప్రతిపదార్థము:–** పూరకుంభకరేచకైః=పూరకము కుంభకము రేచకము అను మూడు వాయువుల పూరించుట లోపల నుండి బయటకు వెల్వరించుటను, ప్రాణాపానౌ=ప్రాణా పానములను, సన్నిరుంధ్యాత్=నిరోధించవలెను, స్వనాసాగ్ర నిరీక్షణః=తన నాసికాగ్ర దర్శనాదులచే, యావత్ =అంతట, మనః=మనస్సు, కామాన్=కామము నుండి, త్యజేత్=త్యజించవలెను.

**తాత్పర్యము:-** పూరక కుంభక రేచక అను మూడింటి ద్వారా ప్రాణాపానములను నిరోధించి మనస్సెంతవరకు కామములను త్యజించునో అంతవరకు దృష్టి నాసాగ్రమునందు నిల్పి ప్రాణాయామము నభ్యసించవలెను.

**శ్లో॥ యతో యతో నిస్సరతి మనః కామహతం భ్రమత్।**
**తతస్తత ఉపాహృత్య హృది రున్ధ్యాచ్ఛనైర్బుధః॥ 33**

**ప్రతిపదార్థము:-** కామహతం మనః=కామముచే కొట్టబడిన మనస్సు, యతః యతః=దేని దేని నుండి, భ్రమత్=భ్రమించుచు, నిస్సరతి=చలించునో, తతః తతః=దాని దాని నుండి, ఉపాహృత్య=మరల్చి, శనైః=మెల్లగా, బుధః=పండితుడైనవాడు, హృది=హృదయమునందు, రుంధ్యాత్=నిరోధించవలెను.

**తాత్పర్యము:-** కామముచే కొట్టబడిన మనసు దేని దేని నుండి భ్రమించి బయలు వెడలుచుండి దాని దాని నుండి మరల్చి మరల్చి పండితుడైన వాడు మెల్లగా హృదయమందు నిరోధించవలెను.

**శ్లో॥ ఏవమభ్యసతశ్చిత్తం కాలేనాల్పీయసా యతేః।**
**అనిశం తస్య నిర్వాణం యాత్యనిన్ధనవహ్నివత్॥ 34**

**ప్రతిపదార్థము:-** ఏవమ్=ఈ ప్రకారము, అనిశమ్=నిరంతరము, అభ్యసతః=అభ్యసించు, యతేః చిత్తమ్=యతియొక్క చిత్తము, అల్పీయసాకాలేన=కొలది కాలములోనే, తస్య చిత్తమ్=వాని చిత్తము, అనింధన వహ్నివత్=కట్టె లేని అగ్నివలె (పొగలేనిది), నిర్వాణం యాతి=శాంతిని పొందుచున్నది.

**తాత్పర్యము:-** ఈప్రకారము నిరంతరము అభ్యసించుచున్న యతి యొక్క చిత్తము స్వల్ప కాలములో పొగలేని అగ్నివలె కట్టెలేని అగ్నివలె శాంతిని పొందుచున్నది.

**శ్లో॥ కామాదిభిరనావిద్ధం ప్రశాన్తాఖిలవృత్తి యత్।**
**చిత్తం బ్రహ్మసుఖస్పృష్టం నైవోత్తిష్ఠేత కర్హిచిత్॥ 35**

**ప్రతిపదార్థము:-** కామాదిభిః=కామాదులచే, అనావిద్ధమ్=క్షోభను పొందనిదై, ప్రశాంతాఖిల వృత్తి=శాంతించిన సకల వ్యాపారములు గలదైన, యత్ చిత్తం=ఏ చిత్తము, బ్రహ్మసుఖ స్పృష్టం =బ్రహ్మానంద సుఖముచే స్పృశించబడినదై, న+ఏవ+ఉత్తిష్ఠేత=బహిర్ముఖములేదు.

**తాత్పర్యము:-** కామాదులచే క్షోభపొందనిదై సకలవ్యాపారములను నివర్తించినదైన ఏ చిత్తము బ్రహ్మానందసుఖానుభవము పొందుచున్నది. మరల బహిర్ముఖము కాదు.

**శ్లో॥ యః ప్రవ్రజ్య గృహాత్పూర్వం త్రివర్గావపనాత్పునః।**
**యది సేవేత తాన్ భిక్షుః స వై వాన్తాశ్యపత్రపః॥ 36**

**ప్రతిపదార్థము:-** యః=ఎవడు ముందు, గృహాత్=గృహమునుండి, గృహస్థాశ్రమము నుండి, ప్రవ్రజ్య=సన్యసించి, త్రివర్గ+అవపనాత్=ధర్మార్థకామములను చెడుతనము గల, భిక్షుః=సన్యాసి, పునః=మరల, తాన్ సేవేత యది=అగ్రామ్యసుఖములను సేవించువాడైనచో, అపత్రపః=సిగ్గులేని వాడు, వాంతాశి=వమనాన్నమును భుజించువాడగును.





**తాత్పర్యము:-** ఎవడు మొదట త్రివర్గమున కుత్సితవనమైన గృహస్థాశ్రమము నుండి సన్యసించి భిక్షుడై మరల సిగ్గులేనివాడై ఆ ధర్మకామాదులు సుఖములను సేవించువాడగునేని అతడు వాంతి చేసుకొన్న అన్నము భుజించువాడగును.

**శ్లో॥ యైః స్వదేహః స్మృతోఽనాత్మా మర్త్యో విట్క్రిమిభస్మసాత్।**
**త ఏవాముం స్వసాత్కృత్వా శ్లాఘయన్తి హ్యసత్తమాః॥ 37**

**ప్రతిపదార్థము:-** యైః=ఎవరిచే, మర్త్యః=మరణించునదియు, విట్క్రిమిభస్మసాత్=మలము, క్రిములు, భస్మమునగు, స్వదేహః స్మృతః=తమ దేహము స్మరింపబడినదో, అముమ్=నిని, తే ఏవ=వారలు, అసత్తమాః=అజ్ఞానులు, కుత్సిత పురుషులు, స్వసాత్=ఈ దేహమునే ఆత్మగా, కృత్వా=చేసి, శ్లాఘయంతి= స్తుతింతురు.

**తాత్పర్యము:-** పూర్వమెవ్వడు మరణిచునదై మలము క్రిములు భస్మమైపోవు ఈ దేహమునే స్మరింతురో ఆత్మను స్మరింపరో వారే ఆ కుత్సితపురుషులే దేహమును ఆత్మగా శ్లాఘింతురు.

**శ్లో॥ గృహస్థస్య క్రియాత్యాగో వ్రతత్యాగో వటోరపి।**
**తపస్వినో గ్రామసేవా భిక్షోరిన్ద్రియలోలతా॥ 38**

**ప్రతిపదార్థము:-** గృహస్థస్య=గృహస్థునికి, క్రియాత్యాగః=సంధ్యాది కర్మలను త్యజించుటయు, వటోరపి=బ్రహ్మచారికి, వ్రతత్యాగః=బ్రహ్మచర్యాది వ్రతమును వదలుట, తపస్వినః గ్రామసేవా =వానప్రస్థుని గ్రామసంచారము, భిక్షః=భిక్షువు యొక్క ఇంద్రియలోలుతా=ఇంద్రియసుఖా భిలాషయు పాపహేతువులు.

**తాత్పర్యము:-** గృహస్థుడు సంధ్యాదికర్మలను త్యజించుట, బ్రహ్మచారి బ్రహ్మచర్యాది నియమములు వదలుట,వానప్రస్థుడు గ్రామసంచారము చేయుట,సన్న్యాసి ఇంద్రియలోలు డగుట, అధర్మము పాపహేతువులు.

**శ్లో॥ ఆశ్రమాపసదా హ్యేతే ఖల్వాశ్రమవిడమ్బనాః।**
**దేవమాయావిమూఢాంస్తానుపేక్షేతానుకమ్పయా॥ 39**

**ప్రతిపదార్థము:-** ఏతే=వారు, ఆశ్రమాపసదా ఖలు=ఆశ్రమ భ్రష్టులైన నీచులు గదా!, ఆశ్రమ విడంబనాః=ఆయాశ్రమములందున్నట్లు నటించువారు, దేవమాయావిమూఢాన్+తాన్=విష్ణు మాయచే మూఢులైన వారిని, అనుకంపయా=కృపతో, అపేక్షేత=చూడవలెను.

**తాత్పర్యము:-** వారెల్లరు ఆశ్రమ భ్రష్టులు ఆశ్రమమునందున్నట్లు నటించువారు విష్ణుమాయా విమూఢులైన వారిని కృపతో చూడవలెను.

**శ్లో॥ ఆత్మానం చేద్విజానీయాత్పరం జ్ఞానధుతాశయః।**
**కిమిచ్ఛన్ కస్య వా హేతోర్దేహం పుష్ణాతి లమ్పటః॥ 40**

**ప్రతిపదార్థము:-** జ్ఞానధుతాశయః=జ్ఞానముచే నిరసించబడిన వాసనగలవాడై, ఆత్మానమ్= తన్ను, పరమ్=పరబ్రహ్మగా, విజానీయాత్ చేత్=గుర్తెరింగిన వాడగునేని మఱి, కిం ఇచ్ఛన్=

బిన్దువునందు, బిన్దువును నాదమునందు, నాదమును ప్రాణమును బ్రహ్మాయందును ఉంచవలెను. అనగా లయము చేయవలెను.

**శ్లో॥ అగ్ని సూర్యో దివా ప్రాహ్ణః శుక్లో రాకోత్తరం స్వరాట్।**
**విశ్వోఽథ తైజసః ప్రాజ్ఞస్తుర్య ఆత్మా సమన్వయాత్॥ 54**

**ప్రతిపదార్థము:–** అగ్నిః=అగ్ని, సూర్యః=సూర్యుడు, దివా=పగలు, ప్రాహ్ణః=ప్రాహ్ణము, శుక్లః =శుక్లపక్షము, రాకా=పూర్ణిమ, ఉత్తరమ్=ఉత్తరాయణము, స్వరాట్=విరాట్ పురుషుడు, అథ= అనన్తరము, విశ్వః=విశ్వుడు, తైజసః=తైజసుడు, ప్రాజ్ఞః=ప్రాజ్ఞుడు, తుర్యః ఆత్మా=తురీయుడగు ఆత్మ, సమన్వయాత్=లయమువలన సంభవించును.

**తాత్పర్యము:–** అగ్ని, సూర్యుడు, పగలు, పాహ్ణము, శుక్లపక్షము, పూర్ణిమ, ఉత్తరాయణము, విరాట్ పురుషుడు పేరులతో తత్తదభిమాన దేవతలను పొంది భోగావసానమున స్థూలోపాధి విశ్వుడు తైజసునియందును, తైజసుడు ప్రాజ్ఞునియందును, ప్రాజ్ఞుడు తురీయమగు ఆత్మ యందును లయము చేయవలెను.

**శ్లో॥ దేవయానమిదం ప్రాహుర్భూత్వా భూత్వానుపూర్వశః।**
**ఆత్మయాజ్యుపశాన్తాత్మా హ్యాత్మస్థో న నివర్తతే॥ 55**

**ప్రతిపదార్థము:–** ఇదమ్=ఈ మార్గమును, దేవయానమ్=దేవయానమునుగా, ప్రాహుః=చెప్పిరి, ఆత్మయాజీ=పరమాత్మపూజకుడును, ఉపశాన్తాత్మా=ఇంద్రియ నిగ్రహము కలవాడును అగు, ఆత్మస్థః=ఆత్మ సంస్థుడు, అనుపూర్వశః=క్రమముగ, భూత్వా, భూత్వా=ఆయా జన్మలను పొంది, న నివర్తతే=మరల తిరిగి మర్త్యలోకమునకు రాడు.

**తాత్పర్యము:–** ఈ మార్గమును దేవయానమని చెప్పుదురు. ఈ మార్గమునందు ప్రయాణము చేయు ఇంద్రియనిగ్రహము, ఆత్మనిష్ఠ గల పరమాత్మ పూజకుడు. ప్రవృత్తిమార్గమునందు పయనించు వ్యక్తి వలె కాక పరమాత్మకు చేరికొనిన పిమ్మట అచటనుండి తిరిగి రాడు. ప్రవృత్తి మార్గమునందు పయనించువ్యక్తి మాత్రము పుణ్యఫలమున్నంత ఊర్ధ్వలోకములందు నివసించి ఆ ఫలము నశించిన పిమ్మట మర్త్యలోకమునకు తిరిగి వచ్చును.

**శ్లో॥ య ఏతే పితృదేవానామయనే వేదనిర్మితే।**
**శాస్త్రేణ చక్షుషా వేద జనస్థోఽపి న ముహ్యతి॥ 56**

**ప్రతిపదార్థము:–** వేదనిర్మితే=వేదముచే నిర్మించబడిన, ఏతే=ఈ, పితృదేవానాం అయనే=పితృ యానము, దేవయానము అను రెండు మార్గములను, శాస్త్రేణ=శాస్త్రము అనెడి, చక్షుషా= కంటితో, యః=ఎవడు, వేద=తెలిసికొనును. (సః=అతడు) జనస్థోఽపి=దేహమునందు ఉన్నను, న ముహ్యతి=మోహమును పొందడు.

**తాత్పర్యము:–** వేదములచే నేర్పాటుచేయబడిన పితృయానము దేవయానము అను రెండు మార్గములను శాస్త్రోక్తముగ, సంపూర్ణముగ తెలిసికొనవలెను. ఇట్లు తెలిసికొనినవాడు లోకమునందు ఉన్నను మోహమును పొందడు. జీవన్ముక్తుడగునని భావము.



**శ్లో॥ రజః ప్రమాదః క్షున్నిద్రా శత్రవస్త్వేవమాదయః।**
**రజస్తమః ప్రకృతయః సత్త్వప్రకృతయః క్వచిత్॥ 44**

**ప్రతిపదార్థము:–** రజః= ....

**తాత్పర్యము:–** రజస్సు, ప్రమాదము, క్షుత్తు, నిద్ర ఇవిలోనైనవి శత్రువులందును, ఒక్కచో రజస్తమ ప్రకృతులు జీవసమాధికి విఘ్నములు, ఒక్కచో సత్త్వ ప్రకృతులు, పరోపకార ప్రదాతలు. ఇవన్నియు శత్రువులు జయించదగినవి.

**శ్లో॥ యావన్నృకాయరథమాత్మవశోపకల్పం ధత్తే గరిష్ఠచరణార్చనయా నిశాతమ్।**
**జ్ఞానాసిమచ్యుతబలోఽథ నిరస్తశత్రుః స్వానన్దతుష్ట ఉపశాన్త ఇదం విజహ్యాత్॥ 45**

**ప్రతిపదార్థము:–** యావత్=ఇదంతయు, నృకాయరథమ్=ఈ నరశరీరరూపరథమును, ఆత్మవశః =బుద్ధికివశమైయుండును, ఉపకల్పమ్=ఇంద్రియాది పరికరములుగాగల, ధత్తే= ధరించుచు, అప్పుడు, గరిష్ఠచరణార్చనయా=గురువుకు పాదసేవచే, నిశాతమ్=వాడియైన, జ్ఞానాసిం బిభ్రన్ =జ్ఞానఖడ్గమును ధరించుచున్నవాడై, అచ్యుతబలః=అచ్యుతుని ఆశ్రయమను, నిరస్తశత్రుః =నిరసించిన శత్రువు కలవాడగుచు, స్వానన్దతుష్టః=ఆత్మానందసంతుష్టుడై, ఉపశాంతః= శాంతచిత్తుడై, ఇదమ్=ఈ రథాన్ని, విజహ్యాత్=ఉపేక్షించును.

**తాత్పర్యము:–** ఎప్పుడు ఈ నరశరీరరూపరథము తనకు వశమగుచున్న ఇంద్రియాది పరికరములలో ధరించుచు అప్పుడు గురువుల పాదసేవచే పదునుగలదైన జ్ఞానఖడ్గమును ధరించి ఈపైన బేర్కొన్న శత్రువులను జయించి ఆత్మానంద సంతృప్తి పొంది శాంతచిత్తుడు రథాధికముగా కల్పింపబడి ఈ శరీరములందు ఉపేక్షించును.

**శ్లో॥ నోచేత్ ప్రమత్తమసదిన్ద్రియవాజిసూతా**
**నీత్వోత్పథం విషయదస్యుషు హి క్షిపన్తి।**
**తే దస్యవః సహయసూతమముం తమోఽన్ధే**
**సంసారకూప ఉరుమృత్యుభయే క్షిపన్తి॥ 46**

**ప్రతిపదార్థము:–** ప్రమత్తమ్ నోచేత్=అట్లు అచ్యుతాశ్రయుడు కాడేని ప్రమత్తు ప్రవర్తించు వానిని, అసదింద్రియవాజిసూతా=మనస్సు ఇంద్రియార్థములను మనస్సుయందు, ఉత్పథమ్ =ప్రవృత్తి మార్గమును గూర్చి, నీత్వా=కొనిపోయి, విషయదస్యుషు=విషయములు శబ్దాదులందు చోరు లందు, క్షిపంతి=పడవేయును, తే దస్యవః=ఆ చోరుల, సహయ సూతమ్= అశ్వములతో సూతునితో గూడి, అముమ్=ఈ జీవుని, తమస్+అంధే=చీకటివ్యాప్తమై, ఉరుమృత్యుభయే=గొప్ప మృతు భయముగల, సంసారకూపే=సంసారమను నూతియందు, క్షిపంతి=పడవేయును.

**తాత్పర్యము:–** ఎవడట్లు ప్రమత్తుడై అచ్యుతాశ్రయుడు గాక ప్రవర్తించునో అట్టివానిని ఇంద్రియాశ్వములు మనస్సు అనునది, ప్రవృత్తమార్గమున గొనిపోయి ఇంద్రియార్థములను దస్యులు కడ వదలును. ఆ చోరులు తమస్సుచే అంధకారమై గొప్ప మృత్యువు భయముగలవైన సంసారకూపమునందు పడవేయును.

**శ్లో॥ ప్రవృత్తం చ నివృత్తం చ ద్వివిధం కర్మ వైదికమ్।**
**ఆవర్తతే ప్రవృత్తేన నివృత్తేనాశ్నుతేఽ మృతమ్॥ 47**

**ప్రతిపదార్థము:-** వైదికమ్ కర్మ=వేదోక్తమైన కర్మ, ప్రవృత్తఞ్చ=ప్రవృత్తమని, నివృత్తఞ్చ=నివృత్తమని, ద్వివిధమ్=రెండు విధములు, ప్రవృత్తేన=ప్రవృత్తిచే, ఆవర్తతే=జన్మదుఃఖాదులు కలుగును, నివృత్తేన=నివృత్తిచే, అమృతమ్=మోక్షమును, అశ్నుతే=పొందును.

**తాత్పర్యము:-** వేదోక్తమైన కర్మ ప్రవృత్తి మార్గము నివృత్తిమార్గము అని రెండు విధములుగా నుండును. ప్రవృత్తి మార్గము అనగా కర్మమార్గము. నివృత్తిమార్గము అనగా జ్ఞాన మార్గము. ప్రవృత్తిమార్గముచే మరల జన్మ దుఃఖాదులు కలుగును. నివృత్తి మార్గముచే మోక్షము పొందును.

**శ్లో॥ హింస్రం ద్రవ్యమయం కామ్యమగ్నిహోత్రాద్యశాన్తిదమ్।**
**దర్శశ్చ పూర్ణమాసశ్చ చాతుర్మాస్యం పశుస్సుతః॥ 48**

**ప్రతిపదార్థము:-** ద్రవ్యమయమ్=హవిరాజ్యాదులు గలవి, కామ్యమ్=కోరికనిచ్చు, అగ్నిహోత్రాది= అగ్నిహోత్రాది, కర్మ హింస్రమ్=హింసాపూర్వకమైన, అశాన్తిదమ్=అశాంతిని, దర్శః=దర్శము పూర్ణ మాసః చ పశుః=పూర్ణమాసం పశువు, సుతః=సుతుడును.

**తాత్పర్యము:-** హవి రాజ్యాదులు గలదై కామ్యమైన అగ్నిహోత్రాది కర్మ హింసాపూర్వకమై అశాంతిని ఇచ్చును. ధర్శము పూర్ణమాసము, చాతుర్మాస్యం పశుయాగము సోమయాగము ఇవియన్నియు హింసాపూర్ణములు.

**శ్లో॥ ఏతదిష్టం ప్రవృత్తాఖ్యం హుతం ప్రవృతమేవ చ।**
**పూర్తం సురాలయారామకూపాజీవ్యాదిలక్షణమ్॥ 49**

**ప్రతిపదార్థము:-** హుతమ్=వైశ్యదేవము, ప్రహుతమ్=బలిహారము, ఏతదిష్టమ్=ఇదిఇష్ట మగును. ప్రవృత్తాఖ్యమ్=ఇదియే ప్రవృత్తమనబడును. ఇదియే కామ్యమైనచో అశాంతినిచ్చును. పూర్వమ్= పూర్వము, సురాలయా=దేవాలయము, ఆరామ=వనము, కూప=బావి, అజీవ్యాది లక్షణమ్= తటాకములోనగు లక్షణములు కలదేని దానిని పూర్తమనబడును.

**తాత్పర్యము:-** వైశ్వదేవము బలిహరణములోనైన దదియంత ఇష్టమునైన ఇది కామ్యమగుచో అశాంతి నిచ్చును. దేవాలయము, వనము, బావి, తటాకము లోనగు వానిని నిర్మించుట పూర్తమనబడును.

**శ్లో॥ ద్రవ్యసూక్ష్మవిపాకశ్చ ధూమో రాత్రిరపక్షయః।**
**అయనం దక్షిణం సోమో దర్శ ఓషధివీరుధః॥ 50**

**శ్లో॥ అన్నం రేత ఇతి క్ష్మేశ పితృయానం పునర్భవః।**
**ఏకైకశశ్చానుపూర్వ్యాద్భూత్వా భూత్వేహ జాయతే॥ 51**

**ప్రతిపదార్థము:-** ద్రవ్య సూక్ష్మ విపాకః=యజ్ఞాదులయందు హుతమైన చరుపురోడాశీది ద్రవ్యముల సూక్ష్మ పరిమాణమైన, ధూమః=ధూమముగను, రాత్రిః=రాత్రిగను, అపక్ష్మయ= కృష్ణపక్షముగను, దక్షిణం అయనమ్=దక్షిణాయనముగను, సోమః=చంద్రుడుగను, దర్శః=విలీన దేహుడుగను, ఓషధి వీరుధ=ఓషధులు, సస్యములుగను, అన్నమ్=అన్నముగను, రేతః= వీర్యము గను, ఏకైకశః=ఒక్కొక్కటిగ, ఆనుపూర్వ్యాత్=క్రమముగ, పితృయానమ్= పితృయాన మార్గమున, పునర్భవః=మరల జన్మను పొందినవాడై, భూత్వా భూత్వా=మారి మారి, ఇహ=ఈ లోకమునందు, జాయతే=పుట్టుచున్నాడు.



**తాత్పర్యము:-** మహీపాలా! ప్రవృత్త కర్మలను ఆచరించు జీవుడు మరణించిన పిమ్మట ఆరోహణ క్రమములో కర్మఫలమున్నంత వరకు చరుపురోడాశీది ద్రవ్యముల సూక్ష్మపరిణామ మగు ధూమము, కృష్ణపక్షము, దక్షిణాయనము, చంద్రుడుగ ఒక్కొక్కటిగ క్రమముగ మారును. కర్మఫలము క్షీణించిన అమావాస్య చంద్రునివలె క్షీణించి అవరోహక్రమమున వర్షము ద్వారా ఓషధిరూపముగను, లతలుగను, అన్నముగను, వీర్యముగను, మారుచూ పితృయానమున మరల జన్మమును పొంది ఈ లోకమునందు పుట్టుచున్నాడు.

**శ్లో॥ నిషేకాదిశ్మశానాన్తైః సంస్కారైః సంస్కృతో ద్విజః।**
**ఇన్ద్రియేషు క్రియాయజ్ఞాన్ జ్ఞానదీపేషు జుహ్వతి॥ 52**

**ప్రతిపదార్థము:-** నిషేకాది శ్మశానాంతైః=గర్భాదానము మొదలు శ్మశానము వరకుగల, సంస్కారైః =సంస్కారములతో, సంస్కృతః=సంస్కరించబడిన, ద్విజః=ద్విజుడు, జ్ఞానముతో వెలుగొందు, ఇంద్రియేషు=ఇంద్రియములయందు, క్రియాయజ్ఞాన్=క్రియలు అనెడి యజ్ఞములను, జుహ్వతి= ఆహుతిగానీయవలెను.

**తాత్పర్యము:-** గర్భాదానము మొదలుకొని శ్మశానము వరకుగల షోడశ సంస్కారములతో సంస్కరించబడిన ద్విజుడు జ్ఞానమనెడి జ్వాలతో వెలుగొందు ఇంద్రియములు అనెడి అగ్నియందు క్రియలు అనెడి యజ్ఞములను ఆహుతిగా నీయబడెను. ద్విజుడు తనచే చేయబడు సమస్త క్రియలను ఇంద్రియములకు మాత్రమే సంబంధించినవనియు, తనకు సంబంధించినవి కావనియు భావించవలెనని భావము.

**శ్లో॥ ఇన్ద్రియాణి మనస్యూర్మౌ వాచి వైకారికం మనః।**
**వాచం వర్ణసమామ్నాయే తమోఙ్కారే స్వరే న్యసేత్।**
**ఓఙ్కారం బిన్దునాదే తు తంతు ప్రాణే మహత్యముమ్॥ 53**

**ప్రతిపదార్థము:-** ఇంద్రియాణి=ఇన్ద్రియములను, ఊర్మౌ=దర్శనాదిసంకల్పములకు మూల మగు, మనసి=మనస్సునందు, వైకారికమ్=వికారములతో కూడియున్న, మనస్సును, వాచి= వాక్కు నందు, వాచమ్=వాక్కును, వర్ణసమామ్నాయే=అక్షరసముదాయమునందు, తమ్=వర్ణ సమదాయమును, స్వరే=అకారాది స్వరత్రయాత్మకమగు, ఓఙ్కారే=ఓంకారమునందు, ఓంకారమ్ =ఓంకారమును, బిన్దునాదే=బిన్దునాదమునందు, తంతు=ఆ బిన్దునాదమును, ప్రాణే =ప్రాణము నందు, అమున్=ఈప్రాణమును, మహతి=బ్రహ్మాయందును, న్యసేత్=ఉంచవలెను.

**తాత్పర్యము:-** ఇన్ద్రియములను సంకల్పమూలమగు మనస్సునందు, మనస్సును వాక్కునందు, వాక్కును అక్షర సమూహమునందు, అక్షర సమూహమును ఓంకారమునందు, ఓంకారమును

బడలేదో ఆపదలురానంతవరకు ఆ వ్యక్తి ఆ వస్తువుతోనే తన కార్యములను సాధించుకొనుటకు ప్రయత్నించవలెను. ఇతర వస్తువులతో తన కార్యమును సాధించుటకు కోరుకొనరాదు.

**శ్లో॥ ఏతైరన్యైశ్చ వేదోక్తైర్వర్తమానః స్వకర్మభిః।**
**గృహేఽప్యస్య గతిం యాయాద్రాజంస్తద్భక్తిమాన్నరః॥ 67**

**ప్రతిపదార్థము:-** రాజన్=ఓ రాజా!, ఏతైః=ఈ చెప్పబడినవియును, అన్యైశ్చ=ఇతరములును అగు, వేదోక్తైః=వేదములయందు చెప్పబడిన, స్వకర్మభిః=తమకు విహితములైన కర్మలతో, వర్తమానః=ఉండువాడును, తద్భక్తిమాన్=ఆ పరమాత్మయందు భక్తి కలవాడును అగు, నరః =నరుడు, గృహేఽపి=గృహస్థాశ్రమమునందు కూడ, అస్య=ఈ పరమాత్మయొక్క గతిమ్= స్థానమును (మోక్షమును), యాయాత్=పొందగలడు.

**తాత్పర్యము:-** ఓ రాజా! ఇట్లు వెనుక చెప్పబడినవియును, ఇతరములును అగు తమకు వేద విహితములగు కర్మలను ఆచరించుచూ, పరమాత్మయందు భక్తిని కలిగియుండు మనుజుడు గృహస్థాశ్రమము నుండి సైతము మోక్షమును పొందుటకు అర్హుడు.

**శ్లో॥ యథా హి యూయం నృపదేవ దుస్త్యజాదాపద్గణాదుత్తరతాత్మనః ప్రభోః।**
**యత్పాదపఙ్కేరుహసేవయా భవానహారిషీన్నిర్జితదిగ్గజః క్రతూన్॥ 68**

**ప్రతిపదార్థము:-** నృపదేవ!=రాజాధిరాజా!, యథా=ఏ విధముగ, భవాన్=నీవు, యత్పాద పంకేరుహసేవయా=ఏ శ్రీకృష్ణుని పాదపద్మములను సేవించుట ద్వారా, నిర్జితదిగ్గజః= దిగ్గజము లను సైతము జయించి, క్రతూన్=యజ్ఞములను, అహారిషీత్=చేసితివో, తథా=అట్లే, ఆత్మనః =శ్రీకృష్ణస్వరూపుడైన, ప్రభోః=ప్రభువు వలననే, దుస్త్యజాత్=వదిలించుకొనుటకు వీలుగాని, ఆపద్గణాత్=ఆపదల సముదాయము నుండి (సంసారము నుండి), ఉత్తరత= ఉత్తీర్ణులు కండు.

**తాత్పర్యము:-** ఓ రాజా! నీవు ఏవిధముగ శ్రీకృష్ణుని పాదపద్మములను సేవించి ఆ పరమాత్మ అనుగ్రహముతో దిగ్గజములను సైతము జయించి యజ్ఞములనొనరించితివో అట్లే ఆ పరమాత్మను బాగుగ సేవించి విడచిపెట్టుటకు వీలుకానిదియు, సకలాపత్సముదాయమునకు నిలయమైనదియు అగు సంసారము నుండి మీరు ఉత్తీర్ణులు కండు.

**శ్లో॥ అహం పురాభవం కశ్చిద్గన్ధర్వ ఉపబర్హణః।**
**నామ్నాతీతే మహాకల్పే గన్ధర్వాణాం సుసమ్మతః॥ 69**

**ప్రతిపదార్థము:-** పురా=పూర్వము, అతీతే=గడచిన, మహాకల్పే=మహాకల్పమునందు, అహమ్ =నేను, ఉపబర్హణః (ఇతి) నామ్నా=ఉపబర్హణుడు అనుపేరుతో, కశ్చన=ఒకానొక, గన్ధర్వః =గంధర్వుణుడనుగా, గంధర్వాణామ్=గంధర్వులకు, సుసమ్మతః=ఇష్టమైనటువంటివాడనుగా, అభవమ్=అయి ఉంటిని.

**తాత్పర్యము:-** పూర్వము గడచిన ఒకానొక మహాకల్పమునందు నేను గన్ధర్వగణపూజితుడనగు ఉపబర్హణుడు అనుపేరుగల గంధర్వుడను అయి ఉంటిని.



**శ్లో॥ ఆదావన్తే జనానాం యో బహిరన్తః పరావరమ్।**
**జ్ఞానం జ్ఞేయం వచో వాచ్యం తమో జ్యోతిస్త్వయం స్వయమ్॥ 57**

**ప్రతిపదార్థము:-** జనానామ్=జనులకు, స్వయమ్=స్వయముగ, అయమ్=ఇట్టివ్యక్తి, ఆదౌ= ఆది యందును, అన్తే=అవసానమునందును, బహిః=వెలుపల, అన్తః=లోపల, (సన్=ఉండునది యగు), పరమ్=గొప్పదియును, అవరమ్=తక్కువదియును, జ్ఞానమ్=జ్ఞానమును, జ్ఞేయమ్= తెలిసికొన తగినదియును,వచః=వాక్కును, వాచ్యమ్=వాక్కుచేత చెప్పబడునదియును, తమః =అన్ధకారమును, జ్యోతిః=తేజస్సును అగు, సత్=సత్ పదార్థము.

**తాత్పర్యము:-** ఇట్టి వ్యక్తియే సర్వజనులకు తమ పుట్టుకకు ముందు నశించిన పిమ్మట, లోపల-వెలుపల ఉండునదియు, పరము-అపరము, జ్ఞానము-జ్ఞేయము, వాక్కు-వాచ్యము, చీకటి-వెలుగును అగు సత్పదార్థము స్వయముగా అయినవాడు.

**శ్లో॥ ఆబాధితోఽపి హ్యాభాసో యథా వస్తుతయా స్మృతః।**
**దుర్ఘటత్వాదైన్ద్రియికం తద్వదర్థవికల్పితమ్॥ 58**

**ప్రతిపదార్థము:-**ఆబాధితోఽపి=బాగుగ బాధింపబడినది అయినప్పటికి, ఆభాసః= ప్రతిబింబము, యథా=ఎట్లైతే, వస్తుతయా=పదార్థముగా, స్మృతః=స్మరించబడినదో, తద్వత్= అట్లే, ఐన్ద్రియకమ్ =ఇన్ద్రియములకు గోచరమగు సమస్తమును, దుర్ఘటత్వాత్=సత్యపదార్థముగా చెప్పుటకు వీలుకానిది అగుటచే, అర్థవికల్పితమ్=పదార్థముగా కల్పించబడినదియే! (మిథ్యా పదార్థమే)

**తాత్పర్యము:-** దర్పణమునందు అగుపడు ప్రతిబింబము యథార్థమైనది అని చెప్పలేము. కాని అది కంటికి కనబడుచున్నది కావున యథార్థ వస్తువుగా భ్రమపడుచున్నాము. వాస్తవమునకు అది మిథ్యయే. అట్లే ఈ లోకమునందు ఇన్ద్రియములకు గోచరమగు సమస్త పదార్థములు యథార్థములు అని చెప్పుటకు వీలు కానివియే. అందువలననే అవి గూడ మిథ్యాపదార్థములే!

**శ్లో॥ క్షిత్యాదీనామిహార్థానాం ఛాయా న కతమాపి హి।**
**న సఙ్ఘాతో వికారోఽపి న పృథఙ్నాన్వితో మృషా॥ 59**

**ప్రతిపదార్థము:-** ఇహ=ఈ లోకమునందు, క్షిత్యాదీనామ్=భూమిమొదలుగా గల, అర్థానామ్= పంచభూతములయొక్క, ఛాయా=నీడ, (నీడ వంటిది అగు దేహము), సంఘాతః=పృథివ్యాధి భూతముల సమాహము, న=కాదు, వికారః=పృథివ్యాది భూతముల పరిణామము, న=కాదు, పృథక్=పృథివ్యాది భూతముల కంటె వేరైనది, న=కాదు, అన్వితః=పృథివ్యాది పంచభూతము లతో అనుగతమైనది, న=కాదు, కతమా+అపి=ఏదియును, న=కాదు, అతః=అందువలన, మృషా=అసత్యమైనది.

**తాత్పర్యము:-** శరీరమును పంచభూతముల సముదాయము అనిగాని, వాటి వికారము అనిగాని, వాటి కంటె వేరైనది అనిగాని, వాటియందు అనుస్యూతమైనది అనిగాని చెప్పలేము. అందు వలననే శరీరమును రజ్జుసర్పమువలె మిథ్య అని చెప్పవలెను.

**శ్లో॥ ధాతవోఽవయవిత్వాచ్చ తన్మాత్రావయవైర్వినా।**
**న స్యుర్హ్యసత్యవయవిన్యసన్నవయవోఽన్తతః॥ 60**

ప్రతిపదార్థము:- అవయవిత్వాత్=అవయవములు కలవి కనుక, ధాతవః=పంచమహాభూతములు, తన్మాత్రావయవైః=తన్మాత్రలనెడి సూక్ష్మములగు అవయవములు, వినా=లేకుండగ, న స్యుః=ఉండజాలవు, అవయవిని=అవయవి, అసతి=లేనప్పుడు, అన్తః తః=చివరకు, అవయవః =అవయవము, అసన్=లేనిదియే అగును.

తాత్పర్యము:- పూర్వశ్లోకమునందు దేహము మిథ్య అని చెప్పబడినది. ఈ శ్లోకమునందు దేహమునకు కారణమగు పంచమహాభూతములు గూడ మిథ్యయే అని చెప్పబడుచున్నది. పంచమహాభూతములు వాటి కారణములగు సూక్ష్మమైన పంచతన్మాత్రలు అనెడి అవయవములు లేక ఉండజాలవు. అనగా ఆ అవయవముల కంటె భిన్నముగా పంచ భూతములు లేవు కావున అవి కూడ మిథ్యాపదార్థములే. అట్లైన అవయవములు సత్యములని భావింతురేమో! అవయవియే లేనప్పుడు చివరకు అవయవము గూడ మిథ్యయే అని చెప్పవలసియుండును గదా!

**శ్లో॥ స్యాత్సాదృశ్యభ్రమస్తావద్వికల్పే సతి వస్తునః।**
**జాగ్రత్స్వాపౌ యథా స్వప్నే తథా విధినిషేధతా॥ 61**

ప్రతిపదార్థము:- వస్తునః=పరమాత్మకు, వికల్పేసతి=భేదము ఉన్నయెడల, సాదృశ్యభ్రమః తావత్ =పోలికవలనవచ్చు భ్రమ, స్యాత్=వచ్చియుండెడిది. యథా=ఎట్లైతే, స్వప్నే=కలయందు, జాగ్రత్స్వాపౌ=మేలుకొనుట, కలగాంచుట కలవో, తథా=అట్లే, విధినిషేధతా= శాస్త్రములందలి విధి నిషేధములు గూడ గలవు.

తాత్పర్యము:- పరమాత్మకు భేదమున్నచో ఆరోపము, సాదృశ్యము, భ్రమ కలుగును. నిద్ర యందు జాగ్రత్ స్వప్నముల వలె శాస్త్రమున విధినిషేధములు అను వ్యవస్థ గలదు.

**శ్లో॥ భావాద్వైతం క్రియాద్వైతం ద్రవ్యాద్వైతం తథాత్మనః।**
**వర్తయన్ స్వానుభూత్యేహ త్రీన్ స్వప్నాన్ ధునుతే మునిః॥ 62**

ప్రతిపదార్థము:- మునిః=మునియగువాడు, ఆత్మనః=తనకు, భావాద్వైతః=భావాద్వైతమును, క్రియాద్వైతమ్=క్రియాద్వైతమును, ద్రవ్యాద్వైతమ్=ద్రవ్యాద్వైతమును, వర్తయన్=ఉంచుచు, స్వానుభూత్యా=స్వస్వరూపానుభవముచే, ఇహ=ఈ లోకమునందే, త్రీన్ స్వప్నాన్=మూడు స్వప్నము లను (అనగా స్వప్నతుల్యములగు జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి మూడు అవస్థలను), ధునుతే=హరించును.

తాత్పర్యము:- ముని యగువాడు తనయందు సర్వదా భావాద్వైతమును, క్రియాద్వైతమును, =ద్రవ్యాద్వైతమును భావించుకొనుచు స్వస్వరూపానుసంధానముచే ఈ లోకమునందే జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి మూడు స్వప్నతుల్యములగు అవస్థలను అతిక్రమించి జీవన్ముక్తుడగును.

**శ్లో॥ కార్యకారణవస్త్వైక్యదర్శనం పటతన్తువత్।**
**అవస్తుత్వాద్వికల్పస్య భావాద్వైతం తదుచ్యతే॥ 63**

ప్రతిపదార్థము:- వికల్పస్య=భేదము, అవస్తుత్వాత్=యథార్థమగు పదార్థము కాకపోవుటచే, పటతన్తువత్=వస్త్రము, దారములవలె, కార్యకారణవస్త్వైక్యదర్శనమ్=కార్యము కారణమగు వస్తువులను ఒకటిగా చూచుట అనునది ఏది గలదో, తత్=అది, భావాద్వైతః=భావాద్వైతముగ, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తాత్పర్యము:- దారములచే తయారైన వస్త్రము దారములకంటె వేరుగ కనబడుట లేదు గదా! అందువలన కారణమగు దారము, దాని కార్యమగు వస్త్రములకు భేదము లేదు. రెండును ఒకటే. ఇట్లే లోకమునందు అన్నికార్యములకు భేదము లేదని భావించవలెను. అట్లు భావించుటను భావాద్వైతమని అందురు.

**శ్లో॥ యద్బ్రహ్మణి పరే సాక్షాత్సర్వకర్మసమర్పణమ్।**
**మనోవాక్తనుభిః పార్థ క్రియాద్వైతం తదుచ్యతే॥ 64**

ప్రతిపదార్థము:- పార్థ!=ఓ పార్థా!, సాక్షాత్=ప్రత్యక్షమైన, పరే బ్రహ్మణి=పరమాత్మయందు, మనోవాక్తనుభిః=మనోవాక్కాయములచే చేయబడిన, సర్వకర్మసమర్పణమ్=సమస్త కర్మలను సమర్పించుట అనునది ఏది గలదో, తత్=అది, క్రియాద్వైతమ్=క్రియాద్వైతము అనుపేరుతో, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తాత్పర్యము:- పార్థ! పరమాత్మను సాక్షాత్కారము చేసికొనిన పిమ్మట ఆ పరమాత్మయందు తాను మనోవాక్కాయములచే చేసిన సమస్త కర్మలను సమర్పించుటను క్రియాద్వైతమని యందురు. అనగా ఆ కర్మలు పరమాత్మయందు కల్పితమైనవే కాని తనకు ఆ కర్మలతో ఎట్టి సంబంధము లేదని భావించుటను క్రియాద్వైతమని అందురని భావము.

**శ్లో॥ ఆత్మజాయాసుతాదీనామన్యేషాం సర్వ దేహినామ్।**
**యత్స్వార్థకామయోరైక్యం ద్రవ్యాద్వైతం తదుచ్యతే॥ 65**

ప్రతిపదార్థము:- ఆత్మజాయసుతాదీనామ్=తన భార్యాపుత్రాదుల యొక్కయు, అన్యేషామ్= ఇతరులగు, సర్వదేహినామ్=సర్వప్రాణుల యొక్కయు, స్వార్థకామయోః=స్వార్థభోగములకు, ఐక్యమ్=ఐక్యభావన, యత్=ఏది గలదో, తత్=అది, ద్రవ్యాద్వైతమ్=ద్రవ్యాద్వైతముగ, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తాత్పర్యము:- ఆత్మీయులగు భార్యాపుత్రాదుల స్వార్థములు, భోగములు అట్లే ఇతరములగు సర్వప్రాణుల స్వార్థములు, భోగములు ఒకటే నని భావించి రాగద్వేషము లేకుండుటను ద్రవ్యాద్వైతము అని అందురు.

**శ్లో॥ యద్యస్య చానిషిద్ధం స్యాద్యేన యత్ర యతో నృప।**
**స తేనేహేత కర్మాణి నరో నాన్యైరనాపది॥ 66**

ప్రతిపదార్థము:- నృప=రాజా!, యత్=ఏ వస్తువు, యేన=ఏ ఉపాయముచే, యతః=ఎవరి సమీపము నుండి, యస్య=ఎవరికి, అనిషిద్ధమ్=నిషేధింపబడినది, స్యాత్=అగునో, అనాపది= ఆపదలు రాని సమయమునందు, సః=అతడు, తేన=దానితో, కార్యాణి=పనులను, ఈహేత= కోరవలెను. అన్యైః=ఇతరములతో, న ఈహేత=కోరరాదు.

తాత్పర్యము:- రాజా! ఏ వస్తువు ఉపాయముతో ఎవరి పక్షమున ఎవరికి శాస్త్రముచేత నిషేధింప

**తాత్పర్యము:–** దేవతలు, రాక్షసులు, మనుష్యులు మున్నగు వారలకు పుట్టుక స్థానమగు దక్షపుత్రికల వంశములు ఈ విధముగ నీ కొఱకు నాచే వివరించబడినవి.

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కన్ధే**
**సదాచారనిర్ణయో నామ పఞ్చదశోఽధ్యాయః(15)**

**శ్రీః**





**శ్లో॥ రూపపేశలమాధుర్యసౌగన్ధ్యప్రియదర్శనః।**
**స్త్రీణాం ప్రియతమో నిత్యం మత్తస్వపురలమ్పటః॥ 70**

**ప్రతిపదార్థము:–**రూప=సౌందర్యముతోను, పేశల=సౌకుమార్యముతోను, మాధుర్య=మధురత్వముతోను, సౌగన్ధ్య=సువాసనలతోను, ప్రియదర్శనః=అందరకు ఇష్టుడనై, నిత్యమ్= ఎల్లప్పుడు, స్త్రీణామ్=స్త్రీలకు, ప్రియతమః=మిక్కిలి ఇష్టుడనై, స్వపురలంపటః=స్వ గృహమందు లంపటుడనై, మత్తః=మదించినవాడను అయితిని.

**తాత్పర్యము:–** సౌందర్య, సౌకుమార్య, మాధుర్య సౌగన్ధ్యములయందు అందరకు ప్రియదర్శనుడనై సర్వదాస్త్రీలోలుడనై, స్వగృహలంపటుడనై మదించి యుంటిని.

**శ్లో॥ ఏకదా దేవసత్రే తు గన్ధర్వాప్సరసాం గణాః।**
**ఉపహూతా విశ్వసృగ్భిర్హరిగాథోపగాయనే॥ 71**

**ప్రతిపదార్థము:–** ఏకదా=ఒకప్పుడు, దేవసత్రే=దేవయజ్ఞము నందు, విశ్వసృగ్భిః= ప్రజాపతులచే, గంధర్వాప్సరసామ్=గంధర్వుల యొక్కయు, అప్సరసలయొక్కయు, గణాః=సమూహములు, హరిగాథోపగాయనే=శ్రీకృష్ణగాథలను గానముచేయుట కొరకు, ఉపహూతాః=ఆహ్వానించిరి.

**తాత్పర్యము:–** ఒకప్పుడు ప్రజాపతులు దేవలోకమున యజ్ఞమును చేయుచూ ఆ యజ్ఞమునందు శ్రీకృష్ణుని గాథలను గానముచేయుట కొరకు గంధర్వులను, అప్సరసలను ఆహ్వానించిరి.

**శ్లో॥ అహం చ గాయంస్తద్విద్వాన్ స్త్రీభిః పరివృతో గతః।**
**జ్ఞాత్వా విశ్వసృజస్తన్మే హేళనం శేపురోజసా॥ 72**

**శ్లో॥ యాహి త్వం శూద్రతామాశు నష్టశ్రీః కృతహేళనః।**
**తావద్దాస్యామహం జజ్ఞే తత్రాపి బ్రహ్మవాదినామ్॥ 73**

**శ్లో॥ శుశ్రూషయానుషఙ్గేణ ప్రాప్తోఽహం బ్రహ్మపుత్రతామ్।**
**ధర్మస్తే గృహమేధీయో వర్ణితః పాపనాశనః।**
**గృహస్థో యేన పదవీమఞ్జసా న్యాసినామియాత్॥ 74**

**ప్రతిపదార్థము:–** తత్=ఆ ఆహ్వానమును, విద్వాన్=తెలిసికొనినవాడనైన, అహం చ=నేను గూడ, స్త్రీభిః=ప్రియురాళ్ళతో, పరివృతః=పరివేష్టితుడనై, గతః=వెళ్లితిని, మే=నాయొక్క, హేలనమ్= అపరాధమును, జ్ఞాత్వా=తెలిసికొని, విశ్వసృజః=ప్రజాపతులు, ఓజసా=తమ ప్రభావముచే, కృతహేలనః=అపరాధమునొనరించిన, త్వమ్=నీవు, ఆశు=శీఘ్రముగా, నష్టశ్రీః=ఐశ్వర్యభ్రష్టుడవై, శూద్రతామ్=శూద్రత్వమును, యాహి=పొందుము,(ఇతి=అని)శేపుః=శపించిరి.

తావత్=అంతలోనే, అహమ్=నేను, దాస్యమ్=శూద్రత్వమును, జజ్ఞే=పొందితిని. తత్రాపి= ఆ శూద్ర జన్మయందు సైతము, బ్రహ్మవాదినామ్=బ్రహ్మవేత్తల యొక్క, శుశ్రూషయా= సేవతో, అహమ్=నేను, బ్రహ్మపుత్రతామ్=బ్రహ్మదేవునకు పుత్రుడుగా అగుటను, ప్రాప్తః=పొందితిని.

యేన=ఏ గృహస్థాశ్రమధర్మమును అచరించుటతో, గృహస్థః=గృహస్థుడు, అంజసా= అనాయాసముగ, న్యాసినామ్=సన్న్యాసులయొక్క, పదవీమ్=పదవిని, ఇయాత్=పొందగలడో,

పాపనాశనః=సమస్త పాపములను నశింపజేయు, గృహమేధయః=గృహస్థాశ్రమమునకు సంబంధించిన, ధర్మః=ఆ ధర్మము, తే=నీ కొఱకు, వర్ణితః=వివరించబడినది.

**తాత్పర్యము:–** ఆ ఆహ్వానమును అందుకొని నేనును నా ప్రియురాండ్లను వెంట పెట్టుకొని అచటకు వెళ్లితిని. నా అపరాధమును గమనించిన ప్రజాపతులు తమ ప్రభావముచే నన్ను ఐశ్వర్యభ్రష్టుడవై శూద్రత్వమును శీఘ్రముగా పొందెదవు గాక" యని శపించిరి.

ఆ శాపవశమున నేను శూద్రజన్మను పొందితిని. అచట కూడ దైవయోగమున బ్రహ్మవేత్త లగు బ్రాహ్మణులతో సాంగత్యమును పొంది వారిని సేవించుట ద్వారా బ్రహ్మకు పుత్రుడనైతిని.

ఓ రాజా! మోక్షము ఒక్క సన్న్యాసాశ్రమమును స్వీకరించుటవలననే లభించదు. గృహస్థాశ్రమమునందు ఉన్నప్పటికి ఆ గృహస్థాశ్రమ ధర్మములను సక్రమముగ అనుష్ఠించుట ద్వారా గూడ లభించగలదు. అట్టి గృహస్థాశ్రమ ధర్మములు నీ కొఱకు వివరించితిని.

**శ్లో॥ యూయం నృలోకే బత భూరిభాగా లోకం పునానా మునయోఽభియన్తి।**
**యేషాం గృహానావసతీతి సాక్షాద్ గూఢం పరం బ్రహ్మ మనుష్యలిఙ్గమ్॥ 75**

**ప్రతిపదార్థము:–** యేషామ్=ఎవరియొక్క, గృహాన్=ఇళ్లయందు, మనుష్యలింగమ్=మనుష్య రూపమును ధరించిన, పరంబ్రహ్మ=పరబ్రహ్మ, సాక్షాత్=స్వయముగ, గూఢమ్=ఎవరికి కనబడ కుండ, ఆవసతి=నివసించుచున్నాడో, యూయమ్=అట్టి మీరు, నృలోకే= మనుష్య లోకమునందు, భూరిభాగాః=అదృష్టవంతులు, లోకమ్=లోకమును, పునానాః=పవిత్రము చేయు, మునయః= మహర్షులు, అభియన్తి=మీ ఇళ్ళకు వచ్చుచున్నారు, బత=ఆహా!

**తాత్పర్యము:–** ఓ రాజా! మనుష్యలోకములో మీరు గొప్ప అదృష్టవంతులు. సమస్త లోకములను పవిత్రముచేయు మహర్షులు తమంతటతాముగా మీ ఇళ్ళకు వచ్చుచున్నారు. ఎవరకు కనబడని పరబ్రహ్మ మనుష్యరూపముతో సాక్షాత్తుగ మీ ఇంట నివసించుచున్నాడు. ఎంత ఆనందము!

**శ్లో॥ స వా అయం బ్రహ్మ మహద్విమృగ్యకైవల్యనిర్వాణసుఖానుభూతిః।**
**ప్రియః సుహృద్వః ఖలు మాతులేయ ఆత్మార్హణీయో విధికృద్గురుశ్చ॥ 76**

**ప్రతిపదార్థము:–** సః అయమ్=ఆ ఈ శ్రీకృష్ణుడే, విమృగ్యకైవల్యనిర్వాణసుఖానుభూతిః= సాధువులచే అన్వేషింపదగు ముక్తిసుఖమునకు ప్రత్యక్షానుభూతి యగు, మహత్=గొప్పదియగు, బ్రహ్మ=బ్రహ్మపదార్థము, వః=మీకు, ప్రియః=యిష్టమైన, సుహృత్=స్నేహితుడు, మాతులేయః =మేనమామ కుమారుడు, ఆత్మా=ఆత్మ, అర్హణీయః=పూజింపదగినవాడు, విధికృత్=విధానకర్త, గురుశ్చ=గురువు గూడ, ఖలు=గదా!

**తాత్పర్యము:–** మహర్షులచే నిరంతరము అన్వేషింపబడు ముక్తి సుఖమునకు ప్రత్యక్షానుభవ స్వరూపమగు పరబ్రహ్మ మీ ఇంటనున్న ఆ ఈ శ్రీకృష్ణుడే! మీకు ప్రియమిత్రుడు, మేనమామ కుమారుడు,ఆత్మ,పూజ్యుడు, మీరు చేయదగిన పనులను చెప్పువాడు,గురువు కూడ ఆ శ్రీకృష్ణుడే!

**శ్లో॥ న యస్య సాక్షాద్భవపద్మజాదిభీరూపం ధియా వస్తుతయోపవర్ణితమ్।**
**మౌనేన భక్త్యోపశమేన పూజితః ప్రసీదతామేష స సాత్వతాం పతిః॥ 77**



**ప్రతిపదార్థము:–** యస్య=ఏ శ్రీకృష్ణుని యొక్క, రూపమ్=రూపము, భవపద్మజాదిభిః= పరమేశ్వరుడు, బ్రహ్మ మొదలగు వారితో, ధియా=బుద్ధితో, వస్తుతయా=వాస్తవముగా, సాక్షాత్= నేరుగా, న వర్ణితమ్=వర్ణించబడలేదో, మౌనేన=మౌనముతోను, భక్త్యా=భక్తితోను, ఉపశమేన= ఇన్ద్రియనిగ్రహముతోను, పూజితః=పూజించబడినవాడగుచు, సః ఏషః=ఆ ఈ, సాత్వతాం పతిః =సాత్వత పతియగు శ్రీకృష్ణుడు, ప్రసీదతామ్=అనుగ్రహించుగాక!

**తాత్పర్యము:–** ఏ శ్రీకృష్ణుని రూపము బ్రహ్మరుద్రాదులచే సైతము బుద్ధితో వాస్తవముగా నేరుగా వర్ణించబడలేదో, మౌనముతోను, భక్తితోను, ఇంద్రియనిగ్రహముతోను మాత్రమే పూజించబడు ఆ శ్రీకృష్ణపరమాత్మ మిమ్ములను అనుగ్రహించుగాక!

**శ్రీ శుక ఉవాచ**

**శ్లో॥ ఇతి దేవర్షిణా ప్రోక్తం నిశమ్య భరతర్షభః।**
**పూజయామాస సుప్రీతః కృష్ణం చ ప్రేమవిహ్వలః॥ 78**

**ప్రతిపదార్థము:–** శ్రీశుకః=శుకమహర్షి, ఉవాచ=పలికెను, భరతర్షభః=భరతకుల శ్రేష్ఠుడగు ధర్మరాజు, ఇతి=ఈ విధముగ, దేవర్షిణా=దేవర్షి అగు నారదునిచే, ప్రోక్తమ్=చెప్పబడిన వాక్కులను, నిశమ్య=విని, సుప్రీతః=సంతసించినవాడును, ప్రేమవిహ్వలః=ప్రేమవిహ్వలుడును అయి, కృష్ణమ్=శ్రీకృష్ణుని, పూజయామాస=పూజించెను.

**తాత్పర్యము:–** శుకమహర్షి ఇట్లు పలికెను. భరతవంశ శ్రేష్ఠుడగు ధర్మరాజు నారదుడు చెప్పిన వాక్కులను విని సంతసించి, ప్రేమవిహ్వలుడై శ్రీకృష్ణుని పూజించెను.

**శ్లో॥ కృష్ణపార్థావుపామన్త్ర్య పూజితః ప్రయయౌ మునిః।**
**శ్రుత్వా కృష్ణం పరమ్బ్రహ్మ పార్థః పరమవిస్మితః॥ 79**

**ప్రతిపదార్థము:–** మునిః=నారదమహర్షి, కృష్ణపార్థౌ=కృష్ణునికి, ధర్మరాజునకు, ఉపామన్త్ర్య= వెళ్ళి వత్తునని తెలిపి, పూజితః=పూజింపబడినవాడై, ప్రయయౌ=వెళ్ళెను. పార్థః=యుధిష్ఠిరుడు, కృష్ణమ్=శ్రీకృష్ణుని, పరం బ్రహ్మ=పరమాత్మనుగా, శ్రుత్వా=విని, పరమవిస్మితః=మిక్కిలి ఆశ్చర్యపడెను.

**తాత్పర్యము:–** దేవర్షియగు నారదుడు శ్రీకృష్ణునికి, ధర్మరాజునకు వెళ్ళివత్తునని తెలిపి వారిచే పూజింపబడినవాడై వెడలిపోయెను. శ్రీకృష్ణుడే పరబ్రహ్మ, పరమాత్మ అని తెలిసికొని ధర్మరాజు బాగుగ విస్మితుడయ్యెను.

**శ్లో॥ ఇది దాక్షాయణీనాం తే పృథగ్వంశాః ప్రకీర్తితాః।**
**దేవాసురమనుష్యాద్యా లోకా యత్ర చరాచరాః॥ 80**

**ప్రతిపదార్థము:–**ఇతి=ఇట్లు, దేవాసురమనుష్యాద్యాః=దేవతలు, రాక్షసులు,మనుష్యులు మొదలుగా గల, చరచరాః=స్థావర జంగమ రూపులగు ప్రాణులు, యత్ర=ఏ వంశములందు, (జన్మించిరో), దాక్షాయణీనామ్=దక్షపుత్రికలకు సంబంధించిన, వంశాః=అట్టి వంశములు, తే=నీ కొఱకు, పృథక్=వేఱువేఱుగా, ప్రకీర్తితాః=బాగుగ వివరించబడినవి.

నమో భగవతే వాసుదేవాయ

*శ్లో॥ యస్య యల్లక్షణం ప్రోక్తం పుంసో వర్ణాభిసూచకమ్।*
*యదన్యత్రాపి దృశ్యేత తత్ తేనైవ వినిర్దిశేత్॥* ***7-11-35***

**ప్రతిపదార్థము:-** యస్య=ఏ, పుంసః=పురుషునికి, యత్ లక్షణమ్=ఏ లక్షణము, వర్ణాభి సూచకమ్=జాతిని సూచించునదిగా, ప్రోక్తమ్=చెప్పబడెనో, యత్=ఏ లక్షణము, అన్యత్ర +అపి=వర్ణాంతరము నందు, దృశ్యేత=కనబడినచో, తత్=ఆ వర్ణాంతరము, తేన+ఏవ=ఆ లక్షణముల చేతనే, వినిర్దిశేత్=నిర్ణయించవలెను.

**తాత్పర్యము:-** ఏ పురుషున కేది వర్ణమునుసూచించు లక్షణమని చెప్పబడినదో, ఆ లక్షణము ఇతర వర్ణములలోని ఒక పురుషుని యందు కన్పట్టుచో, వాని నా లక్షణముచే ఆ వర్ణము వానినిగానే నిర్ణయించవలెను.

వెల రూ. 100-00

శ్రీమద్భాగవతమ్ - సప్తమస్కన్ధః

శ్రీః

# సప్తమస్కన్ధః

చదలువాడ జయరామశాస్త్రి

ఆంధ్ర ప్రతిపదార్థ, తాత్పర్యములు



# శ్రీమద్భాగవతమహాపురాణమ్

ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి - 522 201

శ్లో॥ యస్య యల్లక్షణం ప్రోక్తం పుంసో వర్ణాభిసూచకమ్।
యదన్యత్రాపి దృశ్యేత తత్ తేనైవ వినిర్దిశేత్॥

శ్రీమద్భాగవతమ్ - సప్తమస్కన్ధః

చదలువాడ జయరామశాస్త్రి



# శ్రీమద్భాగవతమహాపురాణమ్

సాధన గ్రంథ మండలి, తెనాలి – 522 201